# భాగవత కథలు

రచన

జానమాతల వేంకట రామమూర్తి

ప్రచురణ
విజయసాహితి
10/8, వీరభద్ర వీధి,
నుంగంబాకం,
చెన్నై - 600 034.

# నివేదనమ్

సప్త గిరులపై కొలువైన స్వామి! నీ య
నంత లీలామయ మృదుల నందన వన
సీమలందు విరిసిన ఈ చిన్ని పూవు
కాన్కగా స్వీకరింపుము కనికరాన!

-రామమూర్తి

ఈ 'భాగవత కథలు' శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారి ద్రవ్య సహాయంతో ప్రచురింపబడినది.

# విషయసూచిక

# మనవి

భాగవతము భక్తిరస నిధానము.

నిగమములు వేయు జదివిన
సుగమంబులు గావు ముక్తి సుభగత్వంబుల్
సుగమంబు భాగవతమను
నిగమంబు పఠింపముక్తి నివసనము బుధా!

భాగవతం వేదమని, దీన్ని చదవడం వల్ల ముక్తి కలుగుతుందనీ, మహాకవీ, మహాభక్తుడూ అయిన పోతన అన్నాడు. ఎంత చదివినా, భాగవతం చదివినదానికి సాటిరాదనీ ఆయన చెప్పాడు.

అంతేకాదు –

**పలికెడిది భాగవతమట**
**పలికించు విభుండు రామభద్రుండట - నే**
**పలికిన భవహరమగునట**
**పలికెద వేరొండు గాథ పలుకగనేలా?**

అని భావించాడు ఆయన.

భాగవత రచన కేవలం భగవత్ప్రేరణ అనీ తాను పలికేది భాగవతం – పలికించేవాడు శ్రీరామచంద్రుడు. ఈ పలుకు పలికితే చాలు జన్మ ధన్యం అవుతుందనీ, మరో గాథ అనవలసిన పని లేదనీ తలచిన వినయ గుణ సంపన్నుడాయన.

ఇది కేవలం ఆయనకొక్కడికే కాదు. ఎవరు చదివినా, విన్నా వారి జన్మలు ధన్యం అవుతాయి. అటు భారతమూ, ఇటు భాగవతమూ తెలుగునాట గొప్ప రచనలుగా ప్రసిద్ధం అయినాయి. రామాయణాలు తెలుగింట ఎన్నో! ఎందరో ప్రసిద్ధులైన కవులు రచించారు. అయితే, కవిత్రయ భారతంవలె, పోతన భాగవతం వలె ఏ రామాయణానికీ, అంతటి భక్తి ప్రపత్తులూ ప్రాచుర్యం లభించలేదనవచ్చు.

**నల్లనివాడు, పద్మనయనమ్ములవాడు, కృపారసంబుపై**
**జల్లెడివాడు, మౌళి పరిసర్పిత పింఛమువాడు నవ్వురా**
**జిల్లెడి మోము వాడొకడు, చెల్వల మానధనంబు తెచ్చెనో**
**మల్లియలార! మీ పొదల మాటుల గదమ్మ చెప్పరే ॥**

ఈ పద్యంలాంటి మధుర భక్తి భావ వీచికలు భాగవతం నిండా ఎన్నో! మలయా నిల సుగంధ వృష్టులెన్నో!

ఈ పద్యం అంటే, ఎందరకో ప్రియం! విశ్వనాథ సత్యనారాయణ గారికి ముఖ్యంగా! ఆయన తన విద్యార్థులందరినీ, ఈ పద్యం అప్పచెప్పమనేవాడు. అలా అప్పగించలేని వారిదగ్గర నుండీ పది రూపాయలు అపరాధ సుంకం వసూలు చేసేవాడంటారు.

భక్తి అంటే ఏమిటి? భగవంతుడి గుణరూపాది వర్ణనలు వినడం పట్ల కామాదులకు ద్రవత్వం కలుగుతుంది. పరమేశ్వరుని పట్ల అవిచ్ఛిన్నంగా లగ్నం అయిన మానసిక వృత్తినే భక్తి' అని మధుసూదన సరస్వతి నిర్వచించాడు.

భక్తికి మార్గాలెన్నొ ఉన్నాయి. అన్ని రకాల భక్తి మార్గాలకూ మూలం అయిన భక్తిని ఆధారంగా చేసుకుని కథాస్రవంతులుగా మన పురాణాలనూ, కాంతాసమ్మితాలయిన కావ్యాలనూ ఋషులయిన మహాత్ములు నిబంధించారు; చిత్రించారు. భక్తి వినా కావ్యం లేదు. కావ్య వస్తువూ లేదు. జీవితమూ లేదు.

భక్తికి ఆలంబనం భగవంతుడు. శాంతం, దాస్యం, సఖ్యం, వాత్సల్యం, మాధుర్యం అనే అనేక భావాలు కలిగిన ఉపమార్గాలూ, భక్తిమూల తత్త్వానికి అనుసంధానమైనవే!

శాంత భక్తి, తపోనిధులూ, వీతరాగులూ, మహాతపస్సంపన్నులూ అయిన వశిష్ఠాదులకు లభ్యం అయింది. హనుమంతాదులకు దాస్య భక్తి లభించింది. సుగ్రీవ, కుచేలులకు స్నేహభక్తి అను భావం అయింది. దేవకీవసుదేవులూ, యశోదానందులూ, వాత్సల్య భక్తితో ఈశ్వరునికి చేరువయ్యారు. రాధాగోపికలకు సంబంధించినది మధురభక్తి. ప్రహ్లాద ధృవగజేంద్రుల భక్తి, శరణాగత భక్తి, వైరభక్తికీ కొందరను చెప్పుకోవచ్చు. కంసుడూ, శిశుపాలుడూ, రావణాదులు తార్కాణ!

గోపికలు ఈ మధురభక్తి భావానికి పరాకాష్ఠ చేరుకున్నారు. భగవంతుడైన శ్రీకృష్ణుని వారు తమ ఆత్మేశ్వరుగా భావించారు. అనిర్వాచ్యమైన, నిర్మలమైన భక్తితో, తమ సర్వస్వం సమర్పించుకుని వారు కృతార్థులైనారు. సర్వస్వం – అనేదానికి వస్త్రాపహరణం ఉదాహరణగా చెప్పుకోవచ్చు!

లింగధారులైన వీరశైవ భక్తులు కొందరు నేటికీ దిగంబరంగా, స్వయంపాకాదులు చేసి అరచేత నిలుపుకున్న శివలింగానికి షోడోపచారాలు నిర్వర్తించడం జరుగుతుంది.

'శ్రీకృష్ణుడొకడే పురుషుడు, మిగిలినవారంతా స్త్రీలు' అని మీరాబాయి భావన! పుంభావం భక్తి ప్రపత్తులకు కొంతగా తెరలు దించుతుందేమో? స్త్రీ త్వభావంలో ఈ నిరోధాలుండవు. భగదుపాసనా సమయంలో, వివిధోపచారాలు భక్తులు చేస్తుంటారు. ఈ ఉపచారాలు, దాస భావంతో చేయవలెనంటారు పెద్దలు. దాస భావం స్త్రీ భావానకి

చాల దగ్గరయిన భావం! అంచేత ఈ ఉపచారాలు, మానసికంగా స్త్రీభావం పొందినపుడే పరిపూర్ణాలవుతాయి. అపుడే భగవంతుణ్ణి, జగన్నాథునిగానూ, ఆత్మనాథుని గానూ భావించి దర్శింప వీలవుతుంది. చైతన్యాదుల నిరతిశయ భక్తి అది.

మధుర భావాలతో నిండిన ఈ భక్తి తుచ్ఛమైన కామవాసనలకు సంబంధించింది కానేకాదు! మోక్ష కామానికి మాత్రమే అది సంబంధించింది! అలా అయినపుడు లౌకిక శృంగారభావాలకు అది అతీతం! గోపికల శృంగారభక్తి లేదా మధురభక్తి దివ్యమూ, నిరతిశయమూ, నిర్మలమూ అయింది. ఎవరయితే మానసికంగా గోపికలవుతారో, వారికి శ్రీకృష్ణ భక్తి పరిపూర్ణంగా అర్థం అవుతుంది. సార్థకం అవుతుంది.

ఆయా భక్తి మార్గాలకు సంబంధించిన యితి వృత్తాలను మణి మాలగా చేర్చి కుర్చిందే వ్యాస భాగవతం లేదా పోతన భాగవతం! ఒక్కో కథలో ఒక్కో రకమైన భక్తి, కథలన్నిటా పరమేశ్వరమూలతత్త్వం, పూలలో వాసనవలె వ్యాపించే ఉంటుంది. అర్థం చేసుకుని, అనుభవానికి తెచ్చుకుని తరించడం, మన మన భావనా బలాన్నీ అదృష్టాన్ని బట్టి ఉంటుంది.

అనగా అనగా రాగం! సాధన చేయగా సాధన చేయగా, మనం అనంతశక్తిలో భక్త పరమాణువులుగా మారవచ్చు. అదే ప్రతిజీవి కర్తవ్యం మనుషులే కాదు జీవులూ అంతే! గజేంద్రుడి కథనం దీనికో ఉదాహరణ!

భక్తి భావ స్ఫోరకంగా, చిన్న చిన్న మాటల్లో, చిన్న చిన్న కథలుగా, కాలప్రవాహంలో తీరిక అంటూ చిక్కని కొందరు సాధకులకయినా, సదుపాయంగా ఉండగలదన్న సద్భావంతో, సదుద్దేశంతో చేసిందే ఈ ప్రయత్నం! ఈ ప్రయత్నం మూలంగా ఏ ఒక్క మనస్సునకయినా నొకకొంత ఊరటా, శాంతీ కలిగినా, నేనూ ధన్యుణ్ణి. నా ప్రయత్నమూ ధన్యం అయినట్లే, – అయితే మనస్సున కందకా, శక్తి కందకా దోషాలనేవి దొరలి ఉంటే, సహృదయులు, మన్నింపవలెనని ప్రార్థన!

ఈ భాగవత కథలు, ఆ మహాకవి ఆంధ్రీకరించిన భాగవతానికి ఛాయామాత్ర వచనానుకరణ. మక్కీకి మక్కీ వ్రాసి మరో ఉద్గ్రంథం చేయాల్సిన అవసరం లేదనుకున్నా.

ఈ పుస్తక ప్రచురణకు ద్రవ్య సహాయం చేసిన తిరుమల – తిరుపతి దేవస్థానం వారికి శిరసా నమస్కారాలు.

ఇలా

**జూనూతుల వేంకటరామమూర్తి**



# భగవాన్ శ్రీ సాయిబాబా
# షిర్డీసాయిబాబా దివ్య కథ

*1/4 డెమ్మీసైజు త్రివర్ణ ముఖచిత్రాలతో*

*ఆఫ్‌సెట్ ముద్రణతో బాబా వర్ణచిత్రాలతో*

*నాటిబాబా భక్తుల జీవిత విశేషాలతో*

*300 పేజీలతో నిండిన బాబా*

*సంపూర్ణ జీవిత చిత్రణ.*

# వేదవ్యాసుడు

శ్రీహరి అవతారం అని వేదవ్యాసుడి గురించి చెబుతారు పెద్దలు. ఆయన వేదాలను విభజింపడం వల్ల వేదవ్యాసుడయ్యాడు. పంచమ వేదం అని ఖ్యాతిగాంచిన భారత రచన చేశాడు. అంత చేసినా ఆయన మనస్సులో ఏదో వెల్తి, మెలికా, ఉమ్మలికా! శ్రీ మహావిష్ణువు మనస్సును అలరించే రచన ఏదీ చేయలేకపోయానే అన్న ఆందోళనతో ఉన్న సమయంలో ఆయన ఉన్నచోటుకు నారదుడు వేంచేశాడు.

''అయ్యా! మహర్షీ! వేదాలను విభజించావు; భారత రచన చేశావు. దొడ్డ తపస్సంపన్నుడవు. ఆపన్నుడి వలె ఇలా ముఖం చిన్నబుచ్చుకుని కూర్చున్నావేం?'' అంటూ నారదుడు పరామర్శించాడు.

అతిథి అయిన నారదుడికి, మర్యాదలూ అవీ చేసిన తరువాత వ్యాసుడు ఇలా అన్నాడు. ''మనస్సును అశాంతి మెలి వేస్తోంది. సంతోషం కలగడం లేదు. తృప్తి లుప్తం అయింది. కారణం తోచింది కాదు. దీనికి కారణం ఏమిటో, తమకు తెలిస్తే చెప్పండి!''

''ఏముంది మహర్షీ! భారతం అయితే గొప్పగా రాశావు. శ్రీహరి గాథలు వివరించలేదు. శ్రీకృష్ణుడు ఆనందమయుడు కదా! ఆయన గుణగానం చెయ్! ఎంతటి ఆనందం పొందుతావో నీకే తెలుస్తుంది. అంతే కాదు, నీ జన్మ ధన్యం అవుతుంది కూడా!'' అన్నాడు నారదుడు.

వ్యాసుడు ఆలోచనల్లో పడ్డాడు మళ్లీ!

తిరిగి నారదుడు అన్నాడు. ''ఎవరి కీర్తనం, ధ్యానం, మననం, శ్రవణం, ముక్తికారకమో, వారిని తనివితీరా వర్ణించు. ఆత్మానందం పొందేలా రచించు; శాంతి పొందుతావు మహర్షీ!''

వ్యాసుడు కనులు మూసుకుని ధ్యానంలో పడ్డాడు.

గణేశ మూర్తి ప్రత్యక్షమై, ''ఏం మహర్షీ! పిలిచావూ?'' అంటూ అడిగాడు.

''ఇంత రచన చేసి ఎంతో అశాంతిని మూటకట్టుకున్నాను స్వామీ! అశాంతి పోవాలెనంటే శ్రీహరి గుణగానం చేయవలెనట! అందుకే ప్రభూ! తమరిని ధ్యానించాను. నీ చల్లని చూపుతోనే కదా తండ్రీ! నాలో జీవం, జవం కలిగేది'' అంటూ సాంజలి అయి నుంచున్నాడు వ్యాసుడు.

''మంచి పనికి వాయిదా పనికిరాదు మహర్షీ! శుభం!'' అంటూ గణపతి అభయ ముద్రతో సుఖాసీనుడు అయ్యాడు.

మహర్షి అంతర్లోచనాలు శ్రీహరి చరణాల మీద కేంద్రీకరించాయి. మనస్సును పులకింతలు పెడుతున్న ఆ తలపులు, పెదాల్లోంచి మాటల రూపంలో దూసుకువస్తున్నాయి. గణేశ మూర్తి గంటం కదలసాగింది.

ఒకానొక సమయంలో భూమాతకు కష్టకాలం దాపురించింది. అరాజకం ప్రబలింది. దారుణంగా సాధుహింసాకాండ మొదలయింది. సాధు సజ్జనులు, నిస్సహాయులై, నిరంతర బాధలకు గురైనారు. అలా జరిగేసరికి భూదేవతకు భారం అనిపించింది. అసహ్యంగా ప్రబలిన దుర్మార్గులనూ, దుష్టులనూ ఆ తల్లి మోయలేకపోయింది. ఆమె తిన్నగా సత్యలోకం చేరి, అలాంటి ధర్మ దూరులను పుట్టించినందుకు వాపోతూ బ్రహ్మదేవుని నిలదీసింది.

ఆమెకు ఎలా సమాధానం చెప్పి ఊరడించాలో ఆయనకు తోచలేదు. అంచేత ఆయన దేవతలనందరనూ వెంటపెట్టుకుని ఆపద్బాంధవుడయిన విష్ణువును కలుసుకునేందుకు వైకుంఠం చేరాడు.

వీరిలా వస్తారని ఆయనకు ముందే తెలుసు కాబోలు! యోగనిద్రలో మునిగిపోయాడు.

దేవతలతో సహా, బ్రహ్మదేవుడు చేతులు జోడించి పురుష సూక్తంతో స్తుతింపసాగాడు.

ఆయన కలువ కనులు, సూర్యోదయానికి వికసించినట్లు తెరచుకున్నాయి.

మందహాసంతో ఆయన, "మీకంతా కులాసాయేనా? ఇందరు ఇలా పని కట్టుకుని వచ్చిన కారణం?" అని ఏమీ తెలీనట్లు అడిగాడు.

కన్నీరు మున్నీరుగా వాపోతూ ధారుణి, తనగోడు వివరించింది. శ్రీహరి నవ్వుతూ తల పంకించాడు.

వసుంధర చిన్నబుచ్చుకుంది. ఇంత బాధతో తను విలవిల్లాడ్డం చూస్తూ కూడా, ఈ పెద్దమనిషి నవ్వుతాడేం! అని అనుకుంది కాబోలు తలవంచుకుంది.

"త్వరలో విముక్తి కలుగుతుంది దేవీ! నిశ్చింతగా ఉండు! ఈ దేవతలు యాదవులై, సురభామలు గోపికలై పుడతారు. నేను దేవకీ వసుదేవులకు కొడుకునై పుట్టి, నీభారం తొలగిస్తా! దీనికి సమయం ఆసన్నమయింది దేవీ! కొంతకాలం ఓపిక పట్టు." అన్నాడు భగవంతుడు.

నిశ్చింతతో వారంతా అక్కడినుండీ నిష్క్రమించారు.



## శ్రీకృష్ణ జననం

శూరసేనుడు మధురానగరానికి రాజు. ఈ రాజు కొడుకు పేరు వసుదేవుడు. ఈ వసుదేవుడికి, ఉగ్రసేనుడి కూతురు అయిన దేవకీ దేవితో వివాహం అయింది. వసుదేవుడికి అంతకుముందే దేవకీదేవి తోబుట్టువులు ఆరుమందితో పెండ్లి అయింది. కడగొట్టు తోబుట్టువు దేవకీదేవి అంటే, ఉగ్రదేవుడి పెద్ద కొడుకు కంసుడికి తగని ప్రేమ. కంసుడికి ఆరుగురు తమ్ములున్నారు.

దేవకీ వసుదేవుల వినోదార్థం, కంసుడు గొప్ప ఉత్సవం చేయించాడు. వారిద్దరనూ ఒక రథంలో కూర్చుండ చేసి, తానే స్వయంగా పగ్గాలు పుచ్చుకుని రథం తోలుతూ, పరాచికాలాడుతూ, ఉత్సాహంగా పురవీథుల వెంట కంసుడు పోతూండగా, గగనవాణి ఇలా గర్జించింది.

"ఏ చెల్లెలినయితే, ఇంతగా ప్రేమిస్తున్నావో, ఆ చెల్లిలికి పుట్టబోయే అష్టమ పుత్రుడు నీకు మారకుడవుతాడు. జాగ్రత్త!"

కంసుడు, తన నెత్తిన వేయి పిడుగులు పడ్డట్టుగా నిర్ఘాంతపోయాడు. క్రోధం కట్టలు తెంచుకుంది. కండ్లు చింత నిప్పులైనాయి. చివాలున కరవాలం అందుకున్నాడు.

ఆశ్చర్యంతో, అమాయకతతో దిక్కులు చూస్తున్న దేవకి కొప్పు పట్టు కున్నాడు కంసుడు. ఆమెను రథంలోంచి క్రిందకు ఈడ్చి వాడు కత్తి ఎత్తాడు.

వసుదేవుడు ఆందోళనగా రెండు చేతులూ జోడించి, వాడి కత్తి వాదరకు వచ్చినుంచున్నాడు.

"బావా! క్రోధం విడచి పెట్టు! కొంచెం నిదానంగా ఆలోచించు. నీ మరణానికి కారణం దేవకి కాదు కదా? మరి ఈమెను ఎందుకు చంపుతావూ? ఎప్పుడో మరణం అందరకూ వస్తుంది. ఎవ్వరూ చావు తప్పించుకోలేరు. ఆకాశం లోంచి వచ్చిన మాటలు నిజాలని నమ్మి, నీవు ప్రియంతో ఇంతకాలంగా మన్నించే, నూతన వధువు దేవకిని, బట్టల మీద పూసిన పసుపు మరకలయినా ఆరకముందే వధిస్తావా? ఇంత కఠిన హృదయం నీకు ఎలా వచ్చింది బావా?"

''ఈ ధర్మ పన్నాలు ఆపు! నా ప్రాణాలకన్నా విలువైన వస్తువు ఈలోకంలో ఏదీ లేదు. తప్పుకో! దీన్ని చంపక విడచిపెట్టను. తప్పుకోకపోతే, ముందు నిన్ను చంపి ఆ తరువాత దీన్ని చంపుతా!'' అంటూ కంసుడు గర్జించాడు.

''అది కాదు బావా! నామాట.... కాదు – విన్నపం విను! శాంతంగా విను! ఒక నిముషం పాటు చంపడం వాయిదా వెయ్! నీవు చంపాలనుకుంటే, ఎల్లాగూ చంపగలవ్! నీకత్తి వాదర నుండీ దేవకిని ఎవ్వరూ కాపాడలేరు. అయితే చంపవలసింది ఈ దేవకిని, ఈ ముద్దరాలినీ కాదు బావా! దేవకి గర్భవాసుల్లో ఎనిమిదో వాడు కదా నిన్న చంపుతాడు? అదేకదా గగనవాణి చెప్పింది? వాడు ఇంకా పుట్టలేదు బావా! లేని వాడి మీద కోపం ఈ దేవకి మీద చూపి చంపుతావా? నీలాంటి సత్కులుడూ, మహావీరుడూ చేయదగిన పనా ఇది?''

''అయితే ఏం చేయమంటావ్?'' కంసుడు ఆలోచనలో పడ్డాడు.

నిర్మోహి అయిన వసుదేవుడు నిశ్చలంగా ''దేవకి బిడ్డలను చంపు'' అన్నాడు.

''అంటే?''

''పుట్టగానే, ఆ పసికందులను, నీకు అప్పగిస్తాను. నీవేం చేసుకుంటావో చేసుకో! చంపాలని ఉంటే, చంపెయ్. అంతేకానీ ఈ ముద్దరాలూ, అమాయకురాలూ అయిన దేవకిని చంపకు బావా! నా ప్రార్థన మన్నించు. నీవంటి వీరునకు ఈ అబల ఎంత? వంటింటి కుందేలు. ఎప్పుడు నీచిత్తం వస్తే అప్పుడు చంపు!''

కంసుడు దీర్ఘంగా ఆలోచించాడు. వసుదేవుడి వైపు నిశితంగా చూశాడు. వసుదేవుడి ముఖంలో నైర్మల్యం, శాంతం తప్ప, కామం, ద్వేషం, రోషం లాంటివి కనిపించలేదు. నిర్మల కాసారం వలె అతడు గంభీరంగా ఉన్నారు. ముఖం పూచిన కలువవలె స్వచ్ఛంగా ఉంది.

కంసుడు దీర్ఘంగా నిట్టూర్చాడు.

''మంచిది. పుట్టగానే శిశువులను నాకు తెచ్చి ఇవ్వు! అలాకాక పోయిందో, మీ ప్రాణాలు దక్కవు!'' అంటూ అతడు కరవాలం ఒరలో పెట్టుకుని నాగుపామువలె జరజర అక్కడి నుండీ వెళ్లిపోయాడు.

''భగవంతుడు దయామయుడు! ఈ గండం గడిచింది. ఈశ్వరుడి ఇచ్ఛ ఎలా ఉంటుందో అలా జరగవలసిందే! నిన్ను నీవు సంబాళించుకో! పద! దేవకీ! మనం ఇంటికి వెళదాం! దీన్ని గురించి ఎక్కువగా ఆలోచించవద్దు! ఆలోచించే శక్తీ, నిర్ణయం తీసుకునే శక్తీ వేరే ఉంది'' అంటూ వసుదేవుడు స్థిత ప్రజ్ఞుడై మాటాడాడు.

జన్మాంతర వాసనలు, శరీరాలు మారుతున్నా అంటిపెట్టుకుని ఉంటాయి.

స్వాయంభువు మన్వంతరంలో దేవకీ వసుదేవులు పృశ్నిసుతపులుగా జన్మించారు. ఇద్దరూ మహా తపస్సంపన్నులు. భగవంతుడు ప్రత్యక్ష్యం కాగా, ఆ దంపతులు, తమ గర్భవాసాన ఆయన్ను జన్మించవలసిందిగా కోరుకున్నారు. ఆ జన్మలో వారు వరదానం పొందిన కారణంగా, ఆ తరువాతి జన్మలో అదితి కశ్యపులుగా జన్మ పొందారు. ఆ జన్మలో శ్రీమహావిష్ణువు వామనమూర్తి అయి పుట్టి వారి ముచ్చట తీర్చాడు.

జన్మాంతర తపో లభ్యం అయిన భక్తి వైరాగ్యాలు వారికి ఈ జన్మలోనూ లభించాయి. భగవంతుడికి తల్లిదండ్రులు కావడమూ జరిగింది.

అడితప్పని వసుదేవుడు, దేవకి శిశువులను క్రమం తప్పక కంసుడికి అప్పగించసాగాడు.

అయితే కంసుడు, ''వీడు నాకు మారకుడు కాదుకదా! ఎనిమిదో వాడు కదా మారకుడు? వీడిని ఇంటికి తీసుకుపో!'' అంటూ చంపక విడచి పెట్టేవాడు.

దుష్టుడికి ఆగ్రహం వచ్చినా, అనుగ్రహం వచ్చినా ఒకటే! ఓ క్షణంలో తారుమారు అవుతుంది. దుష్టుడి లక్షణం అది. కంసుడు అంటేనే సంతోషం తొలగించే వాడని అర్థం. అంటే, దుఃఖం కలిగించేవాడు అన్నమాట! ఈ కంసుడి ప్రవర్తన వల్ల వసుదేవుడు సంతోషించలేదు. నిర్లిప్తుడై ఇంటివచ్చేవాడు. వీడి మంచి తనం ఎంతకాలం ఉంటుందో? అనీ అతడు అనుకున్నాడు.

ఒకనాడు నారద మహర్షి, కంసుడి కొలువుకు వచ్చాడు.

''నీకు శుభం కలగాలి! నీకు క్షేమం కలగాలి! అయితే ఇంతటి మందుడవు అయ్యావు. మరి, నీకు క్షేమం, శుభం ఎలా కలుగుతాయి కంస రాజా?'' అంటూ నారదుడు నవ్వాడు.

''అంటే, నీ ఉద్దేశం?''

''నా ఉద్దేశం అంత ముఖ్యం కాదు. నీకు నీ జన్మ రహస్యం చెబుతా! సావధానంగా విను! గోకులంలోని వారందరూ దేవతలు! దేవకీవసుదేవులతో సహా! వీళ్లందరినీ మామూలు మానవులనుకున్నావు కదూ! నీవా కాలనేమివి! నిన్ను సాధించేందుకు గోకులంలో దేవతలు జన్మించారు. దేవకీ వసుదేవుల అష్టమ గర్భంలో సాక్షాత్తు శ్రీమహా విష్ణువు అవతరింపబోతున్నాడు. ఈ విషయం ఇంతకు ముందే నీకు గగనవాణి చెప్పిందాయె! అప్పుడు నీపని....''

''నిజమా!'' కంసుడు నోరంతా తెరచి అడిగాడు.

''అబద్ధం నీతో చెప్పే సాహసం నాకుందంటావా మహారాజా?'' అంటూ నారదుడు నవ్వాడు.

కంసుడి మనస్సులో ఆలోచనలు సుడులు తిరగసాగాయి రాక్షస ప్రవృత్తి, ఉన్నట్టుండి విద్యుత్తులా శరీరంనిండా వ్యాపించినట్లు భావన కలిగింది.

''అయితే ఈ ఎత్తులూ, జిత్తులూ కేవలం నన్ను సాధించేందుకేనా?''

''అంతే మరి! శ్రీహరి ఎంతటి మాయావో, నీకు తెలీంది కాదుగా?'' అని నారదుడు అక్కడినుండీ చల్లగా జారుకున్నాడు.

ఓ నిప్పురవ్వ, గడ్డివామిలో పడవేయడం వరకూ మనం చేస్తే చాలు. ఆ తరువాత, దాని పని అది చేసుకుపోతుంది. అంతే అయింది కంసుడి పని. ఆ నిప్పు రవ్వ పెద్ద మంట అయింది. సర్వం దహించేంత దాహక శక్తితో అది విజృంభించింది. కంసుడు ఉడికి పోసాగాడు.

అతడు మరి ఆలస్యం చేయలేదు. దేవకి బిడ్డలను నిర్దయతో చంపాడు. అంతటితో ఊరుకోక, దేవకీ వసుదేవులను చెరలో పెట్టాడు. తండ్రి ఉగ్రసేనుడి గతీ అంతే అయింది. తనుకాలనేమి! తనకు వీళ్లంతా శత్రువులు! ఆగర్భ శత్రువులు. తన కత్తికి ఎదురు లేదు; తన ఆజ్ఞకు మారులేదు.

బాణుడూ, భౌముడూ, మాగధుడూ, మహాసేనుడూ, కేశీ, ధేనుకుడూ, బకుడూ, ప్రలంబుడూ, తృణావర్తుడూ చాణూర ముష్టికులూ, ద్వివిద పూతనాదులు ఇష్టులూ, హితులూ, సన్నిహితులూ అయ్యారు. వీరందరూ ఒకరిని మించిన మాయావులు మరొకరు. నిర్దయులూ, నిష్ఠురులూ, పాపబుద్ధులూనూ.

క్రమంగా దేవకి ఆరుమంది శిశువులనూ కంసుడు బలిపెట్టాడు గదా?

దేవకి ఏడవసారి గర్భం ధరించింది.

భగవంతుడు పుట్టవలసిన సమయం ఆసన్నమయింది.

ఆయన యోగమాయను స్మరించాడు.

యోగ మాయ ''చిత్తం!'' అంటూ ఎదురు నిలచింది.

''దేవీ! నీవు గోకులానికి తక్షణం వెళ్లవలె! అక్కడ వసుదేవుడి భార్య రోహిణి ఉంది కదా! దేవకి గర్భంలో తేజరిల్లే ఆదిశేషుని తేజాన్ని రోహిణి గర్భానికి మార్చు. యశోద గర్భంలో నీవు జన్మించుదేవీ! దేవకి గర్భం ఇలా మార్పుకావడం వల్ల ఆమెకు గర్భస్రావం అయిందని లోకులు అనుకుంటారు. ఈ గర్భ సంకర్షణలో జన్మించిన బిడ్డ సంకర్షణుడవుతాడు. ఈ మానవులు నిన్ను దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చండిక, కృష్ణ, మాధవి, కన్యక, మాయ, నారాయణి, ఈశాని, శారద, అంబికాది పదునాల్గు నామాలతో పూజించి తరిస్తారు. నీవు వారికి ఆరాధ్య దైవం అవుతావు. వరదాతవు అవుతావు దేవీ!'' అని భగవదాదేశం.

దేవకి మళ్లీ చూలాలు అయింది. ఈ మారు ఆమెకు అష్టమ గర్భం. ఈ గర్భాన్నుండే, సర్వసర్వం సహా చక్రాన్ని తనలో దాచుకున్న మహాశక్తి సమన్వితుడూ, యోగ పురుషుడూ అయినవాడు ఓ చిన్ని శిశువై జన్మించవలె!

ఆకాశవాణి చెప్పిన విషయం కంసుడు మరచిపోలేదు. నిరంతరం ఏం చేస్తున్నా, ఎక్కడ ఎలా ఉన్నా – ఎవరితో మాటాడుతున్నా, కంసుడి మనస్సు నిండా మహావిష్ణువు జన్మింపబోతున్న విషయం ప్రబలమై నిలచింది. నిద్రలో కలలు; కలకలలు. ఉలిక్కిపడి, హఠాత్తుగా లేచి, పడక మీద కూర్చుని ఆలోచించేవాడు. ఆహారపానీయాలు తీసుకోడం మరచి పోయేవాడు. నిద్రలేక నిరశనంతో విష్ణు జననం గురించి అహర్నిశలూ మననం చేస్తూ, స్మరిస్తూ ఎదురుచూడసాగాడు. మరపులేని వైరానుబంధం ఈశ్వరుడితో అతడికి కలిగింది. ఇదీ ఓ విధమైన భక్తి విశేషం!

శ్రావణ బహుళ అష్టమినాడు చంద్రోదయం అర్ధరాత్రివేళ అవుతుంది. గ్రహతారలు శుభప్రదంగా ఉన్న ఆనాటి నడిరేయి సమయంలో భగవంతుడు దేవకీవసుదేవులకు శిశువై జన్మించాడు. ఆ జన్మించడం అంటే, సాధారణ శిశువుకువలె ఆ తల్లి దండ్రులకు కనిపించలేదు.

ఆ శిశువుకు నాలుగు చేతులు – శంఖం, చక్రం, గదా శార్ఙ్గం – కౌస్తుభ మణి – శ్రీ వత్సలాంఛనం. సూర్యచంద్రుల్లా ప్రకాశించే శ్రవణ కుండలాలు – మణిమయ కిరీటం. ప్రసన్న దృష్టీ కలిగిన ఆ శిశువు వారికి దర్శనం ఇచ్చాడు.

ఆ అద్భుత దర్శనం చూసి వారు ఇద్దరూ పులకితగాత్రులైనారు; తన్మయు లైనారు, వినమ్రులైనారు. భక్తి ప్రపత్తులతో చేతులు జోడించారు. ఆనందభాష్పాలు చెక్కుల నుండీ ధారలు కడుతూండగా తదేకంగా చూడసాగారు. ఆదివ్య దర్శనం మళ్లీ చిక్కదన్నంత తృషితంగా వారు చూడసాగారు.

''తండ్రీ? నిన్ను ఏమని కీర్తించడం? ఏమాటలు నీకు సరిపోతవి? ఏ వర్ణన నీకు ఉచితమౌతుంది? సర్వం నీవే అయినవేళ మేం ఏం చెప్పినా, ఏం చేసినా నీదే – నీకే అవుతుంది కదూ? ప్రభూ! నన్ను ఈ దీనుడిని కాపాడు. కరుణావేశంతో ఆదరించు!'' అంటూ వసుదేవుడు నమస్కరించాడు.

''ఇతడు నా కొడుకా? ఈ కొడుకునకు నేను తల్లినా? ఈ శిశువుకు నేనా జన్మఇచ్చింది? నీకే జన్మఇచ్చిన మహాదాతకు నేను ఎలా జన్మదాతను అవుతాను? ఇది నాకు చివరి జన్మచెయ్ నాయనా! అదే నేను కోరేది! తీర్చుతావా తండ్రీ!'' అంటూ కండ్ల నిండా ఊరిన కన్నీళ్లతో దేవకి నుంచుంది.

ఐంద్రజాలకుడి అద్భుతదృశ్యం తెరమరుగయినప్పటిలా అయింది చెరసాల!

''ఈ శిశువును గోకులం తీసుకు వెళ్లు వసుదేవా! నీకు శ్రేయం కలుగుతుంది!'' అంటూ ఎవరో చెవిదాపున చెప్పినట్లయింది.

''ఈ బిడ్డను ఏం చేయాలీ?'' వసుదేవునకు కలిగిన సందేహం.

''గోకులంలో యశోద ప్రసవించింది. ఆ బిడ్డను ఇక్కడకు తెచ్చి ఈ బిడ్డను అక్కడ పెట్టు!''

ఆ తరువాత పురుటింట శిశురోదనలు చెలరేగాయి. ఆ దంపతులు, ఆ శిశురోదనలు విని ఆనందంతో పాటు ఆవేదనా పొందారు. కావలి భటులు వింటే, ఎంతటి ఆపద?

అంతకు ముందు వారిని ఆవరించిన మాయ, ఈమారు కావలి భటులను ఆవరించింది.

చెరసాల తలుపులు తెరచుకున్నాయి. ఎవరివో అడుగులు చప్పుళ్ళు. ఆవేశం ముసించినట్లుంది. జాగృతం కాని స్వాప్తిక దశ వసుదేవునకు కలిగింది.

నిష్కామ కర్మ చేస్తున్న మహా యోగివలె వసుదేవుడు పొత్తిళ్ల పాపడిని ఎత్తుకున్నాడు; నడుస్తున్నాడు.

గోకులం ఎంతదూరం ఉందో? మధ్య యమున అడ్డం కూడా వస్తుంది. ఎలా దాటడం? ఏమో. భగవదాదేశం! శిరోధార్యం! అందులో తన తలమీద ఉన్నది భగవంతుడేనాయె! తనకెందుకూ చింత?

అక్కడ గోకులంలో యశోదకు యోగమాయ పుట్టింది. గోకులం చేరిన వసుదేవుడు, యశోద పురుటింట ప్రవేశించాడు. అందరూ గాఢ నిద్రా ముద్రితులై ఉన్నారు; నిశ్శబ్దం తాండవిస్తూంది. యశోద ప్రక్కలో నిర్మలంగా పాపనిద్ర పోతూంది. వసుదేవుడు గాఢంగా నిట్టూర్చి, శిశువులను మార్చి ఇవతలకు వచ్చాడు.

చెరసాల చేరడంతో యథాప్రకారంగా తలుపులు మూసుకున్నాయి. చేతుల కాళుల సంకెళ్లు ముడివడ్డాయి.

నిస్సహాయంగా వసుదేవుడు చతికల పడ్డాడు.

ఉన్నట్టుండి శిశురోదనలు ధ్వనించాయి. కావలి భటుల నిద్ర చెదరిపోయింది. కన్నులు నులుముకుంటూ లేచి నుంచున్నారు. కంసమహారాజుకు క్షణాల్లో ఆవార్త చేరింది.

అష్టమగర్భం! ఇంతకాలంగా వేయికండ్లతో ఎదురుచూసిన ఎనిమిదవ శిశువు! తన శత్రువు: తన మారకుడు. ఇప్పుడు వీడిని అంతం చేస్తే తను మరణాన్ని జయింపగలడా? తప్పక జయింపగలడు! తనకు మృత్యువు అయిన వాడికి తను మృత్యువు కాబోతున్నాడు. ఎంత సంతోష సమయం?

కంసుడు తల్పమ్మీదినుండీ చివాలున లేచి కూర్చున్నాడు. కరవాలం అందుకున్నాడు. పెద్ద పెద్ద అంగలతో అతడు క్షణాల్లో దేవకి పురుటి గదికి వచ్చాడు.

బిడ్డను అందుకున్నాడు. బాలనాగాన్ని గరుడుడు చివాలున అందుకున్నట్టు బిడ్డను కంసుడు ఒడిసి పుచ్చుకున్నాడు. క్రోధం కట్టలు తెంచుకుంది.

''అన్నా! ఇది ఆడపిల్ల! గగనవాణి మగబిడ్డకదా నీకు మరణ కారకుడు అవుతాడని చెప్పింది? ఈ ఆడపిల్ల నిన్నేంచేయగలదు? దీన్ని రక్షించు! చంపకు! దయచూడు!'' అంటూ దేవకి ఆక్రోశించింది.

అయితే అతడు క్రోధ బధిరుడు. దేవకి ప్రార్థన అతడి చెవిని సోకలేదు. కోపంతో ఆ పాపను నేల పడవేశాడు.

విచిత్రం! నేల పడిన పాప చివ్వున ఆకాశానికి ఎగసింది. అష్టభుజ అయింది; ఆయుధ పాణి అయింది: దివ్య మాలాలంకృత అయింది. కిరీటధారిణి అయింది. మందహాసంతో, దివ్యతేజస్సుతో రెండవ సూర్యుని వలె ప్రకాశింప సాగింది.

కంసుడు కండ్లింత చేసుకుని, సంభ్రమంతో చూడసాగాడు.

''నిన్ను చంపగలవాడు క్షేమంగా ఉండనే ఉన్నాడురా దుర్మతీ!'' అని ఆ మాయాశక్తి, అదృశ్యం అయింది.

కంసుడు అప్రతిభుడైనాడు; మూఢుడూ అయ్యాడు. చేత పడిన కబళం నోర వేసుకునేంతలో అదృశ్యం అయినప్పుడు సింహం ఉన్న స్థితిలో కంసుడు ఇప్పుడు ఉన్నాడు.

పాము బుస్సల్లాంటి నిట్టూర్పులతో అతడు అక్కడే నుంచున్నాడు. కంసుడికి విరక్తి కలిగింది. శిశువులను చంపడం అవివేకం అనిపించింది. ఎప్పుడో, ఎవరో ఏదో చేస్తారన్న భీతితో, తను శిశు హంతకుడయ్యాడు. ఈ శిశుహత్యలు వీరోచిత కార్యమా? ఆ నిముషంలో అతడు పశ్చాత్తాప చిత్తుడయ్యాడు. క్షమింపమని దేవకి చేతులు పట్టుకున్నాడు.

మనస్సు రాయిలా కఠినం కాదు. చాలా మృదువైన పదార్థం. పూల రేకువంటిది. ఏభావం ఎప్పుడు కలిగినా ఆ భావం మనస్సులో ముద్రితం అవుతుంది. దురాలోచనలుగానీ, సదాలోచనలు గానీ ఆక్షణంలో కలిగిన భావవేశం కొద్ది ప్రతిఫలిస్తూంటాయి. ఆసమయంలో మనిషి తదనుగుణంగా ప్రవర్తిస్తాడు. రాక్షస దేవతా లక్షణాలు మనస్సు మార్పుల వల్ల ప్రకటింపబడుతూంటాయి. అల్లాగే ఇప్పుడు కంసుడి మనస్సులో కారుణ్యం తొణికిసలాడసాగింది. శిశుహత్య దారుణం అనిపించింది. ఈ భావన క్షణం ఉండవచ్చు. సదాచారుల్లో ఇది శాశ్వతం అయితే, దురాచారుల్లో క్షణాల వరకే పరిమితం అవుతుంది. అంతే తేడా!

ఆ క్షణాల్లో కలిగిన మార్పుతో కంసుడు మంచివాడయినాడు. అతను చేసిన చెల్లెలి కడుపు కోతకు వాపోయాడు. క్షమింపమని వేడుకున్నాడు.

దేవకీవసుదేవులకు కంసుడి వింత ప్రవర్తన అవగాహన కాలేదు. విస్తుపోయి చూడసాగారు.

''నీవు ఏదో మాకు ద్రోహం చేశానని ఎంతో పశ్చాత్తాపంతో క్షమింపమని అడిగావు బావా! కానీ నీవు మాకేం చేయలేదు. మా పాపాలు నీ చేత అలా చేయించాయి. నీవో నిమిత్తం! అంతే! దీనికంతా కారణం ఆ పరమేశ్వరుడే!'' అంటూ వసుదేవుడు అనునయించాడు.

కంసుడు శాంతచిత్తుడై అంతఃపురం వెళ్లాడు.

మరునాటి ఉదయం అతడు సభ తీర్చాడు. మంత్రులనూ హితులనూ పిలిపించి యోగమాయ తెలిపిన విషయం వారికి చెప్పి, కర్తవ్యం ఏమిటని అడిగాడు.

కంసుడి మంత్రులు అందరూ దుర్మార్గులే; దురాచారులే! వారిమనస్సులకు సదాలోచనలు రావు. అంచేత వారంతా ముక్తకంఠంతో ప్రతీకారం తీసుకో వలసిందిగా చెప్పారు.

''ఎలా ప్రతీకారం ఎవరి మీద తీసుకోవాలి?'' అని కంసుడు అడిగాడు.

''నిన్ను చంపేవాడు ఇంకా శిశుదశలోనే ఉన్నాడు మహారాజా! ఈ లోకంలోని శిశువులనంతా చంపుదాం; గండం గడచిపోతుంది. ఈశ్వరుడు కదా నిన్ను చంపాలనుకుంది. వాడి ఉనికి పట్లు అయిన చోట్లన్నీ తగలపెడదాం! అప్పుడు బయటపడి మనతో పోరాటం సాగిస్తాడా? మనం తీవ్రంగా ఎదుర్కొందాం! వాడనగా మనకూ, మన బలగానికీ ఎంత ప్రభూ? ఎందరినీ పంచ బంగాళం పట్టిచ్చాం! వీడో లెఖ్ఖ మనకు? ఇంతకాలం దాగినవాడు బయట పడ్డం మంచిదేకదా! వీరుల్లాగా పోరాడుదాం! విజయం పొందుదాం!''

కంసుడు పకపకా నవ్వాడు. ఆ నవ్వడం అంటే, మంత్రులకు ఆజ్ఞ ఇచ్చినట్లే!

అప్పటికప్పుడే అంచలంచెలుగా రాజాజ్ఞ జారీ అయింది. ఫలితం దేశమంతా రోదనలు: హాహాకారాలు. హింస వేయి తలలతో, అనంత కోటి పాదాలతో వికృతంగా నాట్యం చేయసాగింది.

భగవంతుడు కొన్ని చోట్ల ఉంటాడని పెద్దలు చెబుతారు. ఆయన ఎంతటి సర్వ వ్యాపి అయినా, ఆయన ముఖ్యమైన ఉనికి పట్లు కొన్ని ఉన్నాయి. గోబ్రాహ్మణులూ, సాధు సజ్జనులూ, అనదులూ, స్త్రీ బాల వృద్ధులూనూ. ఈ ప్రదేశాలు పట్టి పట్టి రాజోద్యోగులు పీడింపసాగారు. వాళ్ళు చేసిన నేరం ఏమీ ఉండదు. భగవంతుడి మీద ప్రతీకారం అది.

నిష్కారణంగా ఎవరి మీదనయినా బలప్రయోగం చేస్తే ఆబలం క్రమ క్రమంగా తగ్గిపోతుంది. అలా బలప్రయోగం చేసిన వారి సిరిసంపదలూ అణగారి పోతాయి. వారు చేసిన పాపాలు తరతరాలకూ తరగనిదవుతుంది. ధర్మహాని జరిగిన చోట విజయం కలిగినా, అది తాత్కాలికమే అవుతుంది. రాజ్యమంతా అల్ల కల్లోలం అయిన దుర్ముహూర్తంలో నందగోకులం మాత్రం, మహానందంతో, మహోత్సాహంతో నిండిపోయింది. నందుడికి నందనుడు ఉదయించాడు. ఆశుభ సందర్భంలో అతడు అంతులేనంతగా దానాలు చేశాడు. స్వస్తి పుణ్యాహవచనాలు చేయించారు. దేవపితృదేవతలను తృప్తి పరచాడు.

గోకులం అంతా పండుగ చేసుకుంది. యశోదనంద గోకులం వారికి తలలో నాలుక! ఆమె వారికి ఆత్మబంధువు. కొందరకు తల్లి: కొందరకు చెల్లి: ఇంకొందరకు ప్రియసఖి. అల్లాంటి యశోద నేడు సంతానవతి అయిందంటే, సంతోషపడని వారెవరు? ఆ బిడ్డను తనివి తీరా ముద్దాడి, ఆశీస్సులందివ్వని వారెవరు? నందగోకులంలో స్త్రీలు గుంపులు గుంపులై యశోదా శిశువును చూడరాసాగారు.

కొందరు గోపికలు, ఆ శిశువు తమవైపు చూశాడనీ, కొందరు, తమను చూసి నవ్వాడనీ, పిడికిళ్లు బిగించి ఎత్తుకోమని సైగలు చేశాడని కొందరూ రకరకాలుగా చెప్పుకుని మురిసిపోసాగారు. కొందరు గోపికలు జోలపాటలు పాడారు. కొందరు ఆనందంతో నృత్యం చేశారు. కొందరు శిశువు నిదురించాడనీ సందడి చేయవద్దనీ మందలించారు.

లోకాలను జోకొట్టి నిదురబుచ్చి, తను మేలుకొన్న ఘనుడు నేడు శిశువై, గోపికలు పాడిన జోలపాటలకు ఆదమరచి నిదురపోవడం ఎంతటి విచిత్రమైన విషయం?

రోహిణి, కొడుకు క్షేమం కోసం యథాశక్తి దానాలు చేసింది.

ఆ ఇద్దరు దైవ బాలలు గోకులం చేరినంతనే అక్కడ పాడి పంటలు సమృద్ధం అయినాయి. ప్రకృతిలో కొత్తగా అందాలు గోచరించాయి. ప్రేమా ఆప్యాయతలు గోపీగోపాలురకు అధికం అయ్యాయి. గోకులంలో వసంత సౌందర్యం శాశ్వతం అయింది.

మధుర రాజులకు నందుడు కప్పం చెల్లించడం ఆనవాయితీగా ఉంది. ఈ మారు నందుడు అమితోత్సాహంతో అంతులేనంతగా పాలూ పెరుగు వెన్నలు, తనవెంట తీసుకుని బయలుదేరాడు.

రాజుకు కానుకలు చెల్లించిన తరువాత నందుడు, వసుదేవుని కలుసుకున్నాడు.

వసుదేవుడు, ఆనందంతో నందుడిని ఆలింగనం చేసుకున్నాడు.

''మీకంతా క్షేమం కదా? ఇంతకాలానికి నీకు సంతతి కలగడం విని చాలా ఆనందించాను!'' అని వసుదేవుడు పరామర్శించాడు.

''నీబిడ్డకూ, రోహిణి కొడుక్కూ క్షేమమేకదా?'' అనీ అడిగాడు.

''మాభాగ్యం గురించి ఏం చెప్పను వసుదేవా? ఎంత చెప్పినా తనివితీరదు! గోకులం అంతా ఆనందధామం అయిందనుకో! ఈ శిశువుల ఉదయంతో పాడి పంటలూ, సిరిసంపదలూ ఉత్కటం అయ్యాయి. గోకులం స్వర్గం అయింది. ఏ ఇంట చూసినా ఆనంద కోలాహలమే!''

వసుదేవుడు చాల సంతోషించాడు.

చివరకు అతడు, ''దుష్టులు ఎవరేనా కీడు కలిగించవచ్చు నందరాజా! కొంచెం అప్రమత్తుడవై ఉండు!'' అన్నాడు.

నందుడు అందరి వద్దా శలవు తీసుకుని తిరుగుప్రయాణం అయ్యాడు. దారిలో ఎన్నో అపశకునాలు ఎదురైనాయి. భగవంతుడి స్మరణతో అతడు ప్రయాణం సాగించాడు.



## పూతన

కంసమహారాజు మంత్రులంతా ఏకగ్రీవంగా శిశుహత్యలు చేయవలసిందిగా చెప్పారు కదూ? కంసుడిని చంపగల శిశువు ఎక్కడో పెరుగుతున్నాడు. అంచేత కనిపించిన శిశువునల్లా నిర్మూలిస్తూ పోతే, ఆ శిశువుల్లో, ఈ శిశువు ఒకడవుతాడని వారి ఉద్దేశం!

సిద్ధహస్తురాలూ, బాలఘాతకీ అయిన పూతనకు ఈ కార్యం వారు అప్పగించారు. పల్లె పల్లెకూ తిరుగుతూ, ఇంటింటికీ పోయి ఎక్కడ శిశువు కనబడితే అక్కడక్కడే మట్టు పెట్టమని దానికి రాజాజ్ఞ!

అది సంతోషంగా రాజానతి తలదాల్చి శిశుహత్యలకు బయలుదేరింది. అలా తిరుగుతూ, కనిపించిన శిశువునల్లా నిర్దయతో చంపుతూ, చివరకు గోకులం చేరింది పూతన. నందుడి ఇంటి సమీపాన పూతన చెవులకు శ్రావ్యంగా శిశు రోదనలు వినిపించాయి.

పూతన సర్వాంగసుందరంగా స్త్రీ వేషం ధరించింది. రాక్షసులు కామరూపులు. ఏ రూపం కోరుకుంటే, ఆ రూపం వారు పొందగలరు. పూతన నంద సదన సింహద్వారం చెంతకు వచ్చింది.

యశోద ఎక్కడో లోపల తలమునకలయిన పనులతో మునిగి పోయి ఉంది. కామరూపిణి అయిన పూతన, చిన్నికృష్ణుడి ఊయల సమీపించింది. బాలుడు గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు.

అంతకు ముందే యశోదా మాత, కడుపునిండా పాలు తాపించి జోకొట్టి నిదురపుచ్చి మరీ, తన పనుల్లో పడి పోయింది. ఏదో అలికిడి కావడంతో ఆమె ఇవతలకు వచ్చింది.

ఆ నూతన వ్యక్తి వేపు యశోద సందేహంతో చూసింది.

''ఎవరమ్మా నీవు? ఇక్కడ తారట్లాడుతున్నావేం? ఏం కావాలి నీకు?'' అంటూ ఆమె అడిగింది.

''నేనా..నేను'' అంటూ పూతన తడబాటును దిద్దుకుంది. ''ఈ అందాల పాపడికి కాసిని పాలు పడదామని వచ్చా తల్లీ! నీ కొడుకు అంద చందాలూ, ఆటపాటలూ లోకమంతా మార్మోగుతూంది. నేనూ బాలెంతనే కనుక, నాబిడ్డ లేడు కనక ఈ చిన్నారి బాలుడిలో నా బిడ్డను చూసి అల్ప సంతోషం పొందవలెనని ఇలా వచ్చా తల్లీ! అంతే అమ్మా! మరే దురుద్దేశం లేదంటే నమ్ము!'' అంది పూతన.

''అయినా నిక్షేపంగా పాలుతాగి మరీ నిద్రపోతున్న వాడికి పాలు పడతానంటావేం? ఇప్పుడు వాడిని నిద్రలేపుతావా ఏం? నిద్ర లేచాడంటే, అంతేనా పని! నాకా లోపల బోలెడంత పని ఉంది.''

''దానికేంలే తల్లీ! నేను ఇక్కడ ఉంటాగా! నా పని పూర్తి చేయకుండా నేను వెళ్లను లేమ్మా! నీ బిడ్డ ఎప్పుడు నిద్ర లేస్తే అప్పుడే ఓగుక్కెడు పాలు పట్టి, నా దారిని నేను వెళతాగా.''

''సరేలే! అయితే వాడిని లేపి మరీ పాలు పట్టకు, నీకు పుణ్యం ఉంటుంది'' అని యశోద లోపలకు పోయింది.

అమాయకురాలైన వారిని మోసగించడం ఎంతో సులభం. ఈ అమాయకులు, ఇతరులను మోసగించలేరు; అంచేత, ఇతరులూ ఉత్తపుణ్యానికి, తమనెందుకు మోసగిస్తారని అనుకుంటారు. యశోద కూడా ఈ కోవకు చెందినది కావడం వల్ల ఓ ఆగంతకురాలయిన స్త్రీని నమ్మి, తనబిడ్డను అప్పగించింది. అయినా సర్వసమర్థుడు అయిన బిడ్డ తనకున్నపుడు ఎందుకూ బెంగ?

పూతన పని బాగా సులువయింది. అది చన్నులనిండా విషపు పూతలు పూసుకునేది. నాలుక తగిలితే చాలు, పంచప్రాణాలు పోయేంత గొప్ప శక్తివంతమైన కాలకూటవిషం చనుబాలతో రంగరించి శిశువులను చంపుతూ వస్తూంది పూతన. ఇక్కడా దాని ప్రయత్నం అదే!

ఇంతలో చిన్నికృష్ణుడు ఆవులించి లేచి, కాళ్లూ చేతులూ ఝాడించి, పూతన పేవులు కొత్తగా లెఖ పెట్టడం ఎందుకనుకున్నాడేమో, దాని వేపు చూసి మందహాసం చేశాడు.

''నిద్ర లేచావా బాబూ! లే! ఎవ్వరూ ఇవ్వలేని పాలు ఈ రోజు నీకు పడతాను. ఓ గుక్కెడు తాగావంటే, మళ్లీ ఎప్పుడూ పాలకు ఏడవ్వు!'' అంటూ పూతన నవ్వుతూ బాలుడిని అక్కున చేర్చుకుంది.

చిన్ని కృష్ణుడు కాళ్లు ఝాడిస్తూ చేతులు ఊపుతూ, పసిడి నవ్వులతో కిలారించి పోతూ, పూతన అందించిన దానిచన్నును నోర లంకించుకున్నాడు. మరో చన్ను తన చిట్టి చేతులతో అందుకున్నాడు.

గుక్కమీద గుక్క పాపడు పాలు తాగుతున్నాడు. పాలు అందక పోయినా చన్ను విడువడు.

''ఇదెక్కడి వింత? ఇంతటి పచ్చి విషం తాగినా వీడికేం కాలేదు. పాలు రాక పోయినా విడచి పెట్టడు'' అనుకుంటూ పూతన, చిన్ని కృష్ణుడి పట్టునుండీ విడిపించుకునే ప్రయత్నం చేయసాగింది.

''ఇహచాలు! తాగింది చాలు! చన్ను విడువ్!'' అంటూ అది ఆక్రందన చేయసాగింది.

పాలుతాపుతున్న చిన్ని కృష్ణుడు, వినోదంగా, అమాయకంగా చూస్తూ, ఒక్కోగుక్క పాలతో ఒక్కోప్రాణం హరించసాగాడు. పూతన చావు కేకతో నిర్జీవి అయింది. ప్రాణం పోయిన తరువాత కామరూపం నిలువదు. అది నిజరూపు పొందింది. కొండంత శరీరంతో విలవిలా తన్నుకుని వెల్లకిలా పడి అది చచ్చిపోయింది.

చిన్ని కృష్ణుడు అంత అయినా దాన్ని విడిచి పెట్టలేదు. దాని శరీరమ్మీద చేరి ఆడుకోసాగాడు.

పూతన అరచిన అరుపులకు లోపలినుండే అటు యశోదా, బయటనుండీ ఇటు రోహిణి మొదలయిన గోపాలురూ, గోపికలూ అక్కడకు వచ్చారు.

ఈ రాక్షసి ఎవరు? ఎలా వచ్చింది? ఎలా చచ్చింది? అని అందరూ అడిగేవాళ్లే! ఒక్కరికీ తగిన సమాధానం చిక్కలేదు.

యశోద చప్పున శిశువును, దాని శరీరమ్మీదినుండీ అందుకుని లోపలకు తీసుకుపోయి ఓయింత ఉప్పు తిప్పి, నూతిలో పోసింది. రోహిణి ఈశ్వరుని పాదాలమీది విభూది ఓచిటికెడు పాపడినొసట పెట్టింది.

ఇంతలో అక్కడకు నందగోపుడు తన పరివారంతో మధురనుండే తిరిగి వచ్చాడు.

కొండవలె అచేతనంగా పడి ఉన్న ఆరాక్షసిని చూసి వారూ ఆశ్చర్య పోయారు.

''వసుదేవుడు దుష్టులు కీడు చేస్తారని చెప్పనే చెప్పాడు. ఇది ఆరంభమా? అంతమా తండ్రీ?'' అంటూ నందగోపుడు గొణుక్కున్నాడు.

దాని మృతకళేబరాన్ని బయటకు తీసుకపోవాలి. దాని శరీరం పట్టేంత పెద్ద వాకిళ్ళు నందగృహంలో లేవు. అంచేత ముక్కలుగా దాన్ని తరిగి తీసుకుపోయారు.

దాని శరీరం కాలుతూంటే, గంధపుచక్కలు కాలుతున్నట్లు సుగంధం నలువేపులా అలముకుంది. ఒక్కోసారి ఒక్కోరకమైన వాసన. ఒకసారి మల్లెల వాసన; మరోసారి మొల్లల వాసన! ఇంకోసారి కేతకీపరిమళం – ఇలా ఎన్నో సువాసనలు అలము కోడం వాళ్లకు చిత్రం అనిపించింది.

పూతన జన్మాంతర సుకృతం, ఏం చేసుకుందో గానీ, చచ్చిన తరువాత అది సుకృతురాలయింది.

భగవంతుడికి పాలునైవేద్యం పెడుతూ అది మరణించింది. అది సామాన్యమైన అదృష్టమా? పుణ్యమా? అయితే ఈ విషయం గోపాలురకు తెలీని కారణంగా, వారు ఇంతటి దుష్టురాలు తగలపడుతూంటే, ఇంతలేసి సుగంధాలేమిటా అని ఆశ్చర్యపోసాగారు.



## శకటాసురుడు

చిన్ని కృష్ణుడు బోరగిల పడ ప్రారంభించాడు. యశోద ముచ్చట పడి ముద్దులాడింది.

నందుడు ఆనందంతో గొప్ప ఉత్సవం చేయ సంకల్పించాడు. సంతర్పణలు చేశాడు;

విందులు కుడిపాడు. చందన తాంబూలాలతో విరివిగా దానాలు చేశాడు. ఊరి వారందరికీ వినోదాలు ఏర్పాటు చేశాడు.

యశోద బాలుడికి జలకాలాడించింది. కస్తూరీ తిలకం దిద్దింది. కనులకు కాటుక అలది, కురులుముడిచి, బొజ్జనిండా పాలుపట్టి, జోకొట్టి నిదురపుచ్చింది.

అతిథి అభ్యాగతులకు విందులు చేస్తూ, యశోదా రోహిణులు లోపల ఎక్కడో ఉన్నారు. ఆరు బయట పడుకుని నిద్రపోతున్న బాలుడి దగ్గర ఎవ్వరూలేరు. అందరూ ఎవరి సందడితో వారు మునిగిపోయారు.

ఇంతలో బండి రక్కసుడు, మహావేగంతో పడకమీది చిన్ని కృష్ణుడిని సమీపించాడు. తన్ను సమీపిస్తున్న రాక్షసుడి విషయం మాగమ్నుగా పడుకున్న శిశువుకు తెలిసింది. తన్ను తాకబోతున్నంతలో, ఎడమకాలితో ఆదేవబాలుడు ఒక్క తన్ను తన్నాడు. పిడుగులు పడినంత శబ్దం అయింది. పెళపెళ లాడుతూ బండి ముక్కలు చెక్కలు అయింది. దానితో రాక్షసుడు అక్కడక్కడే మరణించాడు.

ఆ భయంకర శబ్దం విని లోపలి వారంతా, తమ తమ పనులక్కడక్కడే విడచి పెట్టి, బయటకు పరుగెత్తుకు వచ్చారు. భోజనం చేస్తున్నవారు, ఎంగిలి చేతులతోనే వచ్చారు. వడ్డిస్తున్న వారు పాత్రలతోనే వచ్చారు.

ఇరుసుతో సహా విరిగిపోయిన బండిని వారు చూశారు. నవ్వుతూ కేరింతలాడుతున్న బాలుడినీ వారు చూశారు. ఆ బండి ఎందువల్ల నజ్జు అయిందో కారణం ఎవ్వరకూ అంతుచిక్కలేదు. అంతచేసిన బాలకృష్ణుడు నవ్వుతున్నాడే కానీ నోరు విప్పి ఏమీ చెప్పడు.

దూరంగా ఆడుకుంటూ, ఆశబ్దానికి, తమ ఆటలు ఆపి వింతతో నోరంతా తెరచి ఉన్న బాలురు మాత్రం, అక్కడకువచ్చి, ఆచిన్నారి బాలుడు తన్నడం వల్లనే శకటం తునాతునకలయిందని చెప్పారు. పొత్తిళ్ల బాలుడేమిటి బండిని ముక్కలు ముక్కలయ్యేలా తన్నడమేంటి? చిత్రాతి చిత్రంగా ఉందే' అని వాళ్లు అనుకోసాగారు.

అయితే ఎవ్వరకూ నిజం తెలియలేదు.

ఏమీ ఎరగనట్లు బాలకృష్ణుడు, ఏడుపు లంకించుకున్నాడు. యశోద తన కొడుకును గుండెలకు హత్తుకుని ''మానాన్న! ఎంత దిష్టితగిలిందో? ఎంత ఆకలయిందో?'' అంటూ బాలుడిని ఎత్తుకుని లోపలకు పోయింది.

నందుడు ఏదో దుష్టగ్రహాల ప్రభావంగా అనుకున్నాడు గ్రహ ప్రభావం పోయేందుకు, బ్రాహ్మణులను సంప్రదించి శాంతి హోమాలు, అర్చనలూ చేసి విద్వజ్జనానికీ, దేవతలకూ తృప్తిపరచారు.



## తృణావర్తుడు

ఒకనాడు యశోద, కొడుకును తన తొడలపై పడుకోపెట్టుకుని పాలు పడుతూంది. ఆ సమయంలో అదేం వింతో, తన తొడలమీద బాలుడు కొంచెం కొంచెంగా బరువవుతూ, చివరకు కొండంత బరువయ్యాడు. తానునలిగి పోతానన్న భయం ఆమెకు కలిగింది. మోయలేక ఆ బాలుడిని నేలమీద

పడుకో బెట్టి, ఆమె తేలిక పడింది. ఆ బాలుడిని, తదేకంగా ఆశ్చర్యంతో చూస్తూండ సాగింది ఆమె. ఆబాలుడు మాత్రం, తనబోసి నవ్వుల వెలుగులతో తల్లిని ముంచెత్తుతూ చూడసాగాడు.

ఇంతలో, కంసుడి ఆజ్ఞానువర్తి అయిన తృణావర్తుడు అక్కడకు భయంకరంగా వచ్చాడు. వాడిరాకతో గాలిసుడులు తిరుగుతూ వీచింది. ఆకులలవములూ, దుమ్మూధూళీ ఎగురుతూ భూమ్యాకాశాలమధ్య గుండ్రంగా తిరుగుతూ నృత్యం చేస్తున్నట్లు కనిపించింది. అప్పుడు చీకట్లు ముసురుకు వచ్చాయి. కండ్లు తెరచుకోలేక గోపాలురు, కండ్లు నులుముకుంటూ, ఎక్కడి వాళ్లక్కడే నుంచుండిపోయారు.

తృణావర్తుడు, ఇంతలో, నేలమీదిపాపడిని ఎగరవేసుకపోయాడు. వాడి పోకతో సుడిగాలి ఎలా వచ్చిందో అలా ఉపశమించింది.

అందరూ కండ్లు తెరచిచూడగా, చిన్నికృష్ణుడి జాడలేదు.

గోకులం యావత్తూ వ్యాకులం అయింది. కింకర్తవ్య విమూఢులై వారంతా నుంచుండి పోయారు.

''అయ్యో! సుడిగాలి ఎంత పని చేసింది? మాముద్దుల కన్నయ్యను ఈపాపిష్టిగాలి ఎగరేసుక పోయిందా?'' అంటూ ఒకరినొకరు చేతులు పట్టుకుని వాపోవసాగారు.

''ఇక్కడే నా చిన్నారిని పడుకోపెట్టాను. పాపిష్టిదాన్ని ఎందుకు పడుకో బెట్టాను? ఒళ్లోని పాపడు నాకు బరువయ్యాడా? బరువు అయింది వాడుకాదు: నా దురదృష్టం! ఎంతటి బుద్ధిహీనురాలిని నేను? ఇంతలో ఎంత విలయం జరిగిపోయింది! అయ్యో రోహిణీ! నేను ఎంతటి పాపిష్టిదాన్నో నీకు అర్థం అయిందా?'' అంటూ యశోద దుఃఖ వివశురాలై కుప్పకూలిపోయింది.

''ఊరుకో యశోదా! మన కృష్ణుడికి ఏంకాదు. అంతామంచి జరుగుతుంది. నా మనస్సునాకు చెబుతూంది. బాధపడకు!'' అంటూ రోహిణి అనునయించింది.

''ఏమో. నేనో నష్టజాతకురాలిని! లేకలేక కలిగిన ఈ బిడ్డను గాలికి వదలి వేశాను.'' అంటూ యశోద వాపోయింది.

యశోద దుఃఖంలో గోపవనితలు పాలు పంచుకుని, తలలు వంచుకుని, ఆర్ద్రం అయిన కండ్లు తుడుచుకోసాగారు.

తృణావర్తుడు. ఒకలేతాకును మల్లె, ఒక చిన్ని పూవునుమల్లె సునాయాసంగా బాలకృష్ణుడిని, ఆకాశం ఎత్తులకు ఎత్తుకుపోసాగాడు. వాడు ఎంత దూరం తీసుకపోవాలనుకున్నాడో ఏమో. వాడికే అర్థం కాలేదు. పిచ్చి పుట్టినట్లు పోతున్నాడు... దారీ తెన్నూ లేకపోతున్నాడు.

ఇంతలో తను తీసుకుపోతున్న ఒక లేతాకంతటి బరువు, ఒక పూవంతటి బరువూ దుస్సహం కాసాగింది. ఆ బరువు ఒక కొండ రాయంత అయింది. కొండంతే అయింది. అంతటితో ఆ బరువు ఆగలేదు. అనంతంగా పెరుగుతూంది. ఆమోయలేనంత ఆ బరువుతో వాడు ఉక్కిరిబిక్కిరై పోయాడు. ఊపిరి ఆడడం ఎప్పుడో నిలచిపోయింది. క్షణాల్లో ఇంతటి గొప్ప బరువు తన మీదకు ఎలా వచ్చింది? ఎవరు కారణం! ఈ చిన్ని బాలుడు ఇలా దుర్భరం కావడమేమిటి? వాడు సాలోచనగా కృష్ణుడి వేపు చూశాడు. ఆబాలుడు మనోహరంగా నవ్వుతూన్నాడు.

వాడి ఆలోచనలు ఆగిపోయినాయి. ప్రాణాలు కడబట్టాయి. గిలగిలా తన్నుకుంటూ నేలమీద వాడు కుప్పకూలి ప్రాణాలు విడచిపెట్టాడు.

దూరాన్నుండీ ఈదృశ్యం చూసిన గోపగోపికలు పరువులు పెడుతూ అక్కడకు వచ్చి చూడగా, చనిపోయి పడిఉన్న పర్వతంలాంటి రాక్షసుడూ, వాడి కళేబరమ్మీద ఆడుకుంటున్న బాలుడూ కనిపించారు. కృష్ణుడిని వాళ్లు ఎత్తుకుని ముద్దాడుతూ యశోదకు తెచ్చిఇచ్చారు.



## బాల్యక్రీడలు

అలా ఉండగా, ఒకనాడు వసుదేవుని ప్రార్థన వల్ల కులగురువు అయిన గర్గముని గోకులం వచ్చాడు. నందుడు భక్తి తాత్పర్యాలు చూపుతూ ఆయనకు అర్ఘ్యం, పాద్యం సమర్పించాడు. కృష్ణ బలరాములకు కాలోచితం అయిన జాతకకర్మాదులు చేయవలసిందని కోరాడు.

''కంసుడి భయం వలన ఈ నామకరణాదులు అతి గోప్యంగా చేయవలె స్వామీ!'' అని చెప్పాడు.

గర్గ మహాముని మందహాసం చేసి, ''మంచిది'' అన్నాడు.

ఆ మహాముని రోహిణీ తనయునకు బలరాముడనీ, దేవకీ నందనునకు శ్రీకృష్ణుడనీ నామకరణం చేశాడు. జాతక సంస్కారాదులు నిర్వహించాడు.

రూపంలో నల్లనివాడే అయినా, ఆనందమయుడు కావలెనని ఆ ముని శ్రీకృష్ణుడని చేసిన నామకరణం ఉచితమే అయింది.

తప్పటడుగులు వేస్తూ రామకృష్ణులు నడకలు నేర్చారు. ఆవు దూడల తోకలు పుచ్చుకుని మెల్లమెల్లగా పరువులు పెడుతూ, నవ్వుల మందారాలు కుసుమింపచేస్తూ లోకాలను శ్రీకృష్ణుడు మురిపింప చేయసాగాడు.

గోపికల వంక చూసి మందహాసం చేసేవాడు. తమ ఈడుపిల్లలతో ఆటపాటలతో కాలం గడుపుతూ, గోకులమణిలా ఆ బాలుడు ప్రకాశింప సాగాడు. లేగదూడలు పాలు తాపుతూండగా ఆవు పొదుగును తన నోటిన చిక్కించుకుని పాలు తాగేవాడు. నోరి నిండా పాలు పట్టి బాలురపై ఉమిసేవాడు. ఊరి వారందరకూ ఆనందం కలిగిస్తూ, అందరితో ముద్దు ముచ్చటలు సాగిస్తూ, అందరిలో తానొకడై ఈ ఒక్కడే అందరూనై ఆనందకారకుడై శ్రీకృష్ణుడి శైశవం సాగుతూండేది.

మట్టిలో ఆడుకోడమూ, రెండు చేతులా ఇసుక తీసుకుని పైకి చల్లి, ఆ మట్టి జారుతూండగా, తాను స్నానం చేస్తున్నానంటూ, కాలి అందెలు ఘల్లు ఘల్లుమనగా చిందులు తొక్కేవాడు. ఎవరూ లేని సమయంలో దొంగవలె ఇంట ప్రవేశించి, వెన్న కుండల్లోని వెన్న తిన్నంత తిని, నేలమీద పామి, పెరుగు కుండల పగలకొట్టి, నానా అల్లరి చేసి, ఏమీ ఎరగనట్లు బుంగమూతితో ఆ దేవబాలుడు ఇంటికి వచ్చేవాడు.

''అమ్మా! ఆకలవుతూంది! అన్నం వేగిరంగా తీసుకురా!'' అంటూ తల్లిని ఆజ్ఞాపిస్తూ, యశోద కొంగు పుచ్చుకుని మారాం చేసేవాడు చిన్నికృష్ణుడు.

''ఓ క్షణం ఆగు కన్నా, వస్తున్నా!'' అంటూ యశోద తన కొంగు విడిపించుకోగా, నేలమీద పడి దొర్లుతూ, పొర్లుతూ కాళ్లూ చేతులూ ఝాడిస్తూ గారాములు సాగించేవాడు.

''అడిగినంతనే పెట్టకపోతే, నేను అస్సలు అన్నం తినను!'' అంటూ ఆ బాలుడు బుంగమూతితో, ఒక మూలకు వెళ్లి మోకాళ్లమీద తలపెట్టి కూర్చునేవాడు.

''నాన్నా! ఇంతలో అంత కోపమా? పెడతా అన్నాగా! పీట వేయాలి, కంచం తేవాలి! అన్నం కూరలు వడ్డించాలి, ఇదంతా క్షణాలమీద ఎలా చేయమంటావు బాబూ! నీ ముఖం కోపంతో ఎలా కందిపోయిందో చూడు! అన్నం అడుగుతున్నావు, ఇంతకూ కాళ్లు చేతులు కడుక్కుని వచ్చావా? లేదా?''

''కడుక్కోలేదుగా!''

''ఏవీ నీ చేతులు చూపు! ఎంత మట్టి నీ చేతుల్లో ఉందో చూడనియ్! మట్టిలో ఆడుతున్నావా? ఈ మట్టితో అన్నం తినకూడదమ్మా! చేతులు కడుక్కురా, తిందువు గానీ!''

''తింటే, ఏమవుతుందమ్మా?''

''జబ్బు చేస్తుంది. మట్టి తినకూడదు!''

''నీవేమో మట్టి కుండలో అన్నం వండుతున్నావ్! అప్పుడు మట్టి కాదా? మట్టిలో పడుకుంటున్నాం! మరి మట్టి కాదా? చూడు! ఇలా బాగా చూడు, నా వళ్లంతా మట్టే! ఈశ్వరుడు వళ్లంతా బూడిద పూతలు పూసుకుంటాట్ట! నేనూ వళ్లంతా మట్టి పూసుకుం టాను. ఆయన నాట్యం చేస్తాట్ట! నేనూ నాట్యం చేస్తా!'' అంటూ ఆ చిన్ని బాలుడు చిందులు వేసేవాడు.

ప్రేమాప్యాయతలు ముప్పిరికొనగా, యశోద తన్ను తాను ఆ క్షణంలో మరచిపోయేది. ఆమె కండ్లకు నిజంగా పరమశివుడే ఓ చిన్ని బాలుడై నాట్యం చేస్తున్నట్లు అనిపించేది. తాను పెట్టిన తిలకం మూడవ కన్నువలె కనిపించేది. పీతాంబరం, చర్మవసనంగా మారేది. కాళ్లకు చేతులకూ ఉన్న అందెలూ కంకణాలూ నాగాభరణాలుగా రూపొందేవి. గళంలోని తారహారాలు పాములై తనమీదకు దూకుతున్నంట్లుడేవి. తలమీది నెమలి పింఛం గంగవలె భాసించేది. ఆ సమయంలో ఆమె చలనం గోల్పోయి దివ్యమైన అనుభూతి పొందేది. ఆ అనుభూతి ఓ క్షణమో అరక్షణమో ఉండేది.

ఇంతలో తన కృష్ణుడే తనముందు కనిపించేవాడు. ఒక్క పరుగున పోయి, తన శిశువును గుండెలకు హత్తుకుని మోహపరవశ అయి, యశోద కనులు మూసుకునేది.

ఆ సమయంలో పరమ యోగులయిన వారికీ దుర్లభం అయిన పరమానందం ఆమెకు కలిగేది. చేష్టలుడిగి బొమ్మవలె సర్వం ఆమె మరచిపోయేది.

శ్రీకృష్ణుడు గోపబాలుర దగ్గరకు పోయి, ''ఏయ్! ఇలా రండి! నేను మీకంతా రాజును. మీరు నా ప్రజలు. నేను చెప్పినట్లు మీరంతా చేయాలి. నేను మీ భుజాల మీద కూర్చుంటాను. నన్ను మీరంతా వంతుల ప్రకారంగా మోయాల్సింది!'' అని ఆజ్ఞాపించేవాడు.

ఆ బాలకులు కిక్కురుమనకుండా ఒకరికన్నా మరొకరు ముందు ముందుగా వచ్చి మోసేవారు.

''ఇహ చాలు! మీరంతా అలా కూర్చోండి! బాగా అలసి పోయారు!'' అని ఓ తురాయి చెట్టు క్రిందకు శ్రీకృష్ణుడు చేరి కూర్చునేవాడు. ఆ బాలకులు అర్ధవృత్తాకారంగా ఆయన ముందు కూర్చునేవారు.

''కృష్ణా! నీవేం చేయమన్నా చేస్తాం! నీకోసం వేం ఏం చేస్తున్నా ఎంతో సంతోషం కలుగుతుంది! కారణం ఏమిటి కృష్ణా? చెప్పవూ?'' అని అడిగేవారు వారు.

ప్రసన్న దృష్టితో ఆ బాలుడు వారివేపు చూసేవాడు.

ఒకనాటి ప్రాభాత సమయంలో, దుమ్ము రేపుకుంటూ, ఆల మందలు మేతకు పోతున్నాయి. గోపాలురు కేరింతలాడుతూ ఆవుల వెంట వెళుతున్నారు.

గోపికలు కొందరు నందగృహం ముందు ఆవేశంతో నుంచున్నారు.

''అమ్మా! యశోదమ్మ తల్లీ! ఒకసారి ఇలా రామ్మా!'' అంటూ వారు కేకలు వేయసాగారు.

లోపలనుండీ యశోద చేతుల తడి కొంగుకు తుడుచుకుంటూ ఇవతలకు వచ్చింది.

''మీరెంతటి సిరులు కలవారయినా, ఇలా లేనివారలను బాధింప కూడదమ్మా! మీకు మేం ఉండడం, సుఖంగా బతకడం ఇష్టం లేకపోతే చెప్పు తల్లీ! తట్టా బుట్టా తీసుకుని పిల్లా పాపలతో ఎక్కడికయినా పోయి, మా బతుకులేవో మేం బతుకుతాం.''

''ఇంతకూ ఏమయిందో చెప్పకుండా ఇలా నిష్ఠూరాలకు పోతే నాకేం తెలుస్తుంది?''

''ఏం చెప్పమంటావ్ తల్లీ! మేం ఏం చెప్పినా మా మాటలు నమ్మేదెవరు? నీ గారాల కొడుకు చేసే ఆగడాలు ఏవని చెప్పడం? ఎంతని చెప్పడం? ఎంత చెప్పినా తరగవే తల్లీ? తనివితీరవు. అంతటి గ్రంథ సాంగుడు తల్లీ! నీ కొడుకు. ఈ రాలుగాయిని ఎలా కన్నావో నీకే ఎరుక!''

''అసలు సంగతి వివరంగా చెప్పండి. ఊరక బాలుకుడిని నిందించడం మీవంటివారికి ఉచితమేనా? సంగతేమిటో నీవయినా చెప్పవే శ్యామలా?'' అంటూ కోపం, బాధా కలిగిన కంఠంతో యశోద అడిగింది.

''విను తల్లీ! విను! ఓపిగ్గా విను. పాలు పితుకుతాం అనగానే, అంతకు ముందే లేగల కట్టువిప్పి నవ్వుతూ, వెక్కిరిస్తూ పారిపోతాడు. ఎవరో తెలుసా? నీ కొడుకేనమ్మా! ఇహ ఆవులేం పాలిస్తాయి? ఆ ఇచ్చిన కాసిన  పాలూ ఉట్ల మీద పెడతావూ? తానూ, తన పరివారమూ బిలబిలలాడుతూ వచ్చి గుటుక్కుమని పిస్తాడు. ఎంత ఎత్తున ఉట్లు కట్టినా, పీటా చేటా తెచ్చి ఎల్లాగో అందుకుంటాడు. అప్పుడూ అందకపోతే, రాళ్లూ రప్పలూ ఉండనే ఉన్నాయిగా అమ్మా! కర్రలతో కుండలకు తూట్లు పొడుస్తాడు. తాగినంత తాగి, తిన్నంత తిని ఇల్లంతా నానాయాగీ చేసి మరీ పారిపోతాడు. ఇలా అయితే ఏం చేయమంటావో, నీవే చెప్పు తల్లీ యశోదా?''

మరో గోప వనిత ఇలా ప్రారంభించింది. ''కుండల్లోని పాలు తాగిపోతే సరేసరి! నిద్రపోతున్న నా మూతికీ, మా అత్త మూతికీ ఓ యింత పులిమి పోతాడు, నిద్రలేచాక, ఈ వెన్నమాయం గురించి, నాకూ మా అత్తకూ తగాదా. నీవు తిన్నావంటే, నీవు తిన్నావని రెట్టించుకుంటాం. ఎందువల్లనంటే మీ ఇద్దరి మూతులకూ వెన్నపూతలు ఉన్నాయిగా? ఇలా జుట్టుకు ముళ్లు వేసి దొంగచాటునుండీ వినోదం సాగంచి, మరీ పోతాడు. ఆయన తన తల్లికి ఎదురు తిరిగానని రాత్రి మక్కెలు విరగతన్నాడు. ఇలా అయితే సంసారాలు ఎలా చేయాలి అక్కా?''

''నా కూతురు పురుడు పోసుకునేందుకు వచ్చిందా? నీకు చూలు ఎలా అయిందో చెప్పమని, దాని కొంగు పట్టుకుని లాగుతాడు తల్లీ! నీ కొడుకు. పసివాడు అడిగే విషయమా ఇది? మాతంగి ఇప్పు డిప్పుడే పమిట వేసుకుంటుందా? మీ అక్కకు మల్లే నిన్నూ చూలాలిని చేస్తాను రమ్మని చెయ్యి పుచ్చుకునేవాడూ నీ కొడుకేనమ్మా''.

''ఒక ఇంట ఆటలు, మరొక ఇంట పాటలు, ఇంకో ఇంట కేరింతలు. ఇంకో చోట తగాదాలు. ఇలా వెక్కిరిస్తూ, గికురిస్తూంటే ఎలా భరించగలం తల్లీ! ఎంతని తాళుకోగలం? భగవంతుడి దయవల్ల ఇంత పాడి లభిస్తూందనుకుంటే, ఇంతింత కష్టాలూ, నష్టాలూ మీవాడు చేస్తుంటే, ఎలా సంభాళించుక రాగలం తల్లీ! వాడి ముఖం చూస్తే మాకే జాలీ, కోపమూ ఒక్కసారే కలుగుతుంది యశోదా! ఈ గడుగ్గాయి బుడుతడిని నీవు గట్టిగా మందలించకపోతే, మరీ మితిమీరిపోతాడు.''

ఇంతలో అక్కడకు, అమాయకంగా చూస్తూ, భయభక్తులతో ఒదిగి ఒదిగి నడుస్తూ బాలకృష్ణుడు వచ్చాడు.

''వీడా ఇంతటి తుంటరి? ఇంత అల్లరి చేసింది వీడా?'' గోప కాంతలతో సహా యశోద అనుకుంది.

''మీరు నెమ్మదిగా ఇండ్లకు వెళ్లండి! నేను మందలిస్తాను. మళ్లీ ఇలా జరగకుండా చూస్తాగా!'' అంటూ యశోద భరోసా ఇచ్చింది.

''చూడు కన్నా! వీళ్లంతా నీవో తుంటరివనీ, జగడాలకోరువనీ అంటున్నారు. వీళ్ల ఇండ్లలో పాలు తాగావట. నీకు ఇంట ఏం తక్కువయిందని పొరుగువారి గుమ్మాలెంట తిరగడం? నీకు చాలినంత వెన్న పెట్టడం లేదా? పాలు ఇవ్వడం లేదా? ఇలా ఇతరుల వస్తువులు దోచుకోడం మనకు అవమానం కాదా నాయనా? మనం ఇతరులకు చేతనయినంత ఉపకారం చేయవలె; అపకారం చేయవచ్చా?'' అంటూ యశోద, రెండు చేతులా బాలకృష్ణుని పొదివి పట్టుకుంది.

తల్లి గుండెలకు హత్తుకుపోయి గోముగా చూస్తూ, ''వీళ్లంతా ఉత్తుత్త మాటలు చెబుతున్నారమ్మా! వీళ్ల ఇండ్లు అసలు ఎక్కడున్నాయో కూడా నాకు తెలీదంటే నమ్ము!'' అంటూ బుడి బుడి ఏడ్పులు ఏడ్చే కొడుకును ఏమనలేక మౌనం వహించింది యశోద.

ఒకరోజు, బలరాముడు కృష్ణసహితుడై తోడి గోపబాలురతో యశోద దగ్గరకు వచ్చాడు.

''చూడమ్మా! వీడు మట్టిముద్దలు ఇంతింతవి మింగుతున్నాడు. వద్దంటే వినడం లేదు. పైగా వెన్నముద్దలంత రుచిగా ఉన్నాయనీ, బలవంతంగా మానోర కుక్కుతున్నాడు'' అన్నాడు బలరాముడు.

''ఏం నాన్నా? మట్టి తినే అవసరం నీకెందుకు వచ్చింది? ఇంట తినుబండారాలు లేవా?'' అంటూ యశోద నొచ్చుకుంటూ అడిగింది.

''అస్సలు మన్నెందుకు తింటానమ్మా? ఇలా కొండేలు చెప్పి, నీవు నన్ను దండిస్తూంటే, చూడాలని వీళ్ల ఉద్దేశం... వీళ్ల మాటలు నిజాలని నమ్మకు!''

''మరి బలరామన్నా నీమీద చాడీలు చెబుతాడా?''

''ఎందుకు చెప్పడేం? బలరామన్నా తోడు దొంగే కదా?''

''అయితే నీవొక్కడివే సత్యం చెబుతున్నావన్నమాట!''

''ఔను మరి! కావాలంటే, నా నోరి వాసన చూడు మట్టి వాసన వస్తూందో వెన్న వాసన వస్తూందో నీకే తెలుస్తుంది.'' అంటూ బాలకృష్ణుడు నోరు తెరచాడు.

ఆ చిన్నారి నోర బ్రహ్మాండం యావత్తూ పరిభ్రమిస్తున్నట్లు యశోదకు గోచరించింది. సూర్యుడూ, చంద్రుడూ, తారకలూ, కొండలూ, కోనలూ, నదీనదాలూ, సముద్రాలూ, వనస్పతులూ, జీవులూ, చివరకు గోకులం – ఆ గోకులంలో తనూ కనబడుతున్నాయి.

తిరుగుతున్న బ్రహ్మాండంతో పాటు ఆమె తల తిరగసాగింది.

ఏమిటీ అద్భుతం? నేను ఎక్కడ ఉన్నాను? నేను నేను కాదా? మరి ఎవరినీ? ఈ కనిపించేదంతా ఏమిటి? ఈ చిన్నారి శిశువు నా కొడుకు కాదా? ఈ చిన్ని నోర విశ్వం ఎలా ఇమిడి ఉంది? ఇత డెవరు? నేను ఎవరిని? ఈ కిశోర రూపంలో విశ్వభర్త నా ముందున్నాడా? ఎందుకున్నాడు? ఎందుకీ అద్భుతం చూపడం? తన జన్మ ధన్యం చేసేందుకా? అయితే తన ముందున్నది తన కొడుకు కాదన్నమాట. ఆ పరమాత్మ ఈ రూపంలో తన కొడుకై వెలుగై తన ముంగిట నిలిచి ఉందా? ఇంతకాలంగా తను చూసిందీ, అనుభవించిందీ అబద్ధం అన్నమాట! నేను ఈ పరమాత్మకు తల్లిని కావడమేమిటి? నా జన్మకే కారణం అయిన ఈ శక్తి ముందు నేనో అణువును — రేణువును!'' అను కుంటూ యశోద చేతులు జోడించింది.

అంతే! ఇంద్రజాలికుని ప్రదర్శన అయిపోయినట్లు, అంతా మామూలు అయింది. అంతకు ముందు ఆమెకు కలిగిన తెలివి తొలగి పోయింది. మాయ పొరలు ఆవరించాయి. యశోద మామూలు యశోద అయింది. యశోద కండ్లు తెరిచింది. యథాప్రకారంగా చిన్నికృష్ణుడు నోరు తెరచే ఉన్నాడు.

''అయ్యో! నా తండ్రీ! నీ నోరు నొప్పెడుతుంది? ఇహ చాల్లే! నీ నోర మట్టి వాసనలూ లేవు! నీవేం మన్ను తినలేదు లే! వాళ్లే ఏదో సరదాకొద్దీ చెప్పి ఉంటారులే కన్నా!'' అంటూ ఆమె పుత్రవాత్సల్యంతో ఆర్ద్రమై పోయింది.

ఆనందంతో గుండెలకు హత్తుకుంది.

యశోదా నందులు పురాకృత సుకృత వైభవం వల్లనే ఈ జన్మ పొందారు. ద్రోణుడు ఒకనాటి వసువు. అతడి భార్య ధర. ఆ ఇద్దరనూ బ్రహ్మదేవుడు మానవులై పుట్టవలసిందని కోరాడు. శ్రీ మహావిష్ణువు మానవరూపం పొందినప్పుడు, జననీ జనకులుగా ధరా ద్రోణులు జన్మించారు. ఆ కారణంగానే వారికి జన్మాంతర వాసనలు అంటిపెట్టుకుని ఉన్నాయి.



# రోలుకృష్ణుడు

యశోద పొయ్యి మీద పాలు పెట్టి, ముంగిట్లో వెన్న చిలుకుతూంది. ఇంతలో చిన్నికృష్ణుడు, అక్కడకు వచ్చి, ''అమ్మా! పాలు!'' అంటూ కేక వేశాడు.

''ఉండు నాన్నా ఒక్క క్షణం!''

''పాలు!'' అంటూ నేలమీద కాళ్ళ తపతపా బాదుతూ బాలకృష్ణుడు మారాం చేయసాగాడు.

యశోద నవ్వుకుంటూ వచ్చి ఒళ్లోకి తీసుకుని చనుబాలు ఇవ్వసాగింది. ఇంతలో పొయ్యి మీద పాలు పొంగిపోతున్నట్లు ఆమెకు అనుమానం కలిగింది. చన్ను విడిపించుకుని ఆమె లోపలకు పోయింది.

తనకు తనివితీరా పాలు ఇవ్వలేదన్న రోషంతో బాలకృష్ణుడు ప్రక్కన ఉన్న రాయి తీసుకుని వెన్న కుండల మీదకు విసరాడు. కుండలు పగిలిపోయి ముక్కలయ్యాయి. పగిలిన కుండల్లోని వెన్న మెక్కడం సాగించాడా బాలుడు.

పొయ్యిమీది కుండ దింపి యశోద ఇవతలకు వచ్చింది. పెరుగు పాలు ఇల్లంతా కాలువలు కడుతున్నాయి.

ఆమెకు కోపం ముంచుకువచ్చింది.

''అన్నన్న! ఎంత పని చేశావ్? చూడు నిన్నేం చేస్తానో?'' అంటూ యశోద కృష్ణుడిని సమీపించింది.

బాలుడు అందకుండా పారిపోయాడు. ఆమె ఆ బాలుడి వెంట పరువులు పెట్టింది, చిటుకలో కనిపించి, అంతలోనే అదృశ్యం అవుతూ బాలకృష్ణుడు వినోదం సాగించాడు.

ఒక ఇంట వెన్న కుండలు పగలకొట్టి, మరో ఇంట పాలు తాగుతూ అక్కడ ఉన్న కోతులకు వెన్నముద్దలు పెడతూన్న బాలుడిని చూచేసరికి ఆమె కోపం తారాస్థాయికి చేరింది.

''అబ్బో! ఇంతటివారా మీరు? ఆనాడు గోపికలు ఏవో కొండేలు చెప్పారనుకున్నా! వాళ్లు చెప్పినదంతా నిజమే అన్నమాట!'' అంటూ ఆమె బాలుడిని చిక్కించుకోబోయింది.

''ముద్దు చేసి చేసి వీడిని రాలుగాయిని చేస్తున్నాను. కఠినంగా దండింపకపోతే, ప్రవర్తన శృతిమించగలదు. పిల్లలను శిక్షించడం అవసరమే!'' అని ఆమె కృష్ణుడిని దండింపవలెనని తీర్మానించుకుంది.

ముఖమ్మీద కారే చెమటను కొంగుతో తుడుచుకుంటూ గసలు పెడుతూ, తన వెంట పరువులు పెడుతున్న యశోదా మాతను చూసే సరికి, బాలకృష్ణునకు జాలి కలిగింది.

''అమ్మా! మరెప్పుడూ ఇలా చేయనమ్మా!'' అంటూ గోముగా తల్లివైపు తిరిగాడు కృష్ణుడు.

యశోద బాగా అలసిపోయింది. నిట్టూర్పుతో నుంచుంది. వాడిని పట్టుకోవడం ఇహ తనవల్ల కాదనీ ఆమెకు అనిపించింది.

అప్పుడు, చిన్ని కృష్ణుడు, తనకు తానే తల్లి దగ్గరకు వచ్చి ''వచ్చాగా! కొడతావా ఏం? కొట్టు మరి! బెత్తంతో కొడతావా? బెత్తం కూడా నేనే తెచ్చి ఇవ్వాలా?'' అంటూ లాలనగా అడుగుతున్న ఆ బాలుడిని కొట్టేందుకు ఆమెకు చేతులు ఎలా వస్తాయి?

అక్కడున్న ఒక రోలుకు తాడుకట్టి ''ఉండు! నీ మొలకు దీన్ని కడతాను! ఇహ ఎక్కడకూ పోయి ఆగడాలు చేయలేవు!'' అంటూ మరో చివరను కృష్ణుడి మొలకు కట్టబోయింది యశోద. ఋంగ మూతితో తల దించుకున్న శ్రీకృష్ణుడిని చూసి ఆమె నవ్వింది.

''ఎవరు మీరు? కృష్ణులు కారా? పొరుగిండ్ల వెన్న దొంగిలేవారు కారు. పాపం! వారంతా ఉత్తుత్తగానే అభాండాలు వేశారు కదండీ. క్షీరభాండాలూ, దధిభాండాలూ తమకేం తెలియవు కదండీ చోరాగ్రేసర చక్రవర్తిగారూ?'' అంది ఆమె నవ్వుతూ.

యశోద చేత ఉన్న తాడు కృష్ణుడి బొజ్జకు తిరిగి రాలేదు. ఆ తాడు పొట్టిదై కనిపించింది. మరో తాడు తెచ్చి ముడి వేసింది. అయినా ఆ చిరుబొజ్జకు సరిపోలేదు. ఇంట ఉన్న తాళ్లన్నీ తెచ్చినా ఆ బొజ్జ చుట్టుకొలతకు చాల్లేదు.

హతాశురాలై ఆమె నిట్టూర్చి కొడుకువైపు పరకాయించి చూసింది.

కొంటె కృష్ణుడు, తల్లివేపు మధుర మందహాసంతో చూశాడు. ఆ తల్లిమీద ఆయనకు జాలి కలిగింది.

''అమ్మా! ఇప్పుడు కట్టేయ్!'' అంటూ తల్లి చేత కట్టు బడేందుకు చిన్ని కృష్ణుడు అంగీకరించాడు.

ఎవరికీ దొరకనివాడు, ఏ బంధనాలకూ లొంగనివాడూ, ఏ పట్టుకూ అందనివాడూ అయిన ఆ దేవబాలుడు, తల్లి స్థానమ్మీద గౌరవంతో, భక్తితో కట్టుకు ఒప్పుకున్నాడు.

శ్రీకృష్ణుని రోటికి కట్టివేసి గోపికలతో యశోద అటు ముఖం చాటు చేయగానే, ఇటు రోలును దొర్లించుకుంటూ బయలుదేరాడు. ఆ బాలుడు అలా పోయి పోయి రెండు మద్దుల మధ్య రోలును ఇరికించాడు. ఒక్కసారి రోలును గుంజాడు. ఆ రెండు మద్దులూ ఫెళఫెళ శబ్దం చేస్తూ కూలిపడ్డాయి.

ఓ ఇద్దరు దివ్యపురుషులు ఆ కూలిన మద్దుల చోట ప్రత్యక్షం అయ్యారు. చేతులు జోడించారు. శిరస్సులు వంచారు.

''ప్రభూ! నీవు విశ్వమంగళుడవు. కల్యాణనిధివి. మాకు మంగళం కలిగించడం నీకు ఎంతటి పని తండ్రీ? మా శాపాలూ, పాపాలూ, నీ దివ్య దర్శనంతో తీరిపోయాయి. శెలవు దయామయా!'' అంటూ ఆ సిద్ధ పురుషులు అదృశ్యం అయ్యారు.

ఈ మద్దులిద్దరూ యమళార్జునులన్న పేరుగల కుబేర కుమారులు. శంకర కింకరులు. మందాకినీ నదిలో తమతమ ప్రియాంగనలతో, ఒళ్లు తెలీని తమకంతో నగ్నంగా నీరాడుతున్న సమయంలో, అటు వెళుతున్న నారదుడు, వీరిని చూడడం జరిగింది.

నారదుడి రాకను చూచి సంభ్రమంతో ఆ స్త్రీలు బట్టలు కట్టుకుని, మర్యాదగా నమస్కరించారు. అయితే కుబేర కుమారులు మదిరాపాన మత్తులు కావడం వల్లనూ, కావరం పేరుకుపోయి ఉండడం వల్లనూ నారదుడిని లక్ష్యపెట్టలేదు.

అమర్యాదగా వారు ప్రవర్తించారని నారదునకు కోపం వచ్చింది.

ఆయన కోపం కొద్దీ, ''దిగంబరంగా ఉన్న మీరు శాశ్వతంగానే మద్దులై, మొద్దులై పడి ఉండండి!'' అని శపించేసరికి వారికి వళ్లు తెలిసింది.

పశ్చాత్తాపంతో నారదుని కాళ్లమీద పడి విమోచనం కలిగించమని వేడుకున్నారు.

నారదుడి మనస్సు నవనీతసమం! గొప్పవారి మనస్సులు అంతే! క్షణంలో కోపం వస్తుంది, మరో క్షణంలో కోపం పోతుంది. ఆయన శాంతుడై ''మీ శాపాన్ని రద్దు చేయలేను. ఒక వేయి సంవత్సరాలు అలా పడి ఉన్నమీద నందనందనుడు స్వయంగా వచ్చి మీకు విడుదల ప్రసాదించగలడు. అంతవరకూ తప్పదు'' అని ఆయన వెళ్లిపోయాడు.

ఆనాడు పొందిన శాపకారణంగానే వారు మద్దులై గోవిందశ్రీ చరణధూళికై ఎదురుచూడసాగారు.

మద్దులు విరిగిన చప్పుళ్లు పిడుగులు పడ్డట్లు వినిపించాయి. ఈ శబ్దం ఏమిటా అని విస్తుబోయి గోపాలురు అక్కడకు పరువుల మీద వచ్చారు. తీరా వచ్చి చూడగా, రెండు కూలిన

మద్దుల మధ్య నవ్వుతూ కేరింతలాడుతున్న, రోట కట్టిబడ్డ నందకిశోరుడు కనిపించాడు.

"ఈ రోలేమిటి? ఎవరు కట్టారు? ఎవరికేం అవసరం వచ్చింది?" అంటూ ఒకరినొకరు ప్రశ్నించుకునేవారే!

ఇంత గొప్ప మద్దులు ఎలా కూలాయి? గాలి లేదు. వాన లేదు. పిడుగుల్లేవు! మరి ఎవరు కూల్చారు? ఈ బాలుడు, ఇంత గొప్ప మద్దులు కూల్చగలడా? ఏమిటో ఈ గోకులం నిండా విపరీతాలే! ఉత్పాతాలే! అయితే ఎటువంటి ఆపదలు లేవు. అన్నీ అద్భుతాలే!

ఇలా విపరీతాలు ఒకటి వెంబడి మరొకటి కలుగుతూండడం చూసిన వృద్ధ గోపాలురకు ఆలోచనలు కలిగాయి. ఆ ఆలోచనల వెంట భయం కలిగింది.

"తృణ కాష్ఠాలు ఇక్కడ రాను రాను క్షీణించిపోతున్నాయి. మనం ఇక్కడినుండీ మకాం మార్చి బృందావనం వెళదాం! అక్కడ యమునా నదీ ప్రాంతంలో పచ్చిక బయళ్లు మన పశువులకు చాలినంత ఉన్నాయి. నదులూ, కొండలూ, అడవులూ ఉన్న ప్రాంతాలే వాసయోగ్యాలని పెద్దలు చెబుతారు" అని ఓ వృద్ధుడు సూచించాడు.

అందరూ అతడి సలహాను ఆమోదించారు. ప్రయాణాలకు సిద్ధం అయ్యారు. ఓ శుభముహూర్తంలో సకుటుంబ సపరివారసమేతంగా గోపాలురు బండ్లు కట్టుకుని బృందావనం వచ్చి చేరారు.

బృందావనం చేరిన తరువాత శ్రీరామకృష్ణులు తమ సమాన వయస్కులతో చేరి ఆటపాటలతో, యమునా నదీ తీరంలో యథేచ్ఛగా సంచరింపసాగారు. గోవులను మేతలకు విడిచిపెట్టి, వీరు చల్లని చెట్ల నీడల్లో అనేకరకాలయిన ఆటపాటలతో కాలం గడుపుతూండేవారు.

శ్రీకృష్ణుడు వారి ఆయాసం తీరేదాకా మధుర వేణుగానంతో వారిని అలరించేవాడు. ఆ జగన్మోహనకరమైన వేణు రవంతో యమునా పులినాలు తన్మయత చెందేవి. ప్రకృతి స్తంభించేది. ఆ దివ్య గానాన్ని తలమీద ధరించి, వాయువు దూర దూరాలకు మోసుకుపోతూండేది. కొండ కోనలు, ఆ మధుర మంజుల గాన రవళికి ప్రతిధ్వనులిచ్చేవి. భువన మోహనమైన ఆ వేణుసుధారవంలో కరిగిపోయి ఆలమందలు మేత మేయడం ఆపి, మోరలెత్తి చిత్రపటాలై నుంచునేవి.

కంస మహారాజుకు చూచాయగా, తన శత్రువు బృందావనంలో ఉన్న విషయం తెలిసింది. ఆ శత్రువు మీదకు, అతడు అనేక దుష్టశక్తులను ప్రయోగించేవాడు.

ఒకనాడు వత్సాసురుడు, ఆవుదూడవలె మంద చేరి కదుపులో సంచరింపసాగాడు. వాడు అలా సంచరించడం శ్రీకృష్ణుని దృష్టికి రాకుండా ఉండలేదు.

"ఈ ఆవుదూడను చూశావా బలరామన్నా? దీనికి గడ్డి అవసరం లేదు. ఇది గడ్డి కరిచే దూడకాదు!"

"మరేం తింటుంది కృష్ణా?"

"పొలుసు తిండి!"

"నిజమా?" అని బలరాముడు నవ్వి, "మరి ఇంతదూరం రానిచ్చావేం కృష్ణా?" అని అడిగాడు.

"కాలం రావాలి కదా?" అంటూ శ్రీకృష్ణుడు నెమ్మదిగా ఆ ఆవు దూడను సమీపించాడు.

వీపుమీద మృదువుగా చరచాడు. కోపంతో ఆ లేగ దూడ ఛంగున లంఘించింది. కృష్ణుడు నవ్వుతూ నుంచున్నాడు.

వత్సాసురుడు శ్రీకృష్ణుని కవ్వించేందుకా అన్నట్లు వేగం పెంచి ముంగాళ్ల మీద లేచి, కుప్పించి దూకాడు. శ్రీకృష్ణుడు ఆ తాకును, తప్పుకుని, వాడివెనుక కాళ్లను అలవోకగా పట్టుకుని గిరగిరా తిప్పి నేలకేసి కొట్టాడు.

ఆ దెబ్బకు వాడి ప్రాణాలు కడబట్టాయి. అంతటితో ఊరుకోక, వాడిని దాపున ఉన్న చెట్లకేసి కొట్టాడు. దాంతో వాడు ముక్కునా, నోట ఓ యింత నెత్తురు కక్కి ప్రాణాలు వదలాడు.

చనిపోవడంతో వాడి నిజస్వరూపం బయటపడింది.

గోపబాలురు వాడి కళేబరం వంక వింతగా చూస్తూ, ''వీడో రాక్షసుడని నీకెలా తెలిసింది కృష్ణా? మాకెవరికీ తెలీలేదు సుమా!'' అని అడిగారు.

ఆయన నవ్వాడు. వారి అమాయకతకు, నవ్వక మరేం చేస్తాడు బలరాముడు ఆరాధనతో చూస్తూ, ''పదండి! సూర్యుడు పడమట చేరుతున్నాడు. పశువులను తోలుకురండి'' అన్నాడు.

★ ★ ★



# బకుడు

ఒకనాటి మధ్యాహ్నంవేళ గోపబాలురు చల్దులు ఆరగించి, దాపున ఉన్న కొలనులో నీరు తాగుతున్నారు.

తలతో ఆకాశాన్ని అందుకుంటూ, ముక్కుతో తూర్పు అంచునను తాకుతూ, మహా పర్వతమంత నోరు తెరచిన అద్భుత రూపంగల ఒక కొంగ అక్కడ నెమ్మదిగా నడుస్తూ వారికి కనిపించింది.

ఆ మహాబకాన్ని చూసి, అందరూ విస్తుబోయి నుంచున్నారు. ఇంతలో అక్కడకు శ్రీకృష్ణుడు రావడం చూసిన కొంగ ముందుకు అడుగులు సాగించింది. అది ఆవులించినట్లుగా పర్వతగుహ వంటి నోరు తెరచింది. ఆహారం అందుకున్నట్లుగా వాయువేగంతో కృష్ణుడిని కరచిపట్టి మింగివేసింది.

గోపబాలురు హాః హాఃరవాలతో ఏడుస్తూ, నేలమీద పడి దొర్లు తున్నారు. బలరాముడు, వారికి ఎంతగా ధైర్యం చెప్పినా వారు, తమ ఏడుపులు మానలేదు. ఆ బకం గోపబాలురనూ మింగుతుందన్న అనుమానంతో బలరాముడు వారిని సురక్షిత ప్రాంతాలకు తీసుకుపోసాగాడు.

ఆ మహాబకం శ్రీకృష్ణుడిని మింగిందే కానీ, గొంతులోంచి కడుపులోకి నెట్టలేక నానాయాతన పడసాగింది. గొంతులోకి దిగని ఆహారం వాడికి దుస్సహం అయింది. అంచేత, అతి కష్టమ్మీద శ్రీకృష్ణుని కక్కి, బతుకుజీవుడా అని తేలిగ్గా గాలి పీల్చుకోసాగాడు వాడు.

సింహకిశోరం వలె శ్రీకృష్ణుడు బకుడి మీదకు లంఘించి ముక్కు క్రింది భాగాన్ని తన ఎడం కాలితో నేలమీద అదిమిపట్టి, రెండు చేతులా ముక్కుపై భాగాన్ని లాగి పుల్లను చీల్చినట్లు, అతి తేలిగ్గా చీల్చాడు. దానితో బకుడు నిర్జీవుడై నేలమీద పడ్డాడు.

ఆనందంతో కేరింతలాడుతూ గోపబాలురు, బలరాముడితో సహా శ్రీకృష్ణుని చుట్టూ చేరి గంతులు వేయసాగారు.

వృద్ధ గోపాలురు ఈ వృత్తాంతం విని, విచారింపసాగారు. ఇన్ని ఆపదలు బాలకృష్ణుని మీదకు ఒకటి తరువాత ఒకటిగా విరుచుకపడడానికి కారణం ఏమిటి? ఈ బాలుడు ఏం తప్పు చేశాడని, ఎవరు ఈవిధంగా శిక్షస్తున్నారు? ఇన్ని ఆపదలు చుట్టుముట్టినా, తలపువ్వు వాడకుండా, శిశుదశ నుండీ దాటుక రావడం ఒక్క శ్రీకృష్ణునకే చెల్లింది. ఆ బాలుని వెనుక ఎంత గొప్ప శక్తి లేకపోతే ఇలా జరుగు తుంది? అలా ఆలోచించే కొలది వారికి శ్రీకృష్ణుని మీద అనురాగం, ఆరాధనా పెరగసాగింది. ఈశ్వరశక్తి, అంటూ లేకపోయినప్పుడు, ఇంతింతటి ఆపదలు తప్పుక రావడం జరగదు. ఈ బాలకృష్ణుడిలో ఏదో పరశక్తి ఉంది. దైవబలం ఉన్నవారలకు ఎటువంటి ఆపదలూ రావు. వచ్చినా తొలగిపోగలవు అని వారిలో వారు సమాధానపడ్డారు.

బాలరూపుడయిన భగవంతుడు, తోడి గోపాలబాలురతో ఆడుకుంటూ, పాడు కుంటూ, ఎంగిళ్ళు తింటూ, క్రిందా మీదా పడుతూ వారిలో ఒకడై, ఈ ఒకడిలో వారందరూనై తేడాలు మరచిపోయి సర్వం జగన్నాథం అన్నట్లు ప్రవర్తించడం ఎంత విచిత్రం? ఇంతటి అదృష్టానికి నోచుకున్న వారెంతటి ధన్యులో కదా?

బకుడి మరణవార్త, వాడి తమ్ముడు అయిన అఘుడికి తెలిసింది. వాడు కారాలు మిరియాలు నూరుతూ, ప్రతీకారం కోసం బయలు దేరాడు.

నోటినుండీ, కండ్ల నుండీ రేగుతున్న అగ్నికి ఉచ్ఛ్వాస నిశ్వాసాలన్న గాలి తోడు కాగా, మహాబిలం వంటి నోరు తెరచుకుని, అతి ఘోరమైన కొండ చిలువ రూపంతో భకుడి తమ్ముడు అఘాసురుడు గోపాల బాలుర మీదకు వచ్చిపడ్డాడు.

ఆ పామును చూసి గోపబాలురు బిక్కచచ్చిపోయి నుంచున్నారు. అయితే అందరూ కూడ పలుక్కున్నారు.

"కృష్ణుడొక్కడు కొంగను చంపగలిగింది, మనం ఇందరం ఉన్నాం కదా, ఈ ముసలి పాము పని పట్టలేమా?" అని ఉత్సాహంతో వారందరూ దానిమీదకు దాడి చేశారు.

అయితే అఘుడు ఒక్కొక్కరినే మింగుతూ, చివరకు వారి పశువులనూ, తన పొట్టన పెట్టుకున్నాడు.

ఒక గొప్పవాడు చేసిన పనిని మామూలువారు చేయబోవడం అనర్థాలకు దారితీస్తుంది. శ్రీకృష్ణుడు చేశాడని, తామూ ఏదో చేసి తమ శక్తిని చాటుకోవలెనని ఈ బాలగోపాలురు ముప్పు తెచ్చుకున్నారు.

సాయంత్రం పశువులూ, పశువుల వెంట తమ బాలకులూ ఇల్లు చేరకపోతే ఆ తల్లిదండ్రులు ఎంతగా తల్లడిల్లిపోతారు?

"మా పశువులూ, మా పిల్లలూ ఏమయ్యారు కృష్ణా?" అంటూ కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ అడిగేవారికి ఏమని సమాధానం చెప్పాలి?

బాలకృష్ణుడు, తనకు తానే ఆ మహా అజగరం నోర ప్రవేశించాడు. దానికి ఊపిరి ఆడనంతగా, తన శరీరం పెంచాడు. అది గాలి ఆడక గిలగిలా తన్నుకుని చచ్చింది. దాని కళేబరం చీల్చుకుని గోగోప కుమారులు ఇవతలకు వచ్చారు.

కొంత కాలానికి దాని కళేబరం ఎండకు ఎండిపోయింది. అలా ఎండిన దాని దేహం వీరికి విహార కేంద్రం అయింది. ఆటవస్తువూ అయింది.

★ ★ ★



శ్రీకృష్ణ బలరాములు తమ తోటి బాలురతో ఆటపాటలతో కాలం గడుపు తూండడం చూసిన బ్రహ్మదేవునకు, శ్రీకృష్ణలీలలు అర్థం కాలేదు. విశ్వాంతర్యామి అయిన వాడెవడో, వాడే ఈ బాలరూపుడన్న విషయం మాయలో మునిగిన ఆయనకు గోచరం కాలేదు.

మేత మేస్తున్న గోవులను ఆయన హఠాత్తుగా మాయం చేశాడు. పశువులను వెదుకుతూ శ్రీకృష్ణుడు అటూ పోయి, వాటి అతీగతీ కానక ఇటు తిరిగి వచ్చేసరికి గోపబాలురనూ బ్రహ్మదేవుడు అదృశ్యం చేశాడు. బాలకృష్ణుడు ఒంటరివాడై నుంచున్నాడు.

పొద్దు వాటారుతుంది. అదృశ్యం అయిన గోగోపాలబాలుర సమాచారం తెలిసిరాలేదు. ఇండ్లకు వెళ్లవలసిన సమయమూ అయింది. ఎవరూ లేకుండా, తానొక్కడే ఇంటికి వెళితే ఊరు ఊరుకుంటుందా?

శ్రీకృష్ణునకు అంతా అర్థం అయింది. బ్రహ్మదేవుని కైంకర్యం అని తెలిసిపోవడంతో, ఆ బాలుని పెదాల మీద మందహాసం అంకురించింది. బ్రహ్మ చేసిన మాయకు, తానొక మహామాయ చేయకపోతే నాటకం రక్తి కట్టదు. సృష్టికర్తనే సృష్టించిన ఘనునకు అసాధ్యం ఏముంటుంది?

అదృశ్యం అయిన గోగోపాలుర రూపులు తానే అయ్యాడు. ఏయే ఇండ్లకు ఎవరు వెళ్లాలో, ఏయే పశువులు ఏయే ఇండ్లకు వెళ్లాలో యథాప్రకారంగా వెళ్లడం జరిగింది.

సాక్షాత్తు భగవదంశతో ఉన్న ఆ పశువుల పట్లా, ఆ బాలురపట్లా ప్రత్యేకాకర్షణలూ, అనురాగాలు ఆయా యజమానులకు కలుగసాగాయి.

అన్నీ తానే అయినవాడికి, ఈ కొంచెములో ఇముడడం ఎంత? బ్రహ్మకు పాఠం చెప్పడమే కర్తవ్యం. రోజులు వారాలు అయినాయి. వారాలు మాసాలు అయినాయి. ఓ సంవత్సర కాలం గడిచిపోయేందుకు ఏ కొద్ది రోజులో మిగిలి ఉన్నాయి.

బ్రహ్మకు మహాశ్చర్యం కలిగింది. ఆయన నాలుగు మొగాల నిండా విషాదం గూళ్లు కట్టింది. తను మాయ చేత హరింపబడిన గోగోపాల బాలురు నిద్రాసక్తులై పడి ఉన్నారు. మరి బృందావనంలో తిరుగుతున్న ఈ గోవులెక్కడివి? గోపబాలురు ఎక్కడివారు? తాను ప్రయోగించిన మాయకు ప్రతిగా మహామాయను ప్రదర్శించిన వారు ఎవరు?

దీనికి కర్త ఎవరు? తాను బ్రహ్మ కదా? తన సృష్టికి ప్రతిసృష్టి సలిపిన ఈ బ్రహ్మ ఎవరు? ఎంతమంది బ్రహ్మలున్నారు? అన్న విచికిత్సలో పడిన బ్రహ్మ ఆలోచించసాగాడు. తన నాలుగు ముఖాల్లోని ఎనిమిది కండ్లూ బాగా తెరచుకుని, మనస్సు చిక్కపరచుకుని ఆలోచింపసాగాడు.

గుణాలు లేని వారు గుణి అయి, మోహాలు లేని వారు మోహి అయి, రూపాలు లేని వాడొక రూపి అయి గోపబాలురతో చల్దులూ, ఎంగిళ్లూ అమృతం వలె ఆరగిస్తూ,

పరియాచికాలాడుతూ వెక్కిరించు కుంటూ, గికురించుకుంటున్న ఆ బాలమూర్తిని ఆయన పరకాయించి చూడసాగాడు. ఆయన మనస్సు ఏదో వెదుకుతుంది.

ఓ వెలుగు, దృశ్యా దృశ్యమై కనిపించింది. ఆ వెలుగులో శ్యామల మేఘవర్ణుడొకడు, హారకుండల కాంతులు వెదజల్లుతూ, పీతాంబరధారి అయి, శ్రీవత్సలాంఛనం భాసించగా, ఆపాదమస్తకం తులసీమాలల అలంకారంతో శంఖం, చక్రం, గదా కమలాలూ ధరించిన చతుర్భుజాలతో, తనవంటి వారలనేకులు సేవించగా, బ్రహ్మ కండ్లకు గోచరించాడు. ఎవరీ మూర్తి?

అప్రయత్నంగా బ్రహ్మ చేతులు జోడించాడు.

''ప్రభూ! ఏ మాయకయితే నీవు అతీతుడవో, అదే నన్ను ఇంత చేసింది. ఏ శక్తి అయితే నీవో, అదే నన్ను అశక్తుడను చేసింది. ఎవరి ముందు చేతలూ, ఊహలూ, భావాలూ స్థంభించిపోతవో, వాడివి నీవే అని చాలా ఆలస్యంగా తెలుసుకున్నాను. నన్ను క్షమించు ప్రభూ! నీముందు నా గంతులెంత? నేను ఎంత? నన్ను కన్న తండ్రీ! అవ్యక్త చాపల్యంతో ఏదో చేశా! ఏదో అయ్యా! నన్ను రక్షించు'' అంటూ పాదాలు ఆశ్రయించాడు బ్రహ్మదేవుడు.

అంతలోనే బాలకృష్ణుడు పరావతారమూర్తి అయి కనిపించాడు.

బ్రహ్మ నమస్కరించి అదృశ్యం అయిన క్షణంలో, అంతకు ముందు ఆయన దాచిన గోగోపాల బాలురు కనిపించారు. ఆ వెంటనే బాలకృష్ణుడు, తన మాయావతారులను ఉపసంహరించాడు.

ఈ తరుణంలో గోపాల బాలురకు కలిగిన సేవాభాగ్యం అనన్య సామాన్యం! గోపాలకృష్ణుడు కొంచెం అలసినట్లు కనిపిస్తే చాలు. వీపుల మీద ఎక్కించుకుని మోసుక పోయేవారీ బాలకులు. ఏ చెట్టు క్రింద అయినా నిద్రపోతూంటే, చివురుటాకుల వీవనలతో మందమందగా గాలి వీచేవారు. ఆయన శిరస్సుకు, తల్పంవలె తమ తొడలు వంతులు వారీగా సమర్పించుకునేవారు. ''అయ్యో! కృష్ణా! నీ కాళ్ళు చూడు! ఎర్ర తామరల్లా ఎలా కందిపోతాయాయో! ఎంతగా నొప్పులు పుడుతున్నాయో కదా! అలా కూర్చో కృష్ణా! కొంచెం నీ కాళ్లు పట్టనియ్!'' అంటూ వచ్చి వారు కాళ్లు పట్టేవాళ్లు. ఆదిలక్ష్మీ దేవికి అందిన మహద్భాగ్యం ఇప్పుడు ఈ అమాయక గోప బాలురకు అందింది. ఆయన తాగి తిని విడచిన పాలూ, నంజుళ్లు మొదలయిన భుక్త శేషాన్ని, తమలో తాము పోట్లాడుకుంటూ మహా ప్రసాదం వలె ఆరగించేవాళ్లు. తాము తెచ్చుకున్న భక్ష్య విశేషాలు ఆయనకు ఆరగింపు చేయక ఈ బాలకులు ఎప్పుడూ తినేవాళ్లు కారు. ఈ సేవలో, ఈ కైంకర్యంలో వారూ, వారి జన్మలు ధన్యం అవుతున్నాయి.

## ధేనుకుడు

ఒకనాడు చల్దులారగించి, విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో తిని కూర్చోలేక శ్రీదాముడు ఇలా అన్నాడు.

''అక్కడో వనం ఉంది కృష్ణా! ఎన్ని తాటిచెట్లు ఉన్నాయో లేఖ్ఖ పెట్టలేం? ఆ చెట్ల మీద పండిన పండ్లు, నేలరాలిన పండ్లు, చవు లూరించే ఆ మధుర వాసనలూ క్రోసెడు దూరం వరకూ

వ్యాపిస్తాయంటే నమ్ము! అక్కడ గడ్డి నిలువెడెత్తున పెరిగి ఉంది. అయితే ఏం లాభం లే! మన పశువులకు అంత చక్కటి మేతా చిక్కదు; మనకు అంతస్వాదువు అయిన ఫలాలూ దక్కవు. అవి అందని పండ్లు!''

''పదండి! అక్కడకు వెళదాం! ఎందుకాలస్యం?''

''ఆ. వెళదాం! వెళ్లవూ మరి! అక్కడో భయంకర రాక్షసుడు కాపురం చేస్తున్నాడు. వాడు మహా క్రూరుడు. వాడి బంధువులూ అంతే! అక్కడకు వెళ్లిన పసరంగానీ, మనిషిగానీ తిరిగివచ్చింది లేదు. వాడికి ఆహారం అయిపోవలసిందే! ఆ పండ్లున్నాయే చూశావూ, వాడూ వాటిని అనుభవించడు. ఇంకొకరిని అనుభవింపనీయడు. ఒఠ్ఠి లుబ్ధుడు వాడు!'' అన్నాడు శ్రీదాముడు.

''అయితే వాడి సంగతేమిటో తెలుసుకోవలసిందే! ఏం కృష్ణా?'' అంటూ, బలరాముడు సాభిప్రాయంగా నవ్వాడు.

''అః తెల్సుకోడం ఎంతో అవసరం?'' అని కృష్ణుడు నవ్వాడు.

గోపబాలకులు ఆ మాటలు విని భయంతో బిక్కచచ్చిపోయారు.

''శ్రీదామా! నీకేం మతి పోలేదు కదా? ఆ ధేనుకవనం గడ్డీ, అక్కడ ఉండే ఆ తాటి పండ్లూ మనకు వద్దే వద్దు కృష్ణా! వాడు మహా బలవంతుడు. క్రూరుడు కూడా!'' అంటూ మరో బాలుడు మందలించాడు.

''వాడు ఆహారంగా మనుష్యులను పీక్కుతింటాడు. మనం వెళితే మనందరను వాడు నంజుకు తింటాడు. ఆ గడ్డీ, గాదం – ఆ పండ్లూ మనకు లేకపోతే మునిగిపోయేదేం లేదు. ఈ శ్రీదాముడికి పిచ్చి పట్టింది. అందుకే అలా వాగుతున్నాడు'' అంటూ మరో గోపబాలుడు శ్రీకృష్ణుడి రెండు కాళ్లు పట్టుకుంటూ, ''మనం అక్కడకు పోవద్దు! పోయి పోయి ఎవరన్నా పులినోర తలదూర్చుతారా?'' అన్నాడు.

''నిజంగా మీరు పిచ్చి మొద్దబ్బాయిలు. శ్రీకృష్ణ బలరాములు ఎంత బలశాలురో, మీకింకా అర్థం కాలేదు. ఈ చచ్చు రాక్షసులు వారికో లెఖ్ఖా? ఏమయినా కృష్ణా! అక్కడి పండ్లు మనం తినవలసిందే! చూడు! నా నోరు ఎంతగా ఊరుతుందో!'' అంటూ శ్రీదాముడు తొందరించాడు.

శ్రీకృష్ణ బలరాముడు ఒకరినొకరు చూసుకుంటూ నవ్వుకున్నారు. బలరాముడు, శ్రీకృష్ణ సహితుడై గోపబాలకులు వెంటరాగా ధేనుకవనం ప్రవేశించాడు.

ఒక తాటిచెట్టును తన రెండు చేతులతో బలరాముడు బలంగా పట్టి కదిలించేసరికి, తాటిపండ్లు జలజలా రాలాయి.

గోపబాలురు ఆవురావురున తాటిపండ్లు ఏరుకోసాగారు.

పండ్లు రాలిన శబ్దానికి ధేనుకుడు వడివడిగా అక్కడకు పరువెత్తుకు వచ్చాడు.

కండ్లల్లోంచి నిప్పురవ్వలు రాలుతూండగా, ముక్కుపుటాల్లోంచి వేడిగాలులు ప్రసరిస్తూండగా, ముంగాళ్లతో నేలను తన్నుతూ, రంకెలు వేస్తూ వచ్చిన ధేనుకుడు, హఠాత్తుగా బలరాముడి గుండెలమీద కొట్టాడు. రాముడు ఆ తాపుకు నిలదొక్కుకుని ఎదురై నిలిచాడు. ధేనుకుడు వెనక్కి

పోయినట్లు పోయి, వాయు వేగంతో రామునివైపు రాసాగాడు.

అత్యుగ్రాకారుడై భీకరంగా రంకెలు వేస్తూ వస్తున్న రాక్షసుని చూసి బాలకులు భయంతో వణకిపోతూ అచేతనులై నుంచున్నారు. బలరాముడు వాటంగా ధేనుకుడి కాళ్లు రెండూ కలిపి పట్టి, ఒక తాటి చెట్టుకేసి చావుదెబ్బ తీశారు. ఆ దెబ్బకు తాటి చెట్టు నేల కూలింది. అది కూలుతూ మరో చెట్టును తాకడంతో అదీ కూలింది. ఇలా వరుసగా చాలా చెట్లు కూలాయి.

నెత్తురులు కక్కుతూ, గార్దభాసురుడు విగతజీవుడైనాడు. గోపబాలురు ఎగురుతూ గంతులు వేస్తూ తాటి పండ్లు ఏరుకుని కోరినన్ని తినసాగారు.

ఈ అరుపులూ, పెడబొబ్బలూ విన్న ధేనుకుడి బంధువులు అక్కడకు దూసుకువచ్చారు. రామకృష్ణులు బంతులాటవలె వారినందరనూ ముట్టుపెట్టారు.

అంతటితో ధేనుకవనం నిరపాయం, నిష్కంటకం అయింది.



# కాళియమర్దనుడు

ఆనందోత్సాహాలతో వసంతంవలె వారి జీవితాలు సాగుతూండగా, ఒకనాడు గోపబాలురు దాహపీడితులై, విధివంచితులై కాళియ సరస్సులోని నీరు తాగారు. ఈ మడుగులోని నీరు విషమయం. కాళియుడనే సర్పరాజు సపరివార సమేతుడై అక్కడ కాపురం చేస్తున్నాడు. ఆ మడుగును వాడు నెలవు చేసుకుని ఉండడం వల్లనే దానికి కాళియ మడుగు అన్న పేరు వచ్చింది. విష సర్పాల విషం వల్లనే ఆ సరస్సులోని నీరు నిరంతరం తెర్లుతూంటుంది.

తెలిసినవాళ్లెవరూ ఆ మడుగు జోలికి పోరు. అయితే తెలీక బాలకులు, తమ పశువులతో సహా నీరు తాగి ప్రాణాలు పోగొట్టుకోవడం జరిగింది.

శ్రీకృష్ణునకు వారిమీద జాలి కలిగింది. తన అమృత దృష్టులతో వారిని బ్రతికించాడు. వారు నిద్రనుంచి లేచిన విధంగా లేచి కూర్చున్నారు.

ఆ జలాన్ని పానయోగ్యంగా చేయవలెనని శ్రీకృష్ణుడు సంకల్పించాడు.

ఆ మడుగు సమీపంలోని ఓ కదంబ వృక్షం శ్రీకృష్ణుడు ఆరోహించి, ఏనుగు మీదకు దూకుతున్న సింహకిశోరం వలె ఆ మడుగులోకి కుప్పించి దూకాడు.

కాళియుడి కోపం మిన్ను తాకింది. ఇంతవరకూ తన అధికారానికి ఎదురులేదు; మాటకు తిరుగులేదు. ఇప్పుడు, ఇంత కాలానికి ఈ అర్భకుడు మత్తుడై, అవ్యక్తుడై తన మడుగులోకి దూకుతాడా? తన విషం విషయం వాడికి తెలిసినట్లు లేదు. తన ప్రతాపం ఏమిటో, తన శక్తి ఏమిటో ఆ చిన్నవాడికి కాస్తంత రుచి చూపాలి! బతికి ఉంటే మళ్లీ జీవితంలో ఇటుకేసి రాడు.

కాళియుడు మడుగులో కలయ తిరుగుతూ, తరంగాలను ఆకాశం అంచులదాకా లేపుతూ, బుస్సలు కొడుతూ, శ్రీకృష్ణుడు ఉన్నచోటకు వచ్చాడు. వచ్చీ రావడంతోనే, తోకతో తీవ్రంగా కొట్టి శ్రీకృష్ణుడి శరీరాన్ని చుట్టి కాటు వేసేందుకు నోరు తెరచాడు వాడు.

దుందుడుకుతనంతో శ్రీకృష్ణుడు, ఆ మడుగులోకి దూకడమూ, కాళియుడి చేత

బంధింపబడడమూ చూసిన గోపబాలురకు కాళ్లూ చేతులూ ఆడలేదు. నోర మాటలేక నుంచున్నారు. శ్రీకృష్ణునికి సాయం చేద్దామన్న తలంపు వారికి కలిగింది. అయితే అందుకు తాము మాత్రమే చాలమని పించింది. అందువల్ల వాళ్లు బృందావనానికి హుటాహుటి పోయి పెద్దల సాయం తేవాలని కొందరు పరువులు లంకించుకున్నారు.

ఎవ్వరకూ సాయపడ శక్తి లేదన్న విషయం ఆ బాలురకు తెలియ లేదు.

కాళియ మడుగు సంగతి తెలీనివాళ్లు ఎవరూ లేరు. శ్రీకృష్ణుడు చేజేతులా కోరితెచ్చుకున్న విపత్తును ఎలా నివారించడం? ఆలోచించే నిదానం వారికి లేదు. నివారించే శక్తి లేదు. వాళ్లకు అందుబాటయినదేమంటే, విలపించడం ఒక్కటే? అదేవారంతా చేయసాగారు. నెత్తీ నోరు కొట్టుకుంటూ, నేలమీద పడి దొర్లుతూ, గుండెలు బాదుకుంటూ గోడుగోడున వారు దుఃఖింపసాగారు.

యశోదా నందుల సంగతి మరీ దారుణం అయింది. యశోద నేలమీద పడి పొరలి పొరలి ఏడవసాగింది. నందుడు దుఃఖంతో అంగ వస్త్రాన్ని ముఖమ్మీద కప్పుకుని కన్నీళ్లు కార్చసాగారు. రోహిణి దుఃఖపడుతున్నా వాళ్లను ఊరడించే ప్రయత్నం చేయసాగింది.

బలరాముడు వారికి ఎంత ధైర్యం చెప్పినా, ఎవ్వరూ వినే స్థితిలో లేరు.

కాళియుడు నిప్పుగోళాల వంటి కండ్లతో చూస్తూ ఎడాపెడా శ్రీకృష్ణుని కాట్లు వేస్తున్నాడు. శ్రీకృష్ణుడు మగతగా కనిపించాడు.

అలా తమ చిన్నారి బాలుడున్న దుస్థితిని వాళ్లు చూడలేక ముఖాలు చాటుచేసు కున్నారు.

''అదో. ఆ పాడుపురుగు ఎలా కరుస్తోందో చూడండి! ఆ పట్టు నుండీ మన కృష్ణుడు ఎలా తప్పించుకరాగలడో? భగవంతుడా! ఈశ్వరా! రక్షించు! నీ మెళ్లో వన్నీ పాములే కదా! నీపడక ఓ పెను బామే కదా! భగవాన్! ఈ పాము మా పాపాడిని ఏం చేయకుండా కాపాడు. నీకు అభిషేకాలు చేస్తాం! పొంగళ్లు పొంగిస్తాం!'' అంటూ వారు ప్రార్థింపసాగారు.

''మా చిన్నికృష్ణుడు లేని లోకం మాకెందుకూ? నిన్ను ఎలాగూ రక్షించుకోలేని అశక్తులం! నీతో పాటు మేమూ వాడి విషానికి బలి అయిపోతాం!'' అంటూ జట్లు జట్లుగా యాదవులు సరస్సులోకి ప్రవేశింప సాహసించారు.

బలరాముడు, కృష్ణునకు వచ్చిన ఆపద ఏమీ లేదని ఎంతగా చెబుతున్నా వారు నమ్మలేదు.

''చూడవయ్యా! బలరామయ్యా! ఎలా పాపడు వ్రేలాడిపోతున్నాడో కనిపించలే? తూట్లు చేసిన శరీరం అంతా విషమయం అయిపోయింది. కొంచెం కొంచెంగా తలకు ఎక్కుతుంది! ఇంకా ఏం ఉందని రామా! ఋకాయిస్తావూ? నీలమేఘం వంటి బాలుడు, చూడలా, ఎలా కారు మేఘంలా మారుతున్నాడో? అంతా సర్వనాశనం అవుతూంది!''

శ్రీకృష్ణుడు, తనకోసం, అంతగా విలపిస్తూ, ఇంతగా త్యాగం చేసేందుకు, సిద్ధం అయిన వారందరి వేపూ ఆర్ద్రంగా, మందహాసంతో చూశాడు. ఇంకా ఎక్కువగా వాళ్లను బాధించడం భావ్యం కాదను కున్నాడు.

ఒక హుంకారంతో బాలకృష్ణుడు, తన శరీరం అనంతంగా పెంచాడు. ఉన్నట్లుండి బంధితుడి శరీరం పెరగడంతో, కాళియుడి శరీరం, సంధి బంధాలూ పెటపెటలాడాయి. బిగవు

సడలిపోగా పట్టు విడచిపెట్టాడు. శ్రీకృష్ణుడు, వాడి తోక పుచ్చుకుని గిరగిరా త్రిప్పి విసరి కొట్టాడు. ఆ దెబ్బకు, వాడి నవనాడులూ విచ్చుకున్నాయి. చలనం కోలుపోయి, కొంతసేపు మగతలో పడిపోయాడు. తెప్పరిల్లిన తరువాత బుస్సలు కొడుతూ, విషం కక్కుతూ, కాళియుడు కృష్ణుడి మీదకు దూకాడు.

కాళియుని ఫణాగ్రమ్మీదకు శ్రీకృష్ణుడు వాటంగా చేరి తోక పుచ్చుకున్నాడు. విశాలమైన వాడి ఫణాగ్రం మీద శ్రీకృష్ణుడు భువన మోహనంగా కాలి అందెలు రవళింపగా చిందులు వేయసాగాడు. ఆ దివ్యబాలుని కాలి తాడనలకు, వాడి ప్రాణాలు కడబట్టాయి. ఒక్కో తాపుకు ఓ యింత నెత్తురూ, ఆ నెత్తురులో ఓ యింత విషం కక్కుతూ, వేదనతో కాళియుడు దిక్కులు చూడసాగాడు. ఎవరు రక్షిస్తారా అని వాడి కండ్లు వెదకుతూన్నాయి. తన తలమీద ఉన్నవాడే లోకులకూ, లోకాలకూ రక్షకుడన్న విషయం వాడికి ఇంకా తెలిసిరాలేదు.

కాళియుడి కాంతలకు, తమ భర్త దుస్థితి తెలిసింది. వారందరూ శ్రీకృష్ణుని చుట్టూ చేరి చేతులు జోడించారు.

''ప్రభూ! నీవెవరో తెలియక మా భర్త ఇంతగా అపచారం చేశాడు. ఇప్పుడు కంఠగతప్రాణుడై, దీనుడై ఎవరు కాపాడగలరా అని దిక్కులు చూస్తూ పడి ఉన్నాడు. సగం చచ్చినవాడిని పూర్తిగా చంపడం ఉచితమా తండ్రీ? మమ్మలనందరనూ అనాథలుగా చేయడం ధర్మమా స్వామీ? అపచారం చేశాం'' అని లెంపలు వాయించుకుంటున్న మమ్ముల దండించడం ఉచితమా? నీవు దయామయుడవు. భక్తవత్సలుడవు. తప్పులు చేయడం మావంతు అయితే, దండించడము నీ వంతు. ఈ దండించడం జరిగినప్పుడు మిగిలేది నీ ఆదరణ కదా ప్రభూ?'' అంటూ ప్రార్థించారు.

కాళియుని అహం పూర్తిగా చచ్చిపోయింది. తన తలల మీద ఆడుతున్నవాడే, ప్రపంచాన్ని ఆడించగలవాడని, వాడికి తెలిసింది. తన చమత్కారానికి, శక్తికీ అతీతం అయిన శక్తి తన ముందున్నప్పుడు తలవంచి, అహం దించి, చేతులు జోడించి, పాదాలు ఆశ్రయించడమే కర్తవ్యం – అదే వాడి మనస్సుకు తోచిన విషయం!

''పగిలి నెత్తురులు ఓడుతున్న నా తలలమీద నుంచున్న వారెవరో, కొంత ఆలస్యంగా తెలుసుకున్నాను తండ్రీ! అజ్ఞానిని కదూ? అంచేత కొంత ఆలస్యం అయింది. నాది పాపజాతి. నా జాతి ధర్మం, నా నెత్తురులో ఉండకుండా ఉంటుందా? తప్పక ఉంటుంది. ఇదీ నీవు అనుగ్రహించినదే! ఈ గుణం – దుర్గుణం కావచ్చు. నీవు అనుగ్రహించేంత వరకూ నా బుద్ధికి అందదు. ఇవాళ నా దుర్గుణం ఏమిటో అర్థం అయింది. ఇదీ నీవు రావడం వల్లనే. నీవు రావడం ఎందుకంటే, నన్ను అనుగ్రహించడం కోసమే! నా శిరస్సుల మీద నీ పాదాలు మోపడం అనుగ్రహించడం కాక వేరే ఏమవుతుంది ప్రభూ? నిన్ను తెలుసుకున్నాను. ఇప్పుడు నాలో ఇంత కాలం పేరుకుపోయిన కుటిలత్వం అంతరించింది. నీ పాద స్పర్శతో నా పాపాలు పోయినవి. ఈ పాప శరీరాన్ని నీవు శిక్షించావు; పునీతం చేశావు. ఇప్పుడు నేను ఏం చేయవలెనో ఆదేశించు! శరణు అంటే, నీవు దండించవు. ఆదరిస్తావు. నాకు తెలుసు. నీవాడిని, నీ చరణధూళి సోకి పునీతం అయినాడిని. ఇక నాకేం భయం?... నీ చిత్తమేదో అదే చెయ్ తండ్రీ!'' అంటూ కాళియుడు కండ్లు

మూసుకున్నాడు. వాడి కండ్లలోంచి రక్తాశ్రువులు జారుతున్నాయి.

శరణు అనడంతోనే వాడు బాధావిముక్తుడయ్యాడు.

"ఈ మడుగునీరు పానయోగ్యం కావాలి. నీవు ఉంటే అది కుదరదు. నీవు, నీవారితో సాగరానికి వెళ్లు!" అని శ్రీకృష్ణుడు ఆజ్ఞాపించాడు. "గరుడభయంతో రమణకద్వీపం విడచి ఇక్కడకు వచ్చావు. ఇప్పుడు నీ తలలమీద నా పదలాంఛనాలు ముద్రితాలై ఉన్నాయి. ఇక నీకు గరుడ భయం లేదు. యథేచ్ఛగా పోయి అక్కడ జీవించు!"

అప్పటికప్పుడే కాళియుడు తనవారితో సాగరానికి వెళ్లాడు.

సర్పారాధకులు కొందరున్నారు. తమకు కీడు కలుగదన్న నమ్మకంతో, వారు సర్పాలను పూజించి, నివేదనలూ, కానుకలూ సమర్పించేవారు. ఈ సర్పాలకు మృత్యువు గరుత్మంతుడు. గరుత్మంతుని మంచి చేసుకునేందుకు, తమకు వచ్చిన నివేదనలు, ఆయనకు ఇచ్చి కొన్ని సర్పాలు ప్రాణాలు నిలుపుకున్నాయి. అయితే కాళియుడు మహాగర్వి. తనను గరుత్మంతుడు ఏమీ చేయలేడన్న అహంకారం కొద్దీ గరుత్మంతునికి నివేదనల వాటా ఇవ్వలేదు.

తనను తృణీకరించిన కాళియుని, గరుత్మంతుడు చీల్చి చెండాడి బుద్ధి చెప్పాడు. చావు తప్పించుకుని కాళియుడు, తనవారితో ఈ మడుగు ప్రవేశించాడు. ఈ మడుగు వారికి నిర్భయమైన చోటు. ఎందువల్లనంటే, గరుడుడు ఈ ఛాయలకు రాడు.

సౌభరి మహర్షి, ఈ మడుగులో తపస్సు చేస్తున్నప్పుడు గరుడుడు, ఈ మడుగులోని జలచరాలను పట్టి చప్పరించేవాడు. అలా జరుగుతూండగా మీన జాతి, మహర్షి పాదాలు ఆశ్రయించి తమ జాతిని కాపాడ మని వేడుకుంది. ఆయన కరుణించి, నాడు మొదలు గరుడుడు ఈ మడుగులోకి వస్తే తల పగిలి చస్తాడని శాపం పెట్టాడు. ఈ విషయం ఆ ఇద్దరకూ తెలియడం వల్ల గరుడుడు రాడన్న ఉద్దేశంతో, నిర్భయంగా కాళియుడు కాపురం చేయసాగాడు.

కాళియుడు విడిచిపోవడంతో ఆ జలాలు పానయోగ్యం అయ్యాయి. తమ చిన్ని బాలుడు ఆపద గడచి, కాళియుని మదం అణచి తమను చేరడం చూసిన యాదవులంతా ఎంతో సంతోషించి, నాటి రేయి అక్కడే ఆనందోత్సవాలతో గడిపారు.



# ప్రలంబుడు

కంసుడి పంపున వచ్చిన ప్రలంబుడు, గోపబాలుని వేషం ధరించి వారితో చేరి ఆడుతూ, పాడుతూ గుట్టు తెలీకుండా మెలగసాగాడు. వాడు సామోపాయంతో సాధించాలనుకున్నాడు. సర్వజ్ఞుడయిన శ్రీకృష్ణునకు ఆ విషయం తెలియకపోలేదు. అయితే ఆయన మౌనం వహించాడు.

గోపబాలకులందరూ, రెండు జట్లుగా చీలి, ఆటలాడుతూ ఓడినవారు, గెలిచినవారిని, ఒక నిర్ణీత స్థలం వరకూ మోయవలెనన్న పందెం కాశారు. ఆట ముగియడంతో శ్రీకృష్ణుని జట్టు వారు గెలిచినట్లు తేలింది.

నియమప్రకారంగానే శ్రీదాముడు, శ్రీకృష్ణుని తన భుజమ్మీద ఎక్కించుకున్నాడు. ఓడిన జట్టులో ఉన్న ప్రలంబుడు, బలరాముని మోయవలసి ఉంది.

గెలిచినవారిని తమ భుజాల మీద ఎక్కించుకుని ఓడిన జట్టు వారు పరువులు పెట్టసాగారు. గమ్యం చేరిన తరువాత శ్రీదాముడు, కృష్ణుడిని క్రిందకు దింపాడు. అయితే ప్రలంబుడు మటుకూ, బలరాముని దింపకుండా, గాల్లోకి దూసుకుపోయాడు. వాడు నిజరూపం పొంది మేఘాల అంచుకు చేరాడు.

బలరాముడు పొందిన ఆపదకు గోపబాలురు కృష్ణునితో మొరలిడి విచారింపసాగారు.

శ్రీకృష్ణుడు మందహాసంతో మౌనం వహించాడు.

గాల్లోకి దూసుకుపోతున్న ప్రలంబుడి ఇష్టానికి విడిచి బలరాముడు నవ్వుతూ కూర్చున్నాడు.

''ఎంత దూరం పోతావ్ ప్రలంబా?'' అని అడిగాడు బలరాముడు.

''నిన్ను యమపురి చేర్చేంతవరకూ!'' అంటూ వాడు వికృతంగా నవ్వాడు.

''అలాగా!'' అంటూ బలరాముడు, వాడి శిరస్సు ముక్కలు అయ్యేలా పిడికిళ్లతో బాదాడు.

ప్రలంబుని కండ్లు బైర్లు కమ్మాయి. బలరాముని రెండు చేతులా అదిమిపట్టి చంపాలనివాడు ప్రయత్నించాడు.

బలరాముడు, తన రెండు తొడల మధ్య వాడి శిరస్సును లంకించుకుని, అదిమిపట్టి, తల పగిలేలా పిడికిళ్ల పోట్లతో వాడికి ఊపిరి ఆడనివ్వలేదు. వాడు నెత్తుటి ముద్ద అయి నేలకూలాడు.

తల పువ్వు వాడకుండా బలరాముడు మందకు వచ్చాడు.

''అంత లావు రాక్షసుని ఎలా చంపావ్ బలరామన్నా?'' అంటూ గోపబాలకులు ఆరాధనతో చూడసాగారు.



# దవానలం

అలవాటు అయిన ప్రదేశాలకు మాత్రమే పశువులు మేతకు పోతాయి. పచ్చిక బయళ్లలో పచ్చిక తగ్గిపోతూంటే, అవి ముందుకు సాగుతూంటాయి. పశువులను మేతకు విడిచిపెట్టి, బాలకులు చెట్ల నీడల్లో, పిచ్చాపాటి కబుర్లతో, ఆటపాటలతో కాలం గడిపేవారు. సాయంకాలానికి, ఆ పశువులు మేత మాని తిరిగి రావడం అలవాటు.

ఒకరోజు పశువులు మేత మేస్తూండగా, అడవిలో ఉన్నట్లుండి కార్చిచ్చు రవులుకుంది. చిటపటలాడుతూ, అది రానురాను అసహ్యం అయింది. పశువులు మేత మాని ప్రాణభీతితో అంభారవాలు చేస్తూ పరువులు పుచ్చుకున్నాయి.

పశువులు అలా ఎందుకు అరుస్తున్నాయో తెలీక గోపబాలకులు పశువుల వెదక్కుంటూ వచ్చారు. అప్పటికే దవాలం, గాలిని తోడు చేసుకొంది. భయంకరంగా విజృంభించింది. కొన్ని పశువులయితే చుట్టుముట్టిన అగ్ని వలయం నుండీ తప్పించుకునే దారి తెలీక, రోదన ధ్వనులతో కసాబిసా తొక్కుతూ దీనంగా చూస్తున్నాయి.

ప్రాణప్రదంగా చూసుకునే పశువుల సంకట స్థితికి యాదవ బాలకులు గుండెలు అవిసేలా రోదిస్తూ శ్రీకృష్ణుడి కాళ్ళమీద పడ్డారు.

శ్రీకృష్ణుడు వారల ఊరడింపసాగాడు.

''నీ అండతోనే కదా నిండుగా బతుకుతున్నాం కృష్ణా! ఈ పశువులే కదా మా జీవనాధారం. ఈ పశువులు ఇలా దుర్మరణం పొందితే మా పెద్దలు ఒఖరూ జీవించరు కృష్ణా! వాళ్లు ఏంచూసుకుని బతగ్గలరు?''

''మీకూ, మీ పశువులకూ వచ్చిన సంకటం ఏమీ లేదు... మీరంతా నేను చెప్పేంతవరకూ కండ్లు మూసుకోండి! ఆఁ మూసు కున్నారా?''

''ఆఁ మూసుకున్నాం కృష్ణా!'' అని వారు కండ్లు మూసుకున్నారు.

విశ్వరూపుడయిన భగవంతుడు, నాడు తీవ్రమైన గరళం పానం చేసినట్లుగా ఈ దవానలాన్నీ శ్రీకృష్ణుడు నేడు పానం చేశాడు.

ఎలా రగిలిందో, ఎలా వ్యాపించిందో, అట్లాగే కార్చిచ్చు ఉపశమించింది. వేడిగాలులు మారి చల్లగా గాలులు వీచసాగాయి.

''ఇక మీరంతా కండ్లు తెరీవండి!'' అని కృష్ణుడు ఆజ్ఞాపించాడు. తదాజ్ఞాబద్ధుల యిన బాలకులు కండ్లు తెరచారు.

మామూలుగానే, ఏమీ జరగనట్లుగానే, పశువులు కసవు మేస్తున్నాయి. అంతకు ముందు చుట్టుముట్టిన భయంకరాగ్ని ఛాయలైనా కనిపించలేదు.

కృష్ణబలరాముల చుట్టూ చేరి గోపబాలకులు సంతోషంతో నృత్యం చేశారు.



# వస్త్రాపహరణం

హేమంతం రెండు మాసాలు చలిరోజులు. హేమంత ఋతువు మొదటి మాసం మార్గశీర్షం. ఈ నెలరోజుల పాటు కన్నెపిల్లలు కౌమారీ వ్రతం చేయడం ఆనవాయితీ!

నందుని మందలోని కన్నెపిల్లలు, తెల్లారుఝామున్నే నిద్రలేచి కాళిందీ నదిలో నీరాడి, తీరంలో నిలుపుకున్న భగవతి కాత్యాయనీ దేవిని భక్తి శ్రద్ధలతో పూజించేవారు. అలా ఆ తల్లిని పూజింపడం వలన తాము కోరిన భర్తలు తమకు లభిస్తారని వారి నమ్మకం.

బృందావనంలోని కన్నెపిల్లలు కాత్యాయనీ పూజలు చేస్తూ తమకు శ్రీకృష్ణుడు భర్త కావలెనని కోరుకుని, నివేదనలు చేసి, హవిష్యాన్నం తింటూ వ్రతనియమం పాటింపసాగారు.

అలా వారు మాసం రోజులపాటు వ్రతం చేస్తుండగా ఒకనాటి ఉషఃకాలంలో, ఒకరినొకరు పేరు పేరునా పిలుచుకుని కాళిందీ జలాల్లో స్నానం చేసేందుకు బయలుదేరారు.

వారంతా హాయిగా శీతల జలాల్లో స్నానాలు చేస్తూ, పరియాచకా లాడుకుంటూ, శ్రీకృష్ణునిపై తమ ప్రేమను తెలుపుకుంటూ, ఆయన గుణగణాలను ముచ్చటించుకుంటూ, ఆ పరదేవత, తమతమ కామితాలు నెరవేర్చుతుందని అనుకుంటున్నారు.

ఈ అదను చూసి శ్రీకృష్ణుడు నిశ్శబ్దంగా ఒక పొదల మాటు నుండీ మరొక పొదల మాటుకు చేరుతూ, నదీ తీరంలో కుప్పగా ఉన్న గోపకన్యల కట్టుబట్టలు హరించాడు.

ఆ బట్టలతో సహా, ఆ సమీపాన గల ఒక కదంబ వృక్షం ఆరో హించిన శ్రీకృష్ణుడు వారిని నిక్కి నిక్కి చూడసాగాడు.

తాపీగా జలకాలాడి గట్టు మీదకు వారంతా బిలబిల్లాడుతూ వచ్చారు. అక్కడ తమ చీరెలు కనిపించడం లేదు. ఎవరూ వచ్చిన అలికిడీ, జాడా లేదు.

ఇంతలో మధురంగా వేణునాదం వినిపించింది. అప్రయత్నంగా వారంతా అటు తిరిగారు. పైకి చూడగా శ్రీకృష్ణుడు కనిపించాడు.

సిగ్గుతో వారంతా తిరిగి కాళిందిని ప్రవేశించారు.

''అయ్యో! నీవెంత సిగ్గుమాలినవాడివి కృష్ణా? కన్నె పిల్లలు స్నానాలు చేస్తూండగా, ముచ్చులా వచ్చి బట్టలు తీసుకుని చెట్టెక్కి కూర్చుంటావా? ఈ పాడు బుద్ధులు నీకెవరు నేర్పారు? స్నానం చేస్తున్న ఆడవాళ్ల దగ్గరకు మగవాడివయిన నీవు రావచ్చా? తప్పు కదూ? మా చీరెలు మాకిచ్చి అవతలకు పో!''

''బట్టలు ఇచ్చి అవతలకూ పోవాలా?''

''మరి ఇక్కడ పీఠం వేసి కూర్చుంటావా? ఎంత తుంటరివి కృష్ణా నీవు? ఎప్పుడో మా మనస్సులను హరించావు. ఇప్పుడు చీరెలు దొంగిలించావు. ఇక మానాన్ని దొంగిలించడం ధర్మమా? మా చీరెలు మాకిచ్చి మా మానం కాపాడవలె ప్రభూ!''

''ఇది మగధీరుల లక్షణం కాదు. అబలల, అనాథల రక్షణ చేయవలసింది పోయి చీరెలు తీసుకుపోవడం వీర లక్షణమా? ఈ విషయం ఎవరికైనా తెలిస్తే నిన్నెంత చులకన చేస్తారో ఆలోచించావా?''

''నిజంగా మీకు బట్టలు కావలెనా?'' అంటూ కృష్ణుడు అడిగాడు.

''అదేం మాట కృష్ణా? కట్టుబట్టల్లేకుండా ఎలా బయటకు రాగలం? ఈ హేమంతపు చలిలో – ఈ నీళ్లలో ఎంతసేపని ఉండగలం? వేగిరం బట్టలు ఇవ్వు?''

''బట్టలు లేక బయటకు రాలేమన్నారు కదూ? మరి గట్టుమీది బట్టలెలా ధరిస్తారు? నీళ్లలో ఉన్న మీకు బట్టలెలా వస్తాయి?''

''నీవు ఇక్కడ లేనప్పుడు గట్టుకు రాగలం! నీవుండగా ఎలా రాగలం? నీవు తుంటరివైనా ధర్మం తెలిసినవాడవు. ఇలా వలువలు అపహరించడం ఏ ధర్మశాస్త్రంలో ఉంది స్వామీ? అసలు ఇంతులు స్నానం చేస్తూంటే మగవాళ్లు రావటమే తప్పు! ఒకవేళ వచ్చినా, ఇంత విపరీతం చేయవచ్చా? నీకు ఊడిగం చేతులు కట్టుకుని చేస్తాం. నీవేం చేయమన్నా చేస్తాం. మా వలువలు మాకివ్వు కృష్ణా! నీకు పుణ్యం ఉంటుంది.''

''ఊడిగాలు నాకేం చేయవలసిన అవసరం లేదు. చేతులు కట్టుకుని గట్టు మీదకువచ్చి మీ బట్టలు మీరే తీసుకోండి!''

''అయ్యో! వివస్త్రలం! పత్తికాయల్లా ఇంతింత కండ్లు పెట్టకుని, నీవు చూస్తూండగా, ఎలా బయటకు రాగలం? ఇలాంటి పాడు కోరికలు కోరతావేం కృష్ణా? నీకు ఎలాగూ సిగ్గు లేదు. మాకూ లేదనుకున్నావా?

"మీ మనస్సులు దోచినవాడెవడో చెప్పండి! మీకు ఎవడు మగడు కావలెనని అంబికను ధ్యానం చేస్తున్నారో చెప్పండి! నేను మీకు కానివాడను కాదుగా! పరాయివాడినా ఏం?" అంటూ శ్రీకృష్ణుడు నవ్వాడు.

"ఏమో బాబూ! మాకు సిగ్గువేస్తుంది."

"నాముందు మీకు సిగ్గెందుకూ?".

వారు మౌనం వహించారు.

"అయితే ఎంతసేపు ఉంటారో ఉండండి!"

కొందరు కన్నెపిల్లలు బయటపడదామన్నారు. కొందరు ఛీ! పాడు! ఎల్లా వెళ్లగలం? అంటూ శ్రీకృష్ణుడి వేపు అనంతతృపితంగా వారు చూడసాగారు.

చివరకు అందరూ కూడబలుక్కుని, ముడుచుకుపోయిన శరీరాలను చేతులతో దాచుకుంటూ బయటకు వచ్చారు.

"ఇంతలేసి సిగ్గులెందుకూ మీకు? చిన్నతనాన్నుండీ మీతో పెరిగాను. నాకు తెలీని కొత్త అందాలు మీ దగ్గరేమున్నాయి? అసలు వ్రతనిష్ఠతో ఉన్న వారెవరైనా వివస్త్రలై స్నానం చేస్తారా? తప్పు కదూ? వ్రత ఫలితం మీకు దక్కవలెనంటే చేతులెత్తి నాకు మ్రొక్కి వలువలు తీసుకోండి!"

కొంచెం కొంచెం సిగ్గులు విడచిన గోప వనితలు శ్రీకృష్ణుడు కోరినట్లే తమ తమ వలువలు తీసుకుని ధరించారు.

తన ముందు మ్లానలై, నిర్లజ్జలై నిలచి ఉన్న ఆ కన్య కామణుల వైపు చూస్తూ, శ్రీకృష్ణుడు వారికి వరదానం చేశాడు.

"లజ్జవల్ల మీరు నోరారా చెప్పలేదు కానీ, మీరు చెప్పకపోయినా మీ మనస్సు నాకు తెలిసిపోయింది. మీ నోములు ఫలవంతం అయ్యాయి. కృతార్థలు అయ్యారు. ఇక రాత్రులందు నేను మీవాడినే!"

తాము చేసిన కాత్యాయనీ వ్రతం సఫలం అయిందని వారెంతో పొంగిపోయారు.

★ ★ ★




ఒకనాడు మేతకై పశువులు చాలా దూరం పోయినవి. వాటిని అనుసరిస్తూ గోపకుమారులతో కృష్ణబలరాములూ నడచారు.

మధ్యాహ్నం సూర్యుడు నడినెత్తికి వచ్చారు. ఎండ తీవ్రం అయింది. పశువులను యమునకు తీసుకుపోయి, నీరు తాపించిన తరువాత గోపబాలురు ఒక చెట్టు నీడకు చేరారు.

"కృష్ణా! ఇంత ప్రసాదం పెట్టించు! ఒక ముద్ద తినకపోతే మా ప్రాణాలు నిలవ్వు!" అని వారు అడిగారు.

"అల్లాగా" అంటూ శ్రీకృష్ణుడు నవ్వాడు. "మీకంతా చక్కటి విందు భోజనం ఏర్పాటు అవుతుంది. ఇక్కడకు సమీపంలో అంగీరసాది మునుల ఆశ్రమాలున్నాయి. వారందరూ సత్రం చేస్తున్నారు. అక్కడికి వెళ్లండి. నా పేరు చెప్పండి. అన్నం అడగండి. మీకు చక్కటి విందు లభిస్తుంది."

యాదవ కుమారులు అంత ఎండలో పడి ఆశ్రమం చేరారు. శ్రీకృష్ణుడు చెప్పమన్న విధంగా చెప్పారు. ''మా శ్రీకృష్ణబలరాములు పశువులు మేపుతూ ఈ ప్రాంతాలకు వచ్చి, ఆకలిగొన్నవారై, ఆహారం కొరకు ఎదురుచూస్తున్నారు!''

''దేవతార్పన పూర్తికాందే అన్నం ఎవరికీ పెట్టం!'' అని ఆ మునులు నిర్మొహ మాటంగా చెప్పారు.

ఆ బాలురు హతాశులై, గసలు పెడతూ తిరిగివచ్చి, ''మునులు మొండి చేతులు చూపారు కానీ, ముద్ద పెట్టలేదు'' అని కాళ్లు బార్లాసాపి కూలబడ్డారు.

''ఓహో! అలాగా! ఈమారు మునిపత్నులను అడగండి!''

''మళ్లీ అంత దూరం పోవలెనా కృష్ణా? సరే! ఈమాటు వాళ్లే మంటారో విని అది నీకు చెబుతాంలే!'' అంటూ ఆ పిల్లలు తిరిగి ముని ఆశ్రమం చేరారు.

శ్రీకృష్ణుడు చెప్పమన్న విధంగానే మునిపత్నులకు చెప్పి ఆహారం అడిగారు.

వారు, ఆ మాట వినడంతోనే ఎంతో సంరంభంతో, ఉత్సాహంతో, గంపల్లో వివిధాలయిన వ్యంజనాలూ, భక్ష్యాలూ, అన్నాలు పెట్టుకుని హుటా హుటి బయలుదేరారు.

వారలా బయలుదేరుతుండగా, వారి వారి భర్తలు, బంధువులూ, ఎన్నో విధాలుగా అడ్డగించారు. అయితే వారు సముద్రం చేరగా ఎదురుకోలలెత్తే నదులవలె ఉరుకులూ, పరుగులతో శ్రీకృష్ణదేవుని చేర వచ్చారు.

''తండ్రీ! ఇదో నివేదన స్వీకరించు!'' అంటూ ఆ మునిపత్నులు శాక పాకాదులు భగవంతుడయిన శ్రీకృష్ణ పాదారవిందాల చెంత సమర్పించి వినమ్రులై నమస్కరించి ప్రార్థించారు.

''నా చెంత చేరినవారలకు ఎటువంటి అధర్మ దోషం అంటదు. నా ధ్యానంతో, నా కీర్తనంతో, నా దర్శనంతో మీ కర్మ బంధాలు తెగిపోయినవి. మీరు ముక్తలయ్యారు!'' అన్నాడు కృష్ణుడు.

శ్రీకృష్ణుడు, తనవారితో మునిపత్నులు తెచ్చిన భిక్షను తృప్తితీరా ఆరగించాడు.

తమ పత్నులు చేసిన భగవన్నివేదనను, తెలుసుకున్న మునులు, తామెంతగానో నష్టపోయిన విషయం నిదానంగా తెలుసుకున్నారు. తాము ఎంత మోసపోయారో, తమ సతులెంతటి సుకృతి పొందారో వారికి ఆలస్యంగా తెలిసింది. దానివల్ల వారికి విచారం కలిగింది.

స్వయంగా పరమాత్మ, తనకు భిక్ష చేయమని కోరితే, నిరాకరించిన, తమ పాపాలకు నిష్కృతి లేదని వారు విలపించారు.

''క్రతువులూ, సత్రాలూ, వ్రతాలూ, నియమాలూ నిష్ఫలాది లౌకిక క్రియల కవతల ఎవడు వెలుగొందుతున్నాడో వాడిని తెలుసుకోకపోవడం మాయ కాక మరేమవుతుంది? మనం మాయామోహితులం! ఈ పొరలు చీల్చుకుని మన సతుల వలె ఘనం బయటపడలేకపోయాం. నష్టజాతకుల మయ్యాం!'' అని వారు దుఃఖించారు.

ఏమయినా వారికి పట్టవలసిన అదృష్టాన్ని, వారి పత్నులకు కలిగించిన విధి, వారలను మాత్రం నిర్భాగ్యులుగానే మిగిల్చింది.



# గిరిధారి

యాదవులు ప్రతియేటా ఇంద్రప్రీతికై యాగమొకటి చేస్తారు. ఈసారి కూడా యాగసంకల్పం వారికి కలిగింది. చిన్నవారిలో చిన్నవాడూ, పెద్దవారిలో పెద్దవాడూ అయిన శ్రీకృష్ణుడితో ఈ విషయం సంప్రతించడం అవసరం అనుకున్నారు వారు.

"ఇంద్రుడు మీకేం చేస్తున్నాడని, అతడి ప్రీతికై యాగం చేయబోవడం?" అని కృష్ణుడు వారిని నిలదీశాడు.

"పైర్లు పచ్చగా ఉంటే, మనకూ, మన పశువులకూ ఇంత గ్రాసం చిక్కుతుంది. పైర్లు పండాలంటే సకాలంలో వర్షాలు కురవాలి. వర్షాధిపతి ఇంద్రుడు. ఆయన దయకు పాత్రం అయితే మన పైరు పచ్చలు వృద్ధి అవుతాయి!"

"ఇంద్రుడి దయ వల్ల వర్షం కురవడం లేదు. కర్మవల్ల జంతువు పుడుతుంది. కర్మతో వృద్ధి అవుతూంది. దానివల్లనే సుఖ దుఃఖాలు కలుగు తున్నాయి. పురాకృత కర్మఫలాలను తప్పించేందుకు ఈశ్వరుడి వల్లా కాదు. కర్మమే దైవం. కర్మతే పుట్టి, కర్మతో పెరుగుతున్నాం. ఎవరి కర్మలు వారు చేయడం ధర్మం. సత్త్వం, రజస్సూ, తమోగుణాలతో జగత్తు పుడుతుంది. రజోగుణంతో మేఘాలు వర్షిస్తున్నాయి. ఈ వర్షం కారణంగా ప్రజలు అభివృద్ధి పొందుతున్నారు. మరి ఇంద్రప్రసక్తి ఎక్కడ ఉంది?"

"అయితే మనం ఎవరిని పూజించాలంటావ్?" అని అమాయకంగా యాదవులు అడిగారు.

"ఈ కొండను పూజించండి! ఉత్తమ గురువును పూజించండి! గోమాతను పూజించండి. సర్వజీవులనూ ఆరాధించండి! అధమ ఛండాల శునక జాతులనెప్పుడూ నిరాకరించకండి! గోజాతి దయవల్లనే కదా మనం బతుకుతున్నాం! గోపూజలు చేయండి!"

"అల్లాగే కృష్ణా! నీవేం చెబితే అది మాకు సమ్మతమే! నీ మాటలవల్ల మేం కండ్లు తెరిచాం! ఈ గోవర్ధన గిరినే పూజచేతాం!".

ధర్మోద్ధరణకై అంతరించిన కృష్ణపరమాత్మ, దేవరాజు అయిన ఇంద్రుడి ఆధిపత్యాన్ని సవాలుచేయడం ధర్మ విరుద్ధంకాదా?

సర్వదేవతలకూ కీలకంఅయినవాడు శ్రీమన్నారాయణుడు. ఏది ఎవరు, ఎక్కడ, ఎప్పుడు ఏరూపంలో చేసినా చెందవలసినచోటు ఆయన! మధ్యలో ఆగిపోవడం నేరం. ఇంద్రుడు తానే సర్వం అనుకోడం నేరం. తనకే పూజలు చేయవలెనని అనుకోడం ఇంద్రుడి నేరం. ఆ నేరం నుండీ కాపాడ్డం కొరకే ఈ ప్రదర్శన! గర్వాన్ని అణచివేయడం కూడా భగవల్లక్షణం!

వండిన పాయసాన్నాలూ వ్యంజనాలూ, పండ్లు, ఫలాలు పూలూ వగైరా పూజాద్రవ్యా లతో అనేక మొక్కులతో యాదవులు గోర్థనగిరి సమీపానికి తరలి వచ్చారు.

ఈ కొండ తానే అయి, యాదవుల నివేదనలు పరమాత్మ అందుకున్నాడు; తామూ, యాదవులతోపాటు నమస్కరించాడు.

సర్వం తానే అయినవాడు, ఏ రూపంలో, ఏ ఆకృతిలోనయినా ఉండగలవాడూ ఇప్పుడు ఈ పర్వతంలో చేరి ఉన్నాడు. ఆ పర్వతానికి పూజలూ, ప్రదక్షిణాలు చేసి సంతృప్తులై యాదవులు సంతోషించారు.

అయితే సంతోషింపక, కోపించినవాడు ఎవడంటే ప్రతి యేటా, తనకు జరిగే యాగం మానుకోవడంవల్ల ఇంద్రుడు. అతడి కోపం ప్రతీకారం అయింది. ఆ ప్రతీకారం శిక్షారూపం ధరించింది.

ఇంద్రుడు, తన వశంలో ఉన్న పుష్కలసంవర్తకాది మేఘాలను పిలిచాడు.

''మీరంతా మీ బలగాలతో, బలంతో బృందావనం వెళ్లండి. పిడుగులూ, శిలలూ వర్షించండి. చండమారుతం ప్రచండంగా మీకు తోడవుతుంది. పశువులూ, మనుష్యులూ తల దాచుకునేచోటు లేకుండా చేయండి. యాదవలోకం యావత్తూ జలమయం కావాలి. అప్పటికి గానీ ఈ వెర్రి గొల్లలకు బుద్ధిరాదు. అర్భకుడు తెలిసి తెలీక కారుకూతలేవో కూసిన ఫలితంగా, యేటా నా మెప్పు కోసం, నా గొప్ప కోసం చేసే యాగం మానుకున్నందుకు ఫలితం తెలియచేయండి' అంటూ ఆజ్ఞాపించాడు ఇంద్రుడు.

క్షణాలమీద కాటుక కొండలవంటి మేఘాలు కదలి వచ్చాయి. ప్రకృతినిండా చీకట్లు మూసుకువచ్చాయి. ఈదురు గాలులతోపాటు తాటికాయలంత చినుకులు ప్రారంభం అయ్యాయి. శిలలు కురవసాగాయి. పిడుగులు రాలసాగాయి. ఉరుములు ఉరుముతున్నాయి. మెరుపులు మెరుస్తున్నాయి. చెవులు చిల్లులు పడేంతగా మేఘగర్జనలు కొనసాగుతున్నాయి. వ్రజప్రజకు బతుకు దుర్భరం అయింది. తల దాచుకునేందుకయినా చోటు కనిపించలేదు. కొండమీది ప్రవాహాలు ఉధృతంగా ప్రవహింపసాగాయి. పశువుల అంభారవాలూ, మనుష్యుల ఆర్తనాదాలు వర్షపు హోరులో కలిసిపొయ్యాయి.

''అయ్యో ఇప్పుడేం చేయాలి? ఇంద్రుడికి కోపం రానేవచ్చింది!''

''ఏదో బాలుడు చెప్పిందానికి మందులై బుర్రలూపినందుకు మా బాగానే అయింది. చేజేతులా తెచ్చుకున్న ముంపు! అనుభవించండి!'' అంటూ కొందరు ఈసడించుకున్నారు.

''అయ్యో! కృష్ణా! రక్షించడం నీధర్మం! నీ మాట జవదాటలేదు. నీటమునిగిపోతున్నాం. గట్టు చేర్చడానికి నీవు తప్ప వేరు గతిలేదు తండ్రీ!'' అంటూ కొందరు ప్రాధేయపడ్డారు.

''మీ కొచ్చిన భయంలేదు. నేను రక్షిస్తాను'' అంటూ శ్రీ కృష్ణుడు అభయం ఇచ్చారు.

ఇంతకుముందు యాదవులు పూజలు చేసిన గోవర్ధనగిరిని పూలగుత్తి వలె పెకలించి, కుడిచేయి చిటికిన వ్రేల నిలిపి పట్టుకున్నాడు శ్రీ కృష్ణుడు.

''ఇక్కడకు – ఈ కొండ క్రిందకు మీరంతా రండి! మీ మీ సంబరాలతో, పశువులతో, మీ వాళ్లతో రండి! నేనో చిన్న వాడినీ, ఈ కొండ దొడ్డది, బరువైనదీ అన్న సందేహం మీకు వద్దు. ఈ కొండనేకాదు– ఈ కొండమీదకు సర్వ బ్రహ్మాండాలు వచ్చిపడినా నా వేలు కదలదు; అల్లాడదు. నిర్భయంగా, నిశ్శంకతో ఇక్కడకు వచ్చి సురక్షితంగా కాపురం చేయండి.'' అంటూ గోవర్ధనధారి ఆహ్వానించాడు.

గో గోపీ గోపాలురు సంబారాలతో ఆ నీడక్రిందకు వచ్చి నుంచున్నారు. మందీ మార్బలం తెచ్చుకున్నారు. పశువులు హాయిగా ఊపిరి పీల్చుకున్నాయి. ప్రజల ప్రాణాలు కుదుటపడ్డాయి. వంటా వార్పులు చేసుకుంటూ, విందులూ వినోదాలు సలుపుకుంటున్న యాదవులకు కొండక్రింద జీవితం హాయిగా గడిచిపోతూంది. తిండి తింటున్నారు. నిద్రపోతున్నారు. కాలక్షేపానికి శ్రీ కృష్ణుని అద్భుతచర్యల గురించిన గాథలు ఉండనే ఉన్నాయి. పాటలు పాడుకుంటున్నారు. ఆటలాడుకుంటున్నారు. యాదవుల స్థితి ఇంటికన్నా గుడి పదిలం అన్నట్లుంది.

బయట చెట్టూపుట్టా ఏకమై, ఝుడివాన కురుస్తోంది. ఒకరోజు కాదు, రెండ్రోజులు కావు. విరామం లేకుండా ధారపాతంగా ఏడురోజులపాటు వర్షం కురిసింది. అలా ఎంతకాలం వర్షం కురిసినా వాళ్లకు చింతలేదు. తమ రక్షకుడు, తమను కంటికి రెప్పవలె కాపాడుతూండగా, యాదవులకేం తక్కువ? జగద్రక్షకుని వాళ్లు ముంగిట్లో కట్టి పడేసుకున్నారాయె!

యాదవులకు వచ్చిన చింతలేకపోయినా, ఇంతటి జలప్రళయానికి కారణభూతుడయిన, ఇంద్రునికి చింత పట్టుకుంది. ఆ చింతలో అవమానం తొంగిచూసింది.

చిటికిన వ్రేలితో కొండను ఎత్తిపట్టిన వాడెవడు? ఎంతఘనుడుకాకపోతే, దేవరాజు నయిన, తన్ను ప్రతిఘటిస్తాడు? ఇంతకూ ఎవరతడు? అతడి గొప్పలేమిటి?

విచారించిన మీదట శ్రీకృష్ణుడివైనం తెలిసింది.

"అన్నన్నా! ఎంత పొరబాటయింది? పరదేవతతోనా తన వైరం? ఆ కరుణ, ఆదయ, ఆ దృష్టిలేకపోతే తనూ, తన ఉనికీ నిలచేనా? తన ఉనికి ఒకటి కాదు, ఈ సచరాచరసృష్టి నిలచేనా? ఎంత తప్పిదం? ఎంత అవివేకం? ఎంత మూర్ఖత్వం?

తనను పూజింపలేదని తను కోపించాడు. తను ఎవరని తనను పూజింపవలె? తనకే పూజనీయుడయిన మహా పురుషుని ఎదుట తనూ, తన శక్తీ ఎంత? యాదవులు ఏం తప్పు చేశారని తను శిక్షించాడు? తననే శిక్షింపగల మహాశక్తిని తాను ఎదిరించాడు? ఎదిరించి నిలువగలడా?

పశ్చాత్తాపం పొందిన ఇంద్రుడు, క్షణాలమీద తన బలగాలను ఉపసంహరించాడు.

మేఘాలు చెదరిపోవడంతో, ఆకాశం తెలివి చూపింది. సూర్యకిరణాలు నులివెచ్చగా సోకుతున్నాయి. బాగా వెలుతురు వ్యాపించింది.

"వర్షం వెలిసింది! ఇక మీరందరూ బయటకు వెళ్ళండి!"

యాదవులు, తమ మూటాముల్లెలతో ఇవతలకు రావడంతో శ్రీకృష్ణుడు, గోవర్ధన పర్వతాన్ని యథాస్థానంలో నిలిపాడు.

సకల సురసేవ్యమానుడయిన సురపతి, తన కిరీటం నేలసోకేలా శిరస్సు వంచి, ఏ పాదాలు సకల పాపాలు పోగొడతాయో, ఏ పాదాలు భూమినీ, ఆకాశాన్నీ కొలవగలుగుతాయో, ఏ పాదసేవకై బ్రహ్మర్షులు నిరంతరం తపస్సు చేస్తుంటారో, ఏ పాదాలు శ్రీసతి తన పుట్టువు సార్థకత కోసం సంతతం సంవహనం చేస్తుంటుందో, ఏ పాదాలు సర్వతీర్థాలకు సమమౌ, ఆ పాదాలను ఆశ్రయించినవాడై, సాంజలి అయి ఇలా అన్నాడు.

"జగత్తుకు కర్తవూ, భర్తవూ, సంహర్తవూ నీవు ప్రభూ! యాగం నీవు, యాగభోక్తవూ నీవు. నాకో యాగం జరగలేదన్న అహంకారంకొద్దీ ఇంత చేసుకున్నాను. ఇంత చేసుకోకపోతే, నీ పాదధూళి

నాకు లభించదు. మాయలేనివాడవు నీవు; మాయలో మునిగిన వాడను నేను. తగిన శాస్తి చేశావు. నీ ఉనికి గుర్తింపు కలిగించావు. క్షమించు తండ్రీ!'' అని ఇంద్రుడు ప్రార్థించాడు.

''సిరిగల వాడినని గర్వించకు! గర్వం నాశహేతువు'', అని శ్రీకృష్ణుడు ఉపదేశించాడు.

ఇంద్రుడు నమస్కరించి, తనలోకం చేరబోయాడు. యాదవులు సంతోషంతో బృందావనం చేరుకున్నారు.



# వరుణ నగరం

ఏకాదశినాడు ఉపవాసం చేసి, శ్రీహరిని పూజించి, ద్వాదశినాడు పారణ చేయడం ఏకాదశీ వ్రతసాంప్రదాయం. నందుడు ఏకాదశినాడంతా ఉపవసించి, మరునాటి వరువాత స్నానం చేసేందుకు కాళిందికి వచ్చాడు.

అయితే అతడు చేరిన ముహూర్తం రాక్షసలగ్నం. బ్రహ్మ ముహూర్తం అనుకుని, అతడు పెందలకడ నది చేరాడు. నదిలో స్నానం చేస్తూండగా ఒక రాక్షసుడు, అతడిని పట్టి వరుణలోకానికి చేర్చాడు.

నందుడు కనిపించకపోవడంతో, గోపకులు ఖిన్నులైనారు. యశోద వాపోతూ కూర్చుంది.

శ్రీకృష్ణుడు సంగతి తెలుసుకుని హుటాహుటి వరుణలోకం వెళ్లాడు.

అలా రాక రాక వచ్చిన ముఖ్య అతిథిని, అబ్బురంతో వరుణుడు ఆహ్వానించి, నమస్కరించి, ఉచితాసనమ్మీద కూర్చుండ చేశారు.

''నీవు ఇలా రావడంవల్ల నేను ధన్యుణ్ణి అయ్యాను. దురుద్దేశంలేకపోయినా, కుటిలస్వభావం కారణంగా రాక్షసలగ్నం అన్న మిషతో మీ తండ్రిని ఇక్కడకు నా భటుడొకడు తీసుకువచ్చాడు. మన్నించు స్వామీ! మీ తండ్రిని తీసుకువెళ్లు!'' అంటూ సగౌరవంగా, అనేక కానుకలు ఇచ్చి వరుణుడు సాగనంపాడు.

నందుడు, తనకు కలిగిన వరుణ లోకానుభవాలు యాదవులకు వివరించగా, వారు ఆశ్చర్యసమ్మోదాలతో విన్నారు. నందునకు అంతటి అనుభవం కలిగించినవాడు సాక్షాత్తు ఈశ్వరుడన్న నమ్మకం వారికి దృఢం అయింది.

అంచేత అందరూ ముక్తకంఠంతో, తమకు భగవద్దర్శనం కలిగించవలసిందని శ్రీకృష్ణుడిని వేడుకున్నారు.

వారు ఎంత అమాయకులు కాకపోతే, తమ కండ్లముందు సారూపంతో ఉన్న శ్రీకృష్ణుని కాదని, వేరొక భగవంతుడిని చూపమని కోరుకోడమేమిటి?

భక్తవత్సలుడయిన ఆయన వారికా అనుభవం కలిగించాడు.



# గోపికలు

పూర్వ జన్మ సుకృతంవల్లనయితేనేమి, భగవత్సాన్నిహిత్యం కలగడంవల్లనయితేనేమి శ్రీకృష్ణునిమీద, గోపికలకు దివ్యమూ, నిరవధికమూ \అయిన భక్తిభావం కలిగింది. వారు ఏ పనిలో నిమగ్నులై ఉన్నా, ఎక్కడ ఉన్నా, నిరంతర కృష్ణధ్యానంలో జీవించేవారు. ఆ ధ్యానంతో వారు వారినీ, వారి వారినీ, మరచిపోయేవారు. సర్వం వారికి తృణప్రాయం. శ్రీకృష్ణుడువినా, అన్నీ విస్మరణీయాలే అయినాయి.

ఒకనాటి శరద్రాత్రివేళ, వారి చెవులకు శ్రావ్యమైన వేణుగానం వినిపించింది. ఆ వేణుగానంలో వారు కరగిపోయారు. సురిగిపోయారు. గుంపులు గుంపులై వారు యమునాపులి నానికి బయలుదేరారు.

పిచ్చి పట్టినట్టు వారు పరువులు పెట్టారు.

మురళీకృష్ణుడు వ్యత్యస్త పాదారవిందుడై భువనమోహనమైన రాగాలు మురళిమీద పాడుతున్నాడు. గోపికలు, ఉన్మత్తలై, విరహోత్కంఠలై, నిమీలితనేత్రలై, ఆ మురళీరవంలో తమ అనురాగాలు మేళవించారు.

"మీరందరూ ఇంతరాత్రప్పుడు ఇలా ఎందుకు వచ్చారు!" అని కృష్ణుడు వారిని అడిగాడు.

"నీవేగా పిలిచావు!"

"నేనా పిలిచాను?"

"ఆ వేణుగానంలో పిలుపులూ, పలుకరింపులూ లేవా? మా ప్రాణం, మా మానం, మా సర్వస్వం దోచుకు వచ్చి, ఇలా చిద్విలాసంగా నవ్వుతూ కూర్చుని ఎందుకు వచ్చారని అడుగుతావేం కృష్ణా?"

"కులకాంతలు ఇలా జారిణీ స్వభావలై రావచ్చా? మీ రాక మీ వారికి తలవంపులు కలిగించదా?"

"తెలీదు! మాకు తెలిసిందల్లా నీ వేణుగానం, నీ సహచర్యం, నీ సాన్నిధ్యం! ఇవేవీ లేకపోయినపుడు మేం లేము; మా జీవితాలు లేవు కృష్ణా! నీ విరహాగ్నిలో వేగిపోతూ, నిస్సహాయలమై బతుకుతూన్నాం! నీ సన్నిధానం లేకపోయినపుడు, ఈ యమున మాకు శరణ్యం అవుతుంది."

శ్రీకృష్ణుడు మనో హ్లాదంగా నవ్వాడు.

"నా సహచర్యం దోషంకాదు! నా సాంగత్యంలో పాపంలేదు. మీకే పాపాలూ, దోషాలూ ఉండవు!"

శ్రీకృష్ణుడు, ఆ గోపికలకు తలకొకడై, ఆనాటి నీరవ శరద్రాత్రిని నవరస శరద్రాత్రిగా మనోహరంగా చేసి వారందరనూ తృప్తాత్మలుగా చేశాడు.

ఆయన హఠాత్తుగా వారికి తన సహచర్యం ఉపసంహరించాడు. గోపికలు కృష్ణ సందర్శనానికి తహతహలాడుతూ, విరహులై, విరహోత్కంఠలై జాడలుకానక కొమ్మ కొమ్మనూ అడిగారు. గాలిని అడిగారు. పూల పరిమళాలను అడిగారు. ప్రకృతిని అడిగారు. అయితే ఆయన జాడలు చిక్కలేదు.

చివరకు వారు శ్రీకృష్ణదర్శనాన్ని గాలిలో, పూలవాసనలో, ప్రకృతిలో చూడగలిగారు. శ్రీకృష్ణ నిరీక్షణలో వారు హతాశలైనా, సర్వంలో శ్రీకృష్ణాకృతిని దర్శించుకోగలిగారు.

సర్వభక్షకుడయిన అగ్ని నిర్దోషుడయినట్లు, భగవంతుడు గోపికలతో రాసక్రీడలు సలిపినా ఆయనా నిర్దోషుడు: గోపికలూ నిర్దోషులు! సకలప్రాణుల్లో – గోపికల్లో గోపాలురలో – సకల ప్రకృతిలో సంచరించే పరమాత్మకు పరులెవ్వరు? సర్వం తానే! తానే సర్వం!



# సుదర్శనుడు

ఒకసారి నందాది గోపాలురు, శ్రీకృష్ణుడు తోడురాగా, సరస్వతీ తీర్థంలో స్నానమాడి, ఉమామహేశ్వరార్చనలు సలిపి అనేక దానాలు చేసి ఆ రాత్రి హాయిగా నిదురపోతున్నారు.

అప్పుడు ఒక పెనుబాము నందుని కరచి పట్టింది. అంతేకాక అది, అతడిని మింగబోయింది.

అతడు భయంతో "కృష్ణా! కృష్ణా!" అంటూ అరచాడు. గోపాలురు కొందరు కర్రా కత్తీ తెచ్చి ఆ పామును ఎదుర్కొన్నారు. అయితే ఆ పాము చావుదెబ్బలు తింటూకూడా, తన పట్టువిడువలేదు. ఇంతలో శ్రీకృష్ణుడు వచ్చి తన ఎడమపాదంతో, ఆ పామును కొట్టాడు.

పాము అదృశ్యం అయింది. శాపవశాత్తు లభించిన పాపరూపం విడచి గంధర్వరూపం పొంది, అతడు చేతులు జోడించాడు.

"ఇదేమిటి నీవోదేవతవలె ఉన్నావు? మరి నీకేల ఈ దుర్భర సర్పరూపం?" అని గోపాలురు అడిగారు.

"నా పేరు విద్యాధరుడు. గంధర్వుడను. రూపసంపద కారణంగా కన్నుకానక గర్వించిన నేను ఒకనాడు, అంగీరసాది కురూపులయిన మునులను అవమానించాను. దానికి వారు కోపించారు. వారి కోపఫలితం ఈ సర్పరూపం! శాపాన్ని మరలించమని వారి పాదాలు పట్టుకున్నా. జనార్దనుడు మానవుడై పుట్టినపుడు, ఆయన పాదతాడనతో నీకు బుద్ధి వస్తుంది! అప్పుడే నీ శాపం తీరిపోతుంది" అని వారు వెళ్లిపోయారు.

"నాటినుండీ నేను ఈ పాపరూపంతో శ్రీదర్శనం కోసం, కాలితాపుల కోసం ఎదురుచూస్తున్నా!" అని చెప్పి విద్యాధరుడు శ్రీహరికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి యథేచ్ఛగా వెళ్లిపోయాడు.

తమ చిన్ని కృష్ణుని వింతలను తలచుకుంటూ గోపాలురు మురిసిపోయారు.



# గుహ్యకుడు

ఒకనాటి వెన్నెలరాత్రిలో బలభద్ర సమేతుడై శ్రీకృష్ణుడు యమునాతీరంలో గోపికలతో విహారం చేస్తున్నాడు. గోపికలు దేవాంగనలవలె ఆడుతున్నారు; పాడుతున్నారు. ప్రకృతి మోహపరవశం పొందేలా శ్రీకృష్ణుడు మురళి వాయిస్తున్నాడు.

ఆ రసమయ జగత్తులోకి కుబేర భటుడొకడు శంఖచూడుడు అనేవాడు, ఆకాశం లోంచి ఊడిపడ్డట్టు వచ్చాడు. శ్రీకృష్ణ రక్షితలు అయిన గోపికలను, తన యోగబలంతో గుహ్యకుడు ఉత్తరదిశగా తీసుకుపోసాగాడు.

నిస్సహాయలయిన గోపికలు "కృష్ణా! రక్షించు!" అని కాతరలై విలపింపసాగారు.

బలరాముడు ఒక సాల వృక్షాన్ని కూకటి వ్రేళ్లతోసహా పెకలించి, వాడు వెళ్లినవేపుకు పరువెత్తాడు. శ్రీకృష్ణుడు బలరామునకు తోడైనాడు.

మృత్యుదేవతలవలె, తన్ను వెంటాడుతున్న ఆ సోదరులను చూసి శంఖచూడుడు, గోపికలను విడచి, ప్రాణభీతితో పరువులు పెట్టాడు. గోపికల రక్షణకు బలరాముని నియోగించి, శ్రీకృష్ణుడు గుహ్యకుని తరమసాగాడు. వాడు ఎంతదూరం పరుగెత్తినా విడువక వాడిని చిక్కబుచ్చుకుని, వాడిని మట్టుపెట్టి వాడి శిరోరత్నంతో శ్రీకృష్ణుడు తిరిగి వచ్చాడు.

శంఖచూడుని శిరోరత్నం బలరామునకు శ్రీకృష్ణుడు కానుక చేశాడు.



# వృషభాసురుడు

ఒకరోజు పొద్దుటే, హఠాత్తుగా చెవులు చిల్లులుపడేలా రంకెలువేస్తూ, కాళ్లతో మట్టి రేపుతూ, తోక ఎత్తుకుని, ముక్కుపుటాల్లోంచి అంగారకణాలు రేపుతూ, నడగొండవలె వచ్చిన వృషభాసురుడు మందలోపడి చీకాకుపరచ సాగాడు.

వాడి ధాటికి ఆగలేక ఆవులూ, లేగలూ కకావికలైనాయి. లేగలు తల్లులకాళ్లపడి నలిగిపోతూ ఆక్రందనలు చేస్తూ, విరిగిన కాళ్లతోనే పరువెత్తేందుకు శ్రమపడుతున్నాయి. వృషభాలు దిక్కుతోచక దొరకిన దిక్కు పుచ్చుకున్నాయి.

వృషభుడు ఎదురులేక, విజయగర్వంతో రంకెలువేస్తూ కసాబిసా నేలను తవ్వుతూ, పరుగులెత్తుతున్న ఆవులను వెంబడించి వాడి కొమ్ములతో, నెత్తుర్లు కారేలా, కండలు ఎగిరిపడేలా పొడుస్తూ వీరవిహారం చేయసాగాడు.

తమ పసరాల దీనావస్థకు కలతచెందిన చిత్తాలతో గోపబాలకులు దీనంగా రక్షింపుమని కృష్ణుని వేడుకున్నారు.

శ్రీకృష్ణుడు భయంలేదని వారికి తన వరద హస్తం చూపించాడు. గావంచా నడుంచుట్టూ

బిగించికట్టి శ్రీకృష్ణుడు వాడికి ఎదురై నిలచాడు.

బాణవేగంతో, తనవైపుకు దూసుకువస్తున్న వృషభుడి కొమ్ములను వాటంగా లంకించుకున్నాడు శ్రీకృష్ణుడు.

శ్రీకృష్ణుడిని ఎత్తి విసరి వేయాలని వాడు తీవ్రంగా ప్రయత్నం చేశాడు. మహా పర్వతంవలె నిలిచిన శ్రీకృష్ణుడు అవలీలగా, వాడిని వెనక్కు నెట్టివేశాడు. వాడు అల్లంతదూరాన పడిలేచి బలం కూడకట్టుకుని కొమ్ములతో కుమ్మే ప్రయత్నాలు చేశాడు.

శ్రీకృష్ణుడు వాడి కత్తుల్లాంటి కొమ్ముల్లో ఒకటి ఊడపెరికి, దాంతో ఎడా పెడా కొట్టాడు.

వృషభుడు దిమ్మతిరిగి నేలకూలాడు. మత్తగజమ్మీదకు దూకే సింహ కిశోరంవలె శ్రీకృష్ణుడు, వాడిమీదకు లంఘించి చీల్చి చెండాడి హతం చేశాడు.

గోపబాలకులు చప్పట్లు చరచి సంతోషంతో గంతులు వేసి చెల్లా చెదరయిన తమ పశువులను సమీకరించసాగారు.



# కంసమహారాజు

కంసుడు దైవోపహతుడు కావడంవల్ల, తన ప్రయత్నాలు అన్నీ వమ్ముకావడంతో మండిపడ్డాడు. తన ఆలోచనలు తీవ్రం చేశాడు.

దేవకీదేవి అష్టమగర్భం ఏమయింది? ఎందరు వేగులను పంపినా తగిన సమాచారం తెలియలేదు. మందలో ఉన్నట్లు చూచాయగా తెలుసు! తన బలం, తనబలగం అక్కడనీరు కారిపోతూంది.

అలా ఉండగా ఒకనాడు మహతీవీణ వాయిస్తూ నారదుడు కంసమందిరానికి వచ్చాడు.

కంసుడు మర్యాదలూ అవీ చేసి, నారదునకు ఆసనం ఇచ్చాడు.

"నీ ముఖం ఇలావాడి ఉన్నదేం కంసమహారాజా? అపజయం అంటూ ఎరగని వాడివి. ఏ శత్రువు అయినా హఠాత్తుగా, బలవంతుడై ప్రతిఘటిస్తున్నాడా ఏం?" అంటూ నవ్వుతూ నారదుడు అడిగాడు.

"అసలు నా శత్రువు ఎక్కడ ఉన్నాడో తెలిస్తే కదా, ప్రతిఘటించేందుకు?"

"ఓహో. ఆ శత్రువు గురించా నీ ఆలోచన? తెలిసింది దేవకి. అష్టమసంతానం, రోహిణి కన్న బిడ్డతోసహా బృందావనంలో పెరుగుతున్నారు. అనంత బలపరాక్రమాలతో దిన దిన ప్రవర్ధమానులై వారు తేజరిల్లుతున్నారు!"

"అహః దేవకీవసుదేవులు ఎంత నయవంచకులు. ముచ్చుల్లాగా ఎంత పని చేశారు? కానియ్! ఎక్కడకు పోతారు? నా బందీలే కదా! ఇప్పుడే పోయి కత్తితో కండగా తరిగి కాకఘూకాలకు ఆహారం చేస్తాను." అంటూ కంసుడు పళ్ళు పటపటలాడించాడు.

నారదుడు తాపీగా నవ్వి, "ఇంత తొందరపాటువల్లనే అన్ని పనులూ ఇలా తలక్రిందులుగా చేసుకుంటున్నావు. దేవకీవసుదేవులను చంపావనుకో! దానివల్ల ఏమవుతుంది? మందనుండీ ఆ

సోదర ద్వయాన్ని ఇక్కడకు తేగలిగావా? వాళ్లను నీ సభకు రప్పించి, నీ చిత్తానుసారంగా దండింపక, నీ బందీలయి పడివున్న వాళ్లను చంపుతానంటావేం మహారాజా? ముందు వాళ్ల పని చూడు!'' అని అగ్గిమీద గుగ్గిలం చల్లి చల్లగా జారుకున్నాడు.

కేశిరాక్షసుడిని కంసుడు అప్పటికప్పుడే రావించాడు.

కేశి చేతులు జోడించి, ''చిత్తం! నేను చేయగల పని ఏమిటి మహారాజా? చాల రోజులుగా పనిలేక చేతుల తీట తీరడంలేదు!'' అన్నాడు.

''బృందావనం వెళ్లు! నందునిఇంట ఇద్దరు అర్భకులున్నారట. వారు మహాబలవంతు లట. విజయోత్సాహులట. నీ బలం, ప్రతాపం వారికి రుచి చూపించు. ఈ కంసుడి పేరు నిలుపు!''

కేశి అటువెళ్లిన తరువాత కంసుడు తన మంత్రులను పిలిపించి, మంత్రాలోచన ప్రారంభించాడు.

''మధురలో క్రీడోత్సవాలు ఏర్పాటు చేయండి. మల్లయుద్ధం పోటీలు సిద్ధం చేయండి. మన మల్లురకు ఉత్సాహం కలిగించండి. మందలో గొప్ప వీరులున్నారట. ఈ నెపంతో వాళ్లను రప్పించి మట్టుపెడదాం. ఇదే మన ప్రయత్నం. దీనికి ఏం కావాలో వాటినన్నిటినీ సిద్ధంగా ఉంచండి.'' అని వారికి కంసుడు ఆజ్ఞలు ఇచ్చాడు.

యాదవ ప్రముఖుడు అక్రూరుడినీ పిలిపించాడు అతడు.

''విన్నావుగా! మందలో యాదవ బాలురు నా విరోధంతో విర్రవీగుతున్నారట. నీ చాతుర్యంతోనో మంచితనంతోనో, మరి దేంతోనో, నీవు వారిని ఇక్కడకు తీసుకురా! నా బలపరాక్రమాలకు భయపడిన దేవతలు యాదవులై, విష్ణువు కృష్ణుడై పుట్టారని నారదుడు అప్పుడోసారి చెప్పాడు. నిజమేదో నీకు తెలుసు. అయితే నాకు చెప్పవు. నీరాజభక్తి అంత గొప్పది. అది సర్లే! నీవు యాదవులకు తలలో నాలుకవు కదా! అన్నీ తెలిసినవాడవు. వారిని వెంటబెట్టుకరా! వారి పని తీరినాక, దేవకీ వసుదేవుల సంగతి తేల్చుదాం! రాజుధనుర్యాగం చేస్తున్నాడన్న మిష, నీ పని సానుకూలం చేస్తుంది.'' అంటూ కంసుడు విషపు నవ్వులు నవ్వసాగాడు.

అక్రూరుడు తల వంచుకుని, మనస్సులోని ఉమ్మలికను తెలియనీయకుండా, ''నీవు రాజువు. నీవాజ్ఞాపిస్తే నేను పోకపోవడం కానిపనికదా! నీ శత్రువును యాగమిషతో తీసుకరాగల! భగవదేచ్ఛ ఎలా ఉంటే, అలా జరుగుతుంది' అని శలవు తీసుకున్నాడు.

బలకరమైన అశ్వాలు పూన్చిన రథాన్ని సిద్ధం చేసుకుని అక్రూరుడు బృందావనానికి బయలుదేరాడు.

★ ★ ★



## కేశి

కౌలిడెక్కల శబ్దాలు లోహపు మద్దెళ్ల వలె వినిపించగా, ముక్కునా, నోటా అగ్ని జ్వాలలు రేగుతూండగా, యమపాశం వంటి తోక గాలికి అటూ ఇటూ ఊగుతూండగా, సర్వదహనుడయిన అగ్నివలె మండిపడుతూ, భయంకరంగా అరుస్తూ అశ్వరాక్షసుడు కేశి మంద మీద విరుచుకపడి భీభత్సం చేయసాగాడు.

వాడి రాకతో మంద ఛిన్నాభిన్నం అయింది. గోపబాలకులు బిక్కచచ్చిపోయి తలకొకమూల చేరారు. కొందరు కృష్ణుడు దెసకు పారిపోయి వచ్చారు.

''కృష్ణా! చూడల్లా గాడిద పోయి, ఇప్పుడు గుఱ్ఱం వచ్చింది. ఎంత భీకరంగా ఉందో చూడు.'' అంటూ గోపాలురు హెచ్చరించారు.

కృష్ణుడు పోరుకు సిద్ధమై ఉన్నాడు. కేశి వేగంగా వచ్చి ముంగాళ్లను ఎత్తి కృష్ణుడిగుండెల మీద తన్నబోయాడు. కృష్ణుడు వాటంగా, ఆ ఎత్తిన ముంగాళ్లను కలిపి పట్టుకుని వెనక్కునెట్టాడు. అల్లంతదూరాన పడ్డవాడు, ఓ క్షణంలో తెప్పరిల్లి, మహాబిలంవంటి నోరు తెరచుకుని కృష్ణుని దెసకు పరువెత్తుకువచ్చాడు.

శ్రీకృష్ణుడు వాడి తెరచిన నోట, తన చేయి పెట్టాడు. వాడు, శ్రీకృష్ణుని చేయిని నమలివేసే ప్రయత్నం చేశాడు. అయితే కృష్ణుడు తన చేయిని అనంతంగా పెంచిన కారణంగా, వాడికి ఊపిరి ఆడలేదు.

కేశి కేకలువేస్తూ, గుడ్లు తేలవేసి, కండ్లల్లోంచి నెత్తురులు కార్చుతూ విలవిలా తన్నుకుని చనిపోయాడు.

అంతవరకూ ఊపిరి బిగపట్టిన వ్రజ కుమారులు తేలిగ్గా ఊపిరి పీల్చుకుని, గోవిందుని చుట్టూ చేరవచ్చారు.



# అక్రూరుడు

రామకృష్ణులను ధనుర్యాగానికి ఆహ్వానించేందుకు అక్రూరుడు బృందావనం బయలుదేరాడు కదా! అక్రూరుడు సాధువూ, సజ్జనుడూ, నిరంతర హరిసేవారతుడూనూ.

గుఱ్ఱాలు బాణ వేగంగా దూసుకుపోతున్నాయి. అంతకన్నా వేగంగా అతడి ఆలోచనలు కొసలు వేస్తున్నాయి.

కంసుడు వారికి శత్రువు. తను, వారి శత్రువు ఆహ్వానం తీసుకువస్తున్నాడు! శత్రువు దగ్గరనుండీ వచ్చినవాడు ఎవరు? శత్రువేగా? మిత్రుడు ఎలా అవుతాడు?

అయితే, తన మనస్సులో వారిమీద శత్రుభావం లేదు. తన ప్రవర్తనలో కూడా శత్రుత్వం లేదు. అని చెబితే ఎవరు నమ్ముతారు?

ఏమో. బృందావన ప్రముఖులు ముఖ్యంగా బలరామకృష్ణులు ఎలా అనుకుంటారో? అహితుడని నిరాదరిస్తారా? హితుడని మన్నిస్తారా? తన భాగ్యం ఎలా ఉందో? ఈశ్వరేచ్ఛ ఎలా ఉంటే, అలా జరుగుతుంది. తను శ్రీ చరణ కమలసేవారతుడని వారికి తెలిస్తే చాలు!

సర్వాంతర్యామి, సర్వ చక్షువూ, సర్వజ్ఞుడూ అయినవాడికి ఈ చిన్ని విషయం తెలియదా? తన మనస్సును తెలుసుకోలేనంత అజ్ఞానులా రామకృష్ణులు?

ఏదో అవుతుందని నేనెందుకు భయపడవలె! అక్రూరుని ఆలోచనలు అలా సాగుతున్నాయి.

కంసుడు తనకు గొప్ప మేలు చేశాడు. భగవద్దర్శనం ఈ విధంగానయినా, తనకు కలుగచేశాడు.

ఇంతలో అతడు బృందావనం సమీపించాడు. మందలో ప్రవేశింపగానే అతడికి బలరామకృష్ణులు కనిపించారు.

ఆనంద భాష్పాలు చెక్కిళ్లమీదకు జాలువారుతూండగా, వినమిత శిరస్సుతో అక్రూరుడు శ్రీకృష్ణుని సమీపించాడు.

శ్రీకృష్ణ పాదాల చెంత శిరస్సు మోపి ''దేవా!'' అని ఏదో చెప్పబోయి ఉగ్గత్తికతో అక్రూరుడు మౌని అయ్యాడు.

శ్రీకృష్ణుడు మందహాసం చేసి అతడిని లేవనెత్తి వనమాలలు నలిగిపోయేంత గాఢంగా కౌగలించుకుని, ''నీకు క్షేమమా?'' అని అడిగాడు.

అతడు ఆర్ద్రం అయిన నేత్రాలు తుడుచుకుంటూ ''నీదయవల్ల అంతా క్షేమం తండ్రీ!'' అన్నాడు.

వారు అక్రూరుని ఇంటికి తీసుకుపోయి, అర్ఘ్యపాద్యాలతో సంభావించి, ఓ ఉచితాసనమ్మీద కూర్చుండ చేశారు.

''నీరాకలో విశేషం ఏమిటి అక్రూరా?'' అని నందుడు అడిగాడు.

''రాజు ధనుర్యాగమొకటి చేయ సంకల్పించాడు. ఆ యాగానికి మీ కందరకూ ఆహ్వానం స్వయంగా చెప్పి రమ్మని ఆజ్ఞాపించాడు'' అంటూ అతడు చేతులు జోడించాడు.

శ్రీకృష్ణుడు మందహాసం చేసి, బలరామునివేపు సాభిప్రాయంగా చూశాడు. బలరాముడు తల పంకించాడు.

''దుష్టుడయిన కంసుడు, ఇంతమంచివాడయినాడా అక్రూరా? ఇదెప్పటినుండీ?'' అని బలరాముడు అడిగాడు.

శ్రీకృష్ణుడు నవ్వి, ''ఏమయినా రాజాజ్ఞ! మీరందరూ యథాశక్తి కానుకలు సిద్ధం చేయండి! మనమంతా రాజు ధనుర్యాగం చూడబోతాం!'' అన్నాడు.

మరునాటి వేకువన అక్రూరుడు, బలరామకృష్ణులతో రథమ్మీద బయలుదేరాడు. ఆ రథం వెంబడి నందాది యాదవ ప్రముఖులు తమ తమ వాహనాలమీద కానుకలు తీసుకుని బయలుదేరారు. అలా వెళుతున్న కృష్ణుని చూసి, హతాశలైన గోపికలు దీర్ఘంగా నిట్టూర్పుతూ, భారమైన హృదయాల చిక్కబరచుకుంటూ, రథంవెంట నడవసాగారు.

''ఇతడు పేరుకు అక్రూరుడు, నేతిబీరకాయవలె! చేతలన్నీ క్రూరమైనవే! తనకు కృష్ణుడు చిక్కాడని, ఎంత బింకంగా, ఎంత వేగంగా రథం నడుపుతున్నాడో చూడండి! తనను వెంటపెట్టుకపోతున్నది. మన ఊపిరి, మన గాలి, మన సుఖం, మన దుఃఖం, మన సర్వస్వం అని ఈకిరాతకుడికి తెలియడంలేదు!''

రథమార్గాన్ని అనుసరించి వస్తున్న దీనలయినగోపికలను శ్రీకృష్ణుడు, తన చల్లటి చూపులతో ఆశ్వాసం కలిగించాడు.

అలా రథం సాగి కాళిందిని చేరింది. రామకృష్ణులు దాహం తీర్చుకుని, తిరిగి

రథాసీనులైనారు.

అక్రూరుడు, జలాల్లో స్నానం చేసి, సంధ్యోపాసన చేయసాగాడు. రథంలో ఉన్న రామకృష్ణులు, కాళిందీ నదిలో అక్రూరునకు కనిపించారు.

''వారు ఇక్కడకు ఎప్పుడు వచ్చారు?'' అని అతడు ఆశ్చర్యంతో రథంవేపూ, నీళ్లవేపూ మార్చి మార్చి చూడసాగాడు.

వారు రథంలోనే కూర్చుని కనిపించారు.

అంతా తన భ్రమ! తిరిగి, అతడు దోసిట నీళ్లు తీసుకునేందుకు నదీజలాల్లోకి చూడగా, అక్కడ రామకృష్ణులు కనిపించారు.

''ఏమిటీ అబ్బురం!'' ఎన్నిసార్లు అటూ, ఇటూ చూసినా, అక్కడా, ఇక్కడా వారి దర్శనం కలుగుతుంది.

పాలసముద్రంలోని, శేషశయానుడూ, వనమాలాలంకృతుడూ, శ్రీ వత్సలాంఛనుడూ, ఆయుధహస్తుడూ, కిరీటభూషణుడు, నీల నీరదశ్యాముడూ, శ్రీ సతీసమేతుడూ అయిన మహావిష్ణువు జలాల్లో దర్శనం ఇచ్చాడు.

అతడు చేతులు జోడించాడు.

ఆ మహాపురుషుడు, మందహాసంతో ఆశీర్వదిస్తున్న అనుభూతి అతడికి కలిగింది. ఆనందంతో, తాను చూసిన దివ్య దర్శనం నెమరువేసుకుంటూ అక్రూరుడు రథం సమీపించాడు.

అతడు రావడం చూసిన శ్రీకృష్ణుడు నవ్వి, 'భూమిలో కనిపించని వింతలేమయినా నదిలో కనిపించాయా అక్రూరా? ఇంత ఆలస్యం అయిందేం?'' అని అడిగాడు.

''ఔను స్వామీ! అది మామూలు వింతకాదు. ఎంతో సుకృతులకు కనిపించే వింత! ఆ వింత నీలోనే ఉందనిపిస్తోంది ప్రభూ!'' అని అతడు నమస్కరించాడు.

ఆ తరువాత రథం మధుర పొలిమేరకు వచ్చింది. అక్కడ నందాది యాదవులు, తమ బండ్లను నిలిపి ఉన్నారు.

రామకృష్ణులు రథం దిగారు.

''నగరానికి నీవు వెళ్ళు అక్రూరా! మీ రాజుతో మేం వచ్చామని చెప్పు!'' అన్నాడు శ్రీ కృష్ణుడు.

అక్రూరుడు నమస్కరించి, నందాదులదగ్గర శలవు తీసుకువెళ్లాడు.



# మధుర

రామకృష్ణులు మధుర రాజవీధుల్లో వింతలూ, విశేషాలూ చూస్తూ నడుస్తున్నారు. ఆ ఇద్దరు గొల్ల పిల్లలను నాగరీకులు, వింతగా చూడసాగారు. దివ్యతేజస్సుతో వెలిగిపోతూ, ఆకాశంనుండి భూమికి దిగిన సూర్యచంద్రుల్లా వారు సంచరింపసాగారు.

రాజుగారి చాకలి, వీపుమీది బట్టల మూటతో వారికి ఎదురైనాడు.

''ఓరీ! మేం ఇప్పుడు మందనుండీ వస్తున్నాం. కావడానికి మేం రాజుగారి మేనళ్లుళ్లం.

కట్టుకునేందుకు మంచి బట్టలు మాకులేవు. నీ మూటలో విలువగల వలువలున్నాయి. అవి మాకు ఇవ్వు! నీకు శుభం కలుగుతుంది.'' అని వారు అడిగారు.

''నాకు శుభం కలుగుతుందో లేదో కానీ వీపులు తాటలు రేగుతాయ్ అడిగిన మీకు, ఇచ్చిన నాకూ! ఇవి మీవంటి పల్లెటూరి గొల్లబ్బాయిలు కట్టుకునే మామూలు బట్టలు కావు. రాజుగారి మేలి వస్త్రాలు!'' అని చాకలి త్రోవంట నడవసాగాడు.

కోపంతో శ్రీకృష్ణుడు వాడి తలమీద ఓ పిడిగుద్దు గుద్ది మూట లాక్కున్నాడు. వాడాదెబ్బకు ప్రాణాలు విడిచాడు. వాడలా చావడంతో వాడి బంధువులు, మూటలు అక్కడే పడేసి పారిపోయారు. ఈ వైనం చూస్తున్న నాగరీకులు భయంతో గబగబా నడకలు సాగించారు.

రామకృష్ణులు, ఆ మూటలనుండీ, ఉచిత వస్త్రాలు తీసి ధరించారు. మిగిలినవి గోపబాలురు సంగ్రహించారు.

అలా వారు కొంతదూరం వెళ్లేసరికి వారికి రంగు రంగుల అలంకారాలు అమ్ముకునే రంగ కారుడు కనిపించాడు.

దివ్యతేజస్సుతో వెలిగిపోయే, ఆ బాలకులను పిలిచి మరీ అలంకారాలు సమర్పించాడు అతడు.

అలంకారీకుని భక్తికి మెచ్చి శ్రీకృష్ణుడు, వాడికి అనంతైశ్వర్యం అనుగ్రహించాడు.

ఆ తరువాత వారికి సుదాముడనే మాలాకారుడు ఎదురైనాడు. సుదాముడు వారిని పూజించి, భక్తితో కోరిన మాలలు సమర్పించాడు.

''నీ కేంకావాలో చెప్పు! నీవు చేసిన కైంకర్యం మాకెంతో తృప్తి కలిగించింది!''

''తండ్రీ! నాకేం కావాలో మీకు తెలీదా? సదా ఈ భక్తి భావం నాలో నిలచేలా, నీకూ, నీవారలకు విధేయుడనై మనేలా అనుగ్రహించు! అదే పదివేలు ఈ జన్మకు!'' అంటూ సుదాముడు సాగిలపడి నమస్కరించాడు.

''అల్లాగే! అక్షయంగా నీకు సిరిసంపదలుంటాయి.'' అని ఆశీర్వదించి, వారు ముందుకు సాగారు.

సుగంధ మిళితం అయిన చందనలేపనాలతో రాజగృహం వెళుతున్న కుబ్జ ఒకర్తె వారికి ఎదురయింది.

''సుందరీ! ఎవరికై ఈ లేపనాలు తీసుకుపోతున్నావు?''

''నేనా సుందరిని? నా ఆకారం చూడు! నన్ను అందరూ త్రివక్ర అంటారు. నావంకర్లు తిరిగిన శరీరం చూసి అందరూ ఎగతాళి చేస్తూంటారు. లేపనాలూ, సుగంధాలూ సమకూర్చడంలో నన్ను మించిన చేయిలేదు. రాజగృహం వెళుతున్నా! ఈ చందనం వాసన చూడు! ఎంత గొప్పగా ఉందో నీకే తెలుస్తుంది!'' అంటూ ఆమె పూర్వ జన్మసుకృతం కొద్దీ గోవిందుని శరీరమ్మీద అతి విలువగల లేపనం పూసింది.

''ఇది రాజుగారి కోసం ప్రత్యేకంగా తయారుచేయబడింది. మీకు నచ్చిందా? మీరెవరో దేవతల వలె ఉన్నారు. మీకు ఇవ్వడం వల్ల ఈ లేపనాలూ, ఇచ్చిన నాజన్మ ధన్యం అయిందని పిస్తోంది.''

శ్రీకృష్ణుడు నవ్వాడు. బలరాముడు అభినందనతో చూశాడు.

''చాల సంతోషం! నీ సేవకు మెచ్చాను. ఎవ్వరూ ఇవ్వలేని కానుక నీకు ఇవ్వబోతున్నాను'' అంటూ ఆయన కుబ్జ పాదాలమీద తన పాదాలు ఊని, రెండు చేతులతో గవుదలను నొక్కి, పైకి లేవనెత్తాడు. అలా చేయడంతో, దానిముచ్చంకలూ తీరిపోయాయి.

''ఇప్పుడు నీవు అపూర్వ సౌందర్యవతివి. ఇంతకు ముందు నిన్ను ఈసడించుకున్నవాళ్లు, ఇప్పుడు నిన్ను చూసి ఈసున తలలు దించుకుంటారు.''

కుబ్జ సిగ్గుతో తలదించుకుంది. శ్రీకృష్ణుడి కర స్పర్శతో ఆమె శరీరం పులకించిపోయింది. ఉత్కట కామంతో, నిమీలిత నేత్ర అయి, తన మోహాన్ని, హావభావాలతో తెలియపరుస్తూ అంజలి ఘటించింది కుబ్జ.

''నగరంలో నాకు కొంచెం పని ఉంది. ఆ పని తీరిన తరువాత నీ కోరికను మన్నిస్తా!'' అని శ్రీకృష్ణుడు బలరామునితో ముందుకు వెళ్లాడు.

విపణి వీథిలో పురజనులు ఎందరో మర్యాద పురస్సరంగా కర్పూర తాంబూలాలు భక్తియుతంగా వారికి సమర్పించుకుని ధన్యులైనారు.

ఆ సోదర ద్వయం, అలా సాగి, కంసుడి యాగశాలను చేరారు. ఆ యాగశాల ప్రవేశద్వారంలోనే, వారికి ఒక గొప్ప ధనుస్సు కనిపించింది.

శ్రీకృష్ణుడు అలవోకగా విల్లు అందుకున్నాడు. ఆనాడు శ్రీరాముడు శివధనుస్సు విరచినట్లుగా, నేడు ఈ ధనుస్సును రెండు ముక్కలు చేశాడు ఆయన. ఆ భయంకర శబ్దానికి కంసుని గుండెలు ఝల్లుమన్నాయి. కావలి భటులు అక్కడకు పరువెత్తుకు వచ్చారు. భటులకు తోడుగా సైనికులూ పోగయ్యారు.

విల్లు విరచిన బాలురను దండించేందుకు, వారంతా కత్తులు దూశారు. రామకృష్ణులు వింటి ముక్కలను చెరొకటి పుచ్చుకుని సిద్ధం అయ్యారు.

రామకృష్ణులు, ఆ సైనికులను ఎడాపెడా బాది నేలకూల్చారు.

సంధ్యా సమయం కావడం వల్ల, వారు ఆనాటి వీర విహారం చాలించి తమ నెలవులకు వెళ్లారు.

మరునాటి ఉదయం రాజుసభ తీర్చాడు. నందాదులు రాజుగారికి కట్నకానుకలు సమర్పించి, తమ తమ స్థానాల్లో కూర్చున్నారు.

కంసుడికి ఎందరో సామంత రాజులూ, పాళెయగాండ్లూ కప్పాలు తెచ్చి రాశులు పోశారు. కంసుడు గంభీరాలోచనలతో మునిగి తేలుతూ సభను కాబట్టించుకోలేదు. అతడి ముఖంలో ఆనందం లేదు. విషాదం గూళ్లు కట్టుకుని ఉంది.

అలంకృతం అయిన మల్లరంగంలో చాణూర ముష్టికులు, భుజాలు చరచుకుంటూ, మత్త మాతంగాలవలె, నిలచిన చోట నిలువకుండా కలయతిరుగుతున్నారు.

రామకృష్ణులు సభకు రాబోతున్న సమయంలో కువలయాపీడం అనే రాజుగారి పట్టపుటేనుగు, తొండం ఎత్తుకుని, భయంకరంగా ఘీంకారం చేస్తూ అడుగులు వారివైపు సాగించింది.

వారు కొంచెం ప్రక్కకు తప్పుకుని, "ఏమిరా! దుర్మార్గుడా? ఏనుగును మామీద తోలుతున్నావా? నీకూ, నీ ఏనుగుకూ కండ్లు కనిపించడం లేదా?" అని కోపంగా అడిగారు.

మావటి నవ్వుతూ రాజు దెస చూశాడు. కంసుడు కన్నులతో హెచ్చరించాడు. రాజాజ్ఞ కావడంతో మావటి అంబష్టుడు, ఉత్సాహంగా ఏనుగు తలమీద అంకుశంతో పొడిచాడు. వారిమీదకు ఉసికొల్పాడు.

అది అంకుశం పోటుకు ఘీంకారం చేస్తూ, తొండంతో రామకృష్ణులను కలిపి పట్టుకునేందుకు ప్రయత్నించింది.

మావటీవాడు, ఏనుగును, తమమీదకు ఉసికొల్పుతున్నట్లు వారు గ్రహించారు.

రాముడు తొండంవేపుకూ, శ్రీకృష్ణుడు తోక వేపుకూ చేరి కువలయాపీడాన్ని పీడింపసాగారు. రాముడు ఏనుగు దంతాన్ని కూకటివేళ్లతో చెట్టును పెకలించినట్లు పెరికి, అంబష్టుడి మాడు పగలకొట్టాడు. కృష్ణుడు దాని తోకను మెలిపెట్టి అమాంతంగా ఏనుగును పొర్లింత పెట్టించాడు. అంబష్టుడు దానిక్రిందపడి నెత్తురు కక్కి చనిపోయాడు.

రామకృష్ణులు మృత్యు దేవతల వలె, దాని ఇరువైపులా చేరి దంతాలతో మోది, ముష్టి ఘాతాలతో పొడిచి ఏనుగును పీనుగును చేశారు

శరీరాల మీది నెత్తురు పూతలు ప్రాగరుణ శోభ కలిగించగా, కువలయాపీడం దంతాలు చేరొకటి, తమ మూపులమీద ధరించి వారిరువురూ రంగస్థలి ప్రవేశించారు.

అలా వచ్చిన యాదవకుల సింహాలను కంసుడు విభ్రాంతితో, ప్రాణభీతితో చూశాడు. వాడి అనుచరులకు గుండెలు గుభిల్లుమన్నాయి.

కువలయాపీడాన్ని సంహరించినవారు సామాన్యులు కారని చూపరులు అనుకున్నారు.

చాణూరుడూ, ముష్టికుడూ పోట్లాటకు సిద్ధంగా ఉన్నారు.

చాణూరుడు భుజా స్ఫాలనం చేస్తూ కృష్ణుడితో ఇలా అన్నారు.

"రాజుగారి ఉప్పు తింటూ ఇలా బలిసి ఉన్నాను. చేతుల తీట తీరేలా కలియపడేందుకు ఎవ్వరూ రావడం లేదు. అంచేత రాజుగారికి వినోదం కల్పింపలేకపోతున్నాను. నాతో కలియపడేందుకు ఎందువల్ల రావడం లేదంటే, నెత్తురు కక్కి చస్తామని చాలామందికి భయం. ఇంత కాలానికి వెన్నముద్దలు తిని, కొవ్వు పట్టిన నీవు వచ్చావని తెలిసింది. ఓ పట్టు పడదామా? నాతో పందెం కాయడం అంటే, వెన్నముద్దలు మింగడం కాదని తెలుసుకో గోపాలా?"

"ఆ పట్టులో నీవు యముడి పట్టుకు చిక్కిపోగలవు జాగ్రత్త! మీ రాజులా నీవు నీచుడవే! వళ్లు పొగరెక్కే కారుకూతలు కూస్తున్నావు" అంటూ శ్రీకృష్ణుడు నవ్వాడు.

"ఇది గొల్లభామలతో చేసే మదన కదనం కాదు గోపాలా! మల్లయుద్ధం! యముడి మహిషం గంటల సవ్వడి నీ చెవి దాపుకు వచ్చిందన్నమాట: అందుకే నాతో మల్లయుద్ధానికి వచ్చావు." అంటూ చాణూరుడు, భూమి వణికేలా, పెద్ద పెద్ద అంగలు వేస్తూ, హూంకారం చేస్తూ, భుజాలు అప్పళిస్తూ నడగొండవలె యాదవ కిశోరం మీదకు దూకాడు.

ముష్టికుడు, బలరామునిపై లంఘించాడు.

ఏనుగులతో సింహాలా? సింహాలతో ఏనుగులా? అన్నట్లుగా వారు మెరుపు వేగంతో భయంకరంగా పోట్లాడుకోసాగారు.

కర్ణ కఠోరంగా వారు అరుస్తున్నారు. బాధలతో మూలుగుతున్నారు. ఎవరు నేలమీద ఉన్నారో ఎవరుపైన ఉన్నారో కవిపించనంత వేగంగా వారు పోరాడుతున్నారు. ఢీకొన్న రెండు కొండవలవలె, రెండు సింహాలవలె, రెండు మత్తేభాలవలె వారు మల్లయుద్ధం చేయసాగారు. చూపరులకు భయం కలుగుతుంది.

నందుడి మనస్సు వ్యాకులం అయింది. ఆ ఇరువురూ ముక్కుపచ్చలారని పసిపిల్లలు. వీరా మదించిన మల్లయుద్ధ విశారదులు. వీరితో తన కుమారులకు పోటీ ఏర్పాటు చేయడానికి ఈ కంసుడు ఎంత దుర్మార్గుడో కదా? ఈశ్వరుడు, తన పాపలను రక్షించుగాత! అభం శుభం తెలియని వీరికి రక్ష భగవంతుడుకాక మరెవరు అవుతారు?

ఇంతలో ఇద్దరు మల్లురూ రంగభూమిలో నెత్తుటిముద్దలై, అచేతనంగా పడిపోయి కనిపించారు.

క్రోధ ఘూర్ణితులై, విజయోత్సాహులై రామకృష్ణులు కనిపించారు. నందాది గోపాలుర నేత్రాల్లో ఆనందభాష్పాలు ఝుడివానలైనాయి. ఆరాధనతో ఆర్ద్రం అయిన కండ్లు తుడుచుకుంటూ విజయులైన వీరబాలురవేపు చూడసాగారు వారు.

తన మల్లుర చావును చూడగానే కంసుడికి వళ్ళంతా చెమట పోసింది. గుండెల్లో గుబులు మొదలయింది. ఉన్మాదము కలిగినట్లయింది.

"ఈ యాదవులనంతా కత్తితో కండగా తరగండి! దేవకీ వసుదేవులను అక్కడే పాతిపెట్టండి. అక్రూరుడు ఎక్కడ ఉంటే, అక్కడే వాడి తల నరకండి! ఈ ఇద్దరినీ బయటకు తరమండి!" అంటూ కంసుడు అరిచాడు.

కంసుడు ఉన్మాదస్థితిలో ఏదేదో వాగుతూనే ఉన్నాడు. ఇంతలో శ్రీకృష్ణుడు కంసుని సమీపించాడు. ముడి పుచ్చుకుని శ్రీకృష్ణుడు, కంసుని రంగస్థలంలోకి విసరివేశాడు. నేలమీది మహానాగాన్ని, గరుత్మంతుడు ఎంతవేగంగా వచ్చి తాకుతాడో అంత వేగంగా కంసుని, శ్రీకృష్ణుడు ఒడిసి పుచ్చుకుని గొంతు నులిమి పిడిగుద్దులతో చంపాడు.

కంసుడి మరణంతో, వాడి సోదరులు ఒక్కుమ్మడిగా వివిధ ఆయుధాలతో శ్రీకృష్ణబల రాముల మీదకు విజృంభిచారు. వారినందరనూ కూడా పంచత్వం పొందించారు.

కంసుడు చనిపోవడం విని, అతడి భార్యలు అంతఃపురం నుండీ వచ్చి భర్త కళేబరంమీద పడి పొర్లుతూ ఏడవసాగారు.

వారిని ఊరడించి, పరలోక గతులకు చేసే సంస్కారాదులు చేయడం కోసం శ్రీకృష్ణుడు మనుషులను నియమించాడు.

చెరలో అంతవరకూ మగ్గుతున్న దేవకీ వసుదేవులనూ, ఉగ్రసేనుడినీ విడిపించారు. ఉగ్రసేనునకు పట్టంకట్టి సకల బంధువులకూ శ్రీకృష్ణబలరాములు ప్రీతిపాత్రం అయ్యారు.

"నాయనా! తండ్రీ! ఇంతటివాడివైనావు. తల్లిదండ్రుల ఋణం తీర్చుకున్నావు! తల్లిదండ్రులను మన్నించనివాడు, ఎంతలేసి పుణ్యకార్యాలు చేసినా ఫలించవు. ఇంటగెలిచి రచ్చగెలువవలె. నిన్ను చూడచూడ సంతోషం కలుగుతుంది" అంటూ వసుదేవుడు కొడుకును కౌగలించుకుని మూర్ధాఘ్రాణం చేశాడు.

కన్నులనిండా కొడుకును చూసి ఆర్ద్రం అయిన కన్నులు తుడుచుకుంటూ దేవకి మురిసిపోయింది.

కృష్ణబలరాములు కొంతకాలం మధురలో ఉండవలెననుకున్నారు. ఈ కోరికను విని నందుడు దుఃఖించాడు.

శ్రీకృష్ణుడు నందుని ఊరడించి, ''మా శరీరాలు ఇక్కడ ఉన్నా, మా మనస్సులు మాత్రం మీతోనే ఉంటాయి. ఆ యమునా తీరాలూ, ఆ పశువులూ, ఆ గోపికలూ, ఆ శరద్రాత్రులూ మరపురాని స్మృతులు. త్వరలో రాగలం. అంతవరకూ విచారింపకండి. తల్లి యశోదను ఎల్లాగో మీరె ఊరడింపవలె!'' అన్నాడు.

''మా అదృష్టంకొద్దీ మాకు ఇద్దరు తల్లులు; ఇద్దరు తండ్రులూ! కొంత పొద్దు వీరిని సంతోషపరచడం ధర్మంకదా తండ్రీ?'' అనీ శ్రీకృష్ణుడు నందుని సముదాయించాడు.

కొడుకు మాటలకు నందుడు సంతోషించాడు: దుఃఖించాడు. అతని మనస్సులో రెండు భావాలు గంగలై, యమునలై ప్రవహించాయి. భారమైన హృదయాలతో నందాదులు తిరుగు ప్రయాణం అయ్యారు. యశోద, కృష్ణుడు లేకుండా వచ్చిన తన్ను చూసి ఎంతగా వాపోతుందో కదా? అని నందుడు అనుకున్నాడు.



# విద్యాభ్యాసం

అంతవరకూ విద్యా సంస్కారాలకు దూరం అయిన, తన పుత్రులకు గర్గముని ఆదేశానుసారంగా, వసుదేవుడు, ఉపనయనాదులు చేయించాడు. గోహిరణ్యదానాలు ఘనంగా గురువులకు సమర్పించుకున్నారు.

ఉపవీతులయిన, తన కొడుకులకు, విద్య నేర్పింపవలసి ఉంది. అయితే శ్రీకృష్ణ బలరాములు, ఆచారం అనుసరించి, గురువును వెదక్కుంటూ, పాదచారులై కాశీ చేరారు. కాశీ సమీపంలోని అవంతి నగరంలో సాందీపని మహర్షిని తమ గురువుగా భావించి, విద్యార్థులైనారు.

జగద్గురువు అయిన శ్రీకృష్ణుడు లౌకికంగా, గురువును ఎన్నుకుని గురుచరణాల మీద వ్రాలి విద్యాభిక్ష పెట్టమని ప్రార్థించాడు.

ఏకసంతగ్రాహులయిన ఆ సోదరులు, అరవైనాలుగు విద్యలూ రోజు కొకటి చొప్పున నేర్చుకున్నారు.

విద్యానంతరం సాందీపని తనశిష్యులను ఆశీర్వదించాడు.

''మీ విద్యాకాలం ముగిసింది. ఇహ పోయి గృహస్థాశ్రమం స్వీకరించి ఇహపరాలు సాధించండి'' అని ముని అనుజ్ఞ ఇచ్చారు.

''స్వామీ! మీ దయవల్ల విద్యావంతులం, సుశిక్షితులం అయ్యాము. సాంప్రదాయానుసారంగా గురువుకు దక్షిణ ఇవ్వవలె! తల్లి దండ్రుల, గురువుల ఋణాలు తీర్చలేనివి. అయినా యథాశక్తి

విముక్తికి ప్రయత్నించడం మానవధర్మం కదా! మీకు తెలియని ధర్మాలేమున్నాయి? మీ మనస్సులోని కోరిక ఏదేని ఉంటే నిస్సంకోచంగా తెలిపి మా ప్రార్థన మన్నించడండి స్వామీ!'' అని కృష్ణుడు అంజలి ఘటించాడు.

''నీవు నా శిష్యుడవా? నేను నీకు గురువునా. నీవు ఎవరివో, ఎందుకు వచ్చావో నాకు తెలుసుకృష్ణా! నీవు జగద్గురుడవు. నేను సాధారణగురువును. నీముందు నేనో అల్పుడను. అల్పుడయిన వాడు, అనల్పుడయిన వాడి దగ్గర చేయిసాపడం ధర్మ విరుద్ధం కాదు. ప్రభాసతీర్థంలో, నా ఏకైక పుత్రుడు, కొంతకాలం క్రితం, నీరాడబోయి మునిగిన వాడు, ఇంతవరకూ తిరిగి రాలేదు. వాడి అతీగతీ తెలియక మేము ఇద్దరం – ముసలివాళ్లం పుత్ర విరహంతో కొట్టుకలాడుతున్నాం. పుత్రభాగ్యం గురుదక్షిణగా నీ చిత్తం వస్తే, కలిగించు నాయనా! గురుపత్ని ఎంతో సంతోషిస్తుంది. అంతకన్నా మాకేం కావాలి కృష్ణా?'' అంటూ ఆ వృద్ధ ముని అశ్రువులు తుడుచుకున్నాడు.

శ్రీకృష్ణబలరాములు రథారూఢులై ప్రభాసతీర్థం చేరారు.

''మా గురుపుత్రుడెక్కడ?'' అని వారు సముద్రుణ్ణి అడగ్గా, సముద్రుడు బయటకు వచ్చాడు.

''అలల తాకిడికి తాళలేక ఇక్కడకు దూరంగా అతడు వెళ్లాడు. అక్కడ ఆ బాలుడిని పంచజనుడనే వాడు మింగి వేశాడు. అంతే నాకు తెలిసింది. వాడున్న చోటు మీకు చూపగలను'' అన్నాడు సముద్రుడు.

వారు, పంచజనుని కడుపు చీల్చి చూడగా, గురుపుత్రుడు కనిపించలేదు. అయితే వాడి కడుపులో ఒక అపూర్వ శంఖం కనిపించింది. ఆ శంఖం శ్రీకృష్ణుడు తీసుకున్నాడు. అది పంచజనుని పేరిట పాంచజన్యంగా ప్రసిద్ధం అయింది.

గురుపుత్రుని వెదకుతూ వారు యమలోకం వెళ్లారు. ధర్మరాజు వారికి ఉచితాసనాలు ఇచ్చి, వారు వచ్చిన పని తెలుసుకుని గురుపుత్రుని తెచ్చి ఇచ్చాడు. శ్రీకృష్ణబలరాములు, సాందీపనికి గురుదక్షిణగా ఆయన పుత్రుని ఇచ్చి, ఆశీస్సులంది, మధురకు తిరిగి వచ్చారు.

శ్రీకృష్ణునకు ఉన్నట్టుండి, బృందావనం జ్ఞాపకం వచ్చింది. గోప వనితలూ, వారి వేదనలూ గుర్తుకొచ్చాయి.

ఉద్ధవుని పిలిచాడు ఆయన.

''నీవు పల్లెకు వెళ్లు! అక్కడ నీకు గోపికలు, కండ్లలో ప్రాణాలు పెట్టుకుని, అతిదీనలై కనిపిస్తారు. నా గురించి వారికి చెప్పి ఊరట కలిగించు. త్వరలో రాగలనని నమ్మపలుకు! వారిని ఊరడించిరా!''

ఉద్ధవుడు, సాయంకాలానికల్లా, బృందావనం చేరుకున్నాడు. నందాదులు, ఉద్ధవునికి మర్యాదలు చేసి, శ్రీకృష్ణబలరాముల యోగక్షేమాలు విచారించారు.

ఆనాటి రేయి, వారు పడుకుని, శ్రీకృష్ణుని బాల్యచేష్టలు చెప్పుకుంటూ గడిపారు.

ఉద్ధవుడు గోపికలను వెదకుతూ కాళిందీ తీరం చేర వచ్చాడు.

గోపికలు మధుర నుండీ వచ్చిన అతని చుట్టూ చేరి శ్రీకృష్ణుడి గురించీ గుచ్చి గుచ్చి అడిగారు.

"మీ మీ మనసుల్లో నేను నివసిస్తున్నాను; శాశ్వతంగా ఉన్నాను. నా మనస్సులో మీరు ఉన్నారు. మనకు విరహం లేదు. ఎడబాటు లేదు. త్వరలో శారీరకంగా మిమ్ముల కలుస్తాను. శాంతచిత్తలై, నా ధ్యానంతో ఉండండి! సర్వశుభాలూ మీకు కలుగుతాయి! అని నందనందనుడు మీతో చెప్పమన్నాడు" అని ఉద్ధవుడు గోపికలకు తెలిపాడు.

"ఇప్పుడాయన నాగరీకుడు కదా? ఏమయినా చెబుతాడు. ఈ పల్లెనూ, ఈ పల్లెపడుచులనూ, ఇంకా జ్ఞాపకం ఉంచుకున్నందుకు మేం ఎంతో ధన్యలం!" అన్నారు గోపికలు కోపంగా.

అయితే వారు ఓ క్షణం ఆగి, రుద్ధ కంఠంతో, కండ్లు తుడుచుకుంటూ ఇలా అన్నారు.

"హరి ఎప్పుడు వస్తాడో, ఎప్పుడు మా మొర ఆలకిస్తాడో? ఎప్పుడు ప్రాణాధికమైన మాస్వామి, ఈ భూముల్లో విహరిస్తాడో? ఎప్పుడు ఈ శరద్రాత్రులు జీవవంతం అవుతాయో ఉద్ధవా! నీవేమయినా చెప్పగలవా?"

"మాధవుడు తప్పక రాగలడు! నిశ్చింతలై ఉండండి. మిమ్ములను ఆయన మరచిపోలేకపోవడం వల్లనే నన్ను పంపాడు. ఆయన మీ కోరికలు తప్పక నెరవేర్చుతాడు!" అని అతడు గోపికలను ఊరడించాడు.

ఉద్ధవుడు నందుని ఇంట కొంత కాలం గడిపి తిరిగి మధుర చేరాడు. గోపికల వేదన శ్రీకృష్ణునకు వివరించాడు.

భగవంతుడు స్వయంగా వచ్చి, "నీకేం కావాలి?" అని అడిగినప్పుడు కుబ్జ, "నీ పొందు చాలు" అంటూ కోరుకుంది.

ఆమె కోరిక నెరవేర్చగలందుకు శ్రీకృష్ణుడు ఉద్ధవసహితుడై కుబ్జను అనుగ్రహింప వచ్చాడు.

శ్రీకృష్ణ కృపా విశేషం వలన, ఇప్పుడు అది అతిలోక సౌందర్యవతి అయింది.

కృష్ణుడు రావడం చూసి కుబ్జ సంభ్రమంతో ఎదురువచ్చి పట్టు పరుపుల మీద కూర్చుండచేసి పన్నీట పాదాలు కడిగి, కర్పూర తాంబూలం సమర్పించి, అతిలోక దుర్లభం అయిన ఆయన పాదాలు, తన ఒడిలోకి తీసుకుని, సంవాహనం చేస్తూ, నిమీలిత నేత్ర అయింది; మధురోహలతో తేలిపోసాగింది.

శ్రీకృష్ణుడు ఆమె కోరిక నెరవేర్చి తృప్తాత్మను చేశాడు.



# జరాసంధుడు

కంసుడు చావడంతో, అతడి భార్యలు అస్తీ, ప్రాప్తీ విధవలైనారు. ఈ ఇరువురూ జరాసంధుని కూతుళ్లు. భర్త మరణంలో వారు పుట్టిల్లు అయిన మగధ చేరారు.

జరాసంధుడు తన కుమార్తెలకు జరిగిన అన్యాయానికి మండిపడ్డారు. కంస మరణానికి కారణభూతులయిన బలరామకృష్ణుల మీద ప్రతీకారం తీసుకునేందుకు తీవ్ర ప్రయత్నాలు చేయసాగాడు.

ఇరువది మూడ క్షౌహిణుల సైన్యం వాడు క్షణాల్లో సమీకరించి మధురపై దండయాత్ర చేశాడు.

మాగధులను ఎదుర్కొనేందుకు మధురలో తగినంత సైన్యం లేదు. శ్రీకృష్ణుడు, తన యోగబలంతో, చతురంగ బలాలు, సకలాయుధాలూ పుట్టించి జరాసంధుడి దాడికి సిద్ధం అయి కూర్చున్నాడు.

ఇరుసైన్యాలూ దారుణంగా తాకాయి. బలరాముడు, ఒక చేత ముసలం, మరొక చేత హలం ధరించి, ఫాలాక్షుని వలె వీరవిహారం చేసి పీనుగు పెంట చేయసాగాడు. శ్రీకృష్ణుడు తన చక్రాయుధంతో శత్రు సంహారం సాగించాడు.

జరాసంధుడు, కనిపించిన చోటనల్లా, మధుర సేనల పాలిట యముడై సంచరిస్తూ సంహరిస్తూ హడలెత్తింపసాగాడు.

ఆ యుద్ధం, ప్రళయ సమయంలో రెండు సముద్రాలు ఏకం అయినట్లుగా తోచింది. గుర్రాల సకిలింపులూ, ఏనుగుల ఘీంకారాలూ క్షతగాత్రుల ఆక్రందనలూ, వీరుల ప్రలాపాలూ సముద్రఘోషను మించిపోయింది.

జరాసంధుడెక్కిన రథాన్ని బలుడు, తన హలాయుధంతో నుగ్గు చేసి, గుర్రాలను చంపి, అతడు, మరొక రథం ఎక్కబోతున్నంతలో నిరాయుధుడిని చేసి పట్టుకున్నాడు.

కోపంతో పండ్లు పటపటలాడిస్తూ, ''ఎంత కావరం లేకపోతే ఇంత దూరం వస్తావు నీవు? ఇప్పుడు నీకు దిక్కెవరో చెప్పు! ఈ రోకలితో నీ తల వెయ్యి ముక్కలు కాబోతూంది. కాచుకో!'' అంటూ బలరాముడు రోకలి ఎత్తాడు.

ఇంతలో శ్రీకృష్ణుడు అడ్డం వచ్చి, ''బలరామన్నా! ఆగు! వీడి చావు ముహూర్తం ముందుంది!'' అని శాంతపరచాడు.

''మరెప్పుడయినా ఇంతకు రెండింతల సైన్యంతో రా! నిరాయుధుడవు! నీకు ప్రాణభిక్ష పెడుతున్నా! వెళ్లు జరాసంధా!'' అంటూ మాటలతో అతడిని సగం చంపి విడచిపెట్టాడు శ్రీకృష్ణుడు. వీరుడికి అవమానమే మరణం... జరాసంధునికి అంతే అయింది. అవమానంతో, తలవంచుకుని యుద్ధరంగం నుండీ, ఒంటరి అయి, దిక్కులేని దుస్థితితో వాడు పారిపొయ్యాడు.

జరాసంధుడు, అపజయంతో, అవమానంతో శ్రీకృష్ణుని మీద మరీ మచ్చరం వహించాడు. దుర్మార్గులయిన రాజులనందరనూ కూడకట్టుకున్నాడు. సైన్యం వీలయినంతగా పెంచాడు. అంతకు ముందు జరిగిన యుద్ధం, వాడికి గుణపాఠం కాలేదు. ప్రతీకార పాఠం అయింది.

ఆ ప్రతీకారంతో జరాసంధుడు మధురపై పదిహేడు సార్లు దండెత్తడం ఓడిపోవడం – మళ్లీ మళ్లీ రావడం – విధీ విరామం లేకుండా దండయాత్రలు సాగించాడు.

పద్దెనిమిదోసారి వాడు యుద్ధానికి సిద్ధం అయ్యాడు.

ఆ సమయంలో ఒకనాడు నారదుడు, కాలయవనుని కొలువుకు వచ్చాడు.

''నీవు ఎంతో బలవంతుడివని విన్నాను. భూమ్మీద రాజులనెందరినో సునాయాసంగా జయించావు. చక్రవర్తి పేరుకు అర్హుడవూ అయ్యావు. అయితే చందమామలో మచ్చ ఉన్నట్లుగా, నీ విజయపరంపరలో ఒక లోపం ఉండనే ఉంది!'' అన్నాడు నారదుడు.

"ఏంటది?" కాలయవనుడు మండిపడ్డాడు.

"యాదవ ప్రముఖుడొకడున్నాడు. జరాసంధుడు ఎన్నిసార్లు దండయాత్రకు వెళ్లినా, చావు తప్పి కన్ను లొట్టబోయి అపజయంతో తిరిగి వస్తున్నాడు. ఆ యాదవ ప్రభువు మీదకు నీవు ఎప్పుడూ యుద్ధానికి వెళ్లలేదు. భయం వల్ల బహుశా, ఆ ప్రభువు మీదకువెళ్లి ఉండవు. ఔనా?"

"ఎవరతడు? ఎక్కడ ఉంటాడు? రేపే బయలుదేరి, వాడి తలను నా పాదాల మీద పడేలా చేస్తాను!"

"అతడా?" అంటూ నారదుడు నవ్వాడు, "ఎలా ఉంటాడని అడుగుతావా? ఎక్కడ ఉంటాడని అడుగుతావా? ఎల్లా ఉంటాడంటే, నీలమేఘం వంటి రంగు గలవాడూ, చూపుల్లో కరుణ నిలిపినవాడూ, మహాశూరుడూ! అయితే ఏం? శరణు అంటే, కాపాడే గుణం గలవాడూ, ఎప్పుడు ఎక్కడయినా ఉండగలవాడూ, పట్టుకోవలెనంటే పట్టు చిక్కనివాడూ, తనకు తానే చిక్కేవాడు అతడు!"

"ఆ యాదవుడెంతటి వాడయినా సరే! నా బాణాగ్నిలో శలభం వలె భస్మం చేయకమానను. ఇప్పుడే వాడిమీదకు వెళుతున్నా" అంటూ కాలయవనుడు కాలాగ్నివలె మండిపడసాగాడు.

మధుర మీదకు ఒక్కసారిగా అటు కాలయవనుడూ, ఇటు జరాసంధుడూ చుట్టుముట్టి యుద్ధభేరులు మ్రోగించారు.

ఆ ఇద్దరి తాకిడిని తాళుకోవడం కష్టం! శ్రీకృష్ణుడు ఆలోచించాడు. విశ్వకర్మను మనస్సులో ధ్యానించాడు. విశ్వకర్మ కనిపించి నమస్కరించాడు.

"సముద్ర మధ్యంలో పన్నెండు చదరపు యోజనాల మేర సంపాదించు. అక్కడ ఓ దుర్గం నిర్మించు. ఈ మధురవాసులు అక్కడ సుఖంగా ఉండగలరు!" అన్నాడు శ్రీకృష్ణుడు.

"ఆజ్ఞ ప్రభూ!" అంటూ విశ్వకర్మ అదృశ్యం అయ్యాడు.

అతడు క్షణాల్లో సముద్ర మధ్యంలో దేవతల నగరం వంటి నగరం నిర్మించాడు. ఆ నగరం పేరు ద్వారక. ఈ ద్వారకకు శ్రీకృష్ణుడు తన యోగబలంతో మధురా నగరంలోని ఆబాలగోపాలాన్ని చేర్చాడు.

ద్వారకలో ప్రజలు సుఖంగా జీవించసాగారు.

యుద్ధం కోసం మోహరించి, ఉన్న కాలయవనుడూ, జరాసంధుడూ, మధుర సైన్యం కోసం ఎదురుచూస్తుండగా, కోట తలుపులు కొంచెం కొంచెంగా తెరచుకున్నాయి. వాళ్ల చూస్తాండగా ఒంటరి అయి, నిరాయుధుడయి, పాదచారి అయి శ్రీకృష్ణుడు వెళుతున్నాడు.

ముట్టడి వేసి ఎంతకాలం అయినా, అవతలివారి అలికిడి లేకపోగా, ఇప్పుడీ మనిషి బయటకు రావడం కాలయవనునకు ఆశ్చర్యం కలిగించింది. నారదముని వర్ణించిన వర్ణన సరిపోతూంది. బహుశా, అతడే ఇతడు కావచ్చు అనుకుని పట్టుకొనేందుకు కాలయవనుడు ముందుకు వచ్చాడు.

ఎవరి పట్టుకూ చిక్కనివాడిని పట్టుకునేందుకు కాలయవనుడు వెంట నడిచాడు. వాడు వెంట పడడంతో శ్రీకృష్ణుడు వేగం పెంచాడు. వాడూ నడక వేగం పెంచాడు.

''ఆ ముని చెప్పినవాడివి నీవే అయితే, కంసాదుల నెందరినో సునాయాసంగా చంపిన వాడివి నీవే అయితే, ఇప్పుడు నీతో పోరుకు వచ్చిన నాతో పోరక వెన్నిచ్చి భీరుడవై పారిపోతున్నావేం? ఇదేనా నీ వీరత్వం? శూరత్వం'' అంటూ కాల యవనుడు వెంట పడ్డాడు.

కృష్ణుడు వాడి మాటలను లెఖపెట్టలేదు. వెనక్కు తిరిగి చూస్తూ, చేతికి చిక్కినట్లు చిక్కి, అంతలోనె, అంతదూరంలో కనిపిస్తూ గికురిస్తూ శ్రీకృష్ణుడు పోసాగాడు.

శ్రీకృష్ణుడు అలా పోయి పోయి ఒక కొండగుహలో దూరాడు. కాలయవనుడు గుహలోకి వచ్చాడు. అయితె కృష్ణుడు కనిపించక పోగా, దీర్ఘ నిద్రలో మునిగి ఉన్న వాడొకడు కనిపించాడు.

''నీవు ఎంత లావు వీరుడవయ్యాబాబూ? నీ అంతటి పిరికిపందను నేను ఎక్కడా చూళ్లేదు. పారిపోయి వచ్చి ఇలా నిద్ర నటిస్తున్నావా? ఇంక ఎక్కడకు పోగలవూ?'' అంటూ కాలయవనుడు, ఆ నిద్రపోతున్న మహాపురుషుని, కృష్ణునిగా తలచి, తనఎడమ కాలితో తన్నాడు.

ఆ తాపుకు అతడు నిక్కి నీల్గి నిద్రలేచి కలయచూశాడు. ఎదురుగుండా కాల యవనుడు కనిపించాడు. అతడు ఎప్పుడయితే కనులు తెరచి చూశాడో, అప్పుడు అతడి కండ్లలోంచి అగ్ని జ్వాలలు పుట్టుక వచ్చాయి. ఎదురుగా నిలచిన కాలయవనుడు, ఆ కంటిమంటల్లో కాలి బూడిద కుప్పగా మిగిలాడు: అతడి పేరు ముచికుందుడు.

మాంధాత కొడుకు ముచికుందుడు. దేవదానవులు పెద్దపొద్దు యుద్ధం చేశారు. దేవతలకు బాసటగా నిలచిన ముచికుందుడు, దానవులతో ఆహార నిద్రలను మరచి యుద్ధం చేశాడు. చివరకు ఆయుద్ధంలో దేవతలు గెలుపొందారు.

''ఇంతగా మమ్ముల ఆదుకున్న నీకు ఏం కావాలో చెప్పు? ఇస్తాం! అయితే మోక్షం ఇవ్వలేం! మోక్షదాత ఈశ్వరుడు. ఇప్పుడు భూమ్మీద నీరాజ్యం, నీవారసులు ఎవ్వరూ లేరు'' అంతా కాలగతి పొందారు. నీవు అక్కడకు పోయి చేయగలిగిందీ లేదు'' అన్నాడు ఇంద్రుడు.

''అయితే హాయిగా నిద్ర పోతాను! నిద్రను వరంగా ఇవ్వండి!'' అని కోరాడు ముచికుందుడు.

దేవతల అనుగ్రహంతో కలిగిన నిద్రలో అతడు ఆగుహలో ఉండిపోయాడు.

ఇప్పుడు కాల యవనుడు నీరైన తరువాత ముకుందుడు, ఆ ముచికుందుని ఎదుట నిలచాడు.

అయితే, తనముందున్న వారెవరయిందీ, అంతకుముందు తన కంటి మంటలకు భస్మం అయిన వాడెవరయిందీ, అతనికి తెలియలేదు.

''మహాత్మా! తామెవరు? ఇక్కడ పెద్దకాలంగా నిద్రపోతున్నా! ఇప్పుడు ఎంతకాలం అయిందో కూడా తెలీదు. ఈ బూడిద అయిన వాడెవడు?'' అని అతడు అడిగాడు.

''వీడు కాల యవనుడు. నీవు చేసిన సత్కర్మలకు సంతోషపడి నిన్ను అనుగ్రహించేందుకు, నిన్ను వెదక్కుంటూ వచ్చాను. నీకేం వరం కావలెనో అడుగు!''.

''తండ్రీ! నీవు కనిపించావు. అదే గొప్ప! నీ అనుగ్రహం, నీ దర్శనం కలిగిన తరువాత, నీవెవరో తెలుసుకున్న తరువాత ఏం కోరగలను ప్రభూ! ముక్తి తప్ప? అదే అనుగ్రహించు. మున్ను దేవతలను అడిగా! వారు తాము అశక్తులం అన్నారు. నీవు శక్తుడవు కదా ప్రభూ!'' అంటూ ముచికుందుడు నమస్కరించాడు.

"మృగయా వినోదం కొద్దీ జీవులననేకం హింసించావు. ఆ కారణంగా నీకో జన్మ ఉంది. ఆ జన్మలో నీకు ముక్తి చిక్కుతుంది!"

అతడు హరికి నమస్కరించాడు. గుహ వెలుపలకు వచ్చి చూడగా పశు పక్షిలతాదులు కురచవై కనిపించాయి. యుగం మారిందనుకున్నాడు. తపస్సుకు గంధ మాదనం అతడు వెళ్లాడు.

మధురానగరపు శివార్లలో జరాసంధుడు ఇరవైమూడక్షౌహిణుల సైన్యంతో మోహరించి కూర్చున్నాడు. యుద్ధంకోసం కండ్లుకాయలు కాచేలా ఎదురు చూస్తున్న సమయంలో రామకృష్ణులు నిరాయుధులై కనిపించారు.

జరాసంధుడు పకపకానవ్వి "అదో. మహావీరులు బయట పడ్డారు. ఇదీ వీరి యుద్ధ వైఖరి" అన్నాడు.

రామకేశవులు పారిపోతూనే ఉన్నారు.

"ఇలా పారిపోతే విడచి పెడతాననుకున్నారా? భీరుల్లారా! ఆగండి! పారిపోకండి! నా కుతుళ్లు ఇంకా కనీళ్లు కార్చుతూనే ఉన్నారు. కంసుని ఆత్మ ఇంకా ఘోషపెడుతూనే ఉంది" అంటూ జరాసంధుడు వెంటపడ్డాడు.

బలరామకృష్ణులు, ఇంతలో ప్రవర్షణ పర్వతం ఎక్కిపోసాగారు. జరాసంధుడు సైన్యంతో కొండంతా గాలించాడు. ఎంతవెదకినా వారి జాడలు చిక్కలేదు.

"ఈ కొండకు చిచ్చుపెట్టండి" అని సైనికులకు జరాసంధుడు ఆజ్ఞాపించాడు.

అతడి సైనికులు కొండమూలమూలలా వెదకుతూ ఎక్కడ సందు ఉన్నా, ఎక్కడ గోయి ఉన్నా, గుహ ఉన్నా, అక్కడంతా గడ్డీగాదం, కఱ్ఱాకంపా నింపి నిప్పు ముట్టించారు.

క్షణాల్లో ప్రవర్షణ పర్వతంలో అగ్ని జ్వాలలు మిన్నుముట్టాయి. రామకృష్ణులు కొండకు అవతలి భాగం నుండీ క్రిందకు దిగి క్షేమంగా ద్వారక చేరారు.

జరాసంధుడు ఆ సోదరులు అగ్నికి ఆహుతి అయ్యారని తలచి మగధ చేరాడు.

రైవతుడనే రాజు కూతురు రేవతి. ఆమె బలుడి గుణగణాలు విని వలచింది. బ్రహ్మదేవుడు రైవతునికి కనిపించి, రేవతిని బలరామునికి ఇచ్చి పెండ్లి చేయమన్నారు. అలా వాళ్లిద్దరకూ వివాహం జరిగింది.



# రుక్మిణీ కల్యాణం

విదర్భ దేశాన్ని భీష్మకుడనే రాజు పాలిస్తున్నాడు. భీష్మకునికి ఐదుమంది కొడుకులు. రుక్మి పెద్దవాడు. ఈ కొడుకుల తరువాత, ఆయనకు అపురూపంగా కూతురు పుట్టింది. ఈ పిల్ల పేరు రుక్మిణి. రుక్మిణి ఎత్తైత్తు బంగారంగా పెరిగి యుక్త వయస్సుకువచ్చింది.

తండ్రి కొలువుకువచ్చే సాధుసజ్జనులు, మునులూ మొదలయినవాళ్లు శ్రీకృష్ణుని అందచందాలూ, గుణగణాలూ గొప్పగా వర్ణించి చెబుతూండడం విన్న రుక్మిణి, అతని మీద అనురాగం పెంచుకుంది. అది రానురాను దృఢం అయింది.

ద్వారకలో అదే పరిస్థితి. రుక్మిణి గురించి విన్న కృష్ణుడికి ఆమెపట్ల అనురాగం కలిగింది.

రుక్మికి శిశుపాలుడు స్నేహితుడు. ఆకాలంలో శిశుపాలుడూ, కంసుడూ, జరాసంధుడూ, దంతవక్త్రుడూ మొదలయిన వాళ్లు ఒక వర్గంగా ఏర్పడి శ్రీకృష్ణుడి పట్ల విరోధం పెంచుకున్నారు. ఈ కారణంగా రుక్మికి శ్రీకృష్ణుడి పొడ కూడా గిట్టదు.

తన మిత్రుడయిన శిశుపాలునికి, తన చెల్లెలు రుక్మిణిని ఇచ్చి వివాహం జరిపితే, స్నేహం, బంధుత్వంతో మరీ దృఢం అవుతుందని రుక్మి ఆలోచించి, ఆ ప్రయత్నాలు చేయనారంభించాడు. తల్లిదండ్రులే కాక మరెవ్వరు చెప్పినా వాడు వినే స్థితిలో లేడు. తమ మాటలు సాగవని భీష్మక దంపతులు మౌనం వహించారు.

రుక్మిణికి, తన అన్న చేసే ప్రయత్నాలు తెలిసి వచ్చాయి. తన వివాహం శిశుపాలుడితో కావడం ఆ పిల్లకు ఎంతమాత్రం ఇష్టం లేదు. తనపతి, తనజీవం, తన దైవం, తన సర్వస్వం శ్రీకృష్ణుడు.

ఆప్తుడూ, నమ్మకస్తుడూ అయిన అగ్నిద్యోతునకు ఆమె కబురు చేసింది.

''మా అన్న లేడూ రుక్మి! వాడునన్ను శిశుపాలునకు ఇచ్చి పెండ్లి చేయువలెనని తొందరపడుతున్నాడు. ఈ విషయం నాకు ప్రాణాంతకంగా ఉంది. భగవంతుడికి నివేదించిన–లేక–నివేదింపబోతున్న వస్తువును ఒకుక్కకు పెట్టడం ఇది. అయితే ఈ కుక్క మా అన్నకు ఎంతో ప్రియం. మిమ్ములను పిలిపించిన కారణం ఈ విషయాలు చెప్పుకునేందుక్కాదు. నాకో సాయం చేయమని ప్రార్థించేందుకుపిలిచాను. మీరు ఎల్లాగో ద్వారకకు పోవలసి ఉంది. ఆ ద్వారకా నాథుడే నా నాథుడు. ఈ విషయం ఆయనకు మనవి చేయండి. నాప్రాణాలు నిలుపండి. మీ ఆశీస్సులతో పెరిగి ఇంత దాన్ని అయ్యేనా? ఇప్పుడు ఈ ఆశీస్సుకై చేతులు జోడించి అతిదీననై, నిస్పృహయనై, దుఃఖితనై నుంచున్నాను.'' అంది రుక్మిణి.

ఆమె కండ్ల నిండా ఊరిన నీళ్లను చూసి ఆ బ్రాహ్మణుడు చలించి పోయాడు. అయితే వెంటనే, అతడు నవ్వాడు, ''భగవంతునికై నిర్ణయించిన వస్తువు, భగవంతుడు తప్పక గ్రహిస్తాడమ్మా! నీ కెందుకూ చింత? నా ధర్మంగా భావించి, సంతోషంగా నీ పని సానుకూలం చేసుకువస్తా! ఈ మూలంగా నయనా ఆ పురుషోత్తముని దర్శనం కలుగుతుంది. నీవు నిశ్చింతగా ఉండుతల్లీ!''

అప్పటి కప్పుడే అతడు ద్వారకకు పయన మయ్యాడు.

శ్రీకృష్ణుని అనుమతితో అతడు అంతఃపురం ప్రవేశించాడు. శ్రీకృష్ణుడు, అతనికి ఉచిత మర్యాదలు చేసి నమస్కరించాడు.

ఆ బ్రాహ్మణుడు సంతోషించి, ''కల్యాణమస్తు!'' అని దీవించాడు.

విదర్భనుండీ వచ్చిన బ్రాహ్మణుడు, తనను కల్యాణమస్తు అని దీవించడంలో గల అంతరార్థం శ్రీకృష్ణుడు అర్థం చేసుకుని నవ్వాడు.

''అక్కడి విశేషాలేమిటి స్వామీ?''

''అన్నీ నీకు తెలిసినవే మహాత్మా! శిశుపాలుడు రుక్మిణీ వివాహం కోసం ఉవ్విళ్లూరుతున్నాడు. వాడికి సాయం రుక్మి! అంటే రుక్మిణి అన్న. మరి రుక్మిణి విషయానికి వస్తే ఈ వివాహం పట్ల ఆమె విముఖురాలై ఉంది. ఆమె ఎవరిని చేసుకుంటుంది స్వామీ? తన మనస్సులో పీఠం పెట్టుకుని

కూర్చున్న వారినే కదా చేసుకోవాలి? ఆమె మనస్సునిండా మీరు ఉన్నారు. మీతో వివాహం కాని పక్షంలో తనకు జీవితం అఖరలేదటూ భీష్మించుక కూర్చుంది. ఆమె భీష్మకుడి కూతురు. అతడు బలహీనుడు; ఆమె అబల. నిస్సహాయ. అన్న బలవంతుడు దురాచారుడూను! ఈ సంకటంలో తను ఏం చేయవలసి ఉందో, తెలుసుక రమ్మని, మీ వద్దకు పంపింది తండ్రీ! మీరేం చెప్పినా, అది తలమీదపెట్టుకుని, మా తల్లి దగ్గరకు పోతాను'' అన్నాడు అతడు.

శ్రీకృష్ణుడు సిగ్గుపడి నవ్వాడు.

''రుక్మిణి అంటే, నాకూ ఇష్టమేస్వామీ! ఆ బాలికను శిశుపాలుని పాలు చేయను. నేను వస్తాను. ఈ వార్త మీ తల్లికి చెప్పండి!''

''ధన్యుణ్ణి ప్రభూ! నాతల్లి ధన్యురాలయింది! సెలవు'' అన్నాడు అతడు.

మరి ఆలస్యం చేయకుండా హుటాహుటి విదర్భకు శ్రీకృష్ణుడు ఆ బ్రాహ్మణుడితో బయలుదేరాడు.

ఒక ప్రియవార్తను ఎదురు చూస్తున్న వారికి ప్రతి నిముషము ఒక యుగంవలె అనిపిస్తుంది. ఎదురు చూస్తున్నవారు ఆలస్యం భరింపలేరు. రుక్మిణి అంతే అయింది. ప్రతి నిముషం ఆమె యుగంవలె లెఖ్ఖపెట్టుకోసాగింది. ఇప్పటికి అగ్నిద్యోతుడు ద్వారకను చేరి ఉంటారు. ఈ బాలిక బాల్యచాపల్యం కొద్ది ఒక సందేశం పంపిందని ఆయన భావిస్తాడేమో! మన్నించడేమో! నా భాగ్యం, నా రాత ఎల్లా ఉందో? తల్లీ! మహేశ్వరీ! నీవు తపం చేసి మరీ భర్తలో సగం అయ్యావు. నాకూ నా ప్రియపతి పాదాల దగ్గర ఓ యింత చోటు అయినా ఇవ్వలేవా వరంగా లోకమాతా? నీ దయ! నన్ను రక్షించు. నా స్థితికి కరుణించు! ఎవరకు చెప్పు కోనమ్మా నీకు తప్ప?

శ్రీకృష్ణుని రాకకు భీష్మకుడు మనస్సులో సంతోషించాడు. ఉచిత మర్యాదలూ అవీ చేయించి, వసతి ఏర్పాట్లు చేయించాడు. అయితే పిలువని పేరంటంలా వచ్చిన కృష్ణుడు, రుక్మీ తదితరులకు కంటగింపు అయ్యాడు.

రాజులనేకులు విదర్భకు ఈ సందర్భంలో వచ్చారు. జరాసంధుడు శిశుపాలుడికి తోడై వచ్చాడు. త్రినేత్రుడు ఎత్తి వచ్చినా రుక్మిణీ శిశుపాలుర వివాహం జరుగుతుందని వాళ్లు అనుకోసాగారు. శ్రీకృష్ణుడి రాకతో యుద్ధం అనివార్యం అని వారంతా, తమ తమ బలగాలకు హెచ్చరికలు చేశారు.

వరునకు తగిన మర్యాదలు అవీ చేయించి, వస్త్రభూషలు గొప్పగా భీష్మకుడు సమర్పించాడు.

శ్రీకృష్ణుడు అలా వెళ్లిన తరువాత, బలరామునకు విషయం తెలిసింది. శిశుపాలుని పెండ్లికి జరాసంధాదులు ఎందరో వస్తారు. అసహాయశూరుడే కృష్ణుడు, అయినా ఒంటరి వాడవుతాడు. తన సహాయం ఎంతో అవుసరం అనుకుని యాదవ సైన్యాన్ని క్షణాలమీద విదర్భకు బలరాముడు తరలించాడు.

రుక్మిణి మంగళ స్నానాదులు చేయడం, అలంకారాలు ధరించడం మొదలయిన తంతును అసహ్యంగానె నెరవేర్చింది. ఆమె మనస్సంతా అగ్ని ద్యోతుడు వెళ్లిన విషయమ్మీద ఉండడంవల్ల అన్యమనస్కగా ఆమె అందరకూ కనిపించింది. కారణం ఎవ్వరకూ తెలియలేదు.

ఇంతలో అగ్నిద్యోతుడు ఆమె ముందుకు వచ్చాడు. అతని ముఖంలో సంతోషం తొణికిసలాడుతూంది. బహుశా అతడు పనిని సానుకూలపరచి ఉంటాడు.

రుక్మిణి అతని ఎదుటకు వచ్చింది.

''తల్లీ! నీ నోములు ఫలించాయి. గోపాల దేవుడు నిన్ను వరించాడు. సంతోషంగా ఉండు!''

ఆమె తన చెక్కిళ్ల మీదకు జారిన ఆనందభాష్పాలు తుడుచుకోనైనా లేదు. సిగ్గుతో ఆ బాలిక బుగ్గలు కెంపులయినాయి. వంచిన తల కొంచెంగా ఎత్తి రెండు చేతులూ జోడించింది.

''నా ప్రాణాలు నిలిపిన మీకు ఏం ప్రత్యుపకారం చేయగలను? ఈ నమస్కారం తప్ప!?''

''అదే పదివేలు'' అని అతడు నవ్వి వెళ్లిపోయాడు.

ఇంతలో గౌరీపూజకు సిద్ధంకమ్మని పురోహితుడు కేకవేశాడు. వీరభటులూ, బంధుమిత్రులూ, భూసురులూ వెంటరాగా, మంగళ వాద్యాలతో చెలికత్తెలు కలసి నడువగా, సాలంకృత అయిన వధువు రుక్మిణి దేవీ అర్చనకు లోకమాత గుడికి వచ్చింది.

ఆమె రెండు చేతులూ జోడించి ''తల్లీ! మంగళ గౌరీ! నాకు మంగళం కలిగించు!'' అంటూ ప్రార్థించింది.

పూజానంతరం రుక్మిణి రథంలో ఎక్కబోతూంది. ఇంతలో మెరుపులా వాసుదేవుడు అక్కడికి వచ్చాడు. ఆ వచ్చినవాడు అవలీలగా, పూలబంతినివలె, రుక్మిణిని ఎత్తుకున్నాడు. తన రథంలో కూర్చుండ చేశాడు.

''దారుకా! వాయువేగం మించిన వేగంతో రథంతోలు! ఎవ్వరనూ లెఖ్ఖ చేయకు!'' అని శ్రీకృష్ణుడు ఆజ్ఞాపించాడు.

శ్రీకృష్ణుడు రుక్మిణిని అపహరించడం క్షణంలో జరిగింది. ఆ క్షణంలో ఎవరికీ కాలూ చేయీ ఆడలేదు. బొమ్మల్లా అందరూ నుంచున్నారు.

ఆ తరువాతనే అందరకూ ఈ వార్త తెలిసింది. ఈ సంగతి తెలిసేలోపల శ్రీకృష్ణుడి రథం. పొలిమేరలు దాటిపోయింది. ఇంతలో బలరాముడు తన బలగంతో వచ్చి చేరాడు.

జరాసంధాదులు కత్తులు దూసి తమ తమ రథాలు ఎక్కి కృష్ణుని అనుసరించారు. అయితె బలరాముడు వారిని అడ్డగించాడు.

ఇరుసైన్యాల మధ్య గొప్ప యుద్ధం అయింది. శిశుపాలుడి వళ్లు తూట్లుపడ్డాయి. జరాసంధుడి పనీ అంతే అయింది. అతడు విరిగిన తన రథం దిగి శిశుపాలుడి రథం ఎక్కాడు.

''శిశుపాలా! మనం వెనక్కు తిరగడం మంచిది. ఈ రోజు యాదవులకు కలసి వచ్చిన రోజులా ఉంది. బతికి ఉంటే మరోచోట నీకు వధువు లభింపకపోదు. వరించని పిల్లకోసం ఎందుకూ కలవరించడం? ఈ యుద్ధం చేయడం? తీరా పెండ్లి అయినా దాంతో ఎం సుఖపడగలవూ?'' అంటూ జరాసంధుడు హితం చెప్పసాగాడు.

వాళ్లు అలా ఆలోచించి, తమ తమ నగరాలకు అక్కడినుండే తిరుగుముఖం పట్టారు.

ఇందరు వీరులు, తనకు తోడు రాకపోయినా, తానొక మహావీరుడనని, తన చెల్లెలిని ఎత్తుకుపోతున్న శ్రీకృష్ణుడిని ఎలాగయినా మళ్లింపవలెనని రుక్మి, బలరాముని కన్నుగప్పి ఓ అక్షౌహిణి సైన్యంతో ముందుకు సాగాడు.

ఆగుమని హెచ్చరిక చేస్తూ, వెంటపడిన రుక్మిని, చూచీచూడక శ్రీకృష్ణుడు పోసాగాడు.

రుక్మి కోపంతో బాణాలు కురిపింపసాగాడు.

''నీకు కులం లేదు. గోత్రం లేదు. రాచకులం వారి కన్నెపిల్లను ముచ్చులా వచ్చి దొంగిలించుకుపోతావా? మా చెల్లెలిని మర్యాదగా అప్పగించు! లేకపోతె నిన్ను యమపురికి పంపుతా!'' అంటూ రుక్మి గర్జించాడు.

''నీవు అంతటివాడివే బావా!'' అని ఒక బాణంతో రుక్మి విల్లువిరచి, మరి కొన్ని బాణాలతో రథాన్ని చూర్ణం చేసి, అశ్వాలను చంపాడు శ్రీకృష్ణుడు.

రుక్మి విరథుడై నేలమీద నుంచున్నాడు. కత్తి దూసి కృష్ణుని మీదకు ఉరికాడు.

శ్రీకృష్ణుడు తన కరవాలంతో, వాడి తల నరకబోయాడు. రుక్మిణి అడ్డం వచ్చింది.

''నీకు సాటి ఎవరు ప్రభూ? ఏదో చాపల్యంకొద్దీ, నా మీద మమకారంకొద్దీ, వాడు ఇంత చేసుకున్నాడు. ఈ శుభ సమయాన బావమరిదిని చంపి, చేతులకు నెత్తురు పులుముకుంటావా? నా ముఖం చూసి వాడిని క్షమించకూడదా?'' అని ప్రార్థించింది రుక్మిణి.

శ్రీకృష్ణుడు రుక్మిని బంధించి, తలా, మీసాలూ గొరిగి విరూపుని చేసి విడిచాడు.

ఇంతలో బలరాముడు తన సైన్యంతో అక్కడకు వచ్చాడు.

''వీడు మన బంధువు! ఇంత విపరీతం ఎందుకు చేశావయ్యా కృష్ణా?'' అని బలరాముడు మందలించి రుక్మిని విడుదల చేశారు.

''తల్లీ! బాధపడకు! విధాత దీనికంతా కారణం అని తెలుసుకో! ప్రత్యక్షకర్త ఆయనే అయినా, పరోక్షకర్తగా మారి, కారణకార్యాలు సృష్టించి ఆయన తన పనులు నెరవేర్చుకుంటాడు.'' అని బలరాముడు. రుక్మిణిని అనునయించాడు.

రుక్మి అవమానభారంతో కుండి నగరంలో తన ముఖం చూపనని ప్రతిజ్ఞ చేసి, ఈశ్వరుని గురించి తపస్సు చేస్తూ కాలం గడిపాడు.

ద్వారకకు వారు చేరిన తరువాత రుక్మిణిని కల్యాణం చేసుకుని శ్రీకృష్ణుడు సుఖించసాగాడు.



# ప్రద్యుమ్నుడు

తన తండ్రి అయిన దక్షుడు చేసిన అవమానం సహించలేక పూర్వం, ఒకసారి దాక్షాయణి ఆత్మార్పణం చేసుకుంది. సతీవియోగంతో ఈశ్వరుడు విరాగి అయి, తపస్వి అయి మంచుకొండల అంచుల్లో తపస్సు చేసుకుంటున్నాడు. దాక్షాయణి పార్వతిగా, మేనకా హిమంతులకు జన్మించింది. ఆమె సదాశివుని వరించి, ఆయనకు సేవలు చేస్తూండసాగింది.

తారకుడు లోకకంటకుడై దేవతలను పట్టిపీడింపసాగాడు. వాడు బ్రహ్మను తపస్సుతో మెప్పించి, శివపార్వతుల కొడుకువల్ల తప్ప మరెవ్వరివల్లా మరణంలేకుండా వరం పొందాడు. ఈ వరబలంతో వాడు మరీ విజృంభించాడు. వాడి పీడ విడుగర కావాలంటే, ఉమామహేశ్వరులకు కొడుకు పుట్టవలసి ఉంది. కానీ శివుడు విరాగి అయి కూర్చున్నాడు. పార్వతివేపు కన్నెత్తి అయిన

ఆయన చూడడు. వారిద్దరి వలపు పంట దేవతలకు అవసరం అయిన కారణంగా, దేవతలు మన్మథుడిని సాయం చేయమని ప్రార్థించారు.

మన్మథుడు ఉబ్బిపోయి తనంత వాడు లేడనుకుని రతీసమేతుడై శివుడు తపస్సు చేసుకునే చోటుకు వచ్చాడు.

ఇంతలో పార్వతీదేవి శివారాధనకు వచ్చింది. అదే అదననుకుని మన్మథుడు తన సమ్మోహనాస్త్రం శివుడిమీద ప్రయోగించాడు.

ఉద్రిక్తం అయిన మనస్సును చిక్కబరచుకుని, దోషి అయిన మన్మథుని తన కంటి మంటల్లో బూడిద చేశాడు పరమేశ్వరుడు.

మన్మథుడు భస్మం అయినా, అతడు చేసిన పని వృథా కాలేదు. శివపార్వతులకు వివాహం అయింది. వారిద్దరకూ కుమారుడు ఉదయించాడు. తారక సంహారం జరిగిపోయింది.

అయితే, రతి పతీవియోగంతో కుమిలిపోతూ శంకరుని పాదాలమీదపడి ప్రార్థించింది. లోక కల్యాణం కొరకు, తనవల్ల చనిపోయిన మన్మథుని అనంగుడుగా శివుడు అనుగ్రహించాడు. మన్మథుడు తిరిగి పుడతాడనీ ఆయన అనుగ్రహించాడు. ఆ అనుగ్రహం కారణంగా, రుక్మిణీ శ్రీకృష్ణులకు మన్మథుడు, జన్మిందాడు. రతీదేవి ఎంతో సంతోషించింది.

శంబరుడన్న రాక్షసుడు, మన్మథుడు శారీరకంగా లేడు కాబట్టి, మన్మథుడివల్ల తప్ప మరెవ్వరివల్లా మరణం కలక్కుండా వరం పొంది, లోకపీడన చేయసాగాడు. మన్మథుడు తిరిగి రుక్మిణీ గర్భాన పుట్టడం తెలుసుకుని, శంబరుడు, తన చావును తప్పించుకోవలెనని, ఆ పురిటి బిడ్డను, తన మాయాబలంతో తీసుకపోయి సముద్రంలో పారవేసి చేతులు దులుపుకున్నాడు.

విధివశాత్తూ, ఆ బిడ్డను ఒక మహా మీనం మింగింది. ఆ మీనంతోపాటు చాలా చేపలు ఒక జాలరికి చిక్కాయి. ఈ పెద్ద చేపను, ఆ జాలరి రాజయిన శంబరునకు కానుక చేశాడు.

శంబరుడు, ఆ చేపను వంటవారికి పంపాడు. వారు దాని పొట్ట చీల్చడంతో, ఒక శిశువు కనిపించింది.

తన భర్త తిరిగి జన్మిస్తాడన్నా ఆశతో రతీదేవి, మాయావతి అన్న పేరుతో శంబరుని కొలువులో చేరి ఉంది.

ఆ శిశువు మన్మథుడని, నారదుని మూలంగా మాయావతి తెలుసుకుంది. శంబరుని అనుమతితో, ఆ శిశువును మాయావతి తనవెంట తీసుకుపోయింది.

ఆ బిడ్డ పేరు ప్రద్యుమ్నుడు. ప్రద్యుమ్నుడు రతీదేవి ఆలనా పాలనలో పెరిగి పెద్ద వాడయ్యాడు. యుక్త వయస్సు రావడంతో రతి నర్మగర్భంగా, తన అనురాగం, ప్రేమా వెల్లడించింది.

ప్రద్యుమ్నుడు ఆశ్చర్యపోయాడు.

"లోకవిరుద్ధంగా నీవు ప్రవర్తిస్తున్నావు. తల్లివై ఉండి, ప్రియురాలివలె ప్రవర్తించడం ధర్మంకాదు. నీ పద్ధతి మార్చుకో!" అని ప్రద్యుమ్నుడు మాయావతిని హెచ్చరించాడు.

"నేను నీ తల్లినికాదు. నీ తల్లి రుక్మిణీ దేవి. నీ తండ్రి శ్రీకృష్ణుడు నీవు పూర్వ జన్మలో మన్మథుడవు. నేను రతిని. నీ భార్యను!" అని ఆమె, అతనికి జన్మ రహస్యం యావత్తూ వివరించింది.

ఆమె, శంబరుని ఆను పానులన్నీ ప్రద్యుమ్నునకు చెప్పింది. వాడిని సాధించేందుకు మహా విద్యనూ ఉపదేశించింది. శంబరుని సాధించేందుకు ఆమె ప్రద్యుమ్నుని పురికొల్పింది.

ప్రద్యుమ్నుడు, శంబరుని మీద యుద్ధం ప్రకటించాడు. శంబరుడు రాక్షస మాయలెన్నో ప్రయోగించాడు. మహా మాయతో, వాడి మాయలు భగ్నం చేసి, అతడు చివరకు శంబర సంహారం చేశాడు.

రతీదేవి తన మాయాశక్తితో ప్రద్యుమ్నుని వెంటపెట్టుకుని ద్వారక చేరింది.

ప్రద్యుమ్నుని చూసిన ద్వారకావాసులు, శ్రీకృష్ణుడని భ్రమ పొందారు. రుక్మిణి ప్రద్యుమ్నుడిని చూడగానే, ఆమె మనస్సులో ప్రేమాప్యాయతలు పొంగులు వారసాగాయి. తన పొత్తిళ్ల బిడ్డ, ఇప్పుడు ఇలా ఉంటాడని ఆమెకు అనిపించింది. సర్వజ్ఞుడయిన గోవిందుడు మాత్రం మౌనం వహించాడు.

ఇంతలో అక్కడకు నారద మహర్షి వచ్చి, ప్రద్యుమ్నుడు రుక్మిణీ కుమారుడని, శంబరుడిని సంహరించాడనీ, తన భార్య రతీదేవితో ఇప్పుడు వచ్చాడనీ వివరణ ఇచ్చాడు.

రుక్మిణి పుత్ర లాభంతో సంతోషించింది.



# సత్యభామ

సత్రాజిత్తు, సూర్యదేవుని ఆరాధించాడు. సూర్యుడు, అతని ఆరాధనకు మెచ్చి శ్యమంతకమణిని అనుగ్రహించాడు.

ఈ శ్యమంతకమణి నేలమీద సూర్యునివలె ప్రకాశించేది. రోజుకు ఎనిమిది బారువుల బంగారం కురిపించేది. రోగాలూ, దుర్భిక్షాలూ మొదలయిన పీడలు నివారించేది. అంత గొప్ప మహిమగల శ్యమంతకమణిని, సత్రాజిత్తు ధరించి సూర్యునివలె ప్రకాశిస్తూ, గొప్పను ప్రదర్శిస్తూ తిరుగుతూండేవాడు.

అతడొకనాడు ద్వారకకు రావడం జరిగింది. ప్రజలు సత్రాజిత్తును చూసి ఇంద్రుడో, చంద్రుడో, సూర్యుడో అన్న భ్రమ పొందాడు.

శ్రీకృష్ణుడు కుతూహలంతో, ఆ మణిని తనకు ఇవ్వమని అడిగాడు. అంత తపస్సు చేసి, కష్టపడి సంపాదించుకున్న మణిని అతడు, యాదవునికి ఇవ్వ నిరాకరించాడు.

అలా జరిగిన చాలాకాలానికి, ఒకనాడు సత్రాజిత్తు తమ్ముడయిన ప్రసేనజిత్తు, శ్యమంతకమణిని ధరించి వేటకు పోయాడు. అతడు అరణ్యంలో వేటాడుతూండగా, ఒక సింహం అతడిని చంపింది. ఆ సింహాన్ని జాంబవంతుడు చంపి మణిని తీసుకుపోయి గుహలో ఉన్న తన కొడుకు ఆడుకునేందుకు ఇచ్చాడు. అలా శ్యమంతకమణి అదృశ్యమయింది.

సత్రాజిత్తుకు ఈ విషయాలేవీ తెలియవు. మణిమీద కన్నువేసిన శ్రీకృష్ణుడు మాయోపాయంతో ప్రసేనజిత్తును చంపి తన మణిని అపహరించాడని, అతడు నలుగురితో చెప్పసాగాడు.

అతడు లేవతీసిన ప్రవాదం చివరకు కృష్ణుడి చెవికీ సోకింది. మణిని తమాషాకు అడిగినంత మాత్రాన, సత్రాజిత్తు ఇంతటి అపవాదు, తనమీద వేసినందుకు శ్రీకృష్ణుడు కలత పొందాడు. మణి జాడలు తెలుసుకోవలెనని నిశ్చయించాడు.

ప్రసేనజిత్తు మరణం గురించి జాడలు తీయగా, కొంత సమాచారం తెలిసింది. అరణ్యం అంతా గాలించగా, చనిపోయిన అశ్వం – దానిప్రక్కన ప్రసేన, సింహ కళేబరాలు కనిపించాయి. నెత్తుటి గుర్తుల మూలంగా పోయి పోయి కృష్ణుడు ఒక గుహలో ప్రవేశించాడు. ఆ గుహలో ఒక ఊయల – ఆ ఊయల మీద మణి కనిపించాయి. హఠాత్తుగా వచ్చిన కృష్ణుడిని చూసి దాది భయపడి ఎలుగెత్తి అరిచింది. ఆ దాది అరుపులకు లోపలనుండీ జాంబవంతుడు ఇవతలకు వచ్చాడు.

''ఎవరు నువ్వు? లోపలికి ఎందుకు వచ్చావ్?'' అని జాంబవంతుడు అడిగాడు.

''ఈ మణి నీది కాదు. ఇది నీకు ఎలా వచ్చిందో చెప్పు. ఈ మణిని నేను హరించానన్న కళంకం నామీద పడింది. దీన్ని తీసికుని మరీ వెళతాను'' అన్నాడు కృష్ణుడు.

జాంబవంతుడు అంగీకరించలేదు.

కృష్ణుడు తన పట్టు విడచిపెట్టలేదు.

ఫలితం పోరు ఏర్పడింది. ఇరువురూ బలవంతులు. వారి పోరాటం ఇరవై ఎనిమిది రోజుల పాటు సాగింది. ఎవరూ గెలిచినట్లు లేదు. ఎవరూ ఓడినట్లు లేదు. వారి కాలితాపులకు కొండ బండలు చూర్ణం అవుతున్నాయి; అరుపులకు అడవి జంతువులు దిక్కు తెలీకుండా పరువులు పెడుతున్నాయి. ఇరువురి శరీరాల నుండీ నెత్తురు ధారలు కడుతున్నాయి.

శ్రీకృష్ణుడి రూపంలో శ్రీరాముడు జాంబవంతుడికి కనిపించాడు. తన దైవం తోనా ఇంతవరకూ పోరాడింది? జాంబవంతుడు అచేతనుడై నుంచున్నాడు. అతడు వెంటనే శ్రీరామ పాదాల మీద వ్రాలి చేతులు జోడించి నుంచున్నాడు.

''ప్రభూ! నీవెవరో ఇంత ఆలస్యంగా గ్రహించాను. నేనో అజ్ఞానిని. జంతు ధర్మం కదూ! నాకు జ్ఞానం ఎక్కడినుంచీ వస్తుంది? పరమాత్మవు నీవు. సర్గమూ, స్థితీ లయమూ చేసే ఈశ్వరుడవు నీవు. నన్ను రక్షించు నీవు కోరితే ఈ మణి ఒక్కటే కాదు ప్రభూ! నా ప్రాణాలయినా నీ పాదాల ముందు నివేదింపనా?''

జాంబవంతుడి శరీర శ్రమ నివారించేందుకు శ్రీకృష్ణుడు తన అమృత హస్తాలతో మృదువుగా అతని శరీరాన్ని స్పృశించాడు.

కొత్త జవం, జీవం జాంబవంతునకు కలిగింది.

''ఈ మణిని నేను అపహరించానని కొందరు అపవాదు వేశారు. దాన్నుండీ కాపాడుకునేందుకు వచ్చాను.''

జాంబవంతుడు సంతోషించాడు.

''ఈ మణినేకాదు. నా ప్రాణంతో సమానమైన నా కూతురును అనుగ్రహించు! నన్ను ధన్యుణ్ణి చెయ్!'' అంటు అతడు ప్రార్థించాడు.

''కృష్ణార్పణం!'' అని జాంబవంతుడు మణినీ, జాంబవతినీ శ్రీకృష్ణునకు సమర్పించు కున్నాడు.

శ్రీకృష్ణుడు, తన కొలువుకు సత్రాజిత్తును పిలిపించాడు.

"ఈ మణి, ప్రలోభంతో మీ తమ్ముడిని చంపి కాజేశానని నీవు అందరితో చెబుతున్నావట! ఇదో నీ మణి! తీసుకుపో!" అంటూ శ్రీకృష్ణుడు మణిని అతడికి ఇచ్చాడు.

సత్రాజిత్తు సిగ్గుపడి తలవంచుకున్నాడు. అయితే మణి వదలుకోవడానికి మనస్సు అంగీకరించలేదు. మణితో ఇంటికి వచ్చాడు. కానీ అతడికి సరిగా నిద్రపట్టలేదు. బలవద్విరోధం తెచ్చుకున్నానే అని కలత పొందాడు.

కృష్ణుడు ఎంత ఉదారుడుకాకపోతె అంత కష్టపడి సాధించిన మణిని తనకు ఇస్తాడు? తానులేనిపోని వాదు కల్పించాడు; పాపం చేశాడు. తాను పాపవిముక్తి పొందవలెనంటె, ఈ మణితోసహా తన కూతురు సత్యనూ ఆయన చరణాలముందు పడవేయవలె! జాంబవంతుడు చేసిన పనే తనూ చేయవలె.

సత్రాజిత్తు ఒక శుభ ముహూర్తంలో తన కూతురు సత్యభామతో మణితోసహా వచ్చి శ్రీకృష్ణునకు కానుక చేశాడు.

"మాకు ఈ మణి చాలు!" అని సత్యభామను చేరదీసి, శ్యమంతక మణిని అతడికి ఇచ్చాడు శ్రీకృష్ణుడు.

శతధన్వుడు, సత్యభామను పెండ్లాడవలెననుకుని, ఎప్పుడో సత్రాజిత్తును అడిగాడు. అప్పుడు సత్రాజిత్తు అంగీకరించాడు. అయితె సత్రాజిత్తు, మణిమూలంగా వచ్చిన గొడవలకారణంగా, శ్రీకృష్ణునికి భయపడి, ఆయనను మంచి చేసుకోవలెనన్న ఉద్దేశంతో, తన కూతురును ఇచ్చి పెండ్లి చేసి, అంతకుముందు శతధన్వుడికి ఇచ్చిన మాట తప్పాడు. శతధన్వుడు కోపించినప్పటికీ, ఎవరినీ ఏమీ అనలేక సమయం కోసం ఎదురుచూడసాగాడు.

పాండవులు, తమ తల్లి కుంతితోసహా లాక్షాగృహంలో దగ్ధం అయ్యారన్న విషయం ద్వారకకు చేరింది. అది నిజం కాదని తెలిసినా, బలరామ సహితుడై కృష్ణుడు కురునగరం వెళ్లాడు.

ఈ సమయంలో తన కత్తికి ఎదురులేదని, శతధన్వుడు, నిద్రపోతున్న సత్రాజిత్తును బలిపశువుకువలె కుత్తుక తరిగి శ్యమంతకమణితో పారిపోయాడు.

సత్యభామ, తండ్రి మరణానికి దుఃఖించింది. తండ్రి కళేబరాన్ని నూనె కుండలో దాచి, హస్తినకు చేరి, తన తండ్రి మరణం గురించి శ్రీకృష్ణునకు చెప్పింది.

"వాడి సంగతి నేను చూస్తాలె! నీవు విచారపడకు!" అని కృష్ణుడు ఆమెను ఊరడించాడు.

శ్రీకృష్ణుడు తనను చంపుతాడని శతధన్వునకు భయం పట్టుకుంది. కృతవర్మను తనవైపుకు రమ్మని కోరాడు. కృతవర్మ శ్రీకృష్ణునితో విరోధం కొనితెచ్చుకోడం కుదరదని నిష్కర్షగా చెప్పి పంపాడు. శతధన్వుడు అంతటితో ఊరుకోక అక్రూరుని సాయం అర్థించాడు.

అక్రూరుడు రెండు చేతులూ జోడించి, "ఎవరయితే లోకాలనూ, లోకులనూ పుట్టించి మాయతో ఆడిస్తూ, తాను దూరంగా ఉంటున్నారో, వారితో విరోధం పెట్టుకుని ఎక్కడకు పోయి బతగ్గలం?" అన్నాడు.

శతధన్వుడు మణిని అతడిముందు పడవేసి, రథం ఎక్కి పారిపోయాడు. శతధన్వుడు పారిపోయినా శ్రీకృష్ణుడు విడచిపెట్టలేదు. శ్రీకృష్ణ బలరాములు శతధన్వుని వెదకి వెదకి పట్టి చంపారు. వాడిదగ్గర మణి లేదు.

''వృథాగా వీడిని చంపామేమో!'' అన్నాడు కృష్ణుడు.

''వీడు మణిని తీసుకపోవడం నిజం! ఎక్కడో దాచి ఉంటారు. నీవు ద్వారకకు వెళ్లు; నిజం తెలుస్తుంది. జనక మహారాజును చూసి, నేను త్వరలో ద్వారకకు వస్తాను.'' అని బలరాముడు మిథిలకు వెళ్లాడు.

శతధన్వుని మరణవార్త విని అక్రూర కృతవర్మలు భయంతో ద్వారక విడచి పారిపోయ్యారు.

సాధు పురుషుడయిన అక్రూరుడు ద్వారకను విడచిపోవడంవల్ల ద్వారకలో క్షామం కలిగింది. యాదవ ముఖ్యులు కొందరకు కృష్ణుడి దగ్గరకు పోయి నమస్కరించారు.

''అక్రూరుడు, ద్వారకను విడచిపెట్టడంవల్ల దేశంలో క్షామం కలుగుతుంది. అతడిని రప్పించి, క్షామాన్నుండీ దూరం కావడం మంచిది!'' అన్నారు.

వారి ఆలోచనలు మన్నించి వాసుదేవుడు దూతలను పంపి అక్రూరుని వెదకించి, పిలిపించాడు.

ప్రియ వచనాలతో అక్రూరుని భయం పోగొట్టి, ''శ్యమంతక మణి నీ దగ్గర ఉన్నట్లు అందరూ అంటున్నారు. సత్రాజిత్తు ఎల్లాగూ మరణించాడు. అది ఆడపిల్లల సొత్తు. వారికి ఇవ్వడం ధర్మం!'' అన్నారు శ్రీకృష్ణుడు.

అక్రూరుడు వెంటనే శ్యమంతక మణిని కృష్ణుని పాదాలచెంత పెట్టాడు. అయితే శ్రీకృష్ణుడు. ''నీవే ఈ మణిని నా కానుకగా స్వీకరించు!'' అన్నాడు.



# కాళింది

శ్రీకృష్ణునకు పాండవులంటే, ప్రాణం. వారిని సదా కంటికిరెప్పవలె రక్షించేవాడు. ఒకసారి వారిని చూసేందుకు ఇంద్రప్రస్థం శ్రీకృష్ణుడు వచ్చాడు. పాండవులు ఎంతో భక్తితో, శ్రద్ధతో ఆయన్ను పూజించారు.

కృష్ణుడు అర్జునునితో వేటకు బయలుదేరాడు. వారు మధ్యాహ్నం వరకు వినోదం సాగించి, యమునను చేరి దాహం తీర్చుకున్నారు.

యమునలో ఆ సమయంలో ఒక బాలిక స్నానం చేస్తోంది. ఆమె ఎవరయిందీ విచారించమని శ్రీకృష్ణుడు, అర్జునుని పంపాడు. అర్జునుడు ఆ బాలికను సమీపించాడు.

''ఎవరమ్మా నీవు? ఇలా ఒంటరిగా ఉన్నావేం?'' అని అడిగాడు.

''నా పేరు కాళింది. సూర్యపుత్రికను నేను. ఈ జలాల్లో నాకొక ఇల్లు మా తండ్రి నిర్మించాడు. వాసుదేవుడిని వరించి, తపస్సు చేస్తున్నాను. ఆయనే స్వయంగా వచ్చి, నన్ను వివాహం చేసుకుంటాడని మా తండ్రి చెప్పాడు. ఆ నమ్మకంతో ఎదురు చూస్తున్నా! ఇంతకూ మీరు ఎవరు?'' అని ఆమె అడిగింది.

''నా పేరు అర్జునుడు. ఈ దాపున శ్రీకృష్ణుడున్నాడు. ఆయన పంపడంవల్ల నేను ఇలా వచ్చాను. నాతో వస్తే ఆయన దర్శనం అవుంది''.

కాళింది పరమానందంతో స్నానాదులు ముగించి, సాలంకృత అయి అర్జునుడి వెంట వచ్చింది.

శ్రీకృష్ణుడు ఆమెను ఆదరించి తనవెంట ద్వారకకు తీసుకుపోయి ఓ శుభముహూర్తంలో వివాహం చేసుకున్నాడు.

స్వయంవరంలో మిత్రవిందను ఆయన పెండ్లాడాడు.

కోసలదేశం రాజు నగ్నజిత్తు. ఈయన గారాల కూతురు నాగ్నజిత్తి. ఈ రాజుదగ్గర, అతి భయంకరమైన మదించిన వృషభాలు ఏడున్నాయి. అవి అలవి మాలినవి. అంకెకు తెచ్చిన వాడికి, తన కూతురును ఇచ్చి పెండ్లి చేస్తానని, నాగజిత్తిని వీర్యశుల్కగా ప్రకటించాడు రాజు.

శ్రీకృష్ణుడు ఉత్సాహంగా స్వయంవరానికి వచ్చాడు. కోసలరాజు కృష్ణుడిని పూజించాడు.

''ఈ వృషభాల మదం అణచగలవాడవు నీవు మాత్రమే! ఈ రాజులందరూ వాటి కాలిగిట్టలక్రింద నలిగి చావగలరు. ఇది నీకు తృణప్రాయం!'' అని అన్నాడు.

శ్రీకృష్ణుని అందచందాలు విని, గుణగణాలకు మెచ్చి, ఎప్పుడో మనసిచ్చి, తన్ను జయించాలని నాగ్నజిత్తి వేయిదేవుళ్లకు మొక్కుకుంటూంది.

చాలామంది కుమారులు ముఖాలు చాటు చేసుకోగా శ్రీ కృష్ణుడు బరిలోకి దిగారు. ఆ ఏడు ఆబోతులకు ఏడుగురు మూర్తులయి, బొమ్మలను బాలుడు ఈడ్చినట్లు వాటిని త్రాటకట్టి నిర్వీర్యం చేసి విజయశంఖం పూరించాడు.

శ్రీకృష్ణుడు తన నూతన వధువుతో ద్వారకకు వెళుతున్నపుడు స్వయంవరంలో ఓడిపోయిన రాకుమారులు ఒక్కటై యుద్ధానికి వచ్చారు.

''బావా! నీ దారిన నీవు వెళ్లు! నేను చాలు ఈ ముక్కిడి మూకను అణచివేస్తా!'' అని విజయుడు అగ్నిదత్తమైన గాండీవం ధరించి ఎదురు నిలచాడు.

అర్జునుని బాణధాటిక వారు ఆగలేక, చచ్చిన వారు చావగా మిగిలినవారు వీక్కబలం చూపారు. తన మరదలు అయిన భద్రనూ ఆయన వివాహం చేసుకున్నాడు. సర్వ లక్షణ లక్షణతన్ను వరించగా ఆమెనూ వివాహం చేసుకున్నారు.

రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవింద, నాగ్నిజిత్తి, భద్ర, లక్షణలు అష్టభార్యలై సేవింపగా శ్రీకృష్ణుడు సర్వసుఖాలూ అనుభవిస్తూండ సాగాడు.



## నరకుడు

భూమి పుత్రుడు నరకుడు; అతి భయంకరుడూ, అతి బలవంతుడూనూ కావడంవల్ల దేవతలను పట్టి పీడిస్తూ వీరవిహారం చేయసాగాడు.

దేవతల తల్లి అయిన అదితికుండలాలు నరకుడు హరించాడు. వరుణుడి ఛత్రం సొంతం చేసుకున్నాడు. ఇలా దేవతల వస్తువుల నెన్నో యథేచ్ఛగా వాడుకుంటూ, వారిని తన బానిసలుగా చేసుకున్నాడు.

దేవలోకంలోనేకాక, భూమ్మీదా అందగత్తెలనెందరనో చెరబట్టాడు. పదహారువేలమందికిపైగా ఆ బందీల లెఖ్ఖ తేలింది. వాడు చేసే స్వైరవిహారానికి అడ్డూ ఆపులేకుండా పోయింది.

దేవతలు ముకుంద చరణాలమీద వ్రాలి, నరకుడి బారినుండీ రక్షింపమని వేడుకున్నారు.

దయాళువు అయిన ఆయన అభయం ఇచ్చి, నరకుడిని సంహరిస్తానని మాట ఇచ్చారు.

సత్యభామ వీరవనిత: యుద్ధ విశారద.

''నాథా! నా ముచ్చట తీర్చండి! నేనూ మీతో యుద్ధానికి వస్తా! నరకుడితో మీరు చేసే యుద్ధాన్ని కనులార చూడవలెనని నా కోరిక!''

శ్రీ కృష్ణుడు సమ్మతించాడు. గరుడ వాహనమ్మీద ఆమెను కూర్చుండబెట్టుకుని శ్రీకృష్ణుడు ప్రాగ్జ్యోతిషపురానికి వచ్చి పాంచజన్యం ఊదాడు.

నరకుడు నిర్మించిన పర్వత, వాయు, జలాగ్ని దుర్గాలను తన గదతో, చక్రంతో కృష్ణుడు చూర్ణం చేశాడు. అప్పుడు పుట్టిన శబ్దం కర్ణ కఠోరంగా మిన్ను ముట్టింది. మురాసురుడు ఆ శబ్దం విన్నాడు.

మురాసురుడికి ఐదు తలలు; ఐదు తలలకు ఐదు నోళ్ళు. ఐదు నోళ్ల గుండా అగ్ని జ్వాలలు పుట్టిస్తూ, భయంకరంగా అరుస్తూ మురుడు యుద్ధానికి వచ్చాడు.

శ్రీకృష్ణుడు, తన చక్రంతో వాడి ఐదు తలలూ తెగనరికాడు. వాడి కొడుకులు, తండ్రి మరణం తెలుసుకుని, ఒక్కసారిగా చుట్టు ముట్టారు. వారు శక్తి ఖడ్గ ముసలాది ఆయుధాలు ఒక్కుమ్మడిగా శ్రీ కృష్ణుడి మీదకు విసరారు. అయితే మురారి ఆయా ఆయుధాలను తుత్తునియలు చేసి వీరవిహారం చేయసాగాడు.

అలా వారంతా దుర్మరణం పాలుకావడంతో, నరకుడు కోపోద్రేకంతో కన్నూ మిన్నూ కానక, కుండల ప్రభావిభూషితుడై, చతురంగసైన్య సమేతుడై గోవిందుని మీదకు ఎత్తి వచ్చాడు.

శ్రీకృష్ణుడు అలసట తీర్చుకున్నట్లుగా, సత్యభామకు విల్లందించి ఆమెను యుద్ధానికి పురికొల్పాడు.

గాజుల గలగలలు శింజనీరవంతో మేళవించగా, నేత్రాంచలాల కోపారుణిమలు బాణాగ్ని రుచులతో కలసిపోగా, శృంగారవీరరసాలు ఒకటైన విధంగా సత్యభామ అటు హరినీ, ఇటు అరినీ చూస్తూ యుద్ధం చేయసాగింది. బొమ్మల పెండ్లిళ్లు చేసిన విధంగా సునాయాసంగా నరకుడి బాణధాటికి నిలుపుతూ, వాడి బాణాలు భస్మంచేస్తూ తన బాణాలతో వాడి శరీరాన్ని తూట్లుపడచేస్తూ సత్యభామ యుద్ధ నైపుణ్యం ప్రదర్శించింది.

నరకుడు భీతితో, ఆశ్చర్యంతో ఆ వీరవనితను చూస్తూ నుంచున్నాడు.

శ్రీకృష్ణుడు, తన ప్రియురాలిని అభినందిస్తూ, శత్రువు మీద శతఘ్నిని ప్రయోగించాడు. ఆ ఆయుధ ప్రభావంతో నరకుడి సైన్యం పారిపోయింది.

నరకుడు శక్తిని ప్రయోగించాడు.

గరుత్మంతుడు దాన్ని హరించాడు.

శ్రీకృష్ణుడు చక్రాయుధం ప్రయోగించాడు. సుదర్శన చక్రం కన్నులు మూతలుపడేలా మెరుపులుచిమ్ముతూ, నిప్పులు కురిపిస్తూ క్షణ మాత్రంలో నరకుడి కంఠం తెగవేసింది.

''నా పేరు అర్జునుడు. ఈ దాపున శ్రీకృష్ణుడున్నాడు. ఆయన పంపడంవల్ల నేను ఇలా వచ్చాను. నాతో వస్తే ఆయన దర్శనం అవుంది''.

కాళింది పరమానందంతో స్నానాదులు ముగించి, సాలంకృత అయి అర్జునుడి వెంట వచ్చింది.

శ్రీకృష్ణుడు ఆమెను ఆదరించి తనవెంట ద్వారకకు తీసుకుపోయి ఓ శుభముహూర్తంలో వివాహం చేసుకున్నాడు.

స్వయంవరంలో మిత్రవిందను ఆయన పెండ్లాడాడు.

కోసలదేశం రాజు నగ్నజిత్తు. ఈయన గారాల కూతురు నాగ్నజిత్తి. ఈ రాజుదగ్గర, అతి భయంకరమైన మదించిన వృషభాలు ఏడున్నాయి. అవి అలవి మాలినవి. అంకెకు తెచ్చిన వాడికి, తన కూతురును ఇచ్చి పెండ్లి చేస్తానని, నాగజిత్తిని వీర్యశుల్కగా ప్రకటించాడు రాజు.

శ్రీకృష్ణుడు ఉత్సాహంగా స్వయంవరానికి వచ్చాడు. కోసలరాజు కృష్ణుడిని పూజించాడు.

''ఈ వృషభాల మదం అణచగలవాడవు నీవు మాత్రమే! ఈ రాజులందరూ వాటి కాలిగిట్టలక్రింద నలిగి చావగలరు. ఇది నీకు తృణప్రాయం!'' అని అన్నాడు.

శ్రీకృష్ణుని అందచందాలు విని, గుణగణాలకు మెచ్చి, ఎప్పుడో మనసిచ్చి, తన్ను జయించాలని నాగ్నజిత్తి వేయిదేవుళ్లకు మొక్కుకుంటూంది.

చాలామంది కుమారులు ముఖాలు చాటు చేసుకోగా శ్రీ కృష్ణుడు బరిలోకి దిగారు. ఆ ఏడు ఆబోతులకు ఏడుగురు మూర్తులయి, బొమ్మలను బాలుడు ఈడ్చినట్లు వాటిని త్రాటకట్టి నిర్వీర్యం చేసి విజయశంఖం పూరించాడు.

శ్రీకృష్ణుడు తన నూతన వధువుతో ద్వారకకు వెళుతున్నపుడు స్వయంవరంలో ఓడిపోయిన రాకుమారులు ఒక్కటై యుద్ధానికి వచ్చారు.

''బావా! నీ దారిన నీవు వెళ్లు! నేను చాలు ఈ ముక్కడి మూకను అణచివేస్తా!'' అని విజయుడు అగ్నిదత్తమైన గాండీవం ధరించి ఎదురు నిలచాడు.

అర్జునుని బాణధాటిక వారు ఆగలేక, చచ్చిన వారు చావగా మిగిలినవారు పిక్కబలం చూపారు. తన మరదలు అయిన భద్రనూ ఆయన వివాహం చేసుకున్నాడు. సర్వ లక్షణ లక్షణతన్ను వరించగా ఆమెనూ వివాహం చేసుకున్నారు.

రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవింద, నాగ్నిజిత్తి, భద్ర, లక్షణలు అష్టభార్యలై సేవింపగా శ్రీకృష్ణుడు సర్వసుఖాలూ అనుభవిస్తూండ సాగాడు.



## నరకుడు

భూమి పుత్రుడు నరకుడు; అతి భయంకరుడూ, అతి బలవంతుడూనూ కావడంవల్ల దేవతలను పట్టి పీడిస్తూ వీరవిహారం చేయసాగాడు.

దేవతల తల్లి అయిన అదితికుండలాలు నరకుడు హరించాడు. వరుణుడి ఛత్రం సొంతం చేసుకున్నాడు. ఇలా దేవతల వస్తువుల నెన్నో యథేచ్ఛగా వాడుకుంటూ, వారిని తన బానిసలుగా చేసుకున్నాడు.

దేవలోకంలోనేకాక, భూమ్మీదా అందగత్తెలనెందరనో చెరబట్టాడు. పదహారువేలమందికిపైగా ఆ బందీల లెఖ్ఖ తేలింది. వాడు చేసే స్వైరవిహారానికి అడ్డూ ఆపులేకుండా పోయింది.

దేవతలు ముకుంద చరణాలమీద వ్రాలి, నరకుడి బారినుండీ రక్షింపమని వేడుకున్నారు.

దయాళువు అయిన ఆయన అభయం ఇచ్చి, నరకుడిని సంహరిస్తానని మాట ఇచ్చారు.

సత్యభామ వీరవనిత: యుద్ధ విశారద.

''నాథా! నా ముచ్చట తీర్చండి! నేనూ మీతో యుద్ధానికి వస్తా! నరకుడితో మీరు చేసే యుద్ధాన్ని కనులార చూడవలెనని నా కోరిక!''

శ్రీ కృష్ణుడు సమ్మతించాడు. గరుడ వాహనమ్మీద ఆమెను కూర్చుండబెట్టుకుని శ్రీకృష్ణుడు ప్రాగ్జ్యోతిషపురానికి వచ్చి పాంచజన్యం ఊదాడు.

నరకుడు నిర్మించిన పర్వత, వాయు, జలాగ్ని దుర్గాలను తన గదతో, చక్రంతో కృష్ణుడు చూర్ణం చేశాడు. అప్పుడు పుట్టిన శబ్దం కర్ణ కఠోరంగా మిన్ను ముట్టింది. మురాసురుడు ఆ శబ్దం విన్నాడు.

మురాసురుడికి ఐదు తలలు; ఐదు తలలకు ఐదు నోళ్లు. ఐదు నోళ్ల గుండా అగ్ని జ్వాలలు పుట్టిస్తూ, భయంకరంగా అరుస్తూ మురుడు యుద్ధానికి వచ్చాడు.

శ్రీకృష్ణుడు, తన చక్రంతో వాడి ఐదు తలలూ తెగనరికాడు. వాడి కొడుకులు, తండ్రి మరణం తెలుసుకుని, ఒక్కసారిగా చుట్టు ముట్టారు. వారు శక్తి ఖడ్గ ముసలాది ఆయుధాలు ఒక్కుమ్మడిగా శ్రీ కృష్ణుడి మీదకు విసరారు. అయితే మురారి ఆయా ఆయుధాలను తుత్తునియలు చేసి వీరవిహారం చేయసాగాడు.

అలా వారంతా దుర్మరణం పాలుకావడంతో, నరకుడు కోపోద్రేకంతో కన్ను మిన్నూ కానక, కుండల ప్రభావిభూషితుడై, చతురంగసైన్య సమేతుడై గోవిందుని మీదకు ఎత్తి వచ్చాడు.

శ్రీకృష్ణుడు అలసట తీర్చుకున్నట్లుగా, సత్యభామకు విల్లందించి ఆమెను యుద్ధానికి పురికొల్పాడు.

గాజుల గలగలలు శింజినీరవంతో మేళవించగా, నేత్రాంచలాల కోపారుణిమలు బాణాగ్ని రుచులతో కలసిపోగా, శృంగారవీరరసాలు ఒకటైన విధంగా సత్యభామ అటు హరినీ, ఇటు అరినీ చూస్తూ యుద్ధం చేయసాగింది. బొమ్మల పెండ్లిళ్ల చేసిన విధంగా సునాయాసంగా నరకుడి బాణధాటికి నిలుపుతూ, వాడి బాణాలు భస్మంచేస్తూ తన బాణాలతో వాడి శరీరాన్ని తూట్లుపడచేస్తూ సత్యభామ యుద్ధ నైపుణ్యం ప్రదర్శించింది.

నరకుడు భీతితో, ఆశ్చర్యంతో ఆ వీరవనితను చూస్తూ నుంచున్నాడు.

శ్రీకృష్ణుడు, తన ప్రియురాలిని అభినందిస్తూ, శత్రువు మీద శతఘ్నిని ప్రయోగించాడు. ఆ ఆయుధ ప్రభావంతో నరకుడి సైన్యం పారిపోయింది.

నరకుడు శక్తిని ప్రయోగించాడు.

గరుత్మంతుడు దాన్ని హరించాడు.

శ్రీకృష్ణుడు చక్రాయుధం ప్రయోగించాడు. సుదర్శన చక్రం కన్నులు మూతలుపడేలా మెరుపులుచిమ్ముతూ, నిప్పులు కురిపిస్తూ క్షణ మాత్రంలో నరకుడి కంఠం తెగవేసింది.

సంతోషంతో సురలు పూలవానలు కురిపించారు.

నరకుడు చనిపోవడంతో, అతని తల్లి భూదేవి, దేవతలనుండీ బలవంతంగా తెచ్చిన కుండలాలు వాసుదేవునకు అర్పించింది.

"సర్వభూతాలకు ఎవరు ఆశ్రయమో, ఎవరు కర్త అయి ఉన్నారో ఎవరి కృపతో లోకాలు సాగుతున్నాయో, ఎవరి ఆజ్ఞకు ప్రకృతి నియమితమై ఉందో, వారికి నమస్కారాలు. శత్రువు చనిపోయిన తరువాత శత్రుత్వం ఏముంది, ఇప్పుడు అతిశాంతుడవూ, వరదాతవూ అయి ఉన్నావు. వీడు నరకుడి కొడుకు, బాలుడు. నిస్సహాయుడు, శరణాగతుడు. వీడిని దయచూపడం నీ ధర్మం ప్రభూ" అంది భూదేవి.

నరకపుత్రుడయిన భగదత్తుడు శ్రీకృష్ణ చరణాల మీద వ్రాలాడు. శ్రీకృష్ణుడు ఆ బాలుడికి అభిషేకం చేసి రాచపదవి అనుగ్రహించాడు.

అంతకు ముందు నరకుడు చెరబట్టిన పదహారువేల మంది కన్నెపిల్లల చెర విడిపించి, భగదత్తుని పిలిచి, వారినందరిని, సగౌరవంగా వారి వారి దేశాలకు పంపమన్నాడు శ్రీకృష్ణుడు.

అయితే, ఆ కన్నె పిల్లలందరూ ముక్త కంఠంతో ఇలా అన్నారు.

"చెర శారీరకమైనదేవో విడివడింది మహాత్మా! ఇప్పుడు మేమందరం మానసిక చెరలో ఉన్నాం. ఈ చెరను విడిపించడం నీ కర్తవ్యం కదా స్వామీ! లోకాలకు ఎవరు స్వామి అయి ఉన్నారో వారే మాకూ, మా జీవితాలకూ స్వామి అవుతాడు గాక!" అంటూ వారు ముకుళిత హస్తాలతో నుంచున్నారు.

శ్రీకృష్ణుడు మందహాసంతో సత్యభామ వైపు తిరిగాడు.

"మీరెంతటి సరసులో ఎవరికి తెలీదు ప్రభూ! ఈ పదహారువేల మందికే కాదు. ఈ లోకులకందరికీ మీరు భర్తలే! కానివ్వండి! కన్నె చెర విడిపించడం, పురుష పుంగవులయిన మీకూ, మాకూ ఆనందదాయకమే" అంది సత్యభామ నవ్వుతూ.

అదితికి కుండలాలు స్వయంగా ఇవ్వవలెనని శ్రీకృష్ణుడు సత్యభామతో స్వర్గానికి వచ్చాడు. ఆమెకు కుండలాలు ఇచ్చి, ఇంద్రుడి మర్యాదలు పొంది, ఉబుసుపోకకు నందనవనానికి ఆ దంపతులు వచ్చారు.

సత్యభామ ప్రలోభం కొద్దీ, ఓ పారిజాతం మొక్కను పెరికింది. వన రక్షకులు, ఆ విషయం ఇంద్రునకు చెప్పారు.

ఇంద్రుడు గొప్ప ఐశ్వర్యం కలవాడు. నందనంలో పారిజాతాలకు కొదువ లేదు. ఒక మొలక కృష్ణుడంతటి వాడు తీసుకుంటే, పోనీయ్‌లే అని అతడు ఊరుకోలేదు. కోపంతో ఊగిపోయాడు ఇంద్రుడు.

ఐరావతం ఎక్కి చక్కా వచ్చాడు.

వాసుదేవుడు గరుడిపై వెళుతున్నాడు.

ఇంద్రుడు ఆగమన్నాడు. "ఆ పారిజాతం ఇచ్చి మరీ వెళ్లు!" అని అతడు హెచ్చరించాడు. శ్రీకృష్ణుడు మందహాసం చేశాడు.

ఇంద్రునకు బాసటగా ఇతర దేవతలు వచ్చారు.

యుద్ధం ప్రారంభం అయింది.

నరకుడి బాధ పడలేక, రక్షింపవలసిందని, ఎవరి పాదాలను ఆశ్రయించాడో, ఎవరు దేవతలు మానమర్యాదలను కాపాడారో, వారి మీదకు, ఓ చిన్ని పారిజాతం మొలక కోసం, దేవతలు యుద్ధానికి రావడమేమిటి? కారణమేమిటి?

ఐశ్వర్యమా? అధికారమా? అజ్ఞానమా?

అన్నింటినీ రూపు తీర్చున్నట్లు ఇంద్రుడు శ్రీకృష్ణుడితో పోట్లాటకు దిగాడు. అయితే ఇంద్రుడు కృష్ణుడి ధాటికి ఆగలేకపోయారు.

పెక్కబలం చూపించాడు. శ్రీకృష్ణుడు ద్వారకకు వచ్చి చేరాడు. ఆయన పదహారు వేల కన్నెలను ఓ శుభముహూర్తంలో వివాహం చేసుకున్నాడు. ఆనందమే రూపైన విధంగా ఆయన జీవితం గడపసాగాడు.

స్వయంవరంలో ప్రద్యుమ్నుడు రుక్మవతిని వివాహం చేసుకున్నాడు. ఆ దంపతులకు అనిరుద్ధ కుమారుడు జన్మించాడు.

అనిరుద్ధునికి రుక్మలోచనతో వివాహం నిశ్చయం అయింది. ఆ పెండ్లికి యాదవ బలగం యావత్తూ బయలుదేరింది.

వివాహనంతరం విశ్రాంతి తీసుకుంటుండగా, కాళింగుడు రుక్మి దగ్గరకు వచ్చాడు "జూదం ఆడడంలో బలరాముడికి నేర్పు లేకపోయినా, మక్కువ ఉంది. అతడితో జూదం ఆడి ఓడించి, గేలిచేసి నీ పాత పగ తీర్చుకోగల మంచి సమయం చిక్కింది!" అని ఎక్కతోశాడు.

కర్మబద్ధుడయిన రుక్మి అంగీకరించాడు. బలరాముని ఆటకు పిలిచాడు. బలరాముడు సై అన్నాడు.

ఏదో కొంత పందెం కాసి, ఆడేందుకు ఉభయులూ అంగీకరించాడు.

ప్రతిసారీ రుక్మి గెలవసాగాడు. కోపంతో బలరాముడిలో పంతం పెరిగింది. పందెం పెంచాడు. చివరకు లక్ష అన్నాడు. రుక్మి నవ్వుతూ అంగీకరించాడు.

ఆ ఆటలో బలరాముడు గెలుపొందాడు. అయితే గెలిచింది తానే అన్నాడు రుక్మి. అక్కడ చేరిన వారంతా రుక్మి స్నేహితులు కావడం వల్ల రుక్మికి మద్దత్తు ఇచ్చారు.

చేసేది లేక బలరాముడు మరొక పందెం కాచాడు. ఆ సారీ బలరాముడు గెలిచినా, గెలిచింది రుక్మినే వారంతా ముక్త కంఠంతో వాదించారు.

కోపం కొద్దీ బలరాముడు ఆకాశవాణిని నిజం చెప్పమని ప్రార్థించాడు.

ఆ శరీరవాణి గెలుపు బలరాముడిది అన్నది. అయితే రుక్మి కూటము అంగీకరించలేదు.

"అక్ష విద్యలో మేం విశారదులం. ఆవులూ, ఎద్దులూ కాచే పశుల కాపరలకి నైపుణ్యం ఎక్కడినుండీ వస్తుంది? వృధా వాదాలు వద్దు. పందెం అక్కడ పెట్టు" అన్నాడు రుక్మి దర్పంగా.

బలరాముడు కోపంతో వణికిపోతూ, కండ్లలోంచి నిప్పులు రాలుతుండగా, హలాయుధం ధరించి, కాళంగుడి పళ్ళు రాలకొట్టి, రుక్మిణి చావకొట్టాడు. ఈ కలకలంతో, మిగతా రాజులు పారిపోయ్యారు.

రుక్మి చావడం విని, శ్రీకృష్ణుడు మౌనం వహించాడు. రుక్మిణి బాధను మ్రింగుకుంది.

ఈ విషయం గురించి చర్చించేందుకు ఎవరికీ ధైర్యం చాల్లేదు. అందరూ మౌనం వహించారు.

వివాహం అలా ముగియడంతో, యాదవులు ద్వారకకు వచ్చి చేరారు.

★ ★ ★



# ఉషాబాల

బలికి నూర్గురు కొడుకులు. పెద్దవాడు బాణుడు. ఈశ్వరుని గురించి తపస్సు చేశాడు. సాక్షాత్కారం కలిగింది.

సహస్ర బాహువులు వరంగా పొందాడు. అంతేకాక తన గుమ్మంలో కావలి భటుల్లా విశ్వకర్తా భోక్తా అయిన పరమేశ్వరుని సతీ సమేతంగా ఉండవలసిందని కోరారు.

భక్త సులభుడు అయిన పరమేశ్వరుడు అంగీకరించి గణసమేతుడై, సతీసమేతంగా, వాడి గుమ్మంలో పడుగాపులు కాస్తూ పడి ఉండసాగాడు.

ఇలా ఉండగా, మదోద్ధతుడై మిన్నూ మన్నూ కానక ప్రవర్తిస్తూ ఈశ్వరుడి దగ్గరకు వచ్చి, "స్వామీ! నీవు ఇచ్చిన వేయి చేతులూ తీటపుడుతున్నాయి. లోకంలో నా సాటివాడు, నాతో యుద్ధం చేయగల వాడూ లేక పోవడం వల్ల నాకు చింతగా ఉంది. నాకు ఎప్పుడు యుద్ధం వస్తుందో చెప్పుదేవరా! యుద్ధం లేక ఆయుధాలు తుప్పు పడుతున్నాయి." అంటూ బాణుడు అడిగాడు.

ఈశ్వరుడికి వాడి గర్వం అసహ్యం అయింది. వాడి దర్పం శృతిమించిందనిపించింది.

"నీకోటమీది టెక్కెం త్వరలో నేలకూలుతుంది. అప్పుడు నా అంతటివాడితో యుద్ధం కలుగుతుంది. నీతలకెక్కిన గర్వం, నీ చేతుల తీటా వదలుతుంది. తొందర పడకు!"

బాణుడు నవ్వుకుంటూ, అక్కడినుండీ వెళ్లిపోయి, ఎప్పుడు తన జెండా నేల కూలుతుందా అని ఎదురు చూడసాగాడు.

బాణునకు ఒక కూతురు ఉంది. ఆ పిల్ల పేరు ఉష, ఉషాబాల అతిలోకసౌందర్యవతి. మన్మథుడి ఆరవబాణం. లావణ్య తారుణ్యాలతో, యుక్తవయస్సుతో వికసించిన పద్మం వలె ఉషాబాల ముగ్ధ మనోహరంగా తయారయింది.

ఒకనాటి రేయి, ఆ బాల నిదుర పోతుండగా, మూడవ ఝామున ఒక కల వచ్చింది. అసమాన రూపురేఖలతో నూతన యౌవనుడయిన వాడొకడు కలలో కనిపించి, మురిపించి, వలపించినటుల ఉషకు తోచింది.

ఆ కల నిజంవలె ఉంది. మేలుకొన్నా, మేనపులకలతో, మనస్సున గిలిగింతలు పెట్టే కలకలలతో ఆ స్వప్నమూర్తి కనుల ముందున్నట్లు, అలరిస్తున్నట్లూంది.

ఉత్కటమైన మోహంతో ఉషాబాల ఉక్కిరిబిక్కిరై పోతూ రానురాను మౌని అయి, విరహిణి అయి, దుఃఖిత అయింది.

బాణుడు మంత్రి కుంభాండుని, కూతురు చిత్రరేఖ. ఉషకు చెలికత్తె. ఆరవ ప్రాణం కూడా! చిత్రరేఖ చతుర. జాణ. అనేక విద్యల్లో నిష్ణాత!

తననెచ్చెలి అలా కృశించి పోవడం చూచి చిత్రరేఖ బాధపడి సంగతేమిటని అడిగింది.

తన స్వప్నం గురించి, తన అనుభవం గురించి ఉష, చిత్రరేఖకు చెప్పింది.

"ఉష్! ఇంతేనా? నీకెందుకూచింత? నీప్రియుడు ఎవడేనా కానీ, ఎక్కడ ఉండేవాడుగానీ, క్షణాల్లో నీముందు తెచ్చిపడవేయగలను. నీవు సంతోషంగా ఉండు! ముందు నీ ప్రియుడు ఎవరో తెలుసుకుందాం! ఆ తర్వాత సంగతి ఆలోచిద్దాం!" అంటూ చిత్రరేఖ ఆశ్వాసించింది.

చిత్రరేఖ చిత్రలేఖనంలో సిద్ధహస్తురాలు. అనేక రాకుమారుల చిత్రాలు, దేవదానవ గంధర్వకుమారుల చిత్రాలు లిఖించి తెచ్చింది. ఆ చిత్రాలను ఉషకు చూపించింది.

"ఇప్పుడు నీ ప్రియుడెవడో చెప్పు!" అంది చిత్రరేఖ.

ఉష ఆ చిత్రాలను ఒకటొకటిగా చూసింది. చివరకు తన ప్రియుని చిత్రపటం గుర్తించి, చిత్రరేఖకు ఇచ్చింది.

"ఓహ్. ఇతడా నీ ప్రియుడు? ఇతడెవరనుకున్నావ్? శ్రీకృష్ణదేవుని మనుమడు. అనిరుద్ధుడు. ఈడూ జోడూ బాగానే కుదిరింది. దిగులుపడకు. ఈ రాత్రికే నీప్రియుడు నీముందుంటాడు!" అంది చిత్రరేఖ.

చిత్రరేఖ ఆకాశ గమనంతో, అదృశ్యరూపంతో ద్వారక చేరింది. తన భార్యతో నిదురిస్తున్న అనిరుద్ధుడిని ఆమె తన యోగబలంతో శోణ పురానికి తెచ్చి ఉష పడక మీదకు చేర్చింది.

"నీ వంటి సఖి ఎందరకు ఉంటుంది? నాప్రాణాలు నిలచాయి. నీ ఋణం ఎలా తీర్చుకోను?" అంటూ ఆప్యాయంగా ఉష, చిత్రరేఖను కౌగిలించుకుంది.

చిత్రరేఖ నవ్వింది.

ఉషానిరుద్ధులకు పొద్దుపొడవడంగానీ, అస్తమించడంగానీ తెలియలేదు. అంతఃపురం నుండీ వారు బయటకు రావడమూ లేదు.

బాణుడు ఎప్పుడు తన కూతురు గురించి అడిగినా ఉష అక్కడ ఉందీ, ఇక్కడ ఉందీ అంటూ చెలికత్తెలు జవాబిచ్చేవాళ్లు.

అలా కొంతకాలం గడిచేసరికి ఉషచూలాలు అయింది. చెలికత్తెలు భయంతో బిక్కచచ్చి పోయారు. బాణుడు చండశాసనుడు. అతడికి ఈ విషయం తెలిస్తే? పోతుటీగ కయినా ప్రవేశంలేని కన్యావాసంలోకి ఎవరో మగవాడు రావడం, ఆ వచ్చిన వాడు రాకుమారిని చూలాలిని చేయడం, అంతఃపురంలోనే తిష్టవేసుకుని కూర్చోడమూ చెలికత్తెలకు ప్రాణ సంకటం అయింది. రాజుకీవిషయం చెప్పడమా? చెప్పకపోవడమా? చూలు అయిన విషయం ఎంతకాలం గుప్తంగా ఉంచడం? అలా గోప్యం చేయడమూ క్షేమంకాదు. ఎలాగయినా దండన తప్పదు.

ఉషాబాల చూలు అయిన విషయం విని బాణుడు, ఆజ్యం పోసిన యాగాగ్ని వలె మండిపడ్డాడు. క్రోధంతో కండ్లు చింత నిప్పులయ్యాయి.

"ఎవడువాడు? వాడిని ముక్కలు క్రింద నరకుతాను" అంటూ బాణుడు పెద్ద పెద్ద అంగలు వేస్తూ అంతఃపురం వచ్చాడు.

ఏ దేవతో రాసిన చిత్రపటం వలె నిశ్చలంగా నిదురిస్తున్న అనిరుద్ధుని అతడు చూశాడు.

"వీడిని కట్టి పడెయ్యండి! కత్తికో కండగా తరగండి" అని బాణుడు ఆజ్ఞాపించాడు.

ఉష దుఃఖంతో ఒదిగినుంచుంది.

సైనికులు చుట్టుముట్టేంతలో, నిద్రలేచిన అనిరుద్ధుడు, ఛెంగున లంఘించి, ఓ సైనికుని కత్తిని ఒడుపుగా ఊడబెరికి, వారితో యుద్ధం చేయసాగాడు. క్షణాలమీద, సైనికులను నిరాయుధులనూ, నిర్వీర్యులనూ చేసి, వీర విహారం చేస్తున్న ఆ వీరకుమారునితో బాణుడు తలపడ్డాడు. అక్షీణ బలుడైన అనిరుద్ధుడు, బాణశక్తికి అలవికాలేదు.

బాణుడు, తన మాయాశక్తితో, అనిరుద్ధుని నాగపాశబద్ధుని చేశాడు.

ఇంతలో మహేశ్వరుడు సూచించిన విధంగా కోట మీదిజెండా నేలకూలింది.

అక్కడ ద్వారకలో, పడుకున్న పడక మీద అదృశ్యం అయిన అనిరుద్ధుని సమాచారం తెలియక యాదవులు విచారింపసాగారు.

ఒకనాడు నారదుడు, ద్వారకకు వచ్చి, వారి చేత పూజితుడై అనిరుద్ధుని సమాచారం తెలిపాడు.

శ్రీ కృష్ణ బలరాములు, యాదవబలాన్ని సిద్ధం చేసుకుని శోణపురానికి బయలు దేరారు.

తన చేతుల తీట తీరబోతుందని బాణుడు సంతోషంతో యుద్ధానికి ఎదురు చూడసాగాడు.

ఆ యుద్ధం దారుణంగా పరిణమించింది.

ప్రమథులు వెంటరాగా శూలహస్తుడైన పరమేశ్వరుడు బాణునికి బాసటగా నిలచాడు.

బాణుడు క్రమంగా బడలిక చెందడం, మురారి భయంకరుడై విజృంభించడం చూసి, త్రిపురాంతక దేవుడు, అగ్నికణాలు రాలే బాణాలు అనేకం కుప్పించాడు.

త్రోవలోనే ఆ బాణాలను ముక్కలు చేసి కృష్ణుడు నవ్వాడు. ఈశ్వరుడు బ్రహ్మాస్త్రం సంధించాడు. కృష్ణుడు బ్రహ్మాస్త్రం అందుకున్నాడు. ఈశ్వరుడు ఒక్కోబాణం వేయడం, కృష్ణుడు ఆ బాణాన్ని ఉపసంహరించడమూ, చూడగా, అదో వినోదం వలె, లీలవలె కనిపించింది.

చివరకు హరుడు పాశుపతాస్త్రం సంధించాడు. మురహరుడు నారాయణాస్త్రం విడచాడు. ఆ రెండు అస్త్రాలు కృష్ణుడు ఉపసంహరించి, ''హరా! పరమేశ్వరా! నీ భక్త రక్షణ ఇకచాలు!'' అంటూ సమ్మోహనాస్త్రం విడచాడు. ఆ బాణశక్తి వలన పరమేశ్వరుడు పరవశుడై నిమీలిత నేత్రుడైనాడు. ఆ సమయంలో శ్రీకృష్ణుడు సైన్యాన్ని చించి చెండాడాడు.

బాణుడు వేయి చేతులతో వేయిధనువులు ధరించి అంపవాన కురిపింపసాగాడు.

కృష్ణుడు వాడి ధనువులనూ విరచి, వళ్లంతా తూట్లుపడ నొప్పింపగా, బాణుడు ఖిన్నుడై, నిరాయుధుడై నిలచాడు.

ఇంతలో కృష్ణుడు తన కొడుకును చంపుతాడన్న భయంతో బాణుని తల్లి వివస్త్ర అయి కృష్ణుడి ముందుకు వచ్చి నిలచింది.

ముకుందుడు జిగుప్సతో ముఖం తిప్పుకున్నాడు.

అదే అదనుకుని బాణుడు పారిపోయాడు. అయితే అలా పోయినవాడు పోక, తిరిగి వచ్చి కృష్ణుని మీద బాణ వర్షం కురిపింపసాగాడు.

కృష్ణుడు తన చక్రంతో బాణుని సహస్ర బాహువులను ఖండించి, తలనుత్రుంచ బోతున్నంతలో సదాశివుడు కృష్ణుడి ముందుకు వచ్చాడు.

''ఈ బాణుడు నా భక్తుడు. వీడి ప్రాణాల కోసం నేను నిన్ను ప్రార్థిస్తున్నాను. వీడిని రక్షించు స్వామీ!''

కృష్ణుడు నవ్వి, ''వీడు చంపదగిన వాడుకాడు. ప్రహ్లాదునకు, అతని వంశం వారిని చంపనని మాట ఇచ్చి ఉన్నాను. వీడు ఆ వంశం వాడే కదా స్వామీ!'' అన్నాడు.

బాణుడి గర్వం అణగి పోయింది. జ్ఞానం కలిగింది.

''ఉష నీ కూతురు వంటిదే! అనిరుద్ధుడు నా కొడుకు వంటివాడే! వీరి నెయ్యం గురించి, మనకెందుకూ కయ్యం? నీతో వియ్యమందడానికి నేనెంతో పుణ్యం చేసుకుని ఉంటాను. నన్ను మన్నించుతండ్రీ!'' అని చేతులు జోడించాడు.

యుద్ధం విరమించారు: అది వివాహంతో ముగిసింది.

ఉషా నిరుద్ధులకు ఆ సమయంలో వెలలేని కానుకలనెన్నో బాణుడు సమర్పించుకున్నాడు.



# నృగమహారాజు

ఇక్ష్వాకువంశకర్త అయిన ఇక్ష్వాకుని కొడుకు నృగుడు. గొప్ప ధర్మాత్ముడు; దాత! బ్రాహ్మణులకు అనేక వేల గోదానాలు, హిరణ్యభూదానాలూ విరివిగా చేశాడు.

ఒకానొకసమయంలో ఒకబీద బ్రాహ్మణునకు రాజు గోదానం చేశాడు. ఆ గోవు ఎల్లాగో తప్పించుకుని, తిరిగి రాజుగారి గోశాల చేరింది. గోవు పోయినదారి తెలియక అతడు చింతించాడు. చివరకు ఆ విషయం మరచిపోయాడు.

మందచేరిన ఆవు గురించి రాజుకే కాక గోపాలురకూ తెలియదు. ఎవరో దానం అడిగితే, రాజు గోదానం చేశాడు. విధివశాత్తూ రాజు దానం చేసిన గోవు, మందకు చేరిన బ్రాహ్మణుని గోవు ఒకటే కావడమూ ఎవ్వరకూ తెలియదు.

కొత్తగా దానం పుచ్చుకున్న బ్రాహ్మణుడు, తన గోవును తోలుకుని వెళుతూండగా, మొదటదానం పట్టిన వ్యక్తి తారస పడ్డాడు. అతడు తన గోవును గుర్తు పట్టాడు.

''ఇది నా గోవు! దొంగిలించుకుపోతున్నావా?'' అంటూ అన్నాడు అతడు.

''రాజుగారు ఈ గోవును నాకు దానం ఇచ్చారు. ఈ చేతులను చూడు! ఆయన పోసిన దానజలం తడి ఈ చేతుల్లో ఇంకా ఆరనైనా లేదు. నన్ను పట్టుకుని దొంగిలించుకపోతున్నావా? అని అడుగుతావా?''

ఇరువురకూ మాటమాటా పెరిగింది. చివరకు తీర్పుకోసం నృగ మహారాజు దగ్గరకు వారు వచ్చారు.

ఇరువురి వాదాలు విన్న తరువాత అసలు విషయం రాజుకు అర్థం అయింది. ఆయన నొచ్చుకుంటూ, ''ఈ పొరబాటు నా వల్లనే జరిగింది. దీనికి బదులు వేయిగోవులను ఇస్తాను. ఎవరో ఒకరు, తమ హక్కును వదలుకోండి!'' అని ప్రార్థించాడు.

పుచ్చుకున్న దానం విడచి పెట్టేందుకు ఎవరూ అంగీకరించలేదు. ఫలితంగా ఇరువురూ ఆగోవును విడచి వెళ్లారు.

అలా కావడం రాజుకు దుఃఖం కలిగింది.

కొంతకాలానికి ఆయన కాలం తీరింది.

బ్రాహ్మణ ద్రవ్యం అపహరించిన నేరం ఆయన తలకు చుట్టుకుంది. ఆ పాపఫలితంగా ఆయన తొండ అయిపుట్టడం జరిగింది. నీరు లేని బావిలో ఊసరవెల్లిగా అతడు జన్మించిన తరువాత చాలాకాలం గడచిపోయింది.

ఒకసారి యాదవులందరూ శ్రీకృష్ణబలరామ సహితులై వన విహారం బయలు దేరారు. వారు విహారం చేస్తూ దాహ పీడితులై బావిని వెదకుతూ, ఈ బావిని సమీపించారు.

నీటి కోసం ఆకూపంలోకి తొంగి చూడగా, నీరులేక పోగా కొండవలె ఉన్న తొండ కనిపించింది. వారికి జాలి కలిగింది. దాన్ని బయట పడవేద్దామన్న ఉద్దేశంతో వారు తాళ్లూ కర్రలూ తెచ్చి ప్రయత్నం చేశారు.

అయితే ఆ ఊసరవెల్లిని వారు కదిలించలేక పోయారు. శ్రీకృష్ణునకు ఆ అద్భుతం వారు చెప్పారు. ఆయన ఆ కూపాన్ని సమీపించి ఒక గడ్డిపరకు ఎత్తి పడవేసినట్లుగా ఆ తొండను ఇవతలకు లాగాడు.

ఆ ఊసరవెల్లికి శ్రీకృష్ణకర స్పర్శ తగలడం చేత పాప జన్మఅంతరించి, దివ్యపురుషరూపం కలిగింది.

''భగవన్! నా కర్మ అంతరించింది నేను పునీతుడనయ్యాను.'' అన్నాడు అతడు.

యాదవులు కోరిన మీదట, అతడు తన వృత్తాంతం వినిపించాడు.

''దానం ఎవరికయినా ఇస్తే, మళ్లీ దాన్ని తీసుకోరాదు. గొప్పపాపం కలుగుతుంది. అది తెలిసి చేసినా, తెలీక చేసినా ఒకటే! అందులో విప్రదానం అగ్నివంటింది. నిలువునా దహించగలదు!''



## కాళిందీనది

ఒకనాడు బలరాముడు రేపల్లెకు వచ్చాడు. బంధుమిత్రులు ఎంతగానో సంతోషించి, పేరుపేరునా కుశల ప్రశ్నలు వేశారు.

బలరాముడు, తాను చిన్ననాట తిరిగిన చోట్లను, తన మిత్రులతో తిరుగుతూ గతస్మృతులను నెమరు వేసుకోసాగాడు.

గోపికలు నాటి రేపకడ బలరాముని చేరవచ్చారు. వారు కృష్ణుడితో క్రీడించిన ప్రదేశాలు ఒకటొకటిగా గుర్తు చేసుకుంటూ కృష్ణ విరహానికి కుమిలి పోతూ, ఆయన నిరాదరానికి కోపగించుకుంటూ బలరాముని ముందు అనేక నిష్ఠురాలాడారు.

బలరాముడు, తనకు తోచిన విధంగా వారిని ఊరడించాడు.

బలరాముడు, తన ప్రియాంగనలతో అక్కడ కొన్ని రాత్రులు విహరించాడు. ఆ సమయంలో వరుణదేవుడు మద్యభావ అయిన వారుణీదేవిని పుట్టించాడు. బలరామునకు కానుక చేశాడు. బలరాముడు తన ప్రియాంగనలతో వారుణి తనివి తీరా సేవించాడు. ఆ సేవలో తలమునకలయిన వారికి మత్తు కలిగింది.

మదిరా పానమత్తులయిన వారు విహారం చాలించి, స్నానం చేయవలెననుకున్నారు. బలరాముడు ఒళ్లు తెలీని స్థితిలో యమునను, తన దగ్గరకు రమ్మని ఎలుగెత్తి పిలిచాడు.

అతడో మత్తుడని యమున, అతని ప్రలాపాలను లెక్క చేయలేదు. బలరాముడు అసలే కోపిష్టి. పైగా కల్లు తాగాడు. ఫలితం ఉన్మత్తుడైనాడు. అతడేం చేస్తున్నాడో, ఏం అంటున్నాడో, అతడికే అర్థం కాని స్థితి అది.

అతడు నాగలి ఎత్తాడు ''కాళిందీ! నీవురాక పోయావో, చూడు! నిన్నేంచేస్తానో తెలుసా? ఈ నాగలితో నీ గుండెను చీల్చి వెయ్యి ముక్కలు చేస్తాను. వేయి పాయలై ఎండిపోగలవు. జాగ్రత్త!'' అని గర్జించాడు.

అంతటితో ఆగక నాగలితో యమునను లాగసాగాడు.

యమున గడగడ వణికి పోయింది. బలరాముడు ఉద్రేకి. అన్నంత పని చేయగలడని అనుకుంది. స్త్రీగా మారి యమున, బలరాముడి దగ్గరకు వచ్చింది.

''అయ్యా! బలరామయ్యా! నీకెందుకింత కోపం! అనన్య సామాన్యమైన నీ పరాక్రమం, ఓ అబల మీద చూపడం నీవంటి వారికి ఉచితమా? నీవు కోరిన విధంగానే ప్రవహిస్తాను. నీవారితో మునకలు వెయ్!'' అంది కాళింది.

''వద్దు! పూర్వ మార్గంలోనె నీవు ప్రవహించు!'' అన్నాడు బలరాముడు.

బలరాముడు తన ప్రియాంగనలతో మత్తు తీరా, తృప్తితీరా స్నానం చేశాడు. యమునా నది బలరాముడి నాగలి దెబ్బకు గుర్తుగా, నేటికీ తెల్లటి పాయతో కనిపిస్తోంది.



# పౌండ్రక వాసుదేవుడు

నిజానికి హరి అవతారం తనేననీ, గోపాల కృష్ణుడు కేవలం నటుడనీ పౌండ్రక వాసుదేవుడు, కనిపించిన వాళ్లకంతా చెబుతూ తిరుగుతూండేవాడు. అంతటితో ఆగక, అతడు మెడలో శ్రీవత్సం, చేతిలో గద, శంఖం శార్ఙ్గం ధరించాడు. ఆ ఆయుధాలు అతడు ఎంతో కష్టపడి చేయించి మరీ పెట్టుకున్నాడు. అతడు అలా చెప్పడం, తిరగడం శ్రీకృష్ణుడి చెవికి అందింది. ఆయన నవ్వి ఊరుకున్నాడు.

పౌండ్రక వాసుదేవుడు అంతటితో ఊరుకోక, పనికట్టుకుని ఒక దూతను కృష్ణుని కొలువుకు పంపాడు.

ఆ దూత పౌండ్రకుని మాటగా ఇలా చెప్పాడు. ''నీవు నటుడివి. నటునకు అవసరం అయిన సరంజామా, ఎల్లాగో సంపాదించావు. అవన్నీ పెట్టుకుని ఊరేగుతున్నావు. అసలు

మహావిష్ణువునూ, శ్రీ హరిని నేను. ఈ పెట్టుడు నగలు పెట్టుకోడం ఆపు. నాశరణు పొందు! బతికి పోతావు. లేకుంటే, మాకు మేమే వచ్చి బలవంతంగా నీవు ధరించిన పెట్టుడు నగలు ఊడబెరుక్కపోతాము.''

ఆ దూత సందేశం విని కృష్ణుడు నవ్వాడు.

''నేను నటుడనే! ఈ కృత్రిమ చిహ్నాలు మీ రాజుమీదనే ప్రయోగిస్తాను. వాటి ధాటికి వాడుగనక చస్తే కాకులకూ గద్దలకూ యింత ఆహారం చిక్కుతుంది. సిద్ధంగా ఉండమను'' అని కృష్ణుడు ప్రతిసందేశం పంపాడు.

శ్రీకృష్ణుడు సైన్యం తీసుకుని కాశీకి వచ్చి చేరాడు.

పౌండ్రక వాసుదేవునకు కాశీరాజు అండగా నిలచాడు.

యుద్ధం తీవ్రం అయింది. భీభత్సంగానూ మారింది.

కృష్ణుడు, తన చక్రాయుధంతో పౌండ్రకుని తలత్రుంచాడు. కాశీరాజు తల కోసి అంతఃపురంలో పడేట్టుతన్నాడు.

కాశీరాజు కొడుకు సుదక్షిణుడు, తండ్రి మరణానికి మండిపడ్డాడు. ప్రతీకారంతో కుతకుతలాడాడు.

తనకున్న బలం చాలదని సుదక్షిణుడు పశుపతిని ఆరాధించాడు. అతని తపస్సుకు మెచ్చి ఈశ్వరుడు కనిపించాడు. అప్పుడు అతడు శ్రీకృష్ణుని వధించే ఉపాయం చెప్పమని కోరాడు.

శంకరుడు నవ్వాడు. ''అభిచారం చెయ్! వీలవుతుందేమో ప్రయత్నించు. కాని కోరికలు కోరి ఎందుకు ప్రాణమ్మీదకు తెచ్చుకుంటావ్! మంచి కోరికలు నీ మనస్సుల్లోకి రావుకదా?'' అని ఆయన అదృశ్యమయ్యాడు.

అప్పటికప్పుడు సుదక్షిణుడు, తగిన బ్రాహ్మణులను ప్రలోభపరచి అభిచార హోమం చేశాడు.

ఆ హోమగుండం నుండీ దక్షిణాగ్ని పుట్టుకవచ్చింది. అది కృత్య రూపంలో చూడ భయంకరమై, ఆకాశాన్ని అంటుతూ కనిపించింది. నాలుకను సాపి, శూలపాణిఅయి, వివస్త్రఅయి, నేత్రాల్లోంచి అగ్నిజ్వాలలు రేపుతూ అది ద్వారక వైపునడచింది.

ద్వారకావాసులు, ఆశక్తిని చూసి భయంతో కృష్ణుని ఆశ్రయించారు. కృష్ణుడు వారికి అభయం ఇచ్చి, సుదర్శనాన్ని తలచాడు. సుదర్శన చక్రం కృత్యను దహించి, అంతటితో ఆగక, అభిచారం చేసిన ఋత్విక్కులనూ, సుదక్షిణునీ బూడిద చేసింది.

★ ★ ★




ద్వివిదుడు నరకుని వానరస్నేహితుడు. సుగ్రీవుని మంత్రి అయిన మైందుని తమ్ముడు. తన స్నేహితుని నిర్దాక్షిణ్యంగా శ్రీకృష్ణుడు సంహరించడం ద్వివిదునకు తెలిసింది; వాడు అగ్నిలా మండిపడ్డాడు. దర్పోద్ధతుడైన ఈ వానరుడు ద్వారకకు సుడిగాలిలో వచ్చాడు. ఇండ్లను పడగొట్టి, వృక్షాలను కూల్చి, మందలను చిందర వందర చేస్తూ ఎంతో భీభత్సం కలిగించాడు.

ఇలా దుండగాలు చేస్తూండగా వాడి చెవులకు, దూరంగా మంజులగానం వినబడింది. ఆ గానం వింటూ తన్మయుడై అతడు రైవతగిరి చేరాడు.

ఆ గుహలో తరుణీ, వారుణీ సేవలో బలరాముడు మునిగి తేలుతున్నాడు. అలా వారిని చూడగానే ద్వివిదునకు మర్కట లక్షణాలు పొటమరించాయి. ఎదురుగా ఉన్న చెట్టుఎక్కి, కొమ్మలను ఊపుతూ, పండ్లు కొరుకుతూ, ఇకిలిస్తూ, వెక్కిరిస్తూ, కొమ్మ కొమ్మకూ దూకుతూ, తోకను బాదుతూ, గోళ్ళతో గోకుతూ, నడ్డీ, ముడ్డీ చూపుతూ అనేక రకాలయిన కోతి చేష్టలు వాడు చేయసాగాడు.

వాడి ప్రవర్తన కొంతవరకూ వినోదకరంగా కనిపించినా, కొంతసేపటికి అది దుస్సహం అయింది. బలుడు వాడిని అదలించేందుకు చేతికందిన ఓ రాయి విసరాడు. ఆ దెబ్బను వాడు తప్పుకుని, లోపలకు ఎగిరిదూకి, అక్కడున్న కల్లు కుండను లంకించుకుని ఓ చెట్టు ఎక్కి కూర్చున్నాడు.

ఆ కల్లుకుండను లాక్కోవాలని ఆస్త్రీలు ఎంతగానో ప్రయత్నం చేశారు. స్వభావధర్మం అనుసరించి, ఆ కోతి, ఆ స్త్రీల తలలమీద కల్లుకుండను పగల వేసింది. చీరలు చింపుతూ, నానా అల్లరి చేస్తూ, అల్లకల్లోలం చేస్తున్న, ఆ కోతి చేష్టలు శృతి మించడంతో, వారు దాని పీడ విరగడ చేయమని బలరాముని కోరారు.

చేత ముసలం ధరించి బలుడు గుహ ముఖంనుండీ ఇవతలకు వచ్చి. రోకలిని వాడి మీదకు ప్రయోగిందాడు.

ద్వివిదుడు బలవంతుడుకావడం వల్ల, ఆ దాపున ఉన్న చెట్టొకటి పెరికి రాముడిమీద విసరి కొట్టాడు.

బలరాముని కోపం తారాస్థాయికి చేరింది. నాగలితో వాడి తల మీద బాదాడు. ద్వివిదుడు మూర్ఛపోయాడు.

కొంతసేపటికి తెప్పరిల్లి, కొండబండలను వారిమీదకు దొర్లింపసాగాడు.

బలరాముడు తన సునందం అన్న రోకలితో, ఆబండలను చూర్ణం చేస్తూ, వాడిమీదకు దూకి, తల పగిలేలా కొట్టాడు. వాడు నేలకూలి మళ్లీ లేవలేదు.

★ ★ ★



# సాంబుడు

జాంబవతి కొడుకు సాంబుడు. మంచిసాహసి, సర్వలక్షణ లక్షిత అయిన లక్షణను ప్రేమించాడు. లక్షణ సుయోధనుని కూతురు.

ఒకరోజున, ఎవ్వరితో మాట మాత్రం చెప్పాపెట్టకుండా, సాంబుడు హస్తినకు వచ్చాడు. తిన్నగా అంతఃపురం ప్రవేశించాడు. లక్షణను రథమ్మీద కూర్చుండ పెట్టుకుని ద్వారకవైపు పరుగెత్తుకు రాసాగాడు.

అంత సాహసంతో అంతఃపురం చేరి లక్షణను అపహరించిన సాంబుడిమీదకు క్షణాల మీద, కురుసైన్యంతో సహా కర్ణ సుయోధనాదులు సాయుధులై రథాలు పరువులు పెట్టించారు.

కురువీరులు అంప వానలో సాంబుడిని ముంచివేశారు.

అయితే సాంబుడు శౌర్యసాహసాల్లో తక్కువేమీ కాదు. అందరకూ సమాధానంగా నిలచి యుద్ధం చేశాడు. అందరూ కుమ్మక్కయి ఒక్కమారుగా చుట్టుముట్టి అతడిని విరథుడిని చేశారు. ఆ తరువాత నిరాయుధుడిని చేశారు.

లక్షణతో సహా సాంబుడు వారికి చిక్కిపోయాడు. తమ గొప్పలు చెప్పుకుంటూ కురువీరులు ఇల్లు చేరారు.

సాంబుడి అతీగతీ తెలీక ద్వారకలోనివారు కంగారుపడసాగారు. కృష్ణుడు నిమ్మకు నీరెత్తినట్లు మౌనం వహించాడు. జాంబవతి పుత్ర విరహంతో కుమిలి పోసాగింది.

ఒకనాడు నారదుడు, సాంబుడి విషయం యాదవులకు తెలిపాడు. యాదవులు యుద్ధానికి బయలు దేరారు.

అయితే బలరాముడు కృష్ణునితో ఇలా అన్నాడు.

''కౌరవులు మన బంధువులు; సన్నిహితులు. ఈ చిన్న కారణంగా మనం వాళ్లతో యుద్ధానికి దిగడం మర్యాదకాదు. అంచేత నేను స్వయంగా పోయి, లక్షణ సహితంగా మన సాంబుణ్ణి తీసుకువస్తా! నిశ్చింతగా ఉండండి!''

కృష్ణుడు నవ్వి ఊరకున్నాడు.

బలరాముడు ఒంటరిగా హస్తినకు వచ్చాడు. ఆయన హస్తిన చేరి ఒక వనంలో విడిది చేసి, తన రాకను ఉద్ధవుని ద్వారా కౌరవులకు తెలియ పరచాడు.

కౌరవులు మంగళవాద్యాలు ముందుపెట్టుకుని, మధుపర్కం గోవూ మొదలయిన కానుకలు తీసుకుని బలరామునికి నమస్కరించి సమర్పించారు.

బలరాముడు ఎంతో సంతోషించాడు.

''మనం అందరం బంధువులం! మనలో మనకు విరోధం ఎందుకూ? చాపల్యం కొద్దీ మా సాంబుడు తొందరపడ్డాడు. మిమ్మల్ని అడిగితే మీరు కాదంటారా? ఇప్పుడు మించి పోయిందేమీలేదు. మా సాంబుణ్ణీ, వాడి వధువునూ ద్వారకకు తీసుకుపోతాను.'' అన్నాడు బలరాముడు.

''సాంబుడు అంతఃపుర ద్రోహం చేసిన ద్రోహి! మాకు బందీ కూడా!''

''అయితే ఏమంటావు సుయోధనా?''

''యాదవులతో వియ్యాలు మా కిష్టం లేదు!''

''ఓహో. యాదవులు మీతో వియ్యాలకు సరిపోరా? మరి కయ్యాలకు సరిపోతారేమో చూద్దామా? కృష్ణుడు నేను బయలు దేరుతున్నప్పుడే మీరు నయానికి తగిన వారు కారని చెప్పనే చెప్పాడు. నేనే బంధుప్రీతితో వచ్చాను. మంచిది! నా బంధుప్రీతిని తగినట్లుగౌరవించారు. మీ వీరాధి వీరులనూ, మీ నగరాన్నీ సముద్రం పాలుచేస్తాను. ఏ వీరుడు నీకు ఆసరా అవుతాడో పిలుచుకురా!'' అంటూ బలరాముడు హలాయుధం ఎత్తాడు.

ఆయన తన నాగలి చివరను భూమిలోకి గుచ్చి, భూమి పెటపెటలాడుతూండగా పైకి లేపాడు. అప్పుడు భూమి కంపించింది. నగర సౌధోపరిభాగాలు మహాధ్వనితో ఊగిసలాడాయి.

ప్రజలకూ, ఇతర జీవులకూ ప్రాణభీతి కలిగి ఇటూఅటూ పరువెత్తడం జరిగింది. మహోపద్రవం వచ్చిందని, దానికి ప్రతీకారం తేవక భీష్మద్రోణాదులు మౌనులు అయ్యారు. కౌరవులు బలరాముని పాదాల మీద పడ్డారు.

''మహాత్మా! మన్నించవలె! ఏదోకావరంతో కారు కూతలు మానోట దొర్లాయి. వాటిని మనస్సులో పెట్టుకోకు!'' అంటూ ప్రార్థించాడు సుయోధనుడు.

లక్షణను ఇంతలో సాలంకృతను చేసి సాంబునికి అనేక కానుకలు ఇచ్చి సగౌరవంగా బలరాముని దగ్గరకు తెచ్చారు. కురువీరులు.

''బలరామా! బలంలో నిన్ను మించినవారు పుట్టరు; పుట్టబోరు! నీ బలం తెలిసి కూడా మదం కొద్దీ తలవంపులు తెచ్చుకున్నాం! ఇప్పుడు మా ప్రార్థన మన్నించి శాంతుడవుకా'' అని భీష్ముడు ప్రార్థించాడు.

బలరాముడు భూమిలో గుచ్చిన నాగలిని బయటకు తీశాడు.

సాంబుడినీ, అతడి వధువునూ బలరాముడు ద్వారకకు చేర్చాడు.

ఇప్పటికీ వారణాపురం దక్షణభాగం కొంచెం పైకిలేచి, ఉత్తర భాగం కొంతకుంగినదై, బలరాముని మహాత్మ్యానికి ప్రతీకగా నిలచి ఉంది.



# బహురూపి

ఒకసారి, ఆజన్మబ్రహ్మచారి అయిన నారదునకు గొప్ప సందేహం కలిగింది. ఈ కృష్ణుడు, నరకుడి బందీలయిన పదహారువేలమందిని తెచ్చి పెండ్లిచేసుకున్నాడు. అంతకుముందే అష్టభార్యలు ఉన్నారు. వారితో కాపురం హాయిగా చేస్తున్నాడు. ఇంత మందితో, ఇంత సుఖంగా, శాంతంగా ఆయన ఎల్లా కాపురం చేస్తున్నాడబ్బా? ఒక్కొక్కరితో ఒఖ నిముషం పాటు గడిపినా కాలందాలదే! అయితే ఆయన అందరుభార్యలూ సంతృప్తులూ; సంతాన నతులు. ఇదెలాసాధ్యం అయింది? ఇంత పెద్ద సంసారాన్ని ఆయన ఎలా ఈదుతున్నాడు? ఇదీ నారదునకు కలిగిన సందేహం!

ఎల్లాగయినా, తనకు కలిగిన సందేహం తీర్చుకోవలెనని నారదుడు తీర్మానించుకుని, మొట్టమొదట రుక్మిణి ఇంటికి వచ్చాడు.

లోపలినుండీ శ్రీకృష్ణుడు రుక్మిణీతో వచ్చి, అతిథి పూజలు అవీ చేసి ''ఏం నారదా విశేషాలు?'' అంటూ అడిగాడు నవ్వుతూ.

''మళ్లీ వచ్చి విశేషాలు చెబుతాగా! గొప్ప విశేషమే ఉందిలే స్వామీ!'' అంటూ నారదుడు అక్కడ ఎక్కువసేపు నిలువకుండా సత్యభామ ఇంటికి క్షణాల మీద వచ్చాడు.

అక్కడ శ్రీకృష్ణుడు పూలు అల్లుతూ ''ఏం నారదా క్షేమమా?'' అంటూ పలకరించాడు.

మరో భార్య ఇంట ఆయన వీణ వాయిస్తున్నాడు. ఇంకో ఇంట మురళి వాయిస్తున్నాడు. వేరొక ఇంట సంధ్యోపాసన చేస్తున్నాడు. మరో చోట స్నానానికి వెళుతున్నాడు. ఇంకో చోట బంతు లాడుతున్నాడు.

ఈ విధంగా కాళ్ళు నొప్పులెత్తేంత వరకూ నారదుడు ఇళ్లిల్లూ తిరిగాడు. ఆయా ఇండ్లల్లో ఆయాభార్యలతో శ్రీకృష్ణ దర్శనం నారదునకు అయింది.

శ్రీకృష్ణుడు నవ్వుతూ వ్యంగ్యంగా ప్రతిచోటా తన్ను పరామర్శిస్తున్నాడు.

సర్వవ్యాపి అయిన భగవంతుడు, తన ఉనికిని కేవలం ఈ పదహారువేలా ఎనిమిది తావులకే పరిమితం చేసుకున్నాడా? ఆయన అన్ని చోట్లా ఉన్నాడు లేని చోటు లేదు. చివరకు నారదునకు ఈ సత్యం అవగతం అయింది. ''అన్నన్నా! ఎంతపొరబాటు పనిచేశాను?'' అని నారదుడు అనుకున్నాడు.

చివరకు నారదుడు శ్రీకృష్ణునకు నమస్కరించాడు.

''ప్రభూ! నీ యోగమాయ తెలీక, అల్పుడనై నిన్ను పరీక్షిద్దాం అనుకుని కాళ్లకునొప్పులు తెచ్చుకున్నా. నా చాపల్యాన్ని మన్నించు!నా అల్పబుద్ధిని క్షమించు.'' అని నారదుడు లెంపలు వాయించుకుని తన దారిని వెళ్లాడు.



# రాజసూయం

శ్రీకృష్ణుడు కొలువైన సమయంలో బ్రాహ్మణుడొకడు వచ్చి నమస్కరించాడు.

''జరాసంధుడు లోకకంటకుడైనాడు. తనకు తలవంచని రాజులందరనూ చెరలో పెడుతున్నారు. ఇలా బందీలయిన సంఖ్య ఇరవై వేలకు మించింది ప్రభూ! తమకు తెలీంది లేదు. ఈ రాజకుమారులకు లోకంలో దిక్కులేదు. నీవొక్కడవే వెలుగుదివ్వెవలె వారికి కనిపించావు. అంచేత వారు, నన్ను మీ వద్దకు పంపారు. తమను రక్షింపవలసిందన్న తమ ప్రార్థనను నా మూలంగా చెప్పి పంపారు. దయతో వారిని కడతేర్చవలె మహాత్మా!'' అని చెబుతూండగా సభకు నారదుడు వచ్చాడు.

శ్రీకృష్ణుడు నారదునకు ఆసనం ఇచ్చి, ''పాండవుల విషయం చాలాకాలంగా తెలియలేదు. వారి గురించిన సంగతులేమయినా చెప్పండి?'' అంటూ అడిగాడు.

''నీవు కంటికి రెప్పవలె వారిని రక్షిస్తూండగా. వారి కుశలానికి ఏం తక్కువ స్వామీ? రాజసూయం చేయగా ధర్మరాజు సంకల్పించాడు. త్వరలో ఆహ్వానం అందుతుంది.'' అన్నాడు నారదుడు.

''ఉద్ధవా! నీవు బుద్ధిమంతుడవు. ఇప్పుడు మనకర్తవ్యం ఏమిటి?'' జరాసంధుని చెరలోని రాజులను విడిపించడమా? రాజసూయానికి వెళ్లడమా?

''సమస్తం నీకు తెలుసు! నన్నే పెద్ద చేసి అడిగావు. తెలిసింది చెప్పవలె. రాజసూయానికి వెళ్లి, అటునుండీ జరాసంధుడిని సాధించడం ఉచితం. యుద్ధభిక్షయాచించి, ఒంటరిని చేసి పోరాడ్డం మంచిది.'' అన్నాడు ఉద్ధవుడు.

''మంచి సలహా!'' అని కృష్ణుడు నవ్వి, ప్రయాణానికి సిద్ధం అయ్యాడు.

అల్లంత దూరానికి కృష్ణుడు చేరాడన్న విషయం తెలుసుకున్న ధర్మరాజు సంరంభంతో ఎదురు పోయి, నగరుకు ఆహ్వానించి, కుశలం విచారించి విశ్రాంతికి ఏర్పాట్లు చేశాడు.

"మహాత్మా! నాకు రాజసూయం చేయతలంపు కలిగింది. నీదయ కలిగితే అది క్రియ అవుతుంది" అని ధర్మరాజు అన్నాడు.

కృష్ణుడు నవ్వి, "ఈ యాగం చేయగల వాడివి నీవు! నీతమ్ములు లోకైక వీరులు. లోకం మెచ్చేవిధంగా ఈ యాగం చేద్దాం!" అన్నాడు.

రాజసూయంచేసే ముందు, నాలుగు దిక్కులూ జయించవలసి ఉంది. తూర్పుకు భీముడూ, ఉత్తర దిశకు విజయుడూ, పడమరకు నకులుడూ, దక్షిణం వేపుకు సహదేవుడూ, చతురంగ బలాలు సమకూర్చుకుని విజయయాత్రలకు బయలుదేరారు.

విజయ పరంపరలతో అటు వెళ్లినవారు తిరిగి వచ్చారు.

సర్వలోకపాలురు ధర్మరాజు సార్వభౌమాధికారానికి తలలు వంచారు. అయితే జరాసంధుడుమాత్రం లెఖ చేయలేదు. వాడు కొరుకుడుపడలేదు. ధర్మరాజు అదివిని మౌనం వహించాడు.

"జరాసంధుని సాధింపవలెనని నేనూ చాలకాలంగా అనుకుంటున్నాను. దానికోఉపాయం ఉంది. నీవు చింతింపవద్దు! నేనూ, ఇంద్రసమీరనందనులూ బ్రాహ్మణవేషంలో మగధకు వెళతాం. యుద్ధభిక్షయాచించి, మాలో ఒకరం మాగధుని హతం చేయగలం! దీనికి సందేహం లేదు!" అన్నాడు శ్రీకృష్ణుడు.

బ్రాహ్మణ వేషాలతో ఆ ముగ్గురూ మగధ చేరారు. సంధ్యావందనానంతరం యాచకులకు కాదూ లేదనకుండా దానం ఇవ్వడం జరాసంధుని నిత్యకృత్యం. ఈ కుహనా బ్రాహ్మణులు యాచకుల వరుసలో నుంచున్నారు.

జరాసంధుడు దానాలు ఇస్తూ త్రేతాగ్నులవలె ప్రకాశిస్తున్న ఈ ముగ్గురినీ సమీపించాడు. వారి తేజం చూసి జరాసంధుడు ఆశ్చర్యపోయాడు.

"ఎవరు మీరు? మీకేంకావాలి?" అని అడిగాడు.

"నేను కృష్ణుడను. ఇతడు భీముడు, అతడు అర్జునుడు. మాకు యుద్ధభిక్షకావాలి! నీవు కోరిన ఒకరితో పోరు. ఇది మేం కోరేభిక్ష!."

"నీవూ ఒక వీరుడవని ఇంతకాలానికి నాముందుకొచ్చావు. నీవు వెన్నిచ్చి పారిపోయింది ఎన్ని సార్లో, నీకు జ్ఞాపకం ఉండదు. జ్ఞాపకం ఉంటే, మళ్లీరావు. ఇవాళ వీళ్ళసాయంతో వచ్చావన్నమాట! మీకు బిచ్చం పెడుతున్నాను. నీవు పారుబోతువు. అర్జునుడు బాలుడు. నాతో సరితూగగలవాడు భీముడు. వీడితో పోరుకు సిద్ధం!" అని జరాసంధుడు నవ్వి ముందుకుసాగాడు.

అప్పటికప్పుడే జరాసంధుడు గదను తెప్పించి భీమునకు ఇచ్చాడు. తానొకగదను ధరించి భుజాస్ఫాలనం చేసి గదాయుద్ధానికి అతడు సిద్ధం అయ్యాడు.

వారిరువురూ మత్తమాతంగాలవలె పోరాడసాగారు. భూమి వణకేలా పదఘట్టనలు చేస్తూ, వలయాలు తిరుగుతూ, చూపరుల కండ్లకు గదలు కనిపించనంత వేగంగా, గిరగిరతిప్పుతూ, దారుణంగా పోరాడసాగారు. గెలుపోటములు అర్థంకాలేదు.

భీముడు మాగధుని నేలపడవేసి, ఒకకాలూచేయి పట్టి గుంజగా అతడి శరీరం రెండు ముక్కలయింది. ఆ శరీరఖండాలు నేల పడగానే, తమకు తామె అతుక్కుంటున్నాయి. అలా

ఎన్నిసార్లు చేసినా జరాసంధుడు యథా స్థితికి వస్తున్నాడు. భీముడు ఖిన్నుడై కృష్ణుని వేపు చూశాడు. మురారి ఒక పుల్లను చీల్చి, అటూ ఇటూ అపసవ్యంగా పారవేశాడు. భీముడు కృష్ణుడు చూపిన విధంగానే జరాసంధుని శరీరఖండాలను పారవేశాడు. అప్పుడు ఆ ముక్కలు అతుక్కోలేదు. జరాసంధుడు మరణించాడు.

శ్రీకృష్ణుడు, జరాసంధుని కొడుకైన సహదేవునకు పట్టంకట్టి, బందీలయిన నానా దేశంరాజులను విడిపించాడు.

ధర్మరాజు శ్రీకృష్ణుని ఆజ్ఞపొంది బంధుమిత్రులకు ఆహ్వానాలు పంపాడు.

వ్యాసుడు, కశ్యపుడు, గౌతముడు, వశిష్ఠుడు, విశ్వామిత్రుడు మొదలయిన మహర్షులెందరో వచ్చారు.

కురువృద్ధులూ, గురువులూ, ఇతరదేశాల రాజులూ ఎందరో సబాంధవంగా వచ్చారు.

మహాదాత కర్ణునకు దానాలు ఇచ్చేందుకూ, విందువినోదాల పర్యవేక్షణకు భీమునీ, శ్రీకృష్ణసేవలకు అర్జునునీ, యాగ ద్రవ్యం సమకూర్చేందుకు నకులునీ, బంధుమిత్రసేవలకు సహదేవునీ, భోజనశాలలకు ద్రౌపదినీ ధర్మరాజు నియమించారు.

క్రతువు యథా విధి నెరవేరింది. సమాప్తి రోజున అగ్రపూజ చేయవలె. ఆపూజకు అర్హుడయిన వాడెవడు? అన్న ప్రశ్నవారికి కలిగింది.

తలకొక విధంగా సూచించారు.

సహదేవుడు మాత్రం శ్రీకృష్ణుని నిర్దేశించాడు.

"ఈ దేవదేవుని పూజించినట్లయితే, సర్వదేవతలూ తృప్తులౌతారు. సర్వభూతాలు సంతృప్తం అవుతాయి. కాలం, ధర్మం, గాలీ, నీరూ, నిప్పు, గురువు, మంత్రం, ఆహుతులూ, హుత ద్రవ్యం ఎవరో, వారే నీముందు మూర్తిమంతమై నిలచి ఉన్నప్పుడు, ఈ విషయంలో మహారాజా! చర్చ ఎందుకూ? ఈ గోవిందునికి అగ్రాసనం ఇవ్వండి. పూజించండి. మన క్రతువూ, మన జీవితాలూ ధన్యం అవుతాయి!"

"మంచిమాట చెప్పావు సహదేవా! సృష్టిస్థితి లయలు ఎవరి అధీనమో, వారు మీసుకృతవైభవం వలన మీ నిచ్చెలి అయి, రక్షకుడై ఉన్నాడు. అగ్రాసనపూజకు ఇంతకన్నా అర్హులెవరు నాయనా ధర్మరాజా! ఈ వాసుదేవుని పూజించు!" అని భీష్ముడూ చెప్పాడు.

మహర్షులూ, మిగతా పెద్దలు హర్షించారు.

ధర్మజుడు, సవినయంగా అగ్రాసనమ్మీద కూర్చుండమని శ్రీకృష్ణుని ప్రార్థించాడు. ఆయన సుఖాసీనుడైన తరువాత, పన్నీరుతో, పూలతో ఆయన పాదాలు కడిగి, అర్చించి, ఆ పవిత్రపాదోదకం, తన శిరస్సున చల్లుకుంటున్న సమయంలో దేవతలు పూలవానకురిపించారు.

దమఘోషుడి కొడుకు శిశుపాలుడు. కంసాదులకు పరమమిత్రుడు. శ్రీకృష్ణప్రాభవానికి ఈర్ష్యాసూయలతో కుములుతున్నవాడు అతడు. కృష్ణుని కించపరిచే అవకాశం కోసం ఎదురుచూస్తున్న అతడికి ఇదో అవకాశం అయింది.

ఈ శిశుపాలుడు నాలుగు చేతులతో, మూడుకండ్లతో వికృతంగా పుట్టాడు. అప్పుడు అశరీరవాణి ఎవరు ఈ శిశువును ఎత్తుకున్న సమయంలో ఈ ఉపరి నేత్రం, హస్తాలూ అదృశ్యం అవుతాయో, వారివల్ల వీడికి చావు కలుగుతుందని హెచ్చరించింది. శిశుపాలుడి తల్లి కృష్ణుని మేనత్త. శ్రీకృష్ణుడు ఆ శిశువును ఎత్తుకోగానే ఆ అంగాలు రాలిపోయినవి.

వాడి తల్లి, "నాయనా! కృష్ణా! నాకొడుకు మరణం నీచేతుల్లోనే ఉంది. నా గురించి వాడిని క్షమించు!" అని ప్రార్థించింది.

"అత్తా! వందతప్పులవరకూ నీకోసం నీ కొడుకును క్షమించగలను" అని శ్రీకృష్ణుడు మాటఇచ్చి ఉన్నాడు.

ఆమె అప్పటికి సంతోషించింది.

"ఏదో పిల్ల వాడొక అజ్ఞానపు మాట చెప్పగానే, ఇందరు పెద్దలు, గంగి రెద్దుల్లా తలలూపడం, కృష్ణుని పూజార్హుడని చప్పట్లు కొట్టి మరీ పూజించడం ఎంత విడ్డూరం? ఈ గోపాలుడికి కులమా? గుణమా? వీరత్వమా? ఐశ్వర్యమా? అంతస్థా? ఏం ఉందని పూజింపాలనుకున్నారు? ఆ ఇంటా, ఈ ఇంటా దొంగ కూళ్లు తినడంతోనే బాల్యం గడచి పోయింది. అమాయక గొల్లభామలతో తిరిగిన తిరుగుళ్ల చాలక ఎనిమిదిమందిని పెండ్లి చేసుకున్నాడు! అంతటితో ఊరుకున్నాడా? మరో పదహారువేలమందిని ఎత్తుకవచ్చి కట్టిపడేసుకున్నాడు. ఈతడు ఎంతటి విపరీతకాముకుడో అర్థంకాలేదా? ఇంతటి కామాతురుని ఎక్కడయినా ఎప్పుడయినా చూశారా? చోరుడూ, జారుడూ, కాముకుడూ వీడా పూజార్హుడు? ఈ వెర్రి గొల్లని చుట్టు చేరిన మీరు ఎంతటి వెర్రి వాళ్ళు? చెట్టులేని చోట ఆముదం చెట్టు మహా వృక్షమట.." ఇలా శిశుపాలుడు దుర్భాషలాడుతూండడం విని సభ సహించలేక పోయింది.

శ్రీకృష్ణుడు మందహాసంతో నిరుద్రేకంగా ఉండడం చూస్తూ, ఏమయినా, ఈశ్వర నిందేకాక అది వినడంకూడా మహా పాపం అని మునులూ, మహర్షులూ అక్కడినుండీ వెళ్ళి పోయారు.

పాండవులు, ఒఖ ధర్మరాజు తప్ప మిగిలినవారు కోపోద్రేకంతో వణికిపోసాగారు. కేకయసృంజయాది రాజులు కత్తులు దూసి శిశుపాలుని సంహరించేందుకు ముందుకు వచ్చారు.

శిశుపాలుడు, నోరికి రాకూడని విధంగా దూషిస్తూ, ఉన్మత్తునివలె ప్రవర్తింప సాగాడు.

గోవిందునిలో సహనం పోయింది. వాడి తప్పులు శతాధికం అయ్యాయి. కోపంగా చూస్తూ శ్రీకృష్ణుడు సుదర్శనాన్ని స్మరించాడు. క్షణమాత్రంలో శిశుపాలుడి తల నేలకూలింది. అతడి హితులు భయకంపితులై పరువులు తీశారు.

శిశుపాలుని మృతశరీరాన్నుండీ పుట్టిన జ్యోతి పరమాత్మలో లీనం అయింది. భక్తితో కొందరు భగవంతుని సేవించి తరిస్తే, మరికొందరు విరోధంతో స్మరించి తరిస్తారు. వైరం కూడా విముక్తి మార్గం అని పెద్దలు అంటారు. అయితే ఈ మార్గం ఉచితమైంది కాదు.

ధర్మరాజు పురోహితులకూ, సదస్యులకూ అనేక దక్షిణలూ, కానుకలూ ఇచ్చి తృప్తులను చేసి అవభృథ స్నానం చేసి యాగం ముగించాడు.



## సాళ్వుడు

సాళ్వుడు, శిశుపాలునికి కూర్చిన స్నేహితుడు. శిశుపాలుడలా దారుణ మరణం పొందడం చూసి, అతడు యాదవుల మీద పగపట్టాడు. లోకంలో యాదవ రహితం చేయగా నిశ్చయించాడు. అయితే వాడికి అంతటి బలం, బలగం రెండూలేవు.

సోమశేఖరుడు సులభసాధ్యం అయిన దైవం అనుకుని, ఆయనను గూర్చి తపం సాళ్వుడు చేయసాగాడు.

సాళ్వుడు ఆహారం పూర్తిగా మాని వేసి, పిడికెడు మన్ను మాత్రమే తింటూ కఠిన తపస్సు సంవత్సరకాలం చేశాడు.

భోళా శంకరునకు వాడిమీద కనికరం కలిగింది. దర్శనం ఇచ్చాడు.

''స్వామీ! నీవు దయాసాగరుడవు; అనంతశక్తి సమన్వితుడవు, లోకరక్షకుడవు. వాత్సల్యంతో కనికరించి కనిపించావు. వాయు మనోవేగాలతో ఆకాశంలో సంచరించే విమానం వరంగా ఇవ్వు! ఆ విమానంలో ఎక్కితిరగాలని ఉంది!'' అని సాళ్వుడు నమస్కరించాడు.

స్వామి అనుగ్రహించాడు. ఆయన అనుగ్రహంతో, మయుడు గొప్ప విమానం తయారుచేసి సౌభగం అని పేరుపెట్టి సాళ్వునకు ఇచ్చాడు.

సాళ్వుడు విమానం చూచి పరమానందం పొందాడు., విమానంలో ఎక్కగానే, వాడికి యాదవులు జ్ఞాపకం వచ్చారు. వారిని సాధించేందుకు ద్వారకపైన ఎగురసాగాడు.

సరోవరాలు బూడ్చి, బావులు కలచి, కట్టడాలను పగులకొట్టి, ఇండ్లలో విలువగల వస్తువులు దోచి, రాళ్లవర్షం, ధూళి వర్షం కురిపిస్తూ ప్రజల జీవితాలను చీకాకు పరుస్తూ సాళ్వుడు విచ్చల విడిగా తిరగసాగాడు.

యాదవ ప్రముఖులయిన సాత్యకీ, చారుదేష్ణ సాంబ ప్రద్యుమ్నాదులు వాడిమీదకు దూకారు.

సాళ్వుడు మాయా యుద్ధం చేయసాగాడు. వేలాది భటులు పుట్టుకవచ్చారు. వారు యాదవులను తీవ్రంగా నొప్పించారు.

సాత్యకీ సాంబులు వాడిమీద అంపవానలు కురిపిస్తూ ఎదుర్కొన్నారు. వారు విడిచిన బాణాలకు సౌభగం ఊగిసలాడ సాగింది.

సాళ్వుడు మండిపడుతూ, అన్ని దిక్కులకూ తానై, అందరి ముందూ తానై, అగ్నిశిఖల వంటి బాణాలు కురిపింపసాగాడు.

సాళ్వుడు ప్రయోగించిన బాణాలకు ప్రద్యుమ్నుడు మూర్ఛపోయాడు. అతడి సారధి రథాన్ని దూరంగా తీసుకుపోయాడు.

గెలుపోటములు తెలియకుండా సాళ్వయాదవ సైన్యాలు ఇరవై ఏడు దినాలు ఢీకొన్నాయి.

ఇంద్రప్రస్థం నుండీ బయలుదేరిన కృష్ణునకు తోవలో ఎన్నో దుర్నిమిత్తాలు ఎదురయ్యాయి.

''దారుకా! ద్వారకలో ఏవో వింతలు కలుగుతున్నట్లున్నాయి. ఈ శకునాలు గమనించావా?'' అని అన్నాడు.

ఆయన మనస్సు ఎరిగిన సారథి రథాన్ని మరింత వేగంగా నడపసాగాడు.

వారు ద్వారకను సమీపించేసరికి ప్రచండ యుద్ధం జరుగుతూంది. ఎవరు దండెత్తిందీ తెలియలేదు.

ఇంతలో సాళ్వుడు విమానంలో కనిపించాడు.

సాళ్వుడు, కృష్ణుని చూడగానే ములుకుల్లాంటి బాణాలనేకం కృష్ణ రథమ్మీద కురిపించాడు. కొరివి తిప్పినట్లు అతడు తన విమానాన్ని నడుపుతూ అంపవాన కురిపిస్తూ, కృష్ణుని భుజమ్మీద గాయం చేశాడు.

"ఆనాడు శిశుపాలుని వధువును అపహరించావు. నిన్నటి రోజున వాడి ప్రాణాలే హరించావు. ఆ పాపం నిన్ను కుట్టి కుడుపకపోతుందా? నిన్నూ, నీ ద్వారకనూ భస్మం చేస్తాను. దిక్కున్నచోట చెప్పుకో!" అంటూ సాళ్వుడు బాణ వర్షం తీవ్రం చేశాడు.

"త్రిపురాంతక దేవుని వర గర్వంతో వీర్రవీగుతున్నావు. అగ్ని బడ్డ శుభంలా మాడి చస్తావు! కాచుకో!" అంటూ మురాంతకుడు గదను విసిరికొట్టాడు.

ఆ గదా ఘాతానికి సాళ్వుడు ఓ యింత నెత్తురు కక్కి, సౌభాగంతో సహా అదృశ్యం అయ్యాడు.

ఇంతలో పెడరెక్కలు విరచి కట్టబడిన వసుదేవుని, కృష్ణుని ముందుకు తెచ్చారు సాళ్వవీరులు.

"వాసుదేవా! ఇతడు నీ తండ్రి కదూ? బాగా చూడు: మాకు పట్టుపడ్డాడు. వీడిని ఎలా చంపమంటావో చెప్పు!"

నిశ్చేష్టులై చూడసాగారు యాదవులు.

"మహాత్ముడు వసుదేవుడు వీళ్లకెలా చిక్కాడు?" అని అందరూ ఒకరినొకరు ప్రశ్నించుకోసాగారు.

ఇంతలో సాళ్వుడు అక్కడకు వచ్చాడు.

వసుదేవుని నేలబడ ఈడుస్తూ "ఇదో చూడు కృష్ణా! నీకన్న తండ్రి అవస్థ! నీవు చూస్తుండగానే వీడి శిరస్సు తెగవేస్తాను. నీవు పోటరివికదా? లావుకలిగితె నీ తండ్రిని రక్షించుకో!" అంటూ సాళ్వుడు వసుదేవుని తలత్రుంచి, తన విమానంలో వెళ్లిపోయాడు.

ఆదృశ్యం చూసిన వాసుదేవుని మనస్సుకలత బారింది. కండ్లు ఆర్ద్రం అయ్యాయి.

ఇంతలో వసుదేవుని కళేబరం అదృశ్యం అయింది.

ఆ క్షణంలో సాళ్వుడు చేసిన మాయ కృష్ణునకు అర్థం అయింది. ఆయన శక్తిని అభిమంత్రించి సాళ్వుడి విమానమ్మీద ప్రయోగించాడు. ఆ శక్తి క్షణమాత్రంలో సౌభగాన్ని భస్మం చేసింది. సాల్వుడు నేలకూలాడు.

కృష్ణుడు చక్రాయుధంతో సాళ్వుడి తల త్రుంచాడు.

సాళ్వుడు చావడం విని దంతవక్త్రుడు భగభగమండిపడుతూ చేతనున్న గదను కృష్ణుడిమీద గురిపెట్టి ముందుకు వచ్చాడు.

ఆ గదా యుద్ధంలో, కృష్ణుడు తన గదతో వాడి రొమ్ము పగిలేలా కొట్టాడు: దంత వక్త్రుడు మరి లేవలేక, వాడి స్నేహితుని చేరబోయాడు.



# తీర్థయాత్ర

**అరణ్య అజ్ఞాత** వాసాలు పూర్తిచేసిన పాండవులకు సూది మోపినంత మేర నేలనయినా ఇవ్వనని సుయోధనుడు ఖండితంగా చెప్పాడు. శ్రీకృష్ణుడు కలుగజేసుకున్నా ఫలితం లేక పోయింది. సంజయ రాయబారం పాండవులు నిరాకరించారు. ఫలితం కురుపాండవ యుద్ధం అనివార్యం అయింది. శ్రీకృష్ణుడు పాండవుల వైపు చేరాడు. యాదవసైన్యం కురుసైన్యంలో చేరింది.

సుయోధనుడు బలరాముని శిష్యుడు. అతనిని కాదని పాండవుల వంక బలరామునికి ధర్మంగా తోచలేదు. పాండవులు ధర్మపరులు. అటు చేరవలసి ఉంది. శిష్యవాత్సల్యం బలరాముడు విడిచి పెట్టలేకపోయాడు.

అందువల్ల ఎవరి వైపు చేరక, తీర్థయాత్రల నెపంతో అతడు ముఖం చాటు మంచిదనుకున్నాడు.

బలరాముడు ప్రభాసతీర్థం చేరి, దేవ పితృదేవతలకు తర్పణాలు విడిచాడు. బిందుసరోవరం, వజ్రతీర్థాలల్లో నీరాడి సరయూ, జాహ్నవీ జలాల్లో స్నానమాడి చివరకు నైమి చేరాడు.

నైమిశారణ్యం మునులకూ, మహర్షులకూ ఆలవాలం. అక్కడ ఎందరో మహాన భగవదారాధన చేస్తూ కాలక్షేపం చేస్తున్నారు. బలరాముని రాకకు వారు సంతోష పడి ప్ర చేసి, అతిథి పూజలూ చేశారు. బలరాముడు ఎంతో ప్రీతుడైనాడు.

అయితే దూరంగా ఆసీనుడయిన సూతముని మాత్రం గంభీరంగా కూర్చుండిపో బలరామునకు అతడు భక్తి తాత్పర్యాలు ప్రకటించలేదు. బలరాముడు సూతుడ అవమానించాడనుకున్నాడు. క్షణమాత్రంలో, అతడు సూతుణ్ణి వధించాడు.

మునులందరూ హాహాకారాలు చేస్తూ బలరాముని సమీపించారు.

''తీర్థయాత్రలు చేస్తూ, పవిత్ర జీవితం గడుపుతున్న నీవు, పుణ్యజీవనుడూ, శా ధార్మికుడూ అయిన సూతుణ్ణి వధించడం ఏమి బావో లేదు బలరామా? అతడు ఏ చేశాడని, అంతశిక్ష వేశావు? నీవే ధర్మం తప్పితే ధర్మాన్ని ఎవరు రక్షిస్తారు మహాత్మా నిలదీశారు.

''ఈ సూతుడు కనీసం అతిథి మర్యాదయినా నాకు చేయకపోవడం ధర్మమా? ధర్మభ్రష్టుడు. అందుకనే శిక్షించాను'' అన్నాడు బలరాముడు.

''ఎవరు నీకు అతిథి మర్యాద చేయవలె బలరామా? మేమంతా చేసింది మర్యాదకాదా? పోతే బ్రహ్మస్థానంలో ఉన్న ఆయన నీకు మర్యాద చేయవలెనా? అలా చేసి అవమానించడం ధర్మమంటావా? స్థాన విలువను పాటించడం అధర్మం అంటావా స్వామీ ధర్మవేత్త అతడు. మానసికంగా నిన్ను ఆశీర్వదించాడు. వళ్లు తెలీని కోపంతో ధర్మం తెల సూతుని చంపి నీవు పాపం మూట కట్టుకున్నావు! ఇది నిష్కృతి లేని పాపం!''

బలరాముడు శాంతుడై, తనతొందర పాటుకు నొచ్చుకుని తన యోగశక్తితో పునర్జీవితుని చేశాడు.

మునులందరూ బలరాముని అభినందించారు.

''మీకు నేనే దయినా ఉపకారం చేయవలెనని ఉంది. నా వల్ల కావాల్సినదేదని ప్రయత్నిస్తాను''.

''అయితే మహాత్మా! పల్వుడను రాక్షసుడు, మా ముని వాటికను పెద్ద పీడిస్తున్నాడు. యజ్ఞ గుండంలో మూత్రసురామాంసాదులు వాడు కుమ్మరిస్తుంటాడు. విరగడ అయితే సంతోషిస్తాం'' అని మునులు కోరుకున్నారు.

బలరాముడు ఆయుధాలను స్మరింపగానే రోకలి, నాగలి కనిపించాయి. ఆ ఆయుధాలతో బలరాముడు, పల్వుడిని సంహరించాడు.

మునులు దగ్గర శెలవు తీసుకుని అతడు త్రివేణిలో చేరి స్నానమాడి, ప్రయాగకు వచ్చి పితృ తర్పణాలు నిర్వర్తించి, గండకి దాటి, శోణానదిలో నీరాడి, గయా శ్రాద్ధాదులు సమర్పించి, మహేంద్ర పర్వతం ఎక్కి భగవంతుడు భార్గవరాముని దర్శించి మ్రొక్కి ఆశీస్సులందాడు. శ్రీశైలమల్లికార్జునస్వామికి సాగిలపడి నమస్కరించి, తిరుపతి వేంకటేశ్వరస్వామి పాదాలకు తలవంచిమ్రొక్కి, కంచి చేరి కామాక్షీ ఆమ్రేశ్వరుల ప్రదక్షిణ నమస్కారాలు చేసి, రంగనాథ స్వామికి కైంకర్యం నిర్వర్తించి, కన్యకుమారీదేవికి ప్రణతుడై, రామేశ్వరు నర్చించి, గోకర్ణ చంద్ర మౌళీశ్వరునికి అభిషేకాలు చేసి, దండకదాటి తిరిగి ప్రభాసానికి బలరాముడు చేరుకున్నాడు.

అక్కడి బ్రాహ్మణుల వలన, ఈ మధ్యకాలంలో కురుక్షేత్ర మహాసంగ్రామం ముగిసిందనీ, కురుబలంలో ఒఖ సుయోధనుడు తప్ప మిగిలిన వారు కాలగతి పొందారని తెలుసుకున్నాడు. బలరాముడు వారివల్లనే భీమ దుర్యోధనుల గదా యుద్ధం జరుగబోతుందనీ విన్నాడు. ఆ సంగతులు వినగానే అతడు వ్యాకులం పొందాడు.

బలరాముడు హుటాహుటి వారి యుద్ధరంగానికి వచ్చాడు. అప్పటికే వారు ఇరువురూ మోహరించి ఉన్నారు.

''మీరు ఇద్దరూ సమాన బలులు. నిరంతరాభ్యాసంలో ఒకరూ, విద్యలో మరొకరూ, ఒకరికొకరు తీసిపోని మహావీరులు!'' అని నచ్చచెప్ప బలరాముడు ప్రయత్నించాడు.

కానీ అతడి మాటలు ఎవరూ వినలేదు.

విధి నిర్ణయం ఏదైతే అది జరుగుతుందని, అతడు అక్కడ నిలువక ద్వారకు పయనమైనాడు.



# సుదాముడు

సాందీపని ఆశ్రమంలో శ్రీకృష్ణబలరాములు విద్యాభ్యాసం చేస్తున్న కాలంలో సుదాముడు వారి సహాధ్యాయి, భక్తుడూ, సేవకుడు కూడా. విద్యనేర్చిన తరువాత అతడు తృప్తుడూ, వీతరాగుడూ, హరిసేవారతుడూ అయినాడు.

అతని భార్య సుశీల, పతివ్రత, అనుకూలవతి. భర్త తెచ్చిన కొంచెమే మేరువని సంతోషంగా తృప్తిగా కాలంగడుపుతూండేది.

సుదాముడయిన అతడు దారిద్ర్యంలో కట్టుబట్టలు లేక జీర్ణవస్త్రాలు ధరించడం వల్ల కుచేలుడుగా ప్రసిద్ధుడయ్యాడు.

పిల్లలు ఆకట నకనకలాడుతూ, పిడికెడు అన్నం కోరినా, వారికి పెట్టలేక, అటు భర్త మనస్సునొప్పింపలేక, సంసారం సాగించేందుకు వేరు దారిలేక, భగవదర్పితమైన మనస్సుతో బింకంగా ఆ ఇల్లాలు కాలం నెట్టి వేస్తూండేది.

రాను రాను దారిద్ర్యం మరీ దుర్భరం అయింది. గంజికైనా వెనులుబాటు లేకపోవడంతో ఆ ఇల్లాలు విధిలేక భర్తను సమీపించి ఇలా అంది.

''మునుపెప్పుడో, చదువులు నేర్చిన సమయంలో శ్రీకృష్ణ బలరాములు మీ నేస్తగాండ్లని మీరు చెప్పగా విన్నాను స్వామీ! వారు నేడు కడుధనవంతులు, కరుణాళువులు. పైగా మీకు చిన్ననాటి స్నేహితులు. ఒక అవసరంలో స్నేహితుల ముందు చేయిసాపడం యాచన అనిపించుకోదు. హితులను ఆదుకోవడం స్నేహధర్మం. అందువల్ల మీరు శ్రీకృష్ణుని చూచి మనకింత ఉపాధి కల్పించమని అడగడంలో తప్పు లేదు స్వామీ! అందులో రాజుకు బ్రాహ్మణుడు ఆదరణీయుడు. వారు రాజులు! మనం వారికి ఆత్మీయులం; నిస్పృహాయులం. తప్పక వారు మనకు సాయం చేయగలరు. మీకు వారి దర్శనం ఉచితం మహాత్మా! వారు మీకు సులభులు కావడంలో వింతలేదు!'' అంటూ ఆ సాధ్వి ప్రార్థించింది.

కుచేలుడు ఆ కారణంగానయినా శ్రీకృష్ణ దర్శనం కలుగుతుందని అంగీకరించాడు.

''నిజమే! వెళ్లవలె! భగవదారాధన జీవుల ధర్మం! భగవంతుడి సేవకు ఉత్త చేతులతో పోరాదంటారు. ఏదేనా ఉంటే ఇవ్వు. అదే కైంకర్యం చేస్తాను!'' అన్నాడు కుచేలుడు.

ఏనాటివో మిగిలి ఉన్న పిడికెడు అటుకులు భర్త చిరిగిపోయిన గావంచాకు ఆమె మూట కట్టింది.

శ్రీమంతుడయినవాడు దరిద్రుని దరికిరానివ్వడు: వీడి దారిద్ర్యం ఎక్కడ పట్టుకుంటుందోనని ధనవంతుని భయం, తన మర్యాదకు భంగం! ఆయనో శ్రీమంతుడు, లక్ష్మీపతి. అటువంటివాడు నన్ను – ఈ పీలికలు కట్టుకున్న గర్భ దరిద్రుని చెంత చేర్చుకుంటాడా? ఇంతకూ ద్వారం అయితే చేరుకుంటాను, ఎల్లాగో తంటాలు పడి! ఆయన గుమ్మం ముందు నుంచుంటాను. అసలు గుమ్మంలో ఉండే కావలి భటులు నన్నూ, నా వేషం చూసి ఏవగించు కోరూ? లోపలకు పోనివ్వరు సరికదా, దూరాలకు గెంటివేసినా వేయగలరు. సంపన్నుడయిన వాడిని చూసేందుకు వచ్చిన ఓ యాచకుడని వాళ్ళు అనుకుంటారు. వారు అలా అనుకోవడంలో తప్పు లేదు. వాళ్లను ప్రసన్నం చేసుకునేందుకు తనదగ్గర ఏముందీ? నిర్భాగ్యుడు. ఎవ్వరకూ కానివాడు. దారిద్ర్యం అందరనూ దూరం చేస్తుంది! అంటరాని వాడిని చేస్తుంది. వీడికి స్నేహితులూ, బంధువులూ, హితులూ ఎవ్వరూ ఉండరు. వీడో ఏకాకి! వీడిని రక్షించేందుకు భగవంతుడూ ఉదాసీనుడవుతూంటాడు. వీడి కర్మనశించాలి. దుష్కర్మ నశిస్తేనే భగవత్సాన్నిధ్యం చిక్కుతుంది. ఇంత కాలం పుట్టని ఈ బుద్ధి హటాత్తుగా ఇప్పుడే ఎందుకు కలగాలి! ఆయన రక్షణా సూత్రాలు బలీయం కావడం వల్లనే ఇలా వచ్చి పడ్డానేమో? లోపలకు ప్రవేశం చిక్కకపోతే ఏం? ఆయన స్వయంగా నడచిన ఈ నేల పవిత్రం కాదూ? ఆయన మేన సోకిన ఈ గాలీ పవిత్రం కదూ? ఈ నేల ఎవరి సొంతంకాదు. వీటిని అనుభవించడానికి ఎవరి అడ్డూ ఉండదు. ఈ నేల మీద తిరుగుతూ అక్కడక్కడ గుర్తు తెలీక పోయినా శ్రీకృష్ణపాద ముద్రలను కండ్ల కద్దుకుంటూ, ఆయన శరీరాన్ని స్పృశించి వచ్చే ఈ గాలి గుండెలనిండా పీల్చుకుంటాను. ఈ అనుభవం చాలు, ఈ శేషజీవితం ఈడ్చుక పోయేందుకు – అలా ఆలోచిస్తూ తన్మయత్వంతో కుచేలుడు, శ్రీకృష్ణమందిర ద్వారం చెంతనుంచున్నాడు.

అతడు అలా ఎంతసేపు నుంచున్నాడో ఏమో! స్పృహలేదు. మనస్సులో నిండిన శ్రీకృష్ణుడు: చైతన్యం ఉడిగిన దశ అది.

''సుదామా! నేను వచ్చాను. కండ్లు తెరువ్! ఏం కలకంటున్నా వయ్యా?'' అంటున్న మాటలు అతడికి వినబడలేదు.

అయితే గాఢమైన కౌగలింత విద్యుత్తువలె; పూల గాలి వలె, చందన చర్చవలె అతడి శరీరానికి అనిపించింది.

కుచేలుడు కండ్లు తెరచి చూశాడు.

ఎదురుగుండా శ్రీకృష్ణుడు నవ్వుతూ కనిపించాడు.

''ఈ బడుగు పేదకు ఇంతటి భాగ్యమా తండ్రీ? నీవెంతటి దయామయుడవు?'' అంటూ కుచేలుడు ఆర్ద్రం అయిన కండ్లతో చూడసాగాడు.

''రా! సుదామా! లోపలకు వెళదాం! నేనెంత అదృష్టం చేసుకున్నానో నిన్ను చూసి! ఇంతకాలం ఏం చేస్తున్నావూ? ఎందుకు రాలేకపోయావు సుదామా?'' అంటూ శ్రీకృష్ణుడు, సుదాముని భుజమ్మీద చేయివేసి లోపలకు తీసుకుపోయాడు.

ఓ సుఖాసనమ్మీద కూర్చుండ చేసి, పాదాలు కడిగి, తాళవృంతంతో విసరుతున్న శ్రీకృష్ణుని చూసి కుచేలుడు అవాక్కయ్యాడు.

ఇంతలో రుక్మిణీదేవి, లక్ష్మిలా వచ్చి, విసనకర్రను తీసుకుని ఆ ఇరువురకూ సేవ చేయసాగింది.

''ఏమిటీ అదృష్టం? ఎవరికి దొరికే అదృష్టం?'' అని అతడు తనలో అనుకోసాగాడు.

కృష్ణుడు నవ్వి ఇలా అన్నాడు:

''నీకు జ్ఞాపకం ఉందా సుదామా? మనమంతా సాందీపుని ఆశ్రమానికి అవసరం అయిన వంట చెరకు తెచ్చేందుకు అడవికి వెళ్లామా? ఆనాటి ప్రళయం సంగతి నీవు మరచి పోలేదు కదూ? మనం అడవి చేరామో లేదో, కాటుక కొండల్లా మబ్బులు ఆకాశం నిండాయి. చీకట్లు నిండినట్లయింది. తాటి కాయలంతలేసి చినుకులు! క్షణాల్లో జలమయం!! ఎటు చూసినా నీళ్లు; ప్రవాహాలు! తోవతెలీక మనం ఏంచేశామో నీకు జ్ఞాపకం ఉందా సుదామా? ఓ చెట్టు ఎక్కి కూర్చున్నాం కదూ! ఒక వంక ఆకలి; మరో వంక చలి. ఆ పగలూ, రాత్రీ ఎలా గడిపామో ఇప్పుడు తలచుకుంటే, నవ్వుగా ఉందికదూ! అప్పుడు మనం ఎంతగా భయపడ్డాం? అప్పుడు నీవో కథ చెప్పావ్ జ్ఞాపకం ఉందా సుదామా? ఎప్పుడో వాన వెలిసింది. ఇంతలో గురువుగారు మనల వెదక్కుంటూ వచ్చారు. పాపం! ఆయనకు ఎంత వాత్సల్యం? గురువు అంటే, ఆయనే! గురుపత్ని మాత్రం ఏం తక్కువ? కన్న బిడ్డలను చూసినట్లు శిష్యుల మీద ప్రేమ కురిపించేది. ఆమె మనస్సు నవనీతం. ఆనాటి విషయాలు మరపురాని మధుర స్మృతులు. సుదామా! నీవు వస్తూ ఇంతకూ నాకేం తెచ్చావూ, నీ చేతులమీదుగా ఇచ్చేదేదైనా తిని ఎన్ని రోజులయింది? ఇప్పుడూ నాకు తినాలనిపిస్తోంది'' అన్నాడు నవ్వుతూ శ్రీకృష్ణుడు. నోరుతెరచుకుని బొమ్మలా, కుచేలుడు శ్రీకృష్ణుని ముఖంలోకి చూస్తూ ఉలుకూ పలుకూ లేకుండా కూర్చున్నాడు.

''అరే సుదామా! నీగావంచాలో ఏదో మూట ఉన్నట్లుందే! నాకోసం తెచ్చావా? చూడనియ్!'' అంటూ శ్రీకృష్ణుడు మూటను విప్పి అటుకులు నోర వేసుకుని నములుతూ, ''అబ్బో! ఎంత

మధురంగా ఉన్నాయి ఈ అటుకులు? రుక్మిణీ! నీవూ రుచి చూడు'' అంటూ మరో గుప్పెడునోర వేసుకోబోతున్నంతలో, రుక్మిణి ఆయన చేయి పుచ్చుకుంది.

''ఈ కొంచెం తిననీయవా రుక్మిణీ?'' అంటూ శ్రీకృష్ణుడు నవ్వాడు.

''చాలు! సరిపోతుంది ప్రభూ! మీరిచ్చింది ఈ భక్తుడి జీవితానికి సరిపోతుంది!'' అంది రుక్మిణి.

కుచేలునికి వారి మాటలే కాక చేతలూ అర్థం కాలేదు. అతడు అర్థం చేసుకునే ప్రయత్నం చేయలేదు.

ఆరాత్రి కుచేలుడు శ్రీకృష్ణ మందిరంలో మృష్టాన్న భోజనం చేసి, హంసతూలికా తల్పమ్మీద సుఖంగా నిద్రించారు.

తెల్లారిన తరువాత కుచేలుడు, కృష్ణునకు నమస్కారం చేసి శెలవు పుచ్చుకున్నాడు: శ్రీకృష్ణుడు నవ్వుతూ సాగనంపాడు.

శ్రీకృష్ణుడు, తనను వట్టి చేతులతో సాగనంపినందుకు అతడు బాధ పడలేదు; పైగా సంతోషించాడు. హఠాత్తుగా తాను ధనవంతుడు అయితే, తనను మరచి పోతాననే, తనకు శ్రీకృష్ణుడు సిరులు ఇవ్వలేదని అనుకున్నాడు.

ఇల్లు చేరగానే, అతడికి అంతా అయోమయం అయింది. తను కాపురం ఉంటున్న పూరిపాక స్థానంలో భవంతి ఏర్పడింది. ఎందరో దాసదాసీలు హడావుడిగా ఏవేవో పనులతో తిరుగుతున్నారు.

ఇంతలో అతని ఇల్లాలు సాలంకృతఅయి లక్ష్మీదేవిలా బయటకు వచ్చి చిరునవ్వుతో, అతని కాళ్ళు కడిగి లోపలకు తీసుకపోయి చక్కటి ఆసనమ్మీద కూర్చుండ చేసింది.

ఇంతటి వైభవం తనకు ఎక్కడిదీ? ఎలా వచ్చింది! కుచేలుడు అబ్బురంతో దిక్కులు చూడసాగాడు.

వట్టి చేతులతో శ్రీకృష్ణుడు తనను సాగనంపాడనుకున్నాడతడు. తనకన్నా ముందే తన ఇంట సిరుల పంట పండించి మరీ సాగనంపాడు. అది ఆయన కరుణా విశేషం! కుచేలుడు శ్రీకృష్ణునకు మనసా నమస్కరించాడు. శేషజీవితం కూడా అతడు భక్తి, వైరాగ్యాలతో గడిపాడు.

★ ★ ★




రానురాను శ్రీకృష్ణుడు, అనితర సాధ్యాలయిన కార్యాలు చేయడమూ, మానవాతీత శక్తులను ప్రదర్శించడమూ దేవకీదేవి వింటూ, చూస్తూ ఆశ్చర్య సమ్మోదాలు పొందుతూండేది. కంసుడి కత్తికి బలి అయిన తన పొత్తిళ్ల పాపల గురించి ఆమెకు చింతగా ఉండేది.

''నాన్నా! చిన్నికృష్ణా! నీకు చేయనలవికాని పని లేదని లోకులు అనగా విని నేను నిన్నో కోరిక కోరవలెననుకున్నానయ్యా! ఎప్పుడో ఎక్కడో మునిగి పోయిన గురుపుత్రుని క్షేమంగా ఇల్లు చేర్చావుట. ఇది విన్నాక నా కోరిక మరీ బలీయం అయింది. నీ గురు పత్నికి వలె నాకూ గర్భ శోకం బాధిస్తోంది. నా పురిటి పాపలను కంసుడు నిర్దాక్షిణ్యంగా చంపాడు. వారిని చూడాలని ఉంది నాయనా! ఒఖ సారి చూపగలవా!'' అని దేవకీదేవి అడిగింది.

''నీ కోరిక తీర్చడం నా ధర్మం తల్లీ! అలాగే చూతువుగానీ!'' అంటూ శ్రీకృష్ణుడు అప్పటికప్పుడే సుతలం చేరుకున్నాడు.

బలి చక్రవర్తి అక్కడ కొలువై ఉన్నాడు. శ్రీమహావిష్ణువుకు మూడడుగులనేల దానంగా ఇచ్చిన పుణ్యఫలితంగా, అతడు చిరంజీవి అయి సుతలాన్ని పాలిస్తున్నాడు.

బలిచక్రవర్తి శ్రీకృష్ణాగమనానికి హర్షాతిరేకం పొంది, చేతులు జోడించి ''ఆజ్ఞాపించు మహాత్మా!'' అని అడిగాడు.

''మరీచి భార్య వర్ణ. ఈ దంపతులకు ఆరుమంది కుమారులు. వారూ తపస్సంపన్నులే! వారొకసారి సత్యలోకం పోవడం జరిగింది. అక్కడ బ్రహ్మదేవుడు, తాను పుట్టించిన సరస్వతిని, కామమోహంతో దగ్గరకు తీసుకున్నాడు. ఆ దేవికూడా మోహపరవశ అయింది. అది విధి విధానం! ఈ బ్రహ్మచారులు తన కూతురును బ్రహ్మకామించాడని గుసగుసలు పోయి నవ్వుకున్నారు. బ్రహ్మలజ్జితుడైనా, కోపించి వారిని రాక్షస గర్భంలో పుట్టమని శపించాడు. హిరణ్యకశిపుని సంతానంగా వారు పుట్టబోతుండగా, వారు తాపసులు కనుక వారిని యోగమాయ తన చాతుర్యం కొద్దీ దేవకి గర్భంలోకి మార్చింది. కంసుడు వారిని తుదముట్టించాడు. అయితే దేవకీమాత గర్భశోకంతో కుములుతూ, మృతులయిన వారిని చూడకోరింది. చూపుతాం అని మాట ఇచ్చాం! వారిని తీసుకపోతాను. అంతటితో వారి శాపం తీరిపోతుంది!'' అన్నాడు శ్రీకృష్ణుడు.

బలి, తన వశంలో ఉన్న వారినీ, వారితో పాటు అనేక కానుకలుఇచ్చి శ్రీకృష్ణబలరాము లను సాగనంపాడు.

శ్రీకృష్ణుడు, తనసోదరులతో వచ్చి, దేవకీదేవి ముందట నిలచాడు. నీళ్లూరిన కండ్లనిండా వాత్సల్యం కురిపిస్తూ ఆ తల్లి వారిని పదేపదే చూసి, దగ్గరకు తీసుకుంది.

వారు దేవకీ వసుదేవులకూ నమస్కరించి, శ్రీకృష్ణుని ఆజ్ఞతో శాపంతీరి పోగా, తమ నెలవుకు వెళ్లిపోయారు.



# సుభద్ర

తన చెల్లెలు సుభద్రను, తన శిష్యుడయిన సుయోధనునకు ఇచ్చి వివాహం చేయవలెనని బలరాముడు సంకల్పించాడు. ఈ విషయం విని శ్రీకృష్ణుడు ఊరకున్నాడు.

ఈ విషయం కర్ణాకర్ణిగా, తీర్థయాత్రలు చేస్తున్న అర్జునకు తెలిసింది. అతడు సుభద్రను వివాహం చేసుకోవలెనని ఉవ్విళ్లూరుతున్నాడు. సుభద్రకు అర్జునుడంటే మక్కువ ఎక్కువే!

శ్రీకృష్ణుడు తనవాడు కాబట్టి, ఎదో ఉపాయం చెప్పక పోతాడా అని అర్జునుడు తాపసి వేషంలో ద్వారకకు వచ్చాడు.

సూర్యుని వలె ప్రకాశిస్తున్న అతడిని చూసి, అంత పిన్నవయస్సులో సర్వసంగ పరిత్యాగి అయిన అతడో మహానుభావుడని ద్వారకావాసులు భిక్షలు చేయసాగారు. అతడి కీర్తి అంతఃపురం వరకూ వ్యాపించింది.

ఆ తాపసిని, తమ ఇంటభిక్ష చేయవలసిందని బలరాముడు ప్రార్థించాడు.

అర్జునుడు ''మహాభాగ్యం'' అని అంగీకరించాడు.

ఆ తాపసి సేవలకు బలరాముడు సుభద్రను నియోగించాడు.

అతడు ఎవరో తెలీకపోయినా.. అతడో మహనీయుడనీ, సేవచేస్తున్న సమయంలో సుభద్ర నమస్కరించి తన అన్న చేసే తన వివాహ ప్రయత్నాలు విఫలం అయ్యేలా ఆశీర్వదింపమని కోరింది.

అర్జునుడు నవ్వాడు.

'మీ అన్న బలరాముడు, నీ వివాహం సుయోధనునితో జరిపించాలని నిశ్చయించాడు కదా? మరినీవేమో ఆ సంబంధం తప్పి పోయేలా ఆశీర్వదింపమంటున్నావు. అలాగే ఆశీర్వాదం చేయగలను. అయితే నీ మనస్సున ఉన్నదెవరో చెప్పు! అతనితో నీ వివాహం జరిగేలా ఆశీర్వదిస్తాను. సర్వసంగ పరిత్యాగి అయిన వాతో నీ మనస్సులోని మాట చెప్పకూడదా?'' అని అడిగాడు అర్జునుడు.

సుభద్ర తలఎత్తి చూసింది. ''మీరు ఎంతో దూరం యాత్రలనెపంతో తిరుగుతూంటారు కదా? పాండవుల నెప్పుడయినా చూడడం జరిగిందా?''

''ఆ. పాండవులకేం? వారు సుఖంగానే ఉన్నారు. వారిలో నీవు ముఖ్యంగా ఎవరి గురించి అడుగుతున్నావో చెప్పు. నేను వారి దగ్గరనుండీ రావడం? ఇప్పుడు అర్జునుడు మాత్రం తీర్థయాత్రల కారణంగా దేశాలు పట్టితిరుగుతున్నాడుట. ఈ ప్రాంతంలో ఉన్నట్లు వినికిడి..''

''అయితే ఆయన ఎక్కడ ఉంటాడో మీకు తెలుసా?''

''తెలుసు!''

''ఇప్పుడు ఎక్కడ ఉన్నాడు? ఎలా ఉన్నాడు?''

''అయితే నీ మనస్సు దోచినవాడు అర్జునుడా?'' అంటూ ఆ తాపసి నవ్వాడు

సుభద్ర సిగ్గుతో తలవంచుకుంది.

''అర్జునుడే నీముందుకు వస్తే ఏం చేస్తావు సుభద్రా?''

''అంటే..మీరు..'' అంటూ సుభద్ర పారిపోబోయింది.

ఇంతలో అర్జునుడు ఆమె చేయిపుచ్చుకుని ఆపుతూ, ''ఇదో నీవు వివాహం చేసుకోనంటే, ఈ వేషం శాశ్వతం చేసుకుందామని తాత్కాలికంగా ఈ తాపసి వేషంలో వచ్చికూర్చున్నాను'' అన్నాడు.

''మా చిన్నన్నయ్యను అడగండి! మీకేవేషం ఉచితమో ఆయన అయితేనే బాగా చెప్పగలడు!''

''ఆయన దయలేకపోతే ఇంత దూరం, ఏధైర్యంతో రాగలను సుభద్రా?''

ఇంతలో అక్కడకు, కృష్ణుడు వచ్చాడు. ఇరువురూ నమస్కరించారు. వారిద్దరనూ మార్చి మార్చి చూస్తూ శ్రీకృష్ణుడు నవ్వాడు.

''ఆc ఆc యతులు నమస్కరింపరాదు''

''యతులకు మహాయతివి నీవు బావా! సర్వ నమస్కారాలకూ నీవే అర్హుడవు.''

''తల్లీ! సుభద్రా!! భిక్ష బాగా చెయ్! ఈ యతికి బాగా ఆకలి అవుతున్నట్లుంది. అందుకే ఎక్కువగా మాటాడుతున్నాడు.'' అంటూ శ్రీకృష్ణుడు వెళ్లి పోయాడు.

ఆ ఇద్దరి మందహాసాలు ఒకటైనాయి.

ఇంతలో వసంతోత్సవాలు వచ్చాయి. సుభద్ర తన చెలికత్తెలతో ఉత్సవాలకు వచ్చింది.

శ్రీకృష్ణుడు పంపిన రథంలో యతివేషంలో ఉన్న అర్జునుడు కూర్చుని ఉన్నాడు.

''రా! సుభద్రా! రథం ఎక్కు! ఎవరి ఆజ్ఞ మన ఉభయులకూ శిరోధార్యమో, వారి ఆజ్ఞ అయింది!'' అని అర్జునుడు పిలిచాడు.

సిగ్గుతో సుభద్ర రథం ఎక్కింది.

రథం వాయుమనో వేగాలను మించిన వేగం అందుకుంది. చెలికత్తెలు గోలపెడుతూ, ఏడుస్తూ తాపసి, సుభద్రను అపహరించుకుపోతున్నాడని ఎలుగెత్తి అరవసాగారు.

కావలి భటులు, మరి కొందరిని కూర్చుకుని రథం వెంట పరుగులు తీశారు.

సంగతీ సందర్భమూ బలరాముడికి తెలిసింది. అతడు మండి పడుతూ స్వయంగా తానె వెళ్లి అతని పని పడతానని బయలుదేరుతున్న సమయంలో శ్రీకృష్ణుడు అడ్డుపడ్డాడు.

''ఆ యతి ఎవరో కాదు బలరామన్నా! మన అర్జునుడే! పాండవులు మనకు పరాయి వాళ్లు కాదుకదా! అయినవాడే తీసుకపోయాడు. దీనికి ఎందుకు కోపిస్తావూ? మనమందరం వెళదాం, కట్నకానుకలు తీసుకుని. ఆయుధాలతో పనిలేదు.'' అని శ్రీకృష్ణుడు అనునయించాడు

దేవకీ వసుదేవులు తగిన విధంగా బలరాముని శాంతపరచారు.

''అయితే ఇదంతా తమరి పన్నాగమా?'' అంటూ బలరాముడు నవ్వాడు.

బలరాముడు, ఎన్నో విలువైన కానుకలు, గోధనాదులు చెల్లెలికి అరణంగా పంపాడు.

ఓ మంచి ముహూర్తంలో, పెద్దల సమక్షంలో సుభద్రార్జునుల వివాహం జరిగింది.

★ ★ ★



# భస్మాసురుడు

శకుని కొడుకు వృకుడు. వీడు రాక్షసులకు రాక్షసుడు. దుర్వివేకుడూ, దుర్మార్గుడూ! సాధుసజ్జనులను ఎంతసులభంగా హింసించ వీలవుతుందా అని నిరంతరం ఆలోచించేవాడు.

ఒకసారి వీడికి నారదుడు తారసపడ్డాడు.

వృకుడు వినయంగా నమస్కరించాడు

''అతి తొందరగా, ఎవరిని వేడుకుంటే, మన పనులు సులువు అవుతాయి మహర్షీ? అతి దయాళువు అయిన దైవం త్రిమూర్తుల్లో ఎవరో చెప్పండి? వారిని ఆరాధించి శీఘ్రంగా వరం పొందుతాను''.

''సుగుణ దుర్గుణాలను ఆ క్షణంలోనే ప్రసాద కోపాలను ప్రదర్శించడం ఫాలలోచనుడయిన ఈశ్వర తత్వం. అందుచేత ఆయనను ఆరాధించు. త్వరలో ముక్తుడవు అవుతావు'' అని చెప్పాడు నారదుడు.

వృకాసురుడు కేదారం వెళ్లాడు. ఉగ్ర తపస్సు చేయసాగాడు. తన శరీరంలోని మాంసం ముక్కలను అగ్నికి ఆహుతి చేయసాగాడు. అయినా ఈశ్వరుడు ప్రత్యక్షం కాలేదు. చివరకు వాడు, తన తలకోసి అగ్నిలో పడవేయబోయాడు.

అప్పుడు పరమేశ్వరుడు కనిపించాడు

వరం కోరమన్నాడు.

వృకుడు వినయంతో భక్తితో నమస్కరించి ''తండ్రీ! నీవు కరుణించావు; కనిపించావు. నాకోరిక ఏమిటంటే, నాచేయి, ఎవరి తలమీద పెడతానో వారితల వేయి ముక్కల యేట్లు వరం ప్రసాదించు! చాలు!'' అన్నాడు.

ఇదేం విడ్డూరమైన కోరిక! అయినా ఆ దేవదేవుడు అనుగ్రహించాడు.

''కొంచెం ఆగు పరమేశ్వరా! వెళ్లకు: నీవు ఇచ్చినవరం ఎంత శక్తి వంతమైనదో నన్ను పరీక్షింపనియ్! నా చేయి నీతల మీద పెట్టనియ్!'' అంటూ వృకుడు ముందుకు ఉరికాడు.

ఈశ్వరుడు నిర్విణ్ణుడై, నిరుత్తరుడై నుంచున్నాడు.

''వీడెంతటి పాపాత్ముడో కదా?'' అని శంకరుడు కదలి పొయ్యాడు.

''ఎందుకంత వేగంగా వెళుతున్నావ్ ఈశ్వరా! ఆగు!'' అంటూ వృకుడు వెంటపడ్డాడు.

ఈ సంకట స్థితి నుండీ ఈశ్వరుని తప్పించేందుకు శ్రీమన్నారాయణుడు, ఒక బాలవటువువలె వృకుడి ముందుకువచ్చి నమస్కరించాడు.

''ఎవరో తరుముతున్నట్లు అలా పరువెత్తుతున్నావేం వృకా? అందరూ నీవు మహాబలవంతుడని పొగడుతున్నారు. మరి నీవేమో...'' అంటూ ఆ వటువు నవ్వాడు.

''చూడరా బాలకా! నా తలకోసి నివేదిస్తూండగా, ఈ మహేశ్వరుడు కనిపించి ఓ వరం ఇచ్చాడు. ఆ వరం ఎంత విలువైనదో పరీక్షిస్తానూ అంటే, ఆగకుండా వెళుతున్నాడు. తను ఇచ్చింది నిజమో, కాదో తెలుసుకోనీయక పోవడం అధర్మంకదూ?''

''ఇంతకూ ఆ కోరిన వరం ఏమిటో?''

''ఈ నా చేయి, ఎవరిమీద పెడితే వాడితల వేయి ముక్కలయి పోవలెనని వరం కోరుకున్నా?! ఆయన ఇచ్చాడు. పరీక్షిస్తానంటె అందకుండా పోతున్నాడు!''

''ఎంతగొప్ప వరం! ఈ ఆలోచన నీకేవచ్చిందా?'' అంటూ ఆ వటువు నవ్వాడు.

''మరి ఈ వరం ఎంత గొప్పదో తెలుసుకోవడం ఎలా? అలా పారిపోతాడేం! ఇదేం ధర్మం? నీవే చెప్పు!''

''ఔనౌనం! అధర్మమేం! అయితే నీవు అశుచివని ఆయన తలచాడేమో! అదో ఆ కనిపించేకొలనులో ఆచమనం చేసిరా! అప్పుడు మాట వినక పోతే, మనిద్దరం కలసి ఆయన పని పడదాం!'' అంటూ, ఆ కుహనా వటువు నవ్వాడు.

''నిజమే ఏమో. అయితే స్నానం చేసివస్తా! నీవు ఇక్కడే ఉండు! ఎక్కడకు వెళతాడో చూద్దాం!'' అంటూ వృకుడు మడుగులోకి దూకాడు.

సంకల్పం చేస్తూ, అతడు తన శిరస్సు మీద తన చేతులు పెట్టుకున్నాడు. ఈశ్వర వరం ఫలవంతం అయింది. వాడితల వేయి ముక్కలయి పోయింది.

ఈ వృకుడే భస్మాసురుడుగా ప్రసిద్ధుడైనాడు.



# సత్త్వగుణుడు

పూర్వం ఒకసారి సరస్వతీతీర్థంలో మునులు చేరి, విశ్వశాంతికై యాగం ప్రారంభించారు. ఆ క్రతువు పూర్తి అయిన తరువాత మునులంతా మాటల్లో పడి సత్త్వగుణుడైన దైవం ఎవరో నిర్ణయించుకోలేక వాదోపవాదాలు చేయసాగారు. అయితే నిర్ణయం కాకపోయే సరికి వారంతా భృగుమహర్షిని తేల్చుకరమ్మని ప్రార్థించారు.

భృగు మహర్షి తిన్నగా సత్యలోకం చేరాడు. బ్రహ్మదేవుడి కొడుకు భృగువు. అంచేత బ్రహ్మదేవుడు, భృగువు ఎదురు చూసిన మర్యాద చేయలేదు. అంచేత భృగువు ఆయనలో సత్త్వ గుణం లేదని అనుకున్నాడు.

ఆ తరువాత ఆయన కైలాసం వచ్చాడు.

ఆ సమయంలో పరమశివుడు, తనసతితో ఆనంద తాండవం చేస్తున్నాడు. ఆయన కళ్లతోనే సంతోషం ప్రకటించాడు. నందీ మొదలయిన వారు సంగీతంలో మునిగి పోయారు. పరమేశ్వరుడు తాండవం చేస్తున్నప్పటికీ భృగువునకు ఎదురువచ్చాడు. పరీక్షార్థం వచ్చిన భృగువు ఈశ్వరునకు పెడమొగం పెట్టి నుంచున్నాడు.

తనంతటి వాడు ఎదురయితె, వీడు పెడమొగమవుతాడేమిటా అని సదాశివునకు కోపం వచ్చింది. నేత్రాల్లోంచి నిప్పులు చెరగుతూ శూలం ఎత్తి భృగువును ఆయన చంపబోయాడు.

ఇంతలో పార్వతీదేవి ఆయన పాదాలమీద వ్రాలి, "ప్రభూ! ఇతడు కోపింపదగిన వాడు కాదు. ముని వృత్తిలో ఉన్నవాడు. బ్రహ్మపుత్రుడు. కరుణించి శూలం దింపండి!" అని ప్రార్థించింది.

ఈశ్వరుడు కోపం దించుకున్నాడు.

భృగువు మరి అక్కడ నిలువకుండా, వైకుంఠం చేరాడు. శేష తల్పమ్మీద, ఆది లక్ష్మీదేవి పాదాలు ఒత్తు తూండగా అరగన్నులతో ఉన్న విష్ణుదేవుని భృగువు చూశాడు. భృగువు తన వామ పాదంతో విష్ణుదేవుని గుండెల మీద తన్నాడు.

పానుపుమీది ఆ దేవదేవుడు కనులు తెరచి, చిరునవ్వుతో, దిగి వచ్చి భృగువును సమీపించి, "అయ్యో! మహర్షీ! ఎంతపొరబాటయింది? ఏదో ఆలోచనల్లో పడి, తమరి రాకనే గమనించలేదు పెద్ద తప్పే అయింది. మన్నించు మహర్షీ!" అంటూ భృగువును తనుకూర్చునే అసనమ్మీద కూర్చుండ చేసి, అతని పాదాలు తన వళ్లోకి తీసుకుని సంవహనం, చేస్తూ, భృగువుకు తపోలభ్యం అయిన పాద నేత్రాన్ని చిదిమివేశాడు.

నేత్రభంగంతో భృగువు శాంతుడూ, దీనుడూ అయి, విష్ణుమూర్తికి సాగిలపడి నమస్కరించి శలవు పుచ్చుకుని, సరస్వతీర్థంలోని మునుల ముందుకు వచ్చాడు.

తను పొందిన అనుభవాలు, ఆమునులకు ఆయన వివరించాడు. తాను గుండెల మీద తన్నినా, విష్ణుదేవుడు కోపింపలేదనీ, అంచేత సత్త్వగుణ మూర్తి ఆయనేనని నిర్ణయించాడు.

విష్ణు వక్ష స్థలవాసిని అయిన లక్ష్మీదేవి కోపగించుకుంది. తనను కాలితో తన్నిన ఋషిని మన్నిస్తాడా అని ఆమె రుసరుసలాడింది. చివరకు ఆ కలుముల తల్లి వైకుంఠం విడచి పెట్టి వెళ్లిపోయింది.



# విప్రబాలకులు

ద్వారకావాసి అయిన ఒక బ్రాహ్మణుని ఇల్లాలు నీళ్లాడింది. పురిటి బిడ్డ పురుటింటనే చనిపోయాడు. అలా చనిపోవడం ఒక సారి కాదు. చాలాసార్లు జరిగింది.

అలా చనిపోయిన మృతశిశువును తీసుకపోయి అతడు రాజప్రాసాదం మొగసాలపెట్టి నెత్తీనోరు కొట్టుకుని దుఃఖించేవాడు.

"ఏ రాజు ధర్మం తప్పుతాడో, ఆ రాజు పాలించే దేశంలో ఇటువంటి దురంతాలు పుట్టుక వస్తాయి. రాజు చేసిన పాపం, ప్రజలను ఇలా పీడిస్తూంది" అనేవాడు.

ఈ విధంగా, అతని ఇల్లాలు కన్న ప్రతిసారీ జరుగుతూంది. అలా ఎనిమిది సార్లు జరిగింది. తొమ్మిదవ మృత శిశువును రాజు గారి మొగసాలలో పెట్టి పోతున్నపుడు అర్జునుడు ఎదురుగా వచ్చాడు.

"నీ పురిటి పాపలు చనిపోతుంటే, ఆపగల మేటివీరుడు నగరంలో ఒఖడూ లేడా? ఇంతదారుణం జరుగుతూంటే, రాజెలా ఊరుకున్నాడు? నీ బిడ్డను నేను బతికిస్తాను!" అన్నాడు.

"నీ వల్ల ఏం అవుతుంది? నీ దారిన నీవు వెళ్లు బాబూ!"

"అలా కాని పక్షంలో అగ్ని ప్రవేశం చేస్తాను!" అని అర్జునుడు ప్రతిజ్ఞ తీసుకున్నాడు.

"నీవేం గొప్ప వీరుడవని ఇంతింత మాటలు అంటూ, ఎందుకు ప్రాణమ్మీదకు తెచ్చుకుంటావ్? నీదారిన నీవు వెళ్ళు! క్షేమంగా ఉండగలవ్! ఈ దేశంలో బలుడూ, కృష్ణుడూ లేరా! వారి పుత్ర పౌత్రులు లేరా? వారందరూ వీరులు కారా? వారికి చేతకాని పని నీవు చేయగలనని ముందుకు రావడం వింతగా ఉంది. నక్కఎక్కడ? నాగలోకం ఎక్కడ? నా దురదృష్టం ఇదంతా!" అంటూ ఆ బ్రాహ్మణుడు, తన గావంచాతో, కండ్లు తుడుచుకుంటూ వాపోసాగాడు.

"నీవు చెప్పినవీరుల్లో నేను ఎవ్వడనూ కాదు. త్రిపురాంతక దేవుని యుద్ధంలో ఎదిరించి నిలువరించిన వీరుణ్ణి నేను. నా పేరు అర్జునుడు. ఈ మాటు పురిటింటికి మృత్యువు రాలేదు. అది నా బాణధాటికి ఆగలేదు. నీవు నిశ్చింతగా ఉండు!" అని అర్జునుడు ఊరడించాడు.

అర్జునుని మాటలకు అతడు సంతోషించి ఇంటికివెళ్లాడు. కొంత కాలానికి, అతని ఇల్లాలు చూలైంది, ప్రసవకాలం సమీపించింది. అర్జునునకీ విషయం తెలియ చేయబడింది.

గాండీవంతో అర్జునుడు సిద్ధమై, సూతిగా గృహం చుట్టూ బాణ పంజరం నిర్మించాడు. మంత్రాధి దేవతలను స్మరించుకుంటూ బాణం సంధించి, జాగ్రత్తగా అతడు నుంచున్నాడు.

ఇంతలో సూతికా గృహంలో శిశురోదనలు వినిపించాయి. అంతలోనే ఆ రోదనలతో పాటు ఆ తల్లి రోదనలూ వినిపించాయి. పుట్టిన శిశువు ప్రాణం ఎప్పుడో గాలిలో కలిసి పోయింది. పుట్టడం గిట్టడం రెండూ జరిగాయి.

"భగవంతుడు ఉదాసీనుడయినపుడు, నీవు చాలిన వానివలె గొప్పలు చాలా చెప్పుకున్నావు. అది ఇప్పుడు ఏమయ్యాయి? నిన్ను నమ్మిందుకు నాకు కొత్తగా ఒరిగిందేమీలేదు. నీవే అనవసరంగా ప్రాణమ్మీదకు తెచ్చుకున్నావు." అని ఆ బ్రాహ్మణుడు చీదరించుకున్నాడు.

అర్జునుడు, తన శక్తివల్ల యమసదనం చేరుకున్నాడు. అక్కడ ఎటువంటి సమాచారం చిక్కలేదు. ఎందరను చూసినా ఫలితం దక్కలేదు. అర్జునుడు తన ప్రతిజ్ఞ ప్రకారంగా అగ్నిని పేల్చి, ప్రవేశింపబోతున్నంతలో శ్రీకృష్ణుడు వచ్చి, ''రా! నీకు మృతులయిన శిశువుల చూపుతా!'' అన్నాడు.

వారిద్దరూ ఒక దివ్యరథం ఎక్కి ప్రయాణం సాగించారు. జనపదాలూ, నదులూ, సముద్రాలూ దాటి వాయువేగంతో రథం వెళుతూంది. ఇంతలో పెనుచీకట్లు కమ్ముకవచ్చాయి. రథం ముందుకు సాగలేక పోయింది. శ్రీకృష్ణుడు, తన బాణాసనం తీసుకునిన ఒక దివ్య బాణం, విడచాడు. ఆ బాణం విద్యుత్కాంతులు వెదజల్లుతూ ముందుకు దూసుకపోసాగింది. ఆ వెలుగుల్లో రథం సాగింది.

కన్నులు మిరుమిట్లు కొలిపేంతగా వెలుగులు చిమ్ముతూన్న ఓ దివ్య తేజం కనిపించింది. అలా ముందుకుసాగగా సముద్రం ఎదురయింది.

ఆ సముద్ర మధ్యంలో మణిమయ స్థంభాలతో, రత్నదీపాలతో వెలుగుతూన్న ఒక దివ్యధామం కనిపించింది. ఆలోపల శేషశయానుడూ, నీల నీరదశ్యాముడూ, పద్మదళనేత్రుడూ, సనకసనందనాది ముని జన సంసేవితుడూ, హారకుండల శోభితుడూ, అవ్యయుడూ, అనంతుడూ, అచ్యుతుడూ, అభవుడూ, శ్రీవత్సవక్షుడూ అయిన శ్రీమన్నారాయణుని వారు చూశారు.

ఆ మహానుభావుడు, వీరిని చూసి మందహాస వదనారవిందుడై, ''నా అంశంతో పుట్టిన నరనారాయణులైన మిమ్ముల ఈ ఋషులు చూడవేడగా, ఈ నెపంతో రప్పించాను. ఇప్పుడా డింభకులను తీసుకవెళ్లండి'' అన్నాడు.

వారిరువురూ దండ ప్రమాణాలు చేసి అనేక విధాలుగా ఆ దేవదేవుని స్తుతించారు.

ఆ శిశువులను, ఆ బ్రాహ్మణునకు, తదను రూప వయస్సులతో వారు అప్పగించారు.

శ్రీకృష్ణునకు అతడునమస్కరించి, తనకుమారులతో సంతోషంగా ఇంటికి వెళ్లాడు.

అర్జునుడు, వాసుదేవుని దివ్యలీలలకు ఆశ్చర్యసమ్మోదాలు పొందాడు.



# ముసలం

మహాభారత సంగ్రామం ముగిసింది. ఆయుద్ధంలో చాలవరకూ భూభారం తీరింది. శ్రీమహావిష్ణువు అవతారంలోని విశేషం అది కావడం వల్ల, దుర్మార్గులయిన కౌరవులను, పాండవుల పక్షం చేరి శిక్షించాడు. యాదవులు తమతమ సంతానాలతో, భూమికి భారమైనట్లు శ్రీకృష్ణునకు తోచింది. వారు బలమద దర్పోద్ధతులైనందువల్ల, వారినీ అణచేందుకు ఒక ఉపాయం ఆయన ఆలోచించవలసి వచ్చింది.

సప్తర్షులు ఒక సమయంలో శ్రీకృష్ణ దర్శనం కొరకు ద్వారకకు వచ్చారు. కృష్ణుడు వారిని ఉచితరీతిని సత్కరించాడు. వారు తృప్తులై వాసుదేవుని అనుజ్ఞతో, తమ తమ నివాసాలకు వెళుతున్నపుడు పిండారకం అన్నచోట యాదవులు మదోద్ధతులై వారికి ఎదురువచ్చారు.

ఆ మునులకు వారు నమస్కారాదులయినా చేయలేదు.

సాంబునకువారు స్త్రీవేషం వేశారు. నెలలు నిండిన స్త్రీ వలె వారు వాడిని అలంకరించారు.

''స్వాములూ! ఈ అమ్మడికి బాబు పుడతాడో, పాప పుడుతుందో త్రికాలజ్ఞులు అవడం వల్ల మీరు చెప్పగలరని అడుగుతున్నాం! సెలవీయండి!'' అని వారు ముసిముసి నవ్వులతో నుంచున్నారు. వారి మాటల్లో హేళన ధ్వనించింది.

ఆ మునులకు కోపం కలిగింది. వారు భగ్గునమండి పడుతూ ''ఆడవేషం వేసుకున్న వీడికి ముసలం పుడుతుంది. దాంతో మీ కులక్షయం జరిగి తీరుతుంది!'' అని వారు వెళ్లారు.

యాదవులు భయంతో గజగజలాడారు. సాంబునకు స్త్రీ వేషం తీసి వేస్తున్నపుడు భయంకరమైన రోకలి ఖంగున నేల పడింది.

యాదవులు, శ్రీకృష్ణుని సమీపించి, ముసలం చూపించి ఆ వృత్తాంతం యావత్తూ వివరించి, రక్షింపమని ప్రార్థించారు.

శ్రీకృష్ణుడు ఏమీ ఎరగని వానివలె ఆశ్చర్యం తెచ్చుకున్నాడు.

''మీరెంతటి వెర్రులు కాకపోతే పిలచి పిలచి, ఇంత విపత్తు ఎందుకు నెత్తికి ఎత్తుకున్నారు? ఆ మునులెక్కడ? మీ రెక్కడ? వారిని అవమానించ బోవడం ఎంతగొప్పనేరమో మీకు తెలీదా? నేనైనా, ఆ మునుల శాపాలు నివారింపలేదు. విధి అల్లా ఉంది. మీకు ఆ బుద్ధి పుట్టింది. ఆపద నివారింపలేకపోయినా, ఓ ఉపాయం చెబుతా! దానివల్ల కొంత ఉపశమనం కలుగవచ్చు. ఈ రోకలిని తీసుకపోయి, బండరాళ్లమీద అరగదీసి, ఆ గంధాన్ని సముద్రంలో కలపండి! దైవ చిత్తం ఎలా ఉంటే అలా జరుగుతుంది'' అని వారిని సాగనంపాడు ఆయన.

శ్రీకృష్ణుడు చెప్పినట్లువారు సముద్ర తీరంచేరి, రోకలిని అరగదీశారు. సముద్రంలో కలిపారు. చివరకు ఓ ములికిలాంటి ముక్క మిగిలింది. ఆ ముక్కను అరగదీయలేక సముద్రంలోకి విసరివేసి చేతులు దులుపుకుని యాదవులు ఇండ్లకు వచ్చి చేరారు.

అలా కొంతకాలం గడచింది. మునుల శాపకారణం అన్నట్లుగా ద్వారకలో అనేక దుర్నిమిత్తాలు ఏర్పడ్డాయి. కాకులూ, గద్దలూ ఇండ్లల్లోకి యథేచ్ఛగా, నిర్భయంగా జొరబడుతూండేవి. ఒక జాతి జంతువుకు మరొకజాతి జంతువు పుట్టేది. ఉల్కలు పట్టపగలే రాలసాగాయి. సూర్యుడు తేజం కోల్పోతున్నట్లు హఠాత్తుగా, పగలు రాత్రివలె కనిపించేది. అశ్వాల తోకల్లో అంగార కణాలు రేగుతూండేవి. ఇలా జరగడంతో యాదవులు భయభ్రాంతులై కృష్ణుని ఆశ్రయించారు.

ఆ మహానుభావుడు, ''ఇకపై ద్వారకలో ఉండడం క్షేమంకాదు. మీరంతా ప్రభాసతీర్థానికి వెళ్ళండి!'' అన్నాడు.

ఆ క్షణంలోనేవారు ఆ బాలగోపాలం, ద్వారకను విడచి పెట్టారు.

ఉద్ధవుడు నమస్కరించి, ''ఇంతకాలం నీవే దిక్కని కొలిచే ఈ అమాయక యాదవులను ఎందుకు విడచి పెడుతున్నావు తండ్రీ? వీరు నీకేం అపకారం చేశారు?'' అని అడిగాడు.

శ్రీకృష్ణుడు మందహాసం చేశాడు.

''మరో ఏడు రోజుల్లో సముద్రుడు ద్వారకను ముంచి వేస్తాడు. అందువల్లనే వారిని వెళ్ళమన్నాను. కలిరాకతో అనేకానర్థాలు కలుగుతాయి. యాదవకులక్షయం కలిగి తీరుతుంది. మానవుల్లోనూ అనేక మార్పులు ఏర్పడ బోతున్నాయి. అధర్మపరులూ, అనాచారులూ, అన్యాయ జీవనులూ, అతిదర్పులూ, రోగగ్రస్తులూ, అల్పాయువులూ అవుతారు. నాస్తికవాదం ప్రబలుతుంది.

దైవానికి వీరుదూరం కావడంతో, దైవబలానికీ వీరు దూరం అవుతున్నారు. ఎవరికి వారే బలవంతులని భావిస్తారు!''

''అయితే దీనికి నివారణ లేదా ప్రభూ? తరుణోపాయం ఏదేనా చెప్పుతండ్రీ!'' అని ఉద్ధవుడు ప్రార్థించాడు.

''ఎవరు ఆత్మను పరమాత్మగా భావిస్తారో, ఎవరు ఆత్మను గుర్తిస్తారో వారు ముక్తులు అవుతారు. చెడుత్రోవనూ, చెడునడతనూ విడచిన వాడు సంతోషి అవుతాడు. నామ సంకీర్తనం వల్ల యజ్ఞ యాగాదులంతటి ఫలితం పొంది వీలవుతుంది. నామజపమే తరుణోపాయం ఉద్ధవా!'' అన్నాడు శ్రీకృష్ణుడు.

యాదవులు వనభోజనాలకని, సముద్ర తీరం చేరారు. అక్కడవారు తిని, తాగి వళ్లు తెలీని ఉత్సాహంతో, తమాషాలకు ఒకరినొకరు దెప్పుకుంటూ, మెచ్చుకుంటూ వినోదించారు. కొందరిలో ఆవేశాలు కలిగాయి. చిలికి, చిలికి గాలి వాన పెద్ద దయినట్లు, ఆవేశాలు, చివరకు పోట్లాటలుగా మారాయి, అందుబాట్లో ఆయుధాలేవీ లేకపోవడంతో వారు, సముద్రతీరంలో పెరిగిన తుంగ గడ్డితో గొట్టుకోసాగారు. ఆ తుంగ, ముని శాపకారణంగా పుట్టిన ముసల గంధంతో పెరిగింది కావడం వల్ల వజ్రాఘాతాల్లాగా, వారి శరీరాల మీద పడేదెబ్బలకు కండలు చీల్చ సాగింది. చివరకు ఆ పోట్లాటలో యాదవ వంశాలు నాశనం అయ్యాయి.

అలావారు నాశనం కావడం తెలుసుకున్న బలరాముడు మహా ప్రస్థానం సాగించి, అనంత తేజంలో కలసి పోయాడు.

శ్రీకృష్ణుడు ఒంటరి అయి, పాదచారి అయి పోయిపోయి ఓ లతా నికుంజంలో విశ్రమించాడు. ఒకకాలిమీద మరొక కాలు పెట్టి పడుకున్న తరుణంలో, బోయవాడొకడు, ఆ పాదరింట వేట కలదన్న భ్రమతో బాణం విడదాడు. ఆ బాణం ములికి, ముని శాప కారణంగా పుట్టిన ముసలం చివరిముక్క. ఆ బాణఘాతానికి శ్రీకృష్ణుడు శ్రమ పొందాడు.

వేట కోసం వచ్చిన బోయ, తను బాణం వేసింది, వేట మీదకాదనీ, శ్రీకృష్ణుని మీదననీ తెలుసుకుని క్షమింపమని ఆయన కాళ్ళ మీద పడ్డాడు.

''జన్మాంతర కర్మ తప్పించుకోలేనిది. ఈ విషయంలో నీవు నిమిత్త మాత్రుడవు. నీ తప్పులేదు. నీ ధర్మం నీవు చేశావు. నీ వేటకు నేను చిక్కాను అంతే! వెళ్ళు'' అని బోయను పంపివేసి, ప్రాయోపవేశంతో ఆయన జన్మ చాలించాడు.

ఇంతలో దారకుడు, శ్రీకృష్ణుని వెదకుతూ అక్కడకు వచ్చాడు. అతడు యాదవ కులక్షయమూ, ద్వారకముంపు తెలియచేశాడు.

శ్రీకృష్ణుడు చివరి మాటగా ఇలా అన్నాడు.

''అర్జునుని సాయంతో స్త్రీ బాలవృద్ధులను సురక్షిత ప్రాంతాలకు చేర్చు.''

శ్రీకృష్ణ నిర్యాణం పొందిన నాటినుండీ కలియుగం ప్రారంభమయింది.



# దాక్షాయణి

బ్రహ్మదేవుని సత్రం చూడడం కోసం దేవతలంతా తరలివచ్చారు. ఇంతలో దక్షప్రజాపతి, తన బలగంతో రావడం జరిగింది. అతడు ప్రజాపతి కనుక దేవతలు, తమ తమ ఆసనాలనుండీ లేచి నమస్కరించి గౌరవించారు. దక్షుడు వారి నమస్కారాలు అందుకుంటూ సభను తేరిపార చూశాడు. బ్రహ్మదేవుడూ, ఈశ్వరుడూ మౌనంగా కూర్చున్నారు.

బ్రహ్మ తనను పుట్టించిన వాడు. మరి ఈశ్వరుడెవరు? తన కూతురి భర్త. తను గౌరవనీయుడు కాదా! తను పెద్ద వాడుకదా1 ఎందువల్ల గౌరవించలేదు? గర్వం, మదం, అహంకారం అయిఉంటుందా? తన పెద్ద తనం, తన అల్లుడి దగ్గర పని చేయదా?

''ఇతనిలో ఏం గొప్ప ఉందని ఇంత కండకావరం? ఇల్లా? వాకిలా? ఐశ్వర్యమా? కొండ కొమ్మునా, తప్పితే శ్మశానంలో నివాసం. కట్టుకునేందుకు దుకూలాలు లేక పోతే పోనీ, మామూలు గుడ్డాలేదు. చర్మాలు కట్టుకుంటాడు. ఇంతటి కటిక దరిద్రుడికి పిల్లను ఎవ్వరూ ఇవ్వకపోతే, నేనే దయ తలచి పిలిచి పిల్లనిచ్చాను. ఒక ఇంటి వాడిని చేశాను. అందుకు ప్రతిఫలంగా ఇచ్చే మర్యాద ఇదా? ఆసనమ్మీదనుండీ లేవక పోతే పోనీయ్. కనీసం నోరార పలకరిస్తే ఏం పోయింది? అదీ అఖరలేదు, ఒక చిరునవ్వు పారేస్తే ఈయనగారి సొమ్మేం పోయింది? ఏమయినా ఉంటేకదా పోయేందుకు! చూడండి. ఎలా భీష్మించుకు కూర్చున్నాడో? మానహీనుడూ, ఉన్మత్తుడూ, దిగంబరుడూ, అస్థిమాలాధరుడూ, నాగభూషణుడూ, అశౌచుడూ, అమంగళుడూ అయిన ఇతనికేం మర్యాదలు తెలుస్తాయి? ఔను పిల్ల నిచ్చిన వాడు లోకువే కదా! ఆలోకువ ఏమిటో ఇప్పుడే తెలుస్తా!'' అంటూ వెర్రివలె, ప్రలాపిస్తున్న దక్షుడిని, కొందరు మునులు వారించారు.

భృగువులాంటి కొందరు ఎగసం తోశారు.

దక్షుడు యజ్ఞ భాగం శివునకు చెందకుండా ఉండవలెనని శపించాడు. పరమేశ్వరుడు చిద్విలాసుడై మౌనంగా కూర్చున్నాడు. అయితే శివగణం మాత్రం శివాపరాధం చేసిన దక్షుడి మీద మండిపడ్డారు.

''వీడొక పశువు. వీడికి శివతత్త్వం ఏం తెలుస్తుంది! సర్వమంగళుడయిన ఈశ్వరుని, అమంగళుడన్న వీడి నోరు పడిపోతుంది; తలా తెగి పోతుంది. గొర్రెతల వీడికి శాశ్వతం అవుతుంది!'' అని నంది శపించాడు.

హర ద్వేషులయిన బ్రాహ్మణులు యాచకులవుతారనీ నంది శపించాడు.

బ్రాహ్మణులను నంది శపించడం విన్న భృగువుకు కోపం వచ్చింది ''శివాచారులంతా పాషండులవుతారు!'' అని అతడు శపించాడు

ఆ సత్రం ఆ విధంగా శాపప్రతిశాపాలతో శాపసత్రంగా మారింది. అయితే వారంతా మహానుభావులు కావడం వల్ల వెంటనే ఫలితం కనిపించలేదు.

మరి అక్కడ ఉండకుండా పరమేశ్వరుడు, తన అనుచరులతో తన నివాసానికి వెళ్లి పోయాడు.

శ్వశుర జామాతల అన్యోన్యవైరం అలా ఏర్పడింది. క్రోధనుడు అయిన దక్షుడు మాత్రం ఈశ్వరుని ఏ విధంగా అవమానించడమా అని ఆలోచించసాగాడు. ఒక యజ్ఞంచేసి, ఈశ్వరునికి భాగం ఇవ్వకుండా అవమానం చేయవలెనని నిశ్చయించుకున్నాడు.

అతడు బృహస్పతీ సవనం ప్రారంభించాడు. ఆ సవనం చూడరమ్మని, అతడు అందరనూ పేరుపేరున ఆహ్వానాలు పంపాడు. అయితే పరమేశ్వరుని పిలువలేదు. పిలిచినా, విష్ణుదేవుడూ, బ్రహ్మ ఆ సవనానికి రాలేదు.

దేవతలు ఎక్కడెక్కడినుండో, విమానాలూ, తమ వాహనాలూ ఎక్కి దక్ష వాటికను చేరుకోసాగారు. అలా ఆకాశంలో వెళుతున్న దేవతలను చూసి దాక్షాయణి, తనూ వెళ్లవలెననుకుంది.

"చూశారా ప్రభూ! నా తండ్రి గొప్ప యాగం, చేస్తున్నాడట. ఈ ఉత్సవ సమయంలో కన్నవారిని చూడడం జరుగుతుంది కదా? నా తల్లి, చెల్లెళ్లు, నేను రాకపోతే చిన్నబుచ్చుకుంటారు. పిలువని పేరంటం అంటావా? పుట్టింటికీ, గురు దర్శనానికి పిలిపించుకోవలసిన అవసరం లేదు. బంధువుల ఇండ్లకూ అంతే! ఈ ధర్మం నీకూ తెలుసు!" అంది దాక్షాయణి.

"నీ తండ్రి నాతో విరోధం పెంచుకున్నాడు దేవీ? నామీది ద్వేషం, విరోధం నీమీద చూపక పోతాడా? నీవు అవమానం పొందుతావు. అది తెలిసి నేను ఊరుకో గలనా? ఈ విషయంలో నీ ఆలోచన ఎలా ఉందో అలాగె చెయ్."

సదాశివుడు అలా అన్నదే పదివేలు అనుకున్నది ఈశ్వరి.

ఉత్కటమైన బంధు ప్రేమతో ఆమె అప్పటికప్పుడే బయలు దేరింది ఆమెకు తోడుగా శివగణం అనుసరించింది.

అలా యాగశాలకు వచ్చిన సతీదేవిని తల్లీ తోడబుట్టువులు తప్పమరెవ్వరూ, దక్షుడి భయంకొద్దీ గౌరవించలేదు.

దక్షుడు పెడముగమై, అసహ్యంగా చూశాడు.

సతీదేవికి కోపం, దుఃఖం, అవమానం ఒఖ సారిగా ముంచుకు వచ్చాయి.

శతృత్వాలూ, ద్వేషాలూ వాళ్లు వాళ్లు చూసుకోక, రాక రాక వచ్చిన తనను తండ్రి అయిన వాడు నిరాదరిస్తాడా?

"అరుద్రం అయిన యజ్ఞంతో సహా నిన్నూ క్షణాల్లో దహించి వేస్తాను!" అంటూ సతీదేవి కాళిక అయింది.

నంది అడ్డం వచ్చి, "తల్లీ! శాంతించు! వీడికి శిక్ష ఆ పరమేశ్వరుడు విధిస్తాడు!" అన్నాడు.

"శివ అన్న రెండక్షరాలు సర్వపాపాలను దహించివేస్తాయి. ఆయన చరణాలమీద భక్తి ఎవరికి కుదురుతుందో, వారికి సర్వైశ్వర్యాలూ కలుగుతాయి. ఆయన దిగంబరుడే! సర్వ వ్యాపి కనుక దిగంబరుడయ్యాడు. పరేత వన విహారుడనీ, పిశాచగణ సేవితుడనీ ఎవరు అంటారో, వారికి అమంగళం కలుగుతుంది. ఏదేవదేవుని చరణధూళి సర్వదేవతలకూ శిరోధార్యమో, ఏ దేవదేవునిలో సగమో నన్ను అవమానించావు. ఆయనను ఎప్పుడో అవమానించావు. నిష్కృతి లేని పాపం చేశావు. ఇకపై దాక్షాయణి అన్న పేరుతో పిలిపించుకోడం అవమానంగా భావిస్తున్నాను. నీ కూతురుగా ఆయన దగ్గరకు ఏముఖంతో వెళ్లవలె! నీకు పోగాలం దాపురించింది. హరద్వేషులు బావు పడరు" అంటూ శివాని ధర్భాసనమ్మీద కూర్చుని కనులు మూసుకుంది. ప్రాణాపాన వాయు నిరోధం చేసి, ఉదానం వరకూ లాగి, బుద్ధిని శివార్పణం చేసి యోగస్థితిలో అగ్నిని ఆవాహనచేసి ఆమె దగ్ధమై పోయింది.

సత్రం చూడవచ్చినవారు చేసిన హాహారవాలు మిన్ను ముట్టాయి. శివ గణాలు పూనకం వచ్చినట్లు కోపంతో ఊగిపోతూ, దక్షుడి మీద విరుచుక పడ్డారు.

వారి ధాటికి ఆగలేక దక్షుడు, భృగువు శరణుపొందాడు. భృగు మహర్షి అభిచారహోమం చేసి ఋభునాములైన దేవతలను పుట్టించాడు. వారు ఆయుధపాణులై, పార్షదులయిన రుద్రగణాన్ని తరిమి కొట్టారు.

సతీప్రాణత్యాగం గురించిన సమాచారం నారదుని వలన పరమశివుడు విన్నాడు. వ్యోమకేశుడు ప్రళయ తాండవ మూర్తి అయ్యాడు. తన జటనొకటి ఊడబెరికి బండరాయిమీద కొట్టాడు.

దుర్నిరీక్షమైన తేజంతో, బారెడు కోరలతో, చారెడు కండ్లతో సహస్రబాహులతో భయోత్పాతమైన మూర్తితో శూలపాణి అయి వీరభద్రుడు పుట్టుకవచ్చాడు.

''తండ్రీ! ఆజ్ఞ ఇవ్వు!'' అంటూ ముకుళిత కరాలతో వీర భద్రుడు నంచున్నాడు.

''దక్షవాటికకువెళ్ళు! దక్షుడి తలనరుకు! ఈ ప్రమథులకు నాయకుడవై శివ విరోధులను అణచివెయ్! నీకు విజయం కలుగుతుంది!''

వీరభద్రుడు పరమేశ్వరునకు ప్రదక్షిణ నమస్కారాదులు చేసి దక్ష నగరానికి వచ్చాడు.

రుద్రగణాల్లో కొందరు పత్నీ శాలనూ, కొందరు సదస్యశాలనూ, కొందరు యజమాన శాలనూ, కొందరు అశన శాలనూ ధ్వంసం చేశారు. కొందరు అగ్నిని ఆర్పారు. కొందరు యజ్ఞవస్తువులనూ, పాత్రలనూ ముక్కలు చేశారు. మణిమంతుడు భృగువును చిక్కించుకున్నాడు. భృగువు కండ్లు రెండూ నందీశ్వరుడు పెల్లగించాడు. వీరభద్రుడు దక్షుడిని నేల పడవేసి గుండెల మీద కుడికాలుమోపి, శూలంతో పొడిచాడు. దక్షుడు చావకపోయేసరికి, అతడి తలను గిల్లి యజ్ఞగుండంలో వేసి తగలపెట్టాడు.

దక్షుడి సతీసంతానాల రోదనలు మిన్నువుముట్టాయి. అక్కడఉన్న దేవతలు, మునులూ అచేతనులైనుంచున్నారు.

చావుతప్పి కన్నులొట్టబోయిన విధంగా దేవతలు చావు దెబ్బలు తిని బ్రహ్మలోకంచేరి బ్రహ్మపాదాలు ఆశ్రయించారు.

''భగవంతుడయిన పరమేశ్వరుని వెలివేసిన యజ్ఞం చూడబోయిన మీకు తగిన మర్యాదలు చిక్కాయి. ఏదేవుని కడగంటి చూపు చలువలకు లోకాలు నిలుస్తున్నాయో, ఏదైవం కరుణతో ప్రాణుల మనుగడ సాగుతుందో, ఏ పరంధాముని చూపు వేడిమికి లోకాలు భస్మం అవుతున్నాయో, ఆ పరమేశ్వరునకు అపచారం చేసిన వారికెవరికయినా కల్యాణం కలుగుతుందా? ఆ పాదాలు శరణం పొందడమే శ్రేయం! పదండి! ఆయన చరణ సన్నిధానానికి!'' అంటూ బ్రహ్మదేవుడు, వారితో కైలాసం చేరాడు.

మహా యోగీ, విరాగీ, నిస్సంగీ అయిన వాడూ, విస్తృత శాఖలతో విరాజిల్లే వటవృక్షమూలంలో సిద్ధజనసేవితుడూ, సర్వమంగళరూపుడూ, వీతమత్సరుడూ, చిద్విలాస వదనార విందుడూ అయిన పరమేశ్వరుని వారు సమీపించారు.

దేవతలు ఆయనపాదాలకు తమతమ శిరస్సులు వంచి నమస్కరించారు. మహాత్ముడయిన అర్ధేందుభూషణుడు, బ్రహ్మదేవునకు నమస్కరించి ఉచితాసనం ఇచ్చి గౌరవించాడు.

"నిర్వికార బ్రహ్మవు. నిరంజనుడవు. జత్కారణుడవు, జగత్కల్యాణుడవు అయిన ప్రభూ! ధ్వంసం అయిన యజ్ఞం సమాప్తి చేయవలసిందిగా ప్రార్థిస్తున్నాం. దక్షుడి మీద లవలేశం కోపం చూపించావు. అపరాధి తగిన శిక్ష అనుభవించాడు. కోప తాపాది రాగాలకు అతీతుడవయిన నీవు వారిని రక్షింపగలవు. ఇప్పుడు వారిని పునర్జీవితులను చేయవలె స్వామీ? భగ్నాంగులయిన వారికి, తిరిగి వారి వారి అంగాలను దయచేయవలె తండ్రీ!" అని బ్రహ్మ విన్నవించాడు

"కలుషాత్ములను దండించడం ధర్మరక్షణకే దేవా! ధర్మాసక్తి తప్ప వారిమీద నాకే కోపములేదు. దక్షుడు మేషముఖుడవుతాడు. పూషుడికి యజమాన దంతాలు, భృగువుకు భస్మశ్రువులూ కలుగుతయ్! అశ్వనీ దేవతల ప్రభావంతో ఖండితాంగులయిన బ్రాహ్మణులు లబ్ధాంగులవుతారు!" అని సదాశివుడు వరదానం చేశాడు.

దక్షుడు మేషముఖంతో నిద్రమేలుకున్న విధంగా లేచాడు. విగత కల్మషుడు కావడం వల్ల కన్నీళ్లతో గద్గద స్వరంతో ఈశ్వర పాదాల మీద పడి, "నీకొక అపరాధం చేయడం వల్లనే, నీ కటాక్షం నాకు లభించింది. నీ దండన ప్రతీకారం కాదు. గురువువలె, తల్లికివలె నీవు జీవుల శిక్షిస్తావు. నీవు విశ్వరక్షకుడవు. సర్వేశ్వరా! ఆజ్ఞ ఇవ్వు! శేషయజ్ఞం సమాప్తి చేస్తా. యజ్ఞమేనీవయినపుడు నీవులేని యజ్ఞం చేయవలె ననుకోడం నా అజ్ఞత కదా ప్రభూ!" అని స్తుతించాడు అతడు.

ఆ పవిత్ర సమయంలో విష్ణువు ప్రత్యక్షం అయ్యాడు.

ఆ దేవదేవునకు దేవతలంతా ముక్త కంఠంతో ఇలా స్తుతించారు.

"నీవు నిరంజనుడవు. నిర్మలాత్ముడవు, నిరుపమానుడవు, నిరతిశయుడవు, నిరవద్యుడకవు ప్రభూ! నీకు శతకోటి నమస్కారాలు. సదా వత్సలుడవు తండ్రీ!"

దక్షయజ్ఞం పూర్తి అయింది.

"లోకాలు శాంతి పొందుతాయి!" అని బ్రహ్మణాశీర్వాదంతో స్వస్తి వచనాలు పలికారు.

దాక్షాయణి, మేనకా హిమవంతుల తనూజగా పుట్టి శైలజ నామంతో మహేశ్వరుని చేరింది.



# ధ్రువుడు

స్వాయంభువుమనువు బ్రహ్మకు పుట్టిన ఒకానొక కొడుకు. శతరూప అతని భార్య. ఈ దంపతులకు ఉత్తానపాదుడూ, ప్రియవ్రతుడూ అనే ఇద్దరు కుమారులు కలిగారు.

ఉత్తాన పాదునకు ఇద్దరు భార్యలు. సునీతి, సురుచులు వారు. ఉత్తాన పాదునకు సురుచిమీద మక్కువ. సునీతి ధ్రువుడు పుట్టిన తరువాత, భర్త ప్రేమకు వెలిఅయి జీవించసాగింది.

బాలుడయిన ధ్రువునకు ఈ విషయాలు తెలియవు. ధ్రువుడొకనాడు సురుచి ఇంట ఆటలాడుతున్న సమయంలో, తండ్రి తొడలమీద సురుచి కొడుకయిన ఉత్తముడు కూర్చోడం జరిగింది. ధ్రువునకూ అలా తండ్రి తొడ మీద కూర్చుండవలెనని, కోరికతో తండ్రి అంకసీమ చేరుతుండగా, అక్కడకు సురుచి వచ్చింది.

ఆమె విసురుగా వచ్చి ధ్రువుని రెక్కపుచ్చుకుని ఇవతలకు ఈడ్చింది. ఆ వేగానికి ధ్రువుడు అల్లంత దూరంలో పడ్డాడు. తండ్రి ఉత్తానపాదుడు చూచీ చూడక తన అంకం చేరిన ఉత్తముని ముద్దులాడ సాగాడు.

సురుచి అంతటితో ఊరుకోక, ఆ బాలుడు చేయరానంత నేరం చేసినట్లు ఈసడించుకుంది.

"అర్హతలేని తల్లికి పుట్టిన బిడ్డవు నీవు. నీ తల్లికి లేని అర్హత నీకు ఎక్కడనుండీ వస్తుంది? తండ్రి తొడల మీద కూర్చోవలెనంటే, నీవునాకడుపున పుట్టవలసింది. అలా జరగలేదు. ఈ జన్మకీ అదృష్టం నీకు లభింపదు. వచ్చే జన్మకయినా నీకీ భాగ్యం చిక్కవలెనంటే, భగవవంతుని సేవించి వరం పొందవలసిందే!" అంది సురుచి.

రాచబిడ్డ ధ్రువుడు అభిమాని కనుక అక్కడ నిలువ లేదు. తండ్రి ఉదాసీనుడయిన సమయంలో ఎవరితో మొరపెట్టుకోవలె?

కంటికి మంటికి ఏకధారగా ఏడుస్తున్న కొడుకును సునీతి గుండెలకు హత్తుకుంది. ధ్రువుడు ఏడుస్తూ రాచ నగళ్లలో జరిగిన సంగతి చెప్పాడు.

"నీ తండ్రి నన్ను భార్యగాకాక పోయినా ఒక క్రీత దాసి వలె నయినా మన్నింపలేదు నాయనా! నీసవతి తల్లి, నీకొక మంచి సలహా ఇచ్చింది. తండ్రితొడమీద కూర్చునే అదృష్టం ఇవ్వగల వాడొకడున్నాడు. ఆయన పాదాలు ఆశ్రయిస్తే నీ దుఃఖం పోతుంది. ఉన్నతోన్నతుడవు కాగలవు. ప్రయత్నించు. ఈ అల్పమైన చోటు చిక్కలేదని వాపోకు తండ్రీ?" అంది సునీతి.

సవతితల్లి చేతలకూ, తల్లి మాటలకూ, ధ్రువుడి ఆలోచనలు కొత్తపుంతలు తొక్కాయి. ఆ ఆలోచనలకు జన్మాంతర వాసనలు తోడయ్యాయి. శ్రీహరి గూర్చి తపం చేయ సంకల్పించుకుని అంతఃపురం, పురంవదలి, అడవులకు నడక సాగించాడు ధ్రువుడు.

అలా పోతున్న ధ్రువునకు నారదుడు ఎదురయ్యాడు.

ధ్రువుడు నమస్కరించాడు.

"నీకు మంగళం, కలుగుతుంది. ఎవరు నాయనా నీవు? ఎక్కడకు పోతున్నావు?" అని అడిగాడు నారదుడు.

"శ్రీహరిని వెదుకుతూ పోతున్నాను!" అని ధ్రువుడు తనకు జరిగిన అవమానం, తల్లి ఇచ్చిన ఉపదేశం ఆయనకు చెప్పాడు.

నారదుడు ఆశ్చర్యం నటిస్తూ, "ఇంత చిన్న వయస్సులో నీకు తపస్సు ఎందుకు? ఈ స్వల్పం కోసం ఇంత కష్టం నెత్తికెత్తు కుంటావా? తపస్సు చేయడం ఎంతో కష్టం నాయనా? నీకు వయస్సు చాలదు. విధి ఎలా ఉంటే, అలా జరుగుతుంది. దీనికి చింతించినా, మరేం చేసినా విధి మారదు నాయనా! మనస్సు మార్చుకుని ఇంటికి వెళ్లు. తల్లి నీడలో హాయిగా జీవించు. దయామయుడైన భగవంతుడు నీకు మేలు చేస్తాడు." అన్నాడు.

"విధి నన్ను తపస్సుకు పురికొల్పిందేమో స్వామీ! విధి అలా లేకపోతే నాకీ బుద్ధి పుట్టదు కదా! మీరు నన్నే శిష్యుడ ననుకుని భగవంతుని చేరగల మార్గం ఉపదేశించండి. నా ప్రయత్నానికి నన్ను ఆశీర్వదించండి స్వామీ! నన్ను పురికొల్పండి!!" అంటూ ధ్రువుడు చేతులు జోడించాడు.

"నీ నిశ్చయం ధృఢంగా ఉంది. చాల సంతోషం నాయనా1 ఈ నిబ్బరం నిన్ను కృతార్థుడను చేస్తుంది. దయామయుడు తప్పక కరుణిస్తాడు. అదో. ఆ కనిపించే తరుమూలంలో కూర్చో! సమీపంలో నది ఉంది. నీ తపస్సు మూలంగా ఈ మధువనం పునీతం అవుతుంది. చిత్తంలో మహాదేవుని రూపం ఆకర్షించుకో! చాంచల్యం అరికట్టు.. ఇంద్రియ నిగ్రహం సాధించు. ఈ మంత్రం

జపించు నాయనా! నీకు విజయం కలుగుతుంది!'' అంటూ నారదుడు ధ్రువునకు మంత్రోపదేశం చేశాడు.

ధ్రువుడు యమునలో నీరాడి శుచి అయి, సర్వేశ్వరుని గూర్చి తపస్సు చేయసాగాడు. మూడు రోజులకొకసారి ఆహారం తీసుకుంటూ ఒకమాసం రోజులు తపస్సు చేసి, రెండవనెలలో ఆరురోజుల కొక పరిజీర్ణతృణాలు ఆహారంగా తీసుకుంటూ తపం చేస్తూ, మూడవ మాసంలో తొమ్మిది రోజుల కొకసారి జలం తీసుకుంటూ, నాలుగవ నెలలో పన్నెండు రోజులకు వాయుభక్షణ చేస్తూ, ఐదవ నెలలో వాయుస్తంభన చేసి, ఏకపాదుడై కఠిన తపస్సు చేస్తూ ధ్రువుడు కృశించి పోసాగాడు.

ధ్రువుడు చేస్తున్న తపస్సు మూలంగా మూడు లోకాలు తల్లడిల్లాయి. ఒంటి పాదంతో నుంచున్న ఆ బాలుడి బరువుకు భూమి తాళుకోలేక కుంగి పోయింది. దేవతల మనుగడ అస్తవ్యస్తం అయింది.

దేవతలు ఆబాల ముని తపస్సుకు నిభాయించుకోలేక, భగవంతుడు శ్రీహరిని దర్శించారు.

దేవతల విన్నపం మన్నించి, ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీహరి కదలి వచ్చాడు.

ధ్రువుడు దండప్రణామాలు చేసి నుంచున్నాడు. ఆ దేవదేవుని కీర్తింప భాషలేక నుంచున్న ఆ బాలుని మన్నించి, భగవంతుడు, తన శంఖంతో స్పృశించాడు.

అప్పుడు ధ్రువుడు సకల, విద్యా విశారదుడై భగవంతుని స్తుతింప సాగాడు.

ఏ దేవుడు విశ్వానికంతా కారణ కారకంగా ఉంటున్నాడో, ఏదేవుడు గుణత్రయాధీశుడో, ఏదేవుడు కర్త, భోక్త అయి వెలుగుతున్నాడో, ఏ దేవుడు సర్వజీవులకు ఆత్మ అయి భాసిస్తున్నాడో. ఆ పరంధామునకి నమశ్శతాంజలులు... అనంత శక్తి సమన్వితునకు ఈ దీనుని ప్రణామాంజలి.' అని ధ్రువుడు సాగిలపడి నమస్కరించాడు.

''నాయనా ధ్రువా! నీ తపస్సుకు సంతోషించాను. అనన్యలభ్యం అయిన క్షితి నీపేర వెలుగొందుతుంది. సప్తర్షి మండలం దాటి ధ్రువక్షితి విరాజిల్లుతుంది. నీ తండ్రి తదనంతరం రాజ్యసుఖాలు అనుభవించి నన్ను చేరుకుంటావు. చిరంజీవివై వర్ధిల్లు!'' అని నారాయణుడు అదృశ్యుడైనాడు.

ధ్రువుడు సంతోషంతో ఇంటికి మరలాడు.

ఉత్తాన పాదుడు, వృద్ధుడైన కారణంగా, రాజ్యాధికారం ధ్రువునకు అప్పగించి, వనవాసం చేయసాగాడు.

శింశుమార ప్రజాపతి కూతురయిన భ్రమిని ధ్రువుడు వివాహం చేసుకున్నాడు. ఆమె వలన కల్పుడూ, వత్సరుడూ అన్న కుమారులను పొందాడు. వాయుపుత్రి అయిన ఇల అతని భార్య అయింది. ఇలకు ఉత్కలుడు పుట్టాడు, శంభువు అన్న భార్యవలన భవ్యుడు, శ్లిష్టి కలిగారు. ఈ భార్యలే కాక ధ్రువునకు మరో విచిత్రమైన భార్య ఉన్నదని అంటారు. అతని నీడ – ఛాయను స్త్రీవి కమ్మని కోరాడు. అతని కోరిక మన్నించి ఆ నీడ స్త్రీ అయింది. ఈమెకు ఐదుమంది కొడుకులు పుట్టారు.

పూర్వజన్మలో వేద విదుడైన బ్రాహ్మణుడనీ, రాజ్యకాంక్ష మూలంగా క్షత్రియుడై జన్మించి రాజ్యపాలన చేశాడనీ ధ్రువుని గురించి చెబుతారు.

సురుచి కొడుకు ఉత్తముడు పెండ్లిచేసుకోలేదు. ఒకనాడు వేటకు పోయిన అతడిని ఓ యక్షుడు చంపాడు.

ధృవుడు, తన సోదరుని చంపిన వారిని దండించేందుకు ఉత్తర దిశగా రథంలో పయనించాడు.

అలకాపురం చేరి శంఖం పూరించాడు.

యక్షులు ధృవుని మీద విరుచుక పడ్డారు. ధృవుడు ఒంటరిగా పోరాడి వారి ఆయువుపట్లు నొవ్వచేశాడు.

వారు అంతటితో ఆగక మాయా యుద్ధానికి దిగారు. వారి మాయ వలన ఉన్నట్లుండి చీకట్లు నిండాయి. మూత్ర పురీషాదులు, శిలాపాతాలు వారు ధృవుడి మీద వారు కురిపించారు.

ధృవుడు భగవంతుని స్మరించి నారాయణాస్త్రం ప్రయోగించాడు. ఆ అస్త్ర బలంతో మాయ చెదరి పోయింది. యక్షులు అనేకులు దారుణంగా మరణించారు.

అప్పుడు అతని తాత స్వాయంభువు మనువు ప్రత్యక్షం అయ్యాడు.

"నాయనా! భ్రాతృవత్సలా! నీ తమ్ముడిని వీరు చంపారన్న క్రోధంతో ఇంతదారుణ ప్రతీకారం తీసుకున్నావు. ఇంక శాంతుడవై యక్షనాథుడు కుబేరునితో స్నేహం పాటించు!" అని చెప్పాడు.

మనువు మాటకు జవదాటక ధృవుడు ఆయుధ విసర్జన చేశాడు.

ఇంతలో కుబేరుడు ప్రత్యక్షమై, "నీవు మహావీరుడవు మహారాజా! నీతమ్ముని చంపినది వీరుకాదు; వీరిని చంపినది నీవుకాదు. ఈ సంహారకాండకు కారకుడు ఆ పరమేశ్వరుడు. ఆయన దీనికంతా కారణకర్తగా ఉన్నాడు. బాల్యదశలో భగవంతుని ప్రసన్నం చేసుకున్న మహానుభావుడవునీవు. క్రోధనుడవు కావద్దు! నీకు క్షేమం కలుగుతుంది" అన్నాడు.

వారిశలవు పొంది ధృవుడు తన నగరం తిరిగి వచ్చాడు. అతడు అనేక యజ్ఞయాగాలు చేసి, విరివిగా దానాలు చేసి, బహుకాలం రాజ్యం చేసి, కొడుకులకు రాజ్యం ఇచ్చి వాన ప్రస్థాశ్రమం స్వీకరించాడు.

అతడు హరిధ్యానంతో ముముక్షువై శేషజీవితం గడుప సాగాడు.

ఒకనాడు దివ్యరథం అతని ముందు కనిపించింది.

"మహానుభావా! నీ కోసం విమానం తెచ్చాము. నిన్ను భగవత్సన్నిధానానికి తీసుకవెళ్లవలసిన సమయం వచ్చింది" అన్నారు దేవదూతలు.

అతడు విమానంలో వెళుతూడంగా, తల్లి గుర్తుకు వచ్చింది. తన తల్లిని విడచి వెళుతున్నట్లు తోచింది.

దేవదూతలు, ఆ విమానం ముందు వెళుతున్న మరొక విమానం చూపారు. ఆ విమానంలో అతని తల్లి కనిపించింది.

అలా వెళ్లిన ధృవుడు ధృవమండలం చేరి శాశ్వతుడైనాడు.

ఉత్తరదిశలో ధృవతార ప్రకాశిస్తూంది.



# భరతుడు

చౌలాకాలానికి ముందు ఈ దేశం పేరు అజనాభం. ఈ అజనాభాన్ని భరతుడు పాలించడం వల్ల, ఆయన పేరుమీదుగా అది భారతవర్షం అయింది.

భరతుని భార్యపేరు పంచజని. ప్రజలను కన్నబిడ్డలవలె మన్నించి ఎటువంటి బాధలు లేకుండా ఆయన దేశాన్ని పాలించాడు. దేవతల ప్రీతికై ఆయన అనేక యజ్ఞయాగాలు చేశాడు.

ఆయనకు పంచజని వలన ఐదుమంది కొడుకులు జన్మించారు.

ఐహిక వాంఛలు తీరిన తరువాత, భరతుని మనస్సు ఆముష్మికం వైపుకు తిరిగింది. తన పుత్రులకు భూమిని అప్పగించి నారచీరెలు కట్టుకుని, జింక చర్మం చుట్టి చంకలో పెట్టుకుని, అతడు అడవులకు దారితీశాడు.

గండకీనది తీరం చేరి, భగవదారాధనతో కాలం గడపసాగాడు. ఆడిన మాటలు భగవంతుని ప్రార్థనకాగా, తిన్నదేదో నివేదనకాగా, తిరిగినదెల్లా ప్రదక్షిణలు కాగా, నిదురించినది సమాధి స్థితికాగా సర్వావస్థలూ భగవత్సేవతో, చింతనతో, మననంతో కాలం గడిపేవాడు. ప్రకృతిలో అతడూ, అతడిలో ప్రకృతీ అయింది.

అటువంటి ఉన్నతస్థితి చేరుకున్న భరతుడు ఒకనాడు ఉదయం వేళ స్నానం చేస్తున్నాడు. గండకీనదిలో అతనికి కొంచెం దూరంలో నిండు గర్భిణి అయిన హరిణమొకటి నీరు తావుతూంది. ఇంతలో భయంకరంగా సింహగర్జన వినిపించింది. భీతితో ఆ జింక ఇంత ఎత్తుకు ఎగిరింది. లేచిందే తడవున, దానికి గర్భపాతం ఏర్పడింది. నీళ్లలో లేడికూన పడింది. గట్టున పడ్డ తల్లి జింక ప్రాణాలు గోలు పోయింది.

పుట్టిన క్షణాల్లో తల్లిని గోలుపోయిన ఆ కూన దురదృష్టానికి భరతుని మనస్సు కరుణతో నిండింది. సహజ దయాళువు అయిన భరతుడు, ఆ కూనను రక్షించి, తన వెంట పర్ణశాలకు తెచ్చుకున్నాడు.

లేత గడ్డి పరకలు తెచ్చి, దాని నోటికి అందించేవాడు. చలికి వణకుతూండగా, తన గుండెలకు అదుముకునే వాడు. ఆ కూన కనుచూపులకు దూరం కాకుండా దరిదాపుల్లో తిరగనిచ్చేవాడు.

దాని చెంగణాలకు మురిసి పోతూ, కౌగిలింతలతో ముద్దులతో, ముచ్చట్లతో అహర్నిశలూ విడిచిపెట్టకుండా భరతుడు దానితో తిరిగేవాడు.

పూజ చేస్తున్నా అతడి చిత్తం ఆ హరిణ శాబకమ్మీదనే ఉండేది. చూపులు దాన్ని వెంబడిస్తూండేవి. భగవన్నివేదనలూ, ప్రార్థనలూ, అన్నీ మరుగున పడిపోయినవి. ఆ జింక పిల్ల ఆయనకు ప్రాణసమం అయింది. ఏ యోగం కోసం, ఏ తపస్సు కోసం ఇల్లూ, ఇల్లాలినీ తృణప్రాయంగా త్యజించాడో, ఆ విషయాలు అతడు మరచి పోయాడు. ఆ హరిణ మ్మీద మమకారం పెరిగింది. దాని ఆలనా పాలనా, సుఖదుఃఖాలు, ముద్దుముచ్చట్లు అతడు సర్వస్వం గానూ, పరమావధిగానూ అనుకున్నాడు.

ఒకనాడు ఆ జింకమేత కోసం ఎంతో దూరం పోయింది. సాయంకాలం అవుతున్నా అది పర్ణశాల చేరుకోలేదు. భరతుడు ఎంతో వ్యాకులం పొందాడు. దాన్ని తలచుకుంటూ, దాని ముద్దుముచ్చటలను నెమరువేసుకుంటూ, దాని దారి తెన్నులు చూస్తూ నుంచున్నాడు.

ఆ జింక దానికదే పర్ణశాలకు వచ్చింది. భగవంతుడు వరదాత అయి తన ముందునుంచున్నంతగా అతడు సంతోషించాడు. ఆ జింక ప్రేమతో అతడి గుండెల మీదకు దూకి మోరతో పొడిచి, తన చిట్టికొమ్ములతో గిలిగింతలు పెడుతూ మురిసిపోయి, భరతునీ మురిపించింది.

కొంతకాలానికి భరతుడు ఆసన్న మరణుడైనాడు. ఆ సమయంలోనూ, తల్లి లేని జింక పిల్ల ఏమయి పోతుందో అన్న బెంగ తప్ప మరే విషయమూ విధివశం వల్ల, అతనికి జ్ఞాపకం రాలేదు.

భగవంతుడికి ఎంత దగ్గరకు వచ్చాడో, మరణ కాలంలో అంత దూరాలకు పోయిన అతడు, దేనికోసం తపించాడో, దేనిని ధ్యానించాడో ఆ హీన జన్మ అతడికి లభించింది.

హరిణంగా పుట్టినా అతడికి జన్మాంతరసుకృతం వలన పూర్వజన్మ వాసనలూ, జ్ఞాపకాలూ నిలచి ఉన్నాయి. ఈ నికృష్టపు పుట్టువుకు కారణం కూడా అతని తెలిసి వచ్చింది. అందువల్ల విరక్తితో ఏకాకి అయి, మునుల సాన్నిధ్యంలో తిరుగుతూ, ఆ ఆశ్రమ ప్రాంతంలోని గాలిపీల్చుతూ, ఆ మంత్రాలు వింటూ పుణ్యజీవనం గడపసాగాడు. ఒకనాడు ఆ జన్మ నుండీ అతడు ముక్తుడైనాడు.

ఆ తరువాత ఆంగీరసుని కొడుకై జన్మించాడు. ఆజన్మలోనూ జ్ఞాపకాలు వెంటాడసాగాయి. చేజేతులా చేసిన పాపంఅనీ. మృగశాబకమ్మీది కరుణ వల్ల ఇన్ని జన్మలు పొందుతున్నానన్న బాధ అతని మనస్సును మెలి వేయసాగింది. ఆ దుఃఖం వలన అతడు మూకబధిరాంధుని వలె, మూర్ఖుని వలె జీవింపసాగాడు. జడభరతుడన్న పేరు అతడికి సార్థకం అయింది.

ఆంగీరసుడు, తన కుమారుని విద్యావంతునిగా తీర్చిదిద్దవలెనని ఎంతో ప్రయత్నం చేశాడు. భరతుడు అన్ని విద్యలు నేర్చుకున్నాడు. అయితే, చిత్తం భగవంతుని మీద లగ్నం చేసి బాహిరకంగా అతడు జడునివలె కనిపింపసాగాడు.

కొంతకాలానికి ఆంగీరసుడు కాలం చేశాడు. అతని అన్నలు మందుడయిన భరతుని గృహసేవలకు నియోగించారు. మాడు చెక్కలూ, తెలగపిండీ ఆహారంగా వారు భరతునకు ఇచ్చేవారు. ఎటువంటి పని ఇచ్చినా, మారు మాటాడకుండా అతడు నిర్వర్తించేవాడు. ఆహారంగా ఏది చిక్కినా, అది కేవలం భగవదత్తంగా భావించేవాడు. ఆహార విహారాలు అతనిని బాధించేవి కావు. కటికనేలమీద శయనించేవాడు. శీతుబాధలేదు. వంటికి తగిన బట్టలు ఉండవు. తినతిండి ఉండదు. ఎండకూ, వానకూ, చలికీ అతని శరీరం రాటుతేలింది. రాత్రింబవళ్లు అతని అన్నలు పొలాల కాపలాకు నియోగించేవారు.

భగవంతుని చరణస్మరణతో, అతడు కాలం గడుపుతూ సుఖదుఃఖాలకు, శీతోష్ణాలకూ అతీతుడై, నిర్లిప్తుడై, నిస్సంగుడై, నిరాసక్తుడై జీవించసాగాడు. మలిన శరీరంతో, జీర్ణవస్త్రాలతో మట్టిలో మాణిక్యం వలె అతడు ప్రకాశించేవాడు.

ఆ దేశాన్నేలే రాజు వృషలుడు, నిస్సంతు కావడం వలన, నరపశువును బలి ఇవ్వడం వలన సంతానం కలుగుతుందని ఎవరో చెప్పగా తగిన పశువును తీసుకురమ్మని మనుష్యులను పంపారు. ఆభటులు తిరిగి తిరిగి పొలంలో ఒంటరిగా ఉన్న భరతుని చూశారు. అతడు బలిపశువుకు పనికివస్తాడని రాజభటులు బంధించి, రాజసన్నిధికి తెచ్చారు.

ఆ బలిపశువును అభ్యంజనాదులు చేయించి, నూతన వస్త్రాలు ధరింపచేసి, గంధ పుష్పాలతో అలంకరించి కాళికాలయాలికి తీసుకువచ్చారు.

చండికాగృహంలో వృషలుడు మంత్రతంత్రాలుతో దేవిని అర్చించి, బలి ఇచ్చేందుకు కత్తి ఎత్తాడు.

భరతుడు చిరునవ్వుతో తల వంచాడు.

సర్వభూతమయుడూ, సముడూ, లయుడూ, ఆత్మ అయిన భరతుడు, ఆ సమయంలో వారికి దుస్సహ తేజంతో కనిపించాడు. కాళికాదేవి ప్రత్యక్షం అయింది. రాజునూ, అతని పరివారాన్నీ క్షణమాత్రంలో భస్మం చేసింది.

భరతుడు, ఆ దేవికి దండప్రణామాలు చేసి, అంతకు ముందు కావలి ఉన్న పొలానికి వచ్చి చేరాడు.

భరతుడు, చంపవచ్చిన వారినీ, రక్షించిన దేవినీ ఒకే దృష్టితో చూశాడు. అది సమదృష్టి. ఆ దృష్టివల్లనే అతడు ఉన్నతుడైనాడు.

కొంతకాలం అలా గడచిపోయింది.

సింధుదేశాధిపతి, ఇక్షుమతీ తీరంలో కాపురం ఉన్న కపిల మహర్షిని సుదర్శించి జ్ఞానం పొందగోరి పల్లకిలో ఎక్కి పోతున్నాడు.

శివికా రోహకులకు, ఒక వాహకుని అవసరం కలిగింది. వారికి చేని కాపు అయిన భరతుడు కనిపించాడు. అతడు దృఢకాయుడూ, మలినాంగుడూ అయిన కారణంగా వారు, భరతునకు ఒక కొమ్ము ఇచ్చారు.

భరతుడు ఆ కొమ్మును భుజమ్మీదకు ఎత్తుకున్నాడు. అయితే ఆయన నడిచే సమయంలో భూతహింస జరగకుండా చూస్తూ నడవడం వల్ల శివిక ఊగిసలాడుతూ, సాఫీగా నడవక పోవడం వల్ల పల్లకిలో కూర్చున్న రాజుకు బాధ కలిగింది. అలా శివిక పోతున్న కారణం అతడు అడిగాడు.

"కొత్తవాడొకడు వచ్చాడు ప్రభూ! వాడికి కొమ్ముకాయడం అలవాటున్నట్లులేదు!" అన్నాడు బోయ.

"అయ్యో! పాపం! పల్లకి మోయడం కష్టంగా ఉందటనా? వీడు పల్లకి కాక రాజ్యాలు మోస్తాడటనా? నడ్డి విరిగేలా తన్నండి. సాఫీగా నడుస్తాడు!" అన్నాడు రాజు.

భరతుడు మౌనం వహించాడు. అసహ్యమైన భారాన్ని ఎల్లాగో సహిస్తూ నడవసాగాడు. అయితే శివిక నడక సరిగా లేదు.

రాజు కోపం పెరిగింది.

"ఈ కొంచెం బరువు మోయడం నీకు కష్టంగా ఉందా? ఎల్లా మోయడమో నీకు నేర్పిస్తాను!" అన్నాడు రాజు.

"రాజా! ఈ మోయరాని బరువు శరీరానికే సుమా! ఈ బరువులూ, నొప్పులూ, దండనలూ ఈ శరీరానికే! అవి నాకు కావు సుమా! ఈ శరీరమ్మీది మోహం లేని నాకు నీవు వేసే శిక్ష శరీరానిదే అవుతుంది" అన్నాడు నవ్వుతూ భరతుడు.

ఆ మాటలకు రాజు చకితుడైనాడు. ఎవరో మహానుభావుడు శిబికను మోస్తున్నట్లు అతడు గుర్తించాడు. పల్లకి నుండీ చప్పున ఇవతలకు దూకాడు.

పల్లకి ఆగిపోయింది.

"ఎవరు నీవు మహాత్మా? ఈ శిబిక నీ భుజమ్మీదకు ఎల్లా వచ్చింది!" అంటూ రాజు నమస్కారం చేశాడు.

"అవధూతవయిన నిన్ను గుర్తింపలేక పోయాను. నీ మూపున శిబిక పెట్టించిన నా తప్పును క్షమించు. నీవు ఎవరివో చెప్పి రక్షించు. నేను కపిలాశ్రమానికి జ్ఞానం కోసం పోతున్నా. వెదకబోయిన తీగె కాళ్లకు తగిలినట్లు నీదర్శనం అయింది. నీవు ఎవరవో చెప్పుస్వామీ. నేను ఈ దేశం పాలించే రాజును... నాపేరు.."

"ఈ ప్రపంచం పాలకులూ, పాలితులూ అంతా మిధ్య అని పెద్దలు చెబుతారు. నీవు మాత్రం అది సత్యం అంటున్నావు. రాజువని చెబుతూ జ్ఞానం కోసం పోతున్నానంటున్నావు. సర్వభూతాల్లో ప్రాణవాయువు ఉన్నట్లు అంతర్యామి పరమాత్మ ఉన్నాడన్న విషయం మరచి పోయి ప్రవర్తిస్తున్నావు. ఈ విషయం తెలుసుకో! ముక్త సంగుడవై బతుకు, హరిధ్యానం చెయ్! చాలు!" అని భరతుడు తన దారిని వెళ్లాడు.

సింధు దేశాధిపతి, జడభరతుడు చెప్పిన ఆదేశం మననం చేస్తూ, రాజ్యత్యాగం చేసి తపస్సు చేయసాగాడు.

భరతుడు ఆ జన్మలో ముక్తుడైనాడు.



# ఇంద్రుడు

కశ్యప ప్రజాపతికి పదముగ్గురుభార్యలు. అదితి, దితి ముఖ్యలు. మిగిలిన భార్యల మూలంగా ఆయన త్రిదశ, గంధర్వ, సర్ప, భూరుహఖగ, గో సంతానాలు పొందాడు.

అతిది సంతానం ఆదిత్యులు – దేవతలు. దితి బిడ్డలు దైత్యులు – రాక్షసులు. సవతుల బిడ్డలయిన ఈ దేవదానవులు నిరంతరం పోట్లాడుకుంటూ బలాబలాలు తేల్చుకుంటుండేవారు.

రాక్షసులకు దేవతల మీద పగ.

దేవతలు ధార్మికులు. భగవంతుడు విష్ణుదేవుడు వారికి అండగా ఉండేవాడు. రాక్షసులు తపస్సంపన్నులైనా, బలీయులైనా అధర్మం చేస్తూండడం వలన దైవబలానికి దూరంగా ఉండేవారు.

ఈ రాక్షసుల దుర్మార్గం, ఆగడం ఎక్కువయినపుడు శ్రీమహావిష్ణువు తన సుదర్శన చక్రం అడ్డువేస్తూండేవాడు. దేవతల రక్షించేవాడు. కొన్ని సమయాల్లో అవతారాలు ధరించేవాడు. ఈ అవతార లక్షణం కేవలం ధర్మ రక్షణకే అయి ఉండేది.

ఒకసారి, నిండు కొలువైన ఇంద్రుడు, తమ గురువైన బృహస్పతి రాకను గమనింపక, ఆసనం దిగక గౌరవ మర్యాదలు చేయలేదు. తనను ఇంద్రుడు అవమానించాడని, బృహస్పతి మౌనంగా ఇంటికి వెళ్లిపోయాడు.

గురువుకు కోపం వచ్చిందని, ఇంద్రుడు, ఆయనను ప్రసన్నం చేసుకునేందుకు రాగా, ఆయన, తన యోగబలంతో అదృశ్యుడై పోయాడు. బృహస్పతిని చూడలేక ఇంద్రుడు ఖిన్నుడై తిరిగి వచ్చాడు.

దేవతల మీద గురువు కోపించాడన్న విషయం రాక్షసులకు తెలిసింది. వారు, తమ గురువైన శుక్రుని ఆశ్రయించి, తమబలం వృద్ధి చేసుకున్నారు. ఆ బలగర్వంతో వారు, పెద్ద సైన్యంతో అమరావతిపై దండెత్తారు.

గుమ్మం తట్టి నుంచున్న శత్రువులను సాధించే ఉపాయం చెప్పే గురువు లేక పోవడం చేత ఇంద్రునకు ఎటూపాలు పోలేదు.

శుక్రుని అపార తపోబలంతో రాక్షసమూక విజృంభించి దేవతల చించి చెండాడింది. దేవతలు చెట్టుకొకరు, పుట్టకొకరైనారు. తగిన మంత్రాంగం లేక పోవడం వల్లనే తమకు అపజయం కలిగిందని వారు అనుకున్నారు. వారంతా బ్రహ్మపాదాలు పట్టుకుని కాపాడ వేడుకున్నారు.

''మీ తప్పులను కడుపులో పెట్టుకుని, కంటికి రెప్పలా కాపాడే బృహస్పతిని అవమానించారు. దాని ఫలితం ఇది. గురువును నియమించుకోడం అవశ్యాచరణీయం. త్వష్టపుత్రుడయిన విశ్వరూపుడు తపోధనుడు, మహానుభావుడు. ఆయనను ఆరాధించండి. ప్రసన్నుని చేసుకోండి. మీ కోరికలు నెరవేరగలవు'' అని బ్రహ్మదేవుడు వారిని సాగనంపాడు.

దిక్పాలురతో సహా దేవేంద్రుడు విశ్వరూపుని పాదాలు ఆశ్రయించాడు.

''ఆర్తులమైన మమ్ము రక్షించడం భ్రాతృవత్సలుడవైన నీధర్మం. బృహస్పతుల వారు ఏదోకారణంగా మమ్ము త్యజించారు మహాత్మా! రాక్షసులు విజృంభించారు. వారికి దీటైన మంత్రాంగం తెలియక, నీవు రక్షింపగలవని నీ శరణు వేడుతున్నాం!'' అని ప్రార్థించారు దేవతలు.

విశ్వరూపుడు రచనా త్వష్టల కుమారుడు. రచన దనుజ కులాంగన. త్వష్ట బ్రహ్మణ్యుడు కావడం వల్ల విశ్వరూపుడు మహత్తర శక్తివంతుడైనాడు.

విశ్వరూపుడు దేవతల ప్రార్థన మన్నించాడు. మంత్రాంగం నెరపి, దేవతలను రాక్షసుల బారినుండీ కాపాడాడు.

ఇంద్రునకు, విశ్వరూపుడు నారాయణ కవచం అనే మంత్రాన్ని ఉపదేశించాడు. ఆ మంత్రబలంతో ఇంద్రుడు అజేయుడైనాడు.

సర్వకాలాల్లో, గదాది ఆయుధాలు ధరించిన భగవంతుడు కేశవుడూ, గోవిందుడూ, నారాయణుడూ, విష్ణువూ, మధుసూదనుడూ, కాలమూర్తీ నాకు రక్షకుడవుగాక!' అని నారాయణ కవచమంత్రాన్ని పునశ్చరణ చేశాడు.

తల్లి మీది మమకారంతో, తల్లి వంశం వాళ్లయిన రాక్షసులకు విశ్వరూపుడు యజ్ఞభాగం ఇవ్వసాగాడు. రాక్షసులు యజ్ఞభాగం పొందడం వలన బలవంతులు అయినారు. ఇది ఇంద్రునకు కోపకారణం అయింది.

విశ్వరూపునకు మూడుతలలు. నారాయణ కవచమంత్ర ప్రాభవం కొద్దీ ఇంద్రుడు, విశ్వరూపుని మూడుతలలూ ఖండించాడు. సోమపానం చేసే తల కపింజలపక్షి అయింది. సురాపానం చేసే తల కలవింకం అయింది. అన్నం తినే తల తిత్తరి పక్షి అయింది. ఇలా మూడు పక్షులూ బ్రహ్మహత్యా పాతక రూపాలు పొంది ఇంద్రుని పీడింపసాగాయి.

అతడు ఆ పాపాన్ని కొంత కాలం అనుభవించాడు. ఆ పాపం నుండీ విముక్తి పొందేందుకు అతడు జలాన్నీ, భూమినీ, తరువులనూ, స్త్రీలనూ ప్రార్థించాడు. తలకొక భాగం తీసుకోమని కోరాడు.

భూమి పాపం పంచుకుని ఊసర క్షేత్రం అయింది. తరువులు జిగురు పొందాయి. స్త్రీలకు రజస్వలా రూపంలో బాధించింది. జలాలకు ఫేన రూపంగా మారింది. అలా పాపవిముక్తుడయిన ఇంద్రుడు ప్రతిఫలంగా వారికి వరదానం చేశాడు.

జలాలకు కల్మషహరమైన శక్తిని, భూమికి, తనకు తామే పూడ్చుకునే శక్తినీ, స్త్రీలకు నిరంతర కామసుఖాన్నీ, వృక్షాలకు నరకినా, చిగురించే వరాన్నీ ఆయన అనుగ్రహించాడు.

తన కొడుకును ఇంద్రుడు సంహరించిన విషయం త్వష్టకు తెలిసింది. అతడు కోపంతో మారణహోమం చేసి ఇంద్రుని సంహరింపవలెననుకుని యజ్ఞం చేశాడు. ఆయజ్ఞగుండం నుండీ కల్పాంతక మూర్తీ, మహోగ్రుడూ అయిన వృత్రుడు జన్మించాడు. అతడు మధ్యందిన మార్తాండుని వలె మండి పడుతూ ఇంద్రుని మీదకు వచ్చాడు.

నేలకూ నింగికీ వారధికట్టినంత గొప్ప ఆకారంతో, నక్షత్రాలను సహితం మింగేలా నాలుక సాపుతూ, భూమిక్రుంగిపోయేంత భారంగా అడుగులు వేస్తూ, శూల పాణి అయి వచ్చిన వృత్రుని చూడగనే ఇంద్రుడు గడగడ వణకి పోయాడు.

దేవతలు తమతమ ఆయుధాలు ప్రయోగించారు. వారు ప్రయోగించిన ఆయుధాలను వృత్రుడు మింగాడు. వృత్రుడు జగత్సంహారం చేస్తున్నట్లు, దేవతలను మట్టుబెట్టసాగాడు. దిక్పాలురు దిక్కుల మరచి పోయారు. దేవేంద్రుడు యుద్ధరంగం నుండీ పారిపోయాడు. ఎక్కడో అతడు తలదాచుకున్నాడు.

దేవతలు చివరకు ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీమన్నారాయణుని శరణుజొచ్చారు.

అనేక విధాలుగా స్తుతించిన మీదట ఆయన ప్రత్యక్షం అయ్యాడు.

''సర్వప్రాణులకు నీవు దిక్కై ఉన్నావు. ఆర్తులం; ఆపన్నులం. త్వష్ట తపోశక్తికి రూపైన వృత్రుడు మా పాలిట ప్రళయకాలుడయినాడు. వాడి చూపునుండీ ఎల్లాగో తప్పించుకుని, నీ చరణాల ప్రాపుచేరాం ప్రభూ! నీవిచ్చిన పదవులు నీవే సుస్థిరం చేయవలసి ఉంది. మా ఉనికి ఉపద్రవం అయిన దుష్టకాలంలో పదవుల గురించి చింతించడం లేదు. ఈ జగత్సంహారాన్ని నీవే తప్పింపవలె తండ్రీ! ఇలా రావడం ఆపదమొక్కని అనుకోకు! నిరంతరం నీ చరణ సేవా భాగ్యంతో నిలచిన నీదాసులం! దాసానుదాసులం!'' అని దేవతలు ప్రార్థించారు.

శ్రీహరి ప్రీతుడై నవ్వి, ''నా భక్తులకు పొందలేనిదీ, అందలేనిదీ ఏదీలేదు. మీకు శుభం కలుగుతుంది. దధీచి మహామహిమాన్వితుడు. నిరంతర తపో విరాజితుడు. ఆయన శరీరానికి అనితర సాధ్యం అయిన మహత్తు ఉంది. ఆయన శరీరాన్ని దానంగా పొందండి. త్వష్టపుత్రుడైన విశ్వరూపునకు ఈ మహర్షి కవచ విద్యను ఇచ్చాడు. అశ్వనీ దేవతలకు జీవన్ముక్తి ప్రసాదించాడు. మహావదాన్యుడు. మీ కోరిక కాదనడు. ఆయన ఎముకలతో మీరు ఆయుధాలను నిర్మించుకోవలసింది. శతధారలయిన వజ్రాయుధంతో నీవు వృత్ర సంహారం చేయగలవు'' అన్నాడు.

దేవతలు దధీచి మహర్షిని వెదకుతూ వచ్చారు.

అందరూ సాగిలపడి నమస్కరించారు.. మహర్షి దేవతలను చూసి నవ్వి, వచ్చిన పనేమిటి? అని అడిగాడు.

"మేమెంక నీచపు కోరిక మనస్సుల్లో పెట్టుకుని యాచకులమై వచ్చాం మహర్షీ! మా ప్రాణాలు నిలుపుకునేందుకు, నీ ప్రాణాలు ఇమ్మని ప్రార్థిస్తున్నాం. కోరదగని కోరికనే మేం కోరుతున్నాం తండ్రీ! కోరిక కోరేవాడికి ఇది కోరదగినదీ, ఇది కోరదగనిదీ అన్న తేడా తెలుస్తుందా? వాడి కోరికనేదో వాడు కోరతాడు! మేం నిష్ఠురులం! కరుణారహితులం! మన్నించవలె!"

"సర్వప్రాణులకు విలువైనది తనప్రాణం ఒక్కటే! ప్రాణి తన ప్రాణం నిలుపుకోడం కోసం పడరాని పాట్లు పడుతుంది. ఎవరేనా ప్రాణాలు ఇమ్మంటే ఇచ్చేవారున్నారా? కనకం, గోస్త్రీధనాదులు కోరేవారున్నారు. ప్రాణాలు కోరేవారున్నారా? శరీరాంగాలు పంచుకపోయేవారు ఎక్కడయినా ఉన్నారా? ఆస్థి పంచుకునే వారున్నారు. అస్థికలు పంచుకునేవారు మీ రొక్కరే కనిపిస్తున్నారు!" అంటూ దధీచి మహర్షి నవ్వాడు.

"సర్వభూతమయుడవైన నీకు మా ప్రార్థన మన్నించడం ఒక పెద్ద విషయం కాదు. నేనూ, నాదీ అన్న దృష్టిలేని వారికి, ఏదీ తనది కాదు కదా మహాత్మా! సర్వం ఈశ్వరార్పణం అని నిమిత్తమాత్రంగా జీవించే మీ వంటి వారికి ఇది దుర్లభం కాదు మహర్షీ!"

"మీ వాదన సాధువయినదే! ఏదో మాటాడవలెనని ఇంత సేపు ఆగాను. అంతే! మీ కోసం నేను ఆత్మార్పణ చేసుకోడం నాసుకృతం. ఈ శరీరంలో ఏంకావాలో తీసుకోండి!" అంటూ ఆ మహర్షి నవ్వి యోగప్రకారంగా ప్రాణోత్క్రమణ చేశాడు.

దేవతలు పెన్నిధి చిక్కినంతగా సంతోషించారు. విశ్వకర్మను రావించారు. ఆయుధాలు తయారు చేయించారు. దధీచి వెన్నెముకతో చేసిన ఆయుధం ఇంద్రుని వజ్రాయుధం అయింది. విష్ణువు నిర్దేశించినట్లు అది శతధారలయింది.

నూతనాయుధాలతో, నూతనోత్సాహంతో దేవతలు యుద్ధానికి వచ్చారు. వృత్రుడు మహోద్రేకంతో వారిని ఎదుర్కొన్నాడు.

దారుణంగా యుద్ధం సాగింది. ఉభయ బలాలు సమఉద్ధిలో ఉన్నట్లు కనిపించారు. ఆయుద్ధం కృతయుగంలో ప్రారంభమై త్రేతాయుగం వరకూ సాగుతోంది.

వృత్రుడు శూలంతో పొడవగా ఇంద్రుడెక్కిన ఐరావతం పారిపోయింది. ఐరావతాన్ని అదుపులో అతడు పెట్టసాగాడు.

వృత్రుడు పకపకా నవ్వాడు.

"తపస్సంపన్నుడూ, బ్రహ్మణ్యుడూ అయిన గురువును చంపుకున్నావు ఎందుకూ? నీ ప్రాణాలు నిలుపుకునేందుకు? దధీచి మహర్షి శరీరం యాచించావు. ఆయనను చంపి, ఆయన బొమికలు ఆయుధాలుగా తెచ్చావు. ఎందుకూ? నీ ప్రాణాలు నిలుపుకునేందుకు. నీవెంతటి నీచుడవో ఆలోచించు. ఇంద్రపదవికి అర్హుడవుకావు. నీవు చస్తే నీ శరీరాన్ని కుక్కలూ, నక్కలూ కూడా అంటవు. దయాసత్యం, ధర్మం, పురుషత్వం లేని అల్పుడవు నీవు. అయినా నీకో అవకాశం ఇస్తున్నా! మహర్షి వీర్యాతిశయంతో తేజరిల్లే వజ్రాయుధం నామీద ప్రయోగించు. విష్ణుదేవుని శక్తి తోడవుతుంది. నీవు కృతార్థుడవవుతావు ఆ మహాపురుషులను గౌరవించడం నాధర్మం!" అంటూ వృత్రుడు కనులు మూసుకున్నాడు.

"లోకపాలకా! నీచరణాలు తప్ప మరే భోగభాగ్యాలూ వద్దు తండ్రీ!" నీ సన్నిధిలో ఓ యింత చోటు ఈ దీనునకు ప్రసాదించు మహాదేవా!'' అంటూ వృత్రుడు ప్రార్థించాడు.

వృత్రునికి ఆ నిముషంలో జయాపజయాలు కాబట్టలేదు. ధర్మం ఒక్కటే అతని మనస్సులో నిండింది.

ఇంద్రుడు ఆ అవకాశాన్ని జారవిడుచుకోలేదు. శూలం పట్టిన వృత్రుని బాహువును మొదలంట ఖండించాడు.

బాహవు తెగిపడ్డ వృత్రుడు జంకక, కొంకక, పరిఘను అందుకున ఇంద్రుని మీదకు విసరాడు. ఆ ఆయుధం ఐరావతం కుంభస్థలం పగల కొట్టింది. ఇంద్రుని ముఖం పగల కొట్టింది. ఆ దెబ్బకు ఇంద్రుకు తన చేత ఉన్న వజ్రాయుధం జారవిడచాడు.

"ఆయుధం అందుకో ఇంద్రా! నిరాయుధుడవైన నిన్ను చంపను" అన్నాడు వృత్రుడు.

వృత్రుని ఉదారతకు ఇంద్రుడు ఆశ్చర్యసమ్మోదాలు పొందాడు ఇంద్రుడు నేలపడ్డ ఆయుధం తీసుకుని, వృత్రుని రెండవ చేయిని నరికాడు.

రెండు చేతులూ పోగొట్టుకున్న వృత్రుడు, భయంకరంగా గర్జిస్తూ పర్వతం వలె, మృత్యువు వలె, ఇంద్రుని పై దూకి మింగి వేశాడు.

దేవతలు వృత్రుడు ఇంద్రుని మింగడం చూసి హాహాకారాలు చేస్తూ నిస్పృహాయులై నుంచున్నారు.

వృత్రుని గర్భంలో ఉన్న ఇంద్రుడు, తన వజ్రాయుధంతో అతని కడుపు చీల్చుకుని ఇవతలకు వచ్చాడు. వృత్రుడు మరణించగా, ఆ కళేబరాన్నుండీ వెలువడిన తేజంపైకి లేచిపోయింది. వృత్రుడు శాపవిమోచనం పొంది నిజరూపం అయిన చిత్రకేతువై స్వస్థానం చేరుకున్నాడు.

చిత్రకేతువన్న విద్యాధరపతి, ఒకనాడు, తన విమానంలో వెండికొండ ప్రాంతంలో విహరిస్తూ, అక్కడ కొలువైన ఉమామహేశ్వరుల చూశాడు. ఆ కొలువులో ఎందరో ఋషులూ, మహర్షులూ ఉన్నారు. రుద్రగణం ఉండనే ఉంది. భగవంతుడయిన పరమేశ్వరుడు, తన అంకసీమనున్న గౌరిని తమకంతో కౌగలించుకోబోయాడు.

అందరి ముందు ఆ ఆదిదంపతుల తీరును చూసి చిత్రకేతువు పకపకానవ్వాడు.

వీత రాగతకు, నిస్పృహకూ రూపైన పరమేశ్వరుని ఎవ్వరూ తప్పుపట్టలేదుకానీ, చిత్రకేతువు అవివేకుడై నవ్వడం చూసి, ఆయన ఉదాసీనుడైనాడు. అయితే పార్వతీదేవి మాత్రం కోపంతో భగ్గుమంది. పరమేశ్వర తత్త్వం తెలియకనవ్విన చిత్రకేతువును రాక్షస యోనిలో పుట్టమని శపించింది.

చిత్రకేతువు శ్రీమన్నారాయణ చరణదాసుడు. మహాభక్తుడు కావడం వల్ల, ఆ శాపాన్ని అతడు నిరుద్రేకంగా స్వీకరించాడు. త్వష్ట చేసిన మహాయజ్ఞంలో దక్షిణాగ్ని నుండీ చిత్రకేతువు వృత్రనామంతో జన్మించాడు. దేవరాజు చేత మరణించి శాప విమోచనం పొందాడు.

ఇంద్రుడు వృత్ర సంహారం వలన కలిగిన బ్రహ్మహత్యా పాపం తప్పించుకునేందుకు లోకాలన్నీ తిరిగాడు. ఎక్కడా నిలువ నీడ చిక్కలేదు.

ఈశాన్యం వైపు పరువులు పెట్టి మానస సరోవరం చేరాడు. అక్కడొక సరస్సులో ఉన్న తామరలో ప్రవేశించి గుప్తుడై, తపస్వి అయి ఇంద్రుడు కాలం గడపసాగాడు. ఆ దిశ పరమేశ్వర పాలితం కావడం వల్ల బ్రహ్మహత్యాపాపం, ఇంద్రుని బాధింపలేక పోయింది.

ఇంద్రుడు లేక పోవడం వల్ల, ఇంద్రపదవికి ఉచిత వ్యక్తి అవసరం అయింది. తపోబలం, యోగ బలం కలిగిన నహుష చక్రవర్తిని దేవతలు ఇంద్రపదవికి ఎన్నిక చేశారు.

నహుషుడు ధర్మాత్ముడు. శతాధిక యాగాలు చేసిన పుణ్యాత్ముడు. అయితే ఇంద్రపదవి, అతని బుద్ధిని అపమార్గం పాలు చేసింది. స్వర్గభోగాలు అతనిని వెర్రిని చేశాయి. దేవలోకంలోని అప్సరసస్త్రీల అందచందాలు అతని కామానికి చాలక పోయింది. పతివ్రత అయిన ఇంద్రాణిని అతడు కామించాడు. ఇంద్ర పదవిలో ఉన్న తనకు ఇంద్రపత్ని కూడా భోగవస్తువని నహుషుడు వాదించాడు.

ధర్మంకాక పోయినా దేవతలు రాజశాసనానికి తలలు వంచారు. శచీదేవి మహాపతివ్రత. ఆమె తమగురువైన బృహస్పతి పాదాలమీద పడి కాపాడమని వేడుకుంది.

బుద్ధికి బృహస్పతి పెట్టింది పేరు. ఆయన ఆలోచించాడు. సప్తర్షులను వాహకులుగా చేసిన శిబిక మీద నహుషుని రమ్మని చెప్పమన్నాడు. అంతటితో అతని పాపం బద్దలవుతుందని ఆయన అనుకున్నాడు.

బృహస్పతి సూచన ప్రకారంగా శచీదేవి, నహుషుని బ్రహ్మరథంలో రమ్మని కోరింది. నహుషుడు సంతోషించాడు. సప్తర్షులను పిలిపించి తన శిబికను మోయమన్నాడు. వారు తలలు వంచి, నహుషుని వల్లకిని భుజాల మీదకు ఎత్తుకున్నారు.

అల్లంత దూరంలో శచీదేవి నహుషునకు కనిపించింది. అతడు ఉద్రేకంతో "సర్ప","సర్ప!" అంటూ కేకలు వేస్తూ ఎడమకాలితో దూర్వాస మహర్షి తలమీద తన్నాడు.

సర్ప అంటే, త్వరగా వెళ్లమనీ, పాము అనీ అర్థాలున్నాయి.

నహుషుని కాలి తాపులకు దూర్వాసమహర్షి కోపించాడు. ప్రళయకాలరుద్రుడై "నీవు కోరుకున్న సర్పమే అయిపో" అంటూ శపించాడు.

నహుషుడు పెద్ద కాలం కొండచిలువ రూపంతో శాపాన్ని అనుభవించాడు.

ఉమామహేశ్వర ఆరాధనా ఫలితంగా ఇంద్రుడు బ్రహ్మహత్యా పాప నివృత్తి పొందాడు. దేవతలు అతడికి తిరిగి ఇంద్ర పదవి అప్పగించారు.



## ప్రహ్లాదుడు

లీలావతీ హిరణ్యకశిపులకు నలుగురు సంతానం. అందులో ప్రహ్లాదుడు ప్రసిద్ధుడు. పరమ భాగవతోత్తముడు. ఆ తల్లి గర్భంలోనే అష్టావక్రునికి మల్లె నారాయణ తిరుమంత్రం జపించి సిద్ధుడైనాడు ప్రహ్లాదుడు.

హిరణ్యకశిపుడు బ్రహ్మ గురించి ఉగ్రతపస్సు చేస్తున్న సమయంలో ప్రతీకార వాంఛతో కుమిలి పోతున్న ఇంద్రుడు ఆలోచించాడు. హిరణ్యకశిపుని ఏమీ చేయలేక, నిస్సహాయ, పతివ్రతా అయిన లీలావతి మీద పగ తీర్చుకోవలెనన్న నీచమైన ఆలోచన దేవరాజుకు కలిగింది. నాయకుడు లేని రాక్షస మూకను ఇంద్రుడు సులభంగా జయించాడు. చిక్కిన వారిని చిక్కినట్లు చిత్రహింసల పాలు చేశాడు. అంతఃపురానికి మొచ్చులావచ్చి నిండుచూలాలు అయిన లీలావతిని చెరబట్టి తీసుకపోసాగాడు.

"లోకపాలకా! నీచరణాలు తప్ప మరే భోగభాగ్యాలూ వద్దు తండ్రీ!" నీ సన్నిధిలో ఓ యింత చోటు ఈ దీనునకు ప్రసాదించు మహాదేవా!" అంటూ వృత్రుడు ప్రార్థించాడు.

వృత్రునికి ఆ నిముషంలో జయాపజయాలు కాబట్టలేదు. ధర్మం ఒక్కటే అతని మనస్సులో నిండింది.

ఇంద్రుడు ఆ అవకాశాన్ని జారవిడుచుకోలేదు. శూలం పట్టిన వృత్రుని బాహువును మొదలంట ఖండించాడు.

బాహవు తెగిపడ్డ వృత్రుడు జంకక, కొంకక, పరిఘను అందుకున ఇంద్రుని మీదకు విసరాడు. ఆ ఆయుధం ఐరావతం కుంభస్థలం పగల కొట్టింది. ఇంద్రుని ముఖం పగల కొట్టింది. ఆ దెబ్బకు ఇంద్రుకు తన చేత ఉన్న వజ్రాయుధం జారవిడచాడు.

"ఆయుధం అందుకో ఇంద్రా! నిరాయుధుడవైన నిన్ను చంపను" అన్నాడు వృత్రుడు.

వృత్రుని ఉదారతకు ఇంద్రుడు ఆశ్చర్యసమ్మోదాలు పొందాడు ఇంద్రుడు నేలపడ్డ ఆయుధం తీసుకుని, వృత్రుని రెండవ చేయిని నరికాడు.

రెండు చేతులూ పోగొట్టుకున్న వృత్రుడు, భయంకరంగా గర్జిస్తూ పర్వతం వలె, మృత్యువు వలె, ఇంద్రుని పై దూకి మింగి వేశాడు.

దేవతలు వృత్రుడు ఇంద్రుని మింగడం చూసి హాహాకారాలు చేస్తూ నిస్సహాయులై నుంచున్నారు.

వృత్రుని గర్భంలో ఉన్న ఇంద్రుడు, తన వజ్రాయుధంతో అతని కడుపు చీల్చుకుని ఇవతలకు వచ్చాడు. వృత్రుడు మరణించగా, ఆ కళేబరాన్నుండీ వెలువడిన తేజంపైకి లేచిపోయింది. వృత్రుడు శాపవిమోచనం పొంది నిజరూపం అయిన చిత్రకేతువై స్వస్థానం చేరుకున్నాడు.

చిత్రకేతువన్న విద్యాధరపతి, ఒకనాడు, తన విమానంలో వెండికొండ ప్రాంతంలో విహరిస్తూ, అక్కడ కొలువైన ఉమామహేశ్వరుల చూశాడు. ఆ కొలువులో ఎందరో ఋషులూ, మహర్షులూ ఉన్నారు. రుద్రగణం ఉండనే ఉంది. భగవంతుడయిన పరమేశ్వరుడు, తన అంకసీమనున్న గౌరిని తమకంతో కౌగలించుకోబోయాడు.

అందరి ముందు ఆ ఆదిదంపతుల తీరును చూసి చిత్రకేతువు పకపకానవ్వాడు.

వీత రాగతకు, నిస్పృహకూ రూపైన పరమేశ్వరుని ఎవ్వరూ తప్పుపట్టలేదుకానీ, చిత్రకేతువు అవివేకుడై నవ్వడం చూసి, ఆయన ఉదాసీనుడైనాడు. అయితే పార్వతీదేవి మాత్రం కోపంతో భగ్గుమంది. పరమేశ్వర తత్త్వం తెలియకనవ్విన చిత్రకేతువును రాక్షస యోనిలో పుట్టమని శపించింది.

చిత్రకేతువు శ్రీమన్నారాయణ చరణదాసుడు. మహాభక్తుడు కావడం వల్ల, ఆ శాపాన్ని అతడు నిరుద్రేకంగా స్వీకరించాడు. త్వష్ట చేసిన మహాయజ్ఞంలో దక్షిణాగ్ని నుండీ చిత్రకేతువు వృత్రనామంతో జన్మించాడు. దేవరాజు చేత మరణించి శాప విమోచనం పొందాడు.

ఇంద్రుడు వృత్ర సంహారం వలన కలిగిన బ్రహ్మహత్యా పాపం తప్పించుకునేందుకు లోకాలన్నీ తిరిగాడు. ఎక్కడా నిలువ నీడ చిక్కలేదు.

ఈశాన్యం వైపు పరువులు పెట్టి మానస సరోవరం చేరాడు. అక్కడొక సరస్సులో ఉన్న తామరలో ప్రవేశించి గుప్తుడై, తపస్వి అయి ఇంద్రుడు కాలం గడపసాగాడు. ఆ దిశ పరమేశ్వర పాలితం కావడం వల్ల బ్రహ్మహత్యాపాపం, ఇంద్రుని బాధింపలేక పోయింది.

ఇంద్రుడు లేక పోవడం వల్ల, ఇంద్రపదవికి ఉచిత వ్యక్తి అవసరం అయింది. తపోబలం, యోగ బలం కలిగిన నహుష చక్రవర్తిని దేవతలు ఇంద్రపదవికి ఎన్నిక చేశారు.

నహుషుడు ధర్మాత్ముడు. శతాధిక యాగాలు చేసిన పుణ్యాత్ముడు. అయితే ఇంద్రపదవి, అతని బుద్ధిని అపమార్గం పాలు చేసింది. స్వర్గభోగాలు అతనిని వెర్రిని చేశాయి. దేవలోకంలోని అప్సరసస్త్రీల అందచందాలు అతని కామానికి చాలక పోయింది. పతివ్రత అయిన ఇంద్రాణిని అతడు కామించాడు. ఇంద్ర పదవిలో ఉన్న తనకు ఇంద్రపత్ని కూడా భోగవస్తువని నహుషుడు వాదించాడు.

ధర్మంకాక పోయినా దేవతలు రాజశాసనానికి తలలు వంచారు. శచీదేవి మహాపతివ్రత. ఆమె తమగురువైన బృహస్పతి పాదాలమీద పడి కాపాడమని వేడుకుంది.

బుద్ధికి బృహస్పతి పెట్టింది పేరు. ఆయన ఆలోచించాడు. సప్తర్షులను వాహకులుగా చేసిన శిబిక మీద నహుషుని రమ్మని చెప్పమన్నాడు. అంతటితో అతని పాపం బద్దలవుతుందని ఆయన అనుకున్నాడు.

బృహస్పతి సూచన ప్రకారంగా శచీదేవి, నహుషుని బ్రహ్మరథంలో రమ్మని కోరింది. నహుషుడు సంతోషించాడు. సప్తర్షులను పిలిపించి తన శిబికను మోయమన్నాడు. వారు తలలు వంచి, నహుషుని పల్లకిని భుజాల మీదకు ఎత్తుకున్నారు.

అల్లంత దూరంలో శచీదేవి నహుషునకు కనిపించింది. అతడు ఉద్రేకంతో ''సర్ప'',''సర్ప!'' అంటూ కేకలు వేస్తూ ఎడమకాలితో దూర్వాస మహర్షి తలమీద తన్నాడు.

సర్ప అంటే, త్వరగా వెళ్లమనీ, పాము అనీ అర్థాలున్నాయి.

నహుషుని కాలి తాపులకు దూర్వాసమహర్షి కోపించాడు. ప్రళయకాలరుద్రుడై ''నీవు కోరుకున్న సర్పమే అయిపో'' అంటూ శపించాడు.

నహుషుడు పెద్ద కాలం కొండచిలువ రూపంతో శాపాన్ని అనుభవించాడు.

ఉమామహేశ్వర ఆరాధనా ఫలితంగా ఇంద్రుడు బ్రహ్మహత్యా పాప నివృత్తి పొందాడు. దేవతలు అతడికి తిరిగి ఇంద్ర పదవి అప్పగించారు.

★ ★ ★




లీలావతీ హిరణ్యకశిపులకు నలుగురు సంతానం. అందులో ప్రహ్లాదుడు ప్రసిద్ధుడు. పరమ భాగవతోత్తముడు. ఆ తల్లి గర్భంలోనే అష్టావక్రునికి మల్లె నారాయణ తిరుమంత్రం జపించి సిద్ధుడైనాడు ప్రహ్లాదుడు.

హిరణ్యకశిపుడు బ్రహ్మ గురించి ఉగ్రతపస్సు చేస్తున్న సమయంలో ప్రతీకార వాంఛతో కుమిలి పోతున్న ఇంద్రుడు ఆలోచించాడు. హిరణ్యకశిపుని ఏమీ చేయలేక, నిస్సహాయ, పతివ్రతా అయిన లీలావతి మీద పగ తీర్చుకోవలెనన్న నీచమైన ఆలోచన దేవరాజుకు కలిగింది. నాయకుడు లేని రాక్షస మూకను ఇంద్రుడు సులభంగా జయించాడు. చిక్కిన వారిని చిక్కినట్లు చిత్రహింసల పాలు చేశాడు. అంతఃపురానికి వుుచ్చులావచ్చి నిండుచూలాలు అయిన లీలావతిని చెరబట్టి తీసుకపోసాగాడు.

ఇంతలో నారదుడు ఎదురయ్యాడు.

"తప్పు ఇంద్రా! ఇంతనీచం నీ పదవికి తగింది కాదు. దేవతలకు తలవంపులు తెచ్చే దుష్టకార్యం చేయవద్దు. ఈ తల్లి గర్భంలో విష్ణుభక్తుడు వర్ధిల్లు తున్నాడు. ఈమెను నాకు విడచిపెట్టు!" అన్నాడు నారదుడు.

ఇంద్రుడు తలవంచుకుని లీలావతిని విడచాడు. ఆమెను నారదుడు తన పర్ణశాలకు తీసుకపోయి ఉపచారాలు చేస్తూ, భక్తి జ్ఞానవైరాగ్యాలు ఉపదేశిస్తూ కన్నాకు వలె రక్షింపసాగాడు.

ఆమె గర్భభారంతో మాగన్ను అయినప్పుడు, ఆమె కడుపులోని చిన్న ప్రాణి నారదోపదేశాలు వింటూ, ధర్మతత్త్వం నిర్మల జ్ఞానం పొందడం జరుగుతూండేది. ఆ జీవుడు పురాకృత సుకృతం వలన నారాయణ మంత్రం జపించేవాడు.

హిరణ్యకశిపుని తపస్సు పలించింది. బ్రహ్మదేవుడు ప్రత్యక్షం అయ్యాడు. వరం కోరుకోమన్నాడు. హిరణ్యకశిపుడు అతి దుర్లభం అయిన కోరిక కోరాడు. ఆయుధంతో గానీ, పగలు గానీ, రాత్రిగానీ, ఇంటా, బయటా, దేవగంధర్వ నరయక్ష గంధర్వాదుల వల్లా చావులేనట్లు వరం అతడు కోరుకున్నాడు. బ్రహ్మ వర దానం చేశాడు.

ఆ వర గర్వంతో, బలంతో తనను ఎవ్వరూ చంపలేరన్న ధీమాతో ఆగడాలు, దురంతాలు అతడు ఎక్కువ చేశాడు.

తను ఇంట లేనపుడు తన ఇల్లాలిని చెరపట్టిన ఇంద్రుని మీద అతడు విరుచుక పడ్డాడు. ఇతర దేవతలను శిక్షించాడు. తలలు ఎత్తుకోనంతగా శాసించాడు. తన సోదరుడయిన హిరణ్యాక్షుని సంహరించిన నారాయణుని మీద పగబట్టి, వెదకసాగాడు. కాని కాలం అని ఆ దేవదేవుడు, వాడి కంటికి కనిపించకుండా అదృశ్యం అయ్యాడు.

ప్రహ్లాదుడయిదేండ్ల వాడయ్యాడు. ప్రసన్నగుణుడూ, మృదుస్వభావుడూ, లలిత మర్యాదుడూ అయిన ప్రహ్లాదుడు నిరంతరం హరిసేవానురక్తుడైనాడు.

యజ్ఞ యాగాల్లో లభించే హవిర్భాగాలు హిరణ్యకశిపుడు తన సొంతం చేసుకోడం వల్ల దేవతల మనుగడ దుర్లభం అయింది. సాధు సజ్జనులు పీడలకు గురి అయ్యారు.

దేవతలు ముక్తకంఠంతో భగవంతుని ప్రార్థించారు. వారికి గగనవాణి ఇలా వినిపించింది.

"త్వరలో మీ ఉమ్మలిక తీరుతుంది. ప్రహ్లాద కుమారునికి, తండ్రి ఎప్పుడు కష్టాల పాలు చేస్తాడో, అప్పుడు వాడు చంపబడతాడు."

పిన్న వయస్సులోనే, ప్రహ్లాదునకు ఎవ్వరూ పొందలేని భక్తి తాత్పర్యాలు ఏర్పడ్డాయి. ప్రతిజీవిని తనవలె చూడసాగాడు. ఆటలో, పాటలో, నిద్రలో, జాగృతిలో హరినామం చేస్తూ అతడు తన్మయుడయ్యేవాడు.

అలా పెరుగుతూన్న కొడుకునకు విద్యలు నేర్పించాలనుకున్నాడు తండ్రి. శుక్రుని కొడుకులయిన చండామార్కులను ప్రహ్లాదుని గురువులుగా అతడు నియమించాడు.

ప్రహ్లాదునిస్థితి నానాటికీ లోకాతీతంగా మారింది. నిరంతరం నిమీలిత నేత్రాలతో, అపూర్వ దర్శనం చూస్తున్నట్లు, తనలో తానే పాడుతూ నవ్వుతూ, పట్టు పడని వస్తువును పట్టుకునేందుకు పరువెత్తుతూండే వాడు.

గురువులు చెప్పే పాఠాలు ఉదాసీనంగా వినిపించుకునేవాడు. ఆ బాలుడి మనస్సునిండా హరితలపులు; హరి చింతనలు. గురువులు నేర్పించే విద్యలు తన కొడుకు ఎంత వరకూ గ్రహించాడో చూతామనుకున్నాడు హిరణ్యకశిపుడు.

ప్రహ్లాదుని తన తొడలపై కూర్చుండచేసి, ముద్దు ముచ్చటలతో మురిసిపోతూ హిరణ్యకశిపుడు ఇలా అడిగాడు.

''నాయనా! ప్రహ్లాదా! నీవు గురుముఖంగా ఏమేమి శాస్త్రాలూ, చదువులూ నేర్చుకున్నావో చెప్పు! వింటాను. మనకూ, మన వంశానికీ క్షేమం కలిగే చదువు నేర్చుకున్నావా తండ్రీ?''

''శ్రీహరి సేవకు మించిన క్షేమం ఏముంది తండ్రీ? లోకులకూ, లోకేశులకూ అదే కదా శ్రేయం!'' అని ప్రహ్లాదుడు చేతులు జోడించాడు. హిరణ్యకశిపుడు దిగ్భ్రాంతుడై, మౌనం ఓ నిముషం పాటు పాటించాడు.

''ఎవరీదుర్మార్గపు బోధలు నీకు చేశారు కుమారా? ఈ వింత ఆలోచనలు ఎలా కలిగాయి? నీ పిన తండ్రిని చంపి మన వంశానికి గొప్ప అపకారం చేసిన వాడెలా శ్రేయోదాయకుడంటావు? వాడిని కీర్తింపమని భార్గవులు నీకు రహస్యంగా చెప్పారా? లేక ఈ పాడు బుద్ధి నీకే పుట్టిందా?'' అంటూ హిరణ్యకశిపుడు క్రోధంతో గర్జించాడు.

''ఈశ్వరుని మీద బుద్ధినిలవడం దుర్లభం. మాయలో పడి, మాయ వస్తువుల మీద మమకారం పెంచుకోడం అసత్యం. ఆయన ఉనికి ఒక్కటి సత్యం. ఆయన మీద మనస్సు నిలిపిన వాడూ, ఆయన గుణ గానం చేసిన వాడూ, మరి దేనినీ ఆలోచించడు. ఈ జీవులకు ఆయన తప్ప మరొక శరణం లేదు! ఆయన పాదాలే సద్గతి!''

ప్రహ్లాదుని మాటలకు, అతనికి గొప్ప కోపం వచ్చింది. వళ్లు తెలీనంత కోపం అది. ఆ కోపం అతడిని నిలువ నీయలేదు. కూర్చోనివ్వలేదు. తొడల మీద కొడుకు బరువయ్యాడు. క్రిందకు విసరి వేసి అతడు నుంచున్నాడు. కోపం మాటలకు అందడానికి ఆలస్యం అవుతూంది.

తన కొడుకు తన రక్తం పంచుకుని పుట్టిన జీవం. ఇవాళ తన ఆచారాలనూ, పద్ధతులనూ హేళన చేయడం, కొత్త సిద్ధాంతాలను తనకు నేర్పబోవడం హిరణ్యకశిపునకు కొరుకుడుపడలేదు. తన శత్రువును కీర్తించడం మింగుడు పడలేదు. తన దర్పం ఏంకావాలె? తన రాజసం ఏం కావాలె? ఇంతకాలం దేని కోసం వరాలు పొందాడో, ఏ ప్రతీకారం కోసం ఇంతగా కలవరిస్తున్నాడో, సమయం కోసం ఎదురుచూస్తున్నాడో, ఆసమయంలో, తన ఇంటనే, తన కొడుకు రూపంలో ప్రతిఘటన. తన పేరు చెబితే అగ్ని గడగడ వణకుతూ చప్పగా చల్లారి పోతుందే! గాలి సుతారంగా వీస్తుందే! అల్లాంటప్పుడు ఈ అంగారకణం, ఎక్కడనుండీ వచ్చి పడింది! ఎవరా వేసింది? – అతడు అలా ఆలోచిస్తూ, పదేపదే ప్రహ్లాదుని చూస్తూనుంచున్నాడు.

''మన్నించండి మహాప్రభూ! మరి కొంత సమయం ఇవ్వండి. కుమారుని ఉచితరీతిలో శిక్షస్తాం!'' అంటూ గురుపుత్రులు హామీ ఇచ్చారు. హిరణ్యకశిపుడు తల పంకించాడు. అంతకన్నా మరేమీ చేసేందుకు తోచని సమయం అది.

అదే పదివేలు అనుకుని గురుపుత్రులు ఆబాలుని తీసుకపోయారు.

''ఏం ప్రహ్లాదా! ఇలా మా నోర గడ్డి పెట్టావేం! ఈ వింత చదువులు మేము నీకు నేర్పామా?

నీతండ్రికి విరోధి అయిన వాడి గురించి ఎప్పుడయినా నీతో ముచ్చటించామా? మా పరువు తీశావు. రాజద్రోహులుగా చేశావు.'' అని వారు విచారించారు.

ప్రహ్లాదుడు మౌనంతో తలవంచుకున్నాడు. తనే తప్పుచేశానని, అతడు తలవంచుకోలేదు. గురుభక్తితో తలవంచుకున్నాడు. లలిత మర్యాదుడు ప్రహ్లాదుడు.

గురుపుత్రులు ఈ మాటు అతిశ్రద్ధగా పాఠాలు చెప్పసాగారు. దండనీతి, శుక్రనీతి వివరింపసాగారు. వర్గత్రయాలు వివరించారు. గురువులు ఏం చెప్పినా అతడు వినేవాడు. తనకు ఏది అవసరమో అది మాత్రమే గ్రహించేవాడు.

కొంతకాలానికి ఆ బాలుని మీద గురుపుత్రులకు నమ్మకం కుదిరింది. పరీక్షార్థం తిరిగి రాజుదగ్గరకు ప్రహ్లాదుని తెచ్చారు.

''అన్నా! సిగ్గుతో మాతలలు వంచుకునే స్థితి కల్పించకు!'' అని వారు బ్రతిమలాడారు.

హిరణ్యకశిపుడు గతంలో పొందిన చేదుఅనుభవం మరచిపోయాడు. ప్రహ్లాదుని ముద్దుచేస్తూ ''ఏం చదివావు తండ్రీ? నీ పాండిత్యాన్ని ఒక్క ముక్కలో చెప్పు వింటాను!'' అని అడిగాడు.

''గురువులు ఎంతో నేర్పారు. ఎన్నో నీతులు ఉపదేశించారు. ఈ చదువులకంతా సారభూతమైనదేదో గ్రహించాను తండ్రీ!, అనేక విధాలైన భక్తి మార్గాల్లో ఏదో ఒకదారి చిక్కించుకుని సర్వశక్తిని ఉపాసించడమే మనకర్తవ్యం. అదే సత్యం! హరిభక్తిలేని జీవి జీవికాడు; అది జీవితంకాదు!'' అన్నాడు ప్రహ్లాదుడు.

''ఏమిటీ? నీవు పాత పాటనే పాడుతున్నావన్నమాట! ఏమయ్యా గురుపుత్రుల్లారా! ఇదా మీరు చేసిన నిర్వాకం?'' అంటూ హిరణ్యకశిపుడు మండిపడ్డాడు.

''భార్గవులమైనమేము నీకు శత్రువులమా మహారాజా? ఈ చదువులు మేం చెప్పినవి కానేకావు. ఈ చదువులు నీ కొడుకు ఎక్కడ ఎల్లా నేర్చుకున్నాడో మాకు తెలియడం లేదు. ఈ చదువు జన్మజన్మల సంపాదన అనే చెప్పగలం! అంతే మాకు తెలిసింది. మహాప్రభూ'' అంటూ వారు చేతులు జోడించారు.

''గురువులు నేర్పని చదువులు నీకెవరు నేర్పారు ప్రహ్లాదా?''

''గుడ్డి వాడికి మరోగుడ్డి వాడు వెలుగు చూపింపలేడు తండ్రీ?''

''ఓహో. మేమంతా గుడ్డివాళ్లం! నీవొకడివే కండ్లున్న వాడివి. ఓ దుష్టాంగం ఉంటే, దాన్ని తొలగించడం వైద్యప్రక్రియ. నీలో ఉన్న దుష్టబుద్ధినీ తొలగించడం తండ్రినయిన నాకర్తవ్యం. ఎవరక్కడ? వీడి బుద్ధిని సరిచెయ్యండి. రాకుమారుడని శంకించవద్దు. చికిత్స అవసరం అయితే ప్రేమను వదలు కోవాలి. అవసరం అయితే దండప్రయోగం తీవ్రం చెయ్యండి.'' అని అతడు ఆజ్ఞాపించాడు.

శూలాలు తీసుకుని కొందరూ, కత్తులు తీసుకుని మరి కొందరూ, గదలతో ఇంకొందరూ రకరకాలుగా ప్రహ్లాదుని నొప్పింపసాగారు. అందరూ చేరి చిత్రహింసల పాలు చేస్తూంటే, అతడు ''అయ్యో! అమ్మా! అన్న పాపాన పోలేదు. కంట తడి పెట్టలేదు.

ఎవరిదో ఈ శరీరం. ఎవరో హింసిస్తున్నారు అన్న విధంగా అతడు ప్రవర్తింపసాగారు.

''అయితే, ఆపదుద్ధారకా! ఆపన్నశరణ్య! అనంతశయనా!'' అని మాత్రం అనేవాడు.

రక్షింపుమని, తల్లినిగానీ, తండ్రినిగానీ అతడు అడగలేదు. భయం కించిత్తులేదు. దుఃఖం లవలేశం లేదు. బాధ అణుమాత్రం పొందలేదు. ప్రహ్లాదుని నొప్పింపలేక, రాక్షసభటులు తమను తామె నొప్పించుకున్నారు.

ఏనుగుల చేత తొక్కించారు; కొండ కొమ్మునుండీ సముద్రంలో పడదోశారు. విషసర్పాల చేత కరిపించారు. విషం తాగించారు. అభిచార హోమం చేశారు. ఆ బాలుని తల పువ్వు అయినా వాడలేదు.

హిరణ్యకశిపునకు ఆశ్చర్యం కలిగింది. ఎవడు వీడు? ఇంతటి బాధలను సహించడం ఎవరితరం? ఏ అదృశ్యశక్తి ఇంతగా కాపుకాస్తూంది? ఆ బాలుని హింసింపలేక, కొత్తదారులు వెదకలేక అతడు అలసిపోయ్యాడు: చింతాకులుడూ అయ్యాడు.

"మా తండ్రి వచ్చేంత వరకూ గురుకులానికి ఈ బాలుడిని తీసుకపోతాం. ఆయన శిక్షణలో మారగలడేమో చూతాం!" అని గురు పుత్రులు చెప్పగా, విధిలేక హిరణ్యకశిపుడు అంగీకరించాడు.

గురుపుత్రులు ఈ మాటు అర్థ కామాలు ఉపదేశించారు. కామాన్ని విస్తృతపరచారు.

గురువులు అటువెళ్లగానే ప్రహ్లాదుడు తోటి బాలురను చేర్చి విష్ణు సంకీర్తనం, భజనలూ సాగించాడు. ఆ బాలురను రాక్షస ప్రవృత్తినుండి సాధువులుగా మార్చసాగాడు.

"సర్వభూతమయుడయిన విష్ణువు ఆత్మేశ్వరుడు. ఆయనమీద అచంచల భక్తి కలిగిన నాడు చావుపుట్టుకల విషవలయం నుండీ విముక్తి పొందడం జరుగుతుంది. ముక్తి పథం అదే!" అని ఉపదేశించే వాడు ప్రహ్లాదుడు.

ఆ బాలకులు గురువుల చదువుల చాలించి, నారాయణ భక్తితో నృత్య గానాదులతో తన్మయులై పోయారు. బాలకులు ఇలా కావడానికి గురువులు కలత పొందారు. భీతిమించుతూండమి, ఆ వైనం రాజుకు తెలిపారు. హిరణ్యకశిపుడు కొడుకును పిలిపించాడు.

"నీవొక బాలుడవనీ, నా కొడుకువనీ ఇంతవరకూ, ప్రేమతో, మమకారంతో నీ అగడాలు సహించాను. కానీ నీవు నీ చిత్త వృత్తిని మార్చుకోలేదు. గురువులు బోధించని చదువులు చాలా నేర్చావుట. దిక్కుల గెలిచాను, దిక్కుల కధిపతుల దిక్కులేకుండా చేశాను. ఇంద్రుడు నాదయాభిక్షకు మడి చేతులతో నాముందు నుంచున్నాడు. తన కిరీటం నేల సోక, నా పాదాలకు నమస్కారం చేస్తున్నాడు. నీవేమో నన్ను కాదని, నా ప్రాభవం మరచిపోయి, నీకు వేరొక రక్షకుడున్నాడనీ, వాడిని భజన చేస్తున్నావు. ఎవడువాడు? ఎక్కడ ఉన్నాడు? ఏం చేస్తున్నాడు!" అని అతడు గర్జించాడు.

"దిక్కులకే దిక్కైనవాడూ, కాలానికీ కాలమైనవాడు, సర్వ జీవులకూ ఆత్మ అయినవాడూ నాకు దిక్కు తండ్రీ? ఇంద్రాది దేవతలతో సహా అందరూ పోయినా ఎవరు శాశ్వతమో వారు నాకు శక్తి; రక్ష!"

"అయితే ఎక్కడ ఉందా ఆ శక్తి? ఏ రూపంలో ఉంది?"

"అన్ని రూపాలూ తనవే! అంతా తనదే! ఎక్కడ అని నిరూపింపగలం? ఇక్కడా, అక్కడా, ఎక్కడైనా, ఎప్పుడైనా ఉండగలదా శక్తి!" ప్రహ్లాదుడు అన్నాడు.

"అయితే ఈ స్తంభంలో ఉందా ఆ శక్తి?" అని హిరణ్యకశిపుడు అడిగాడు.

"గాలిలో పుట్టే వాడికి, గాలినే పుట్టించిన వాడికీ ఈ స్థంభం ఒక లెఖా? అక్కడా ఉండగలడు" అని ప్రహ్లాదుడు కనులు మూసుకుని చేతులు జోడించాడు.

హిరణ్యకశిపుడు కోపంతో పిచ్చివాడయినాడు. విసవిసా నడచి చేయెత్తి స్థంభంమీద ఒఖ చరపు చరిచాడు.

ఒక వేయి పిడుగులు రాలినట్లు, సప్త సముద్రాలు ఏకమై ఘోషపెడుతున్నట్లు గొప్ప శబ్దం వినిపించింది. అనంత కోటి సూర్యులు ఒఖసారిగా వెలిగినట్లు దివ్యకాంతి కనిపించింది. ఆ తరువాత ఓ విచిత్రాకృతి ఆ స్థంభంలోంచి వెలువడింది.

అది నరరూపంకాదు. హరిరూపంకాదు. బహుశా రెండింటికి భిన్నమైన నరహరిరూపం అది. వాడి కోరలూ, వేడిచూపులూ, మంటలు కురిసే నాసికా పుటాలు; ఉల్కలు రాల్చే కనులూ, నాలుగు చేతులూ, ఆ చేతుల ఆయుధాలు ఆ స్వరూపంలో ద్యోతకమైనాయి.

హిరణ్యకశిపుని ప్రాణాలు ఆ మూర్తి చూపులకే కడబట్టాయి. అప్పుడు సంధ్యాసమయం. పడమర అరుణ వర్ణం రక్తశోభతో వెలుగుతూంది. పగలూ, రాత్రి కానిసమయం అది. ఆ రాక్షసుడు కోరుకున్న మరణ సమయం అది.

హిరణ్యకశిపుని కళేబరం బరబరాలాక్కుంటూ పోయి నృసింహస్వామి గడపమీద కూర్చున్నాడు. వాడిని తనవళ్లో పెట్టుకున్నాడు. అది ఆకాశం భూమీకాని చోటు. ఏ ఆయుధం కాని తనవాడి గోళ్లతో గుండెను చీల్చి, ప్రేవుల మాలలు మెడలో వేసుకుని హిరణ్యకశిపుని సంహరించి, భయంకరంగా గర్జించాడు ఆ స్వామి.

ఇంతలో రాక్షస మూక రాజుకు సాయం వచ్చింది. ఒఖ హుంకారంతో స్వామి వారిని మట్టి కరిపించాడు. కోపోద్రేకంతో ఆయన నృసింహగర్జనలు చేయసాగాడు.

"రాజుల సంపదలూ, ఇంద్రాది దేవతల సిరులూ నిలచేవికావు. నిలచే సిరి ఇదో నీవే ఇవ్వగలవు. ఈ ఎరుక నీదయ వల్ల కలిగింది. నీ దాసాను దాసుణ్ణి అయ్యాను. కలకాలం ఈ స్థితి నిలచే వరం అనుగ్రహించు ప్రభూ!" అని ప్రహ్లాదుడు సాంజలి అయినుంచున్నాడు.

ప్రసన్నమూర్తి అయినస్వామి "ఏదో కోరికలు నన్ను కోరుతూంటారు అందరూ! నీకేం వరం కావాలో అడుగు నాయనా! ఇస్తాను!" అన్నాడు.

"శుద్ధాత్ముడను కాగల వరం అనుగ్రహించు తండ్రీ!"

"నన్ను శాశ్వతంగా చేరుకుంటావు. చిరంజీవివై వర్థిల్లు!" అని స్వామి అనుగ్రహించాడు.

ప్రహ్లాదుడు అనేక వేల సంవత్సరాలు రాజ్యభోగాలు అనుభవిస్తూ, పరమ భాగవతోత్తముడుగా జీవించాడు.

★ ★ ★




ముమ్మొనలతో త్రిశూలం వలె కనిపించడంతో ఆ కొండ, త్రికూటంగా ప్రసిద్ధి పొందింది. విశాలమైన ఆ కొండకోనలు, అనేక సరస్సులూ ఫలవృక్షాలూ, వనచరాలూ కలిగిఉంది. దేవతలకు ఆ ప్రాంతం క్రీడా విహారం అయింది.

ఆ మూలలో అనేక సంవత్సరాలుగా, ఒక గజరాజు, తన పరివారంతో యధేచ్ఛ సంచారం చేస్తూ సుఖంగా కాపురం చేస్తూంది. అది ఒకనాడు జలార్థి అయి, తనవారితో ఒక సరస్సుకు వచ్చి నీరు తాగింది. స్నానం చేయవలెనన్న కుతూహలంతో జలాశయం ప్రవేశించింది. రాజుతో, అందరూ సరస్సులో చేరి మునిగి తేలసాగారు.

తృప్తి తీరా ఆఏనుగుల గుంపు స్నానం చేసింది. తొండాలతో నీళ్ల చిమ్ముకుంటూ, దుముకుతూ వెల్లకిలా పడుతో, ఈదుతూ సరస్సును అల్లకల్లోలం చేస్తూ ఎంతో పొద్దు అవి విహరించాయి.

ఇంతలో విధివిధానం వలె ఒక మొసలి, గజరాజు పాదాన్ని నోర కరచి పట్టింది. నీళ్లలో సహజంగా బలం కలది కనుక ఆ మొసలి గట్టిగానె పట్టుకుంది. ఆ పట్టునుండీ తప్పించుకునేందుకు గజరాజుకు సాధ్యపడలేదు.

నెత్తురు జుర్రుకుంటూ, ప్రాణాలు తోడుతున్న ఆ మకరికి లోబడిపోయి ఆ గజం విలవిలా తన్నుకోసాగింది.

కాళ్లతో, తొండంతో కుదుళ్ల పగిలేలా ఆ ఏనుగు తన్నుతున్నా ఓ క్షణమాత్రం తన పట్టు విడచి, నీళ్లలో దాగి, మరోక్షణంలో, మహాబలంతో ఆ మకరి పట్టు చిక్కించుకునేది. ఆ మకరి సాగిస్తున్న వినోదం గజానికి ప్రాణ సంకటం అయింది.

ఈ పోరాటం చాలకాలం సాగింది. క్రమంక్రమంగా భూచరం అయిన గజబలం సన్నగిల్లసాగింది. అందులో దానికి ఆహారం కూడా చిక్కడం లేదు. ఏనుగు నెత్తురు తాగితాగి మొసలి బలకరం అయింది.

గజరాజు పరివారం కొంతకాలం వరకూ, రాజుగురించి ఎదురుచూసింది. క్షీణబలుడవుతున్న తమ రాజును చూడలేక, అక్కడ నిలువలేక, అవి అడవిలోకి వెళ్లిపోయాయి.

ఏకాకీ, అశక్తుడూ, కంఠగత ప్రాణుడూ అయిన ఆ గజరాజుకు దిక్కుతోచలేదు. ఆపదనుండి బయటపడగలదారి చిక్కలేదు.

పూర్వజన్మవాసనా ఫలితంగా, ఆ గజానికి భక్తి పుట్టుక వచ్చింది. ఆపదలు ముంచుకొచ్చిన వేళ, తమ బలం ఎందుకూ కొరగాదని తెలినపుడు ప్రతిజీవి దైవబలం కొరకు ఎదురు చూస్తుంది కాబోలు.

''దిక్కుమాలిన ఈ జీవికి దిక్కుఎవరో కదా? ఏవిధంగా ఈ మకరిని గెలువగలను? అయ్యో! తెలివి తక్కువతనంతో ఈ కొలనుకు వచ్చా. నీరు తాగి వెళ్లవచ్చుకదా? నీళ్లాటకు ఎందుకుదిగాను? ఎవరో చెప్పినట్లు, నా బుద్ధికి అతీతంగా జరుగుతూంది. ఇలా నా బుద్ధిమీద కూర్చుని, నన్ను ఆడించే మహానుభావుడు ఎవరు? ఎవరు ఈ లోకాలకు కారణం అయి ఉన్న వాడో, వాడే – అకారణ కర్త నాకు శరణం కావాలి! లోకాలూ, లోకస్థులూ, లోకేశులూ అంతం అయిన వేళలో చీకట్ల కలవతల, తేజోస్వరూపి అయి ఎవరు సదా వెలుగుతున్నాడో, వాడేనాకు శరణం కావాలి. దీనుల పట్ల – నావంటి – పశువుల పట్ల దయాళువొకడు ఉన్నాడంటారు. వాడు ఎక్కడ ఉన్నాడో? ఏమో? తప్పక నా పిలుపు వినగలడు. ఎక్కడ ఉన్నా దిగిరాగలడు? గుణరహితుడూ, నిరంజనుడూ, రూపాలకు రూపం అయినవాడూ, చూపులకు చూపైన వాడూ ఈ దీనుని కాపాడరాడేం? తండ్రీ!

నీవు ఎక్కడ ఉన్నావు? ఈ జయం అపజయం నీవే! ఈ మొసలి పట్టు విడువక నన్ను చీకాకు పరుస్తున్నదీ నీ అనుగ్రహం వల్లనే! ఈ బలాబలాలు రెండూ నీవే ప్రభూ! నాలో బలం ఎప్పుడోపోయింది. ప్రాణాల్లో మిగిలిన ఈ ఒఖ ప్రాణం కొటకలాడుతూ ఎప్పుడెప్పుడా అని ఉంది. ఈ సమయంలో నిన్ను నాకు జయం కలిగించమని వేడుకోడం లేదు. ముక్తి కలిగించు. విముక్తి ప్రసాదించు భగవన్!'' అంటూ ఆ ఏనుగు తొండం ఎత్తి ప్రార్థింప సాగింది.

కరుణామయుడూ, దయామయుడూ, దానిమొర ఆలకించాడు. కరిరాజును రక్షింపవలె అనుకున్నాడు. ఆయన మనస్సునెరిగిన సుదర్శనం క్షణంలో మకరి తల త్రుంచింది.

గజం విడుదల పొందింది. ప్రాణాలు కుదుట పడ్డంతో దానికి నూతనోత్సాహం కలిగింది. కరమెత్తి శ్రీహరికి నమస్కరించింది. మహావిష్ణువు తన చల్లని చూపుతో దానికి పోయిన బలాన్ని ప్రసాదించాడు.

గంధర్వుడయిన హూహూ శాపవిమోచనం పొంది, మకరి జన్మను విడచి, ఈశ్వరునకు నమస్కరించి, తనలోకానికి వెళ్లిపోయాడు.

ఇంద్రద్యుమ్న మహరాజు ద్రవిడ దేశానికి రాజు. గొప్ప వైష్ణవ భక్తుడు. అతడొకనాడు విష్ణుచింతనతో పరవశుడయిన సమయంలో దూర్వాసుడు అటు రావడం జరిగింది. అతడు గమనించలేదు. రాజు తనను గౌరవించలేదని ఆ ముని అనుకున్నాడు. ఆ కోపం శాపమైంది. ఫలితం మహరాజు తన బలగంతో సహా గజజన్మపొందవలసి వచ్చింది.

శ్రీహరి కరుణాలేశంతో ఆ శాపం పోగొట్టుకున్న వాడై అతడు పూర్వస్థితీ, ద్యుతీ పొందాడు. జన్మాంతర పుణ్యం వలన పశుజన్మలో సైతం భక్తి ప్రపత్తి కలిగింది.



# అమృతం

ప్లమోచన అనే దేవకాంత, నందనోద్యానవనంలో పూలు కోసి మాల అల్లి, దూర్వాసునకు భక్తితో కానుక చేసింది. దూర్వాసుడు, ఆమాలను ఐరావతం ఎక్కివ్యాహ్యాళి వెళుతున్న ఇంద్రునకు ఆశీర్వాదంతో ఇచ్చాడు.

అయితే దేవరాజు అధికార దర్పంతో, ఆ పూవమాలను అలవోకగా అందుకుని ఐరావతమ్మీదకు విసరాడు. ఆ ఏనుగు ఆమాలను తన కాళ్ల క్రింద పడవేసి తొక్కినలిపి వేసింది.

ఇంద్రుడు, తన కానుకను అలా నిర్లక్ష్యం చేయడం చూసిన దూర్వాసునకు కోపం వచ్చింది. ఆయన అసలే కోపిష్టి! దానికితోడు అవమానాగ్ని! కోపాగ్నితో మండిపోయాడు.

ఆయన ఊహలు శాపాలయినాయి.

''ఏ శ్రీమంతంతో ఇంతగా విర్రవీగుతున్నావో అదంతా నీళ్లపాలయ్యే రోజు త్వరలో వస్తుంది ఇంద్రా! గర్వంతో మిడిసి పడకు!'' అని ఆయన శపించి, తన దారిన వెళ్లాడు.

ఆశాప ఫలితంగా దేవతల శ్రీ అదృశ్యం అయింది. దారిద్ర్యం వేయివిధాలయింది. దేవతలు ఈతిబాధలకు గురై బ్రహ్మను చేరి ప్రార్థించారు.

''హరికరుణ లేక కలిమి కలుగదు. కలుముల తల్లి ఆయన సేవకులనే చేరుతుంది. ఆయనను ప్రార్థించండి!'' అన్నాడు బ్రహ్మ.

హరిని చూడ వచ్చిన వారికి ఆయన దర్శనం కాలేదు.

''ఏమాయకు జీవులు బద్ధులో, ఏమాయదాటరానిదో, ఏమాయ వలన సుఖం – దుఃఖం – మంచీ చెడులు రూపొందుతున్నాయో, ఆ మాయకు నీవు అతీతుడవు. కారణకర్తవూ అయిఉన్నావు ప్రభూ! నీచరణధూళి మాత్రమే ఆ మాయను దూరం చేయగలదు. ఈ మాయ కవతలి చూపు ప్రసాదించు తండ్రీ! సర్వం నీవే! నీవే శరణు!'' అంటూ దేవతలు ప్రార్థించారు.

అప్పుడు అనంతశయానుడు వారికి గోచరించాడు.

''భూమిలో అన్నం, గోవులో అమృతం, సమిధలో అగ్ని ఉన్నట్లు సర్వ జీవుల్లో నీవూ ఉన్నావు దేవా! సర్వం తెలిసిన నీకు మా దురవస్థ ఏమని చెప్పగలం!'' అని ఇంద్రాది దేవతలు ముకుళిత కరాలతో నుంచున్నారు.

''గర్వం ఎవ్వరకూ పనికి రాదు. ముని శాపానికి కారణం అయిన దర్పం, స్వాభిమానం, ఎంతటి దురవస్థకు దారి తీసిందో అర్థం అయిందా? పాల సముద్రాన్ని మందరను కవ్వం చేసి, ఓషధులను పోసి, వాసుకిని తాడుగా చేసి చిలకండి. మీకోరికలు నెరవేరుతయ్! దానవులతో విరోధం విడచి స్నేహభావం ప్రకటించండి. వారి సాయం ఈ పనికి ఎంతో అవుసరం! నా అండ ఉంటుంది!'' అని ఆయన అదృశ్యం అయ్యాడు.

దేవతలూ, దిక్పాలురూ వెంట రాగా దేవేంద్రుడు ముల్లోకాధీశుడయిన బలి ముందు యాచకుడై నుంచున్నాడు.

''మనం ఒక తండ్రి బిడ్డలం! మనలో మనకు వృధా తగవు లెందుకూ? మీరు ఎల్లాగూ స్వర్గసుఖాలు పొందుతూనే ఉన్నారు. భ్రాతృవాత్సల్యంతో స్నేహం అర్థిస్తున్నాం!''

''వీడు కడు ధూర్తుడు. కపటి కూడా! నేడు పసచెడి, చేవచచ్చి లేవలేక స్నేహం అని కడుదీనుడై వచ్చాడు. ఎంతమాత్రం వీడితో నెయ్యం మనకు వద్దు ప్రభూ!'' అంటూ మంత్రులు సలహా ఇచ్చారు.

''శరణు అన్న వారిని రక్షించడం ధర్మం కదా?'' అని అడిగాడు బలి.

''కడుపులో ఓయింత కుట్ర పెట్టుకుని ఈ దేవతలు వచ్చారు. ఒక్కనాటికీ వీరిస్నేహం పనికిరాదు!'' అని ఖచ్చితంగా మంత్రులు చెప్పారు.

''వీరు ఇప్పుడు సగం చచ్చినవాళ్లు!! ఏం చేయగలరు! మనసేవకులు. బతకనిద్దాం!'' అంటూ బలి చక్రవర్తి ఉదారంగా సమాధానించారు.

''సోదరా! నీవుమా ప్రాణదాతవు. నీవు చేసిన సాయానికి ప్రతిఫలంగా సకల సౌభాగ్యాలూ కలిగే ఉపాయం చెబుతాను. సావధానంగా విను.. మునిశాప కారణంగా, ఎన్నో అమూల్య వస్తువులు సముద్రం పాలయ్యాయి కదా? ఇప్పుడు మనం, ఆ పాలవెల్లిని చిలికామంటే, అంతులేని నిధులు చిక్కుతాయి. నీ చిత్తం వచ్చిందేదో నీవు తీసుకో! నీకు అక్కరలేని వస్తువులతో మేం తృప్తి పడతాం!'' అన్నాడు ఇంద్రుడు.

ఇంద్రుడు చెప్పిన విషయం విని లోభకారణంగా రాక్షసులు ఎంతో సంతోషించారు.

ఇంద్రుడు బలిని అంగీకరింపచేసిన తరువాత, శంబరునీ, అరిష్టనేమినీ, జంభునీ, మాలీనీ సుమాలినీ, నివాత కవచులనూ అంగీకరింపచేశాడు.

దేవదానవులు మహా సంరంభంతో, ఉత్సాహంతో మందర పర్వతం దగ్గర కలుసుకున్నారు. ఆ పర్వతాన్ని పెకలింప ప్రయత్నించారు. పర్వత పీఠాన్ని తవ్వి, ఎల్లాగో తంటాలు పడి, చీమల బారువలె, కొండ క్రింద చేరి ఎత్తుకున్నారు వారు. అయితే ఆ పర్వతం బరువుకు వారు తాళుకోలేక, చితికిపోయారు. కొందరు కాళ్లు, కొందరు చేతులు, కొందరు నడుములు విరచుకున్నారు. కానీ మందరం మాత్రం అంగుళం కదల్లేదు.

ఇంతలో మహావిష్ణువు గరుడ వాహనమ్మీద వారికి కనిపించాడు. ఆయన మందరను, ఓ చిన్ని కొండరాయి వలె ఎత్తి గరుడుని మూపున పెట్టుకుని పాలసముద్రం మధ్యలో పెట్టాడు.

మహాబలుడైన వాసుకిని ప్రార్థింపగా, కవ్వపు తాడు అయేందుకు అతడు అంగీకరించాడు.

దేవతలు తలపైపు పట్టుకోగా, తమకా భాగం కావలెనని రాక్షసులు పట్టుపట్టారు. తోకపుచ్చుకోవడం వారు అవమానంగా భావించారు. దేవతలు వాసుకి పుచ్ఛభాగం పట్టుకున్నారు. అయితే చిలుకడం ప్రారంభింపకముందే మందర పర్వతం సముద్రంలో మునిగి పోయింది. మహావిష్ణువు మహాకూర్మమై కఠినమైన తన మూపున మందరాన్ని నిలిపాడు.

దేవదానవులు మరే ఆటంకమూలేకుండా పాలవెల్లిని చిలుక సాగారు. అగ్నికణాలు రేగుతూ బుసబుస పొంగుతూ, పొగలు పోతూ తెర్లిపోతూ భయంకరమైన కాలకూట విషం పుట్టుక వచ్చింది. ఆ విషపు వేడిమికి ఎక్కడివాళ్లక్కడే పారిపోయారు.

ఆ మహావిషం దుస్సహమై, సర్వవ్యాపకమై, కాళిమమై కొంచెం కొంచెం ముందుకు సాగుతూంది. అది ఆకాశం నిండా కప్పుకుంది. దేవదానవులు, తమ దురవస్థకు చింతించి కైలాసం చేరి మహాదేవుని పాదాలు శరణన్నారు.

"తండ్రీ! పశుపతీ! శరణు! భూతపతీ శరణు! సత్యం, ధర్మం, ఛందం నీవు. సత్వరజస్తమోగుణ చక్షుడవు నీవు. ఫాలాగ్ని ధరించిన దేవదేవుడవు నీవు. ఈ భయంకర కాలకూట విషాగ్నికి చిక్కి స్రుక్కి దిక్కు తోచక అతలాంకుతలాం అయి నీ శరణు పొందాం స్వామీ! కరుణచూడు! మూడుమూర్తులూనీవు, మూడు కాలాలు నీవు. నీవు తప్ప వేరుదైవం మాకు తెలియదు. పాలవెల్లిని భోగవస్తువులకై మథించాము తండ్రీ! అది నేడు ప్రాణాంతకమైంది మహానుభావా!" అంటూ బ్రహ్మాది దేవతలు మొరలుపెట్టారు.

కరుణాళువు అయిన ఆ దేవదేవుడు చిరునగవుతో పార్వతి వైపు చూశాడు. జగన్మాత మందహాస మధురిమలు కురిపించింది.

పరమేశ్వరుడు చేయిసాపి బ్రహ్మాండం నిండుతున్న విషాగ్నిని అరచేతికి ఆకర్షించాడు. ఆ విషం యావత్తూ కొంచెమై కొంచెమై ఒక ఉసిరిక కాయంత అయి ఆయన అరచేత చేరింది.

జగద్ధాత్రి అయిన పరమేశ్వరికి అమృత వర్షిణి అని మరొక పేరు ఉంది. అమృత వర్షిణి అంటే, అమృతం కురిపించేదని అర్థం. పరమేశ్వరుని అరచేత ఉన్న గరళం ముద్ద వేపు ఆ తల్లి తనచూపుల అమృతం కురిపించి, ఇహపరవాలేదు మింగమన్నట్లు మందహాసం చేసింది.

సర్వభక్షకుడయిన అగ్నికి వలె, పరమేశ్వరుడు, తన అరచేత ఉన్న విషఫలాన్ని గుటుక్కున

మింగాడు; తన ఉదరంలోని సర్వజగత్తుకు విపత్తు కలుగుతుందని కంఠభాగంలో దానిని నలిపివేశాడు. ఆయన కంఠ ప్రదేశం కమలినట్లు నీలం అయింది. ఆ కారణంగానే, నీలకంఠుడూ, గరళకంఠుడూ అయ్యాడు పరమేశ్వరుడు.

ముప్పు గడచిపోవడంతో దేవదానవులు తిరిగి పాలవెల్లిని చిలక సాగారు. అప్పుడు తెల్లని దేహంతో కామధేనువు పుట్టింది. ఈ ధేనువును దేవమునులు సొంతం చేసుకున్నారు. ఉచ్చైశ్రవం ఉద్భవించింది. దాన్ని బలితీసుకున్నాడు. ఐరావతం పుట్టింది. కల్పవృక్షం, చంద్రుడూ అప్సరసలూ పుట్టారు. బ్రహ్మ ఆజ్ఞమేరకు చంద్రుడు గ్రహస్థితి చేరాడు. ఆ తరువాత మహాలక్ష్మి ఉద్భవించింది. దిగ్వేదండాలు ఆ కలుముల తల్లికి మంగళస్నానం చేశాయి. దేవతలు పూజించారు. సముద్రుడు, తనకూతునకు పచ్చని చీరెలు అరణంగా ఇచ్చాడు. వరుణుడు వైజంతీ మాలనూ, విశ్వకర్మ కేయూర కంకణాలనూ, సరస్వతీదేవి ముత్యాల మాలనూ, బ్రహ్మదేవుడు పద్మాన్నీ, వేదాలు కుండలాలనూ, దిశలు సిరుల తల్లివన్న దీవననూ సమర్పించి, తమ సంతోషం తెలుపుకున్నారు.

ఆ తల్లి, దేవతలనందరనూ సాభిప్రాయంగా తిలకించింది. దేవ దేవుడయిన శ్రీమహావిష్ణువు శృంగార రూపీ; శుద్ధ కారుణ్యమూర్తి, సాధుసేవితుడూ అనీ, తనకు తగిన వాడనీ, ముకుందమాలను వరమాలగా ముకుందుని మెడలో వేసి వరించింది. ఆ మహానుభావుడు, ఆమెకు తగిన చోటు, తన వక్షస్థలం అనీ, హత్తుకుని గౌరవించాడు: వరకట్నంగా సముద్రుడు కౌస్తుభమణి ఇవ్వగా, ఆయన ఆ మణిని గుండెలమీద దాచుకున్నాడు.

ఆ తరువాత మథనంలో వారుణి ఉదయించింది. ఆ వారుణిని దనుజులు సంతోషంతో పుచ్చుకున్నారు. ధన్వంతరి విష్ణుస్వరూపంతో ఆవిర్భవించాడు. ఆయన చేత అమృతకలశం ఉన్నది.

దానవులు బలవంతులై, దేవతలను కికురుపెట్టి అమృతభాండం పుచ్చుకున్నారు. చావు లేని మందు పొందామని వారు పొంగి పోయారు. ఒకరి కన్నా మరొకరు ముందు సేవించాలని, ఎవరికి వారు బలాబలాలు చూపసాగారు. తమ ప్రయత్నం వ్యర్థం అయిందని దేవతలు విచారించారు.

వారి దైన్యం పోగొట్టవలెనని విష్ణువు, వారిని ఊరడించి, తానొక ఆడవేషం ధరించాడు. దానవుల కండ్లు మిరుమిట్లు కొలిపే రూపలావణ్య తారుణ్యాలతో వారిముందు ఆ మోహినీదేవి దృశ్యాదృశ్యంగా అవతరించింది.

జగన్మోహన రూపంలో తమ ముందు నిలచిన ఆ కామినిని చూచి, దానవులు వెర్రి వారై, కామోద్రేకంతో వళ్ళు తెలియక, ఆతరుణీ హస్తంతో అమృతం సేవించడం తమ జన్మ సాఫల్యం అని తమకు తామె అమృతకలశాన్ని మోహిని చేతపెట్టి, తలకొక దారెడు పంచమని కోరారు.

ఆ మోహిని, తన మందహాసరుచులతో వారి ఆయువు పట్లు తూట్లు పడవేస్తూ బారులుతీరి కూర్చోమని ఆజ్ఞ ఇచ్చింది. దేవతలకూ అదే ఆజ్ఞ ఇచ్చింది. దేవదానవులు స్నానాదులు ముగించి శుచులై కూర్చున్నారు. దేవతల వరుసనుండీ అమృతం మోహిని పంచడం ప్రారంభించింది; దేవతలకు మొత్తం అమృతం పంచి, రాక్షసులను మోసం చేస్తుందన్న అనుమానంతో రాహువు, దేవతవలె వేషం వేసుకుని ఆ వరుసలో కూర్చున్నాడు. అతడు దొంగచాటుగా అమృతం సేవిస్తున్న విషయం సూర్యచంద్రులు ఆ మోహినికి తెలియచేశారు. విష్ణువు తన చక్రాయుధంతో రాహువు తల తుంచాడు. అమృతం సేవించిన కారణంగా తలామొండెం వేరయినా రాహువు చావలేదు.

రాహుకేతువులయ్యారు: తల రాహువు – మొండెం కేతువుగా మిగిలారు. ఆ ఇద్దరూ గ్రహస్థితి పొంది, సూర్యచంద్రుల మీద మచ్చరం వహించి, పర్వ దినాలో పట్టి పీడిస్తామని చెప్పారు. ఆ విధంగా సూర్యచంద్ర గ్రహణాలు కలిగాయి.

అమృతం దేవతలకు ఇచ్చి, మోహిని అవతారం చాలించి, విష్ణువు గరుడుని ఎక్కి తన దారిని తాను వెళ్లాడు.

రాక్షసులకు, తమకు జరిగిన మోసం నిదానంగా తెలిసింది. కోపంతో వారు దేవతలను ఎదుర్కొన్నారు.

బలి ఇంద్రుని మీద అనేక అస్త్రశస్త్రాలు కురిపించాడు. శుంభ నికుంభులు ఇతర దేవతలనొప్పించారు.

ఇంద్రుడు బలిరథాన్నీ, అశ్వాలనూ చంపాడు. బలి మాయాయుద్ధానికి దిగాడు.

జంభుడు ఇంద్రుని తాకి ఐరావతాన్ని, మాతలినీ గాయపరిచాడు. ఇంద్రుడు, తన వజ్రాయుధంతో వాడిని చంపాడు. నముచి, ఇంద్రునికి ఎదుట నిలచి యుద్ధం చేయసాగాడు. ఇంద్రుడు నముచి తల త్రుంచగానే తల మొండెంతో కూడుకునేది. వాడిని ఇంద్రుడు చంపలేకపోయాడు.

అశరీరవాణి ఇలా ఆదేశించింది.

''నముచి తపస్సంపన్నుడు. వరబలం వల్ల ఎండిన, తడిసిన ఏయుధం తోనైనా చావడు. రెండూకాని ఆయుధంతో చస్తాడు.''

ఇంద్రుడు, తన వజ్రాయుధానికి సముద్రపు నురుగుపూసి, నముచి తలను ఖండించాడు.

దేవదానవుల యుద్ధం ఎంతకూ తీరలేదు. నారదుడు వారికి సంధి చేయవలసివచ్చింది.

''అమృతం చిక్కింది కదా! మీరు వెళ్లండి!'' అని దేవతలను వెనక్కు పంపాడు నారదుడు.

అపజయం పొందిన దానవుల దైన్యం చూడలేక శుక్రాచార్యులు మృతసంజీవనీ ప్రాభవంతో మృతులయిన రాక్షసులను బతికించాడు.



# మహాబలి

అమృతం విషయంలో దేవతలు తమను మోసం చేసిన విషయం బలి మరచిపోలేదు. దేవతల మీద అతడు యుద్ధం చేస్తూనే ఉన్నాడు. దేవతలు బలవంతులై బలిని తరిమి కొట్టసాగారు.

సిగ్గుపడి, పసచెడి చావగా మిగిలిన మూకతో బలి ఇల్లుచేరాడు.

రాక్షసులకు గురువైన శుక్రుని, బలి ఆశ్రయించి, దేవతలను గెలువగల వరం అనుగ్రహించమని ప్రార్థించాడు.

బలిని కర్తగా చేసి శుక్రుడు విశ్వజిద్యాగం నెరవేర్చాడు. ఆ యాగఫలితంగా రథం, అశ్వాలూ, ధ్వజం, ధనువూ, తూణీరం పుట్టుక వచ్చాయి. మణిమాల తాత ప్రహ్లాదుడు, విజయశంఖాన్ని శుక్రుడూ బలికి ప్రసాదించారు.

ఆబలంతో బలి అమరావతిని ముట్టడించాడు.

మునుపొకపరి ఓడిపోయిన బలి తిరిగి రావడం చూసి ఇంద్రుడు ఆశ్చర్యం పొందాడు. ఏదోగొప్ప శక్తి లభించడం వల్లనే, తిరిగి అతడు వచ్చాడని, గురువు బృహస్పతిని, ఇంద్రుడు సంప్రదించాడు.

''భార్గవుల అనుగ్రహంతో అనేక సంపదలు, శక్తులూ పొందిన ఈ బలి అజేయుడు. మీరు వారి బలానికి చాలరు. అనువుగాని చోట అధికులం అనరాదు. అది బుద్ధిమంతుల లక్షణం కాదు. కొంతకాలం తలదాచుకో! ఇది బలికి శుక్రమహర్దశ!'' అని బృహస్పతి హితం చెప్పాడు.

ఇంద్రుడు గురూపదేశం పాటించాడు. ప్రతిఘటన అంటూలేక పోవడం వలన బలికి స్వర్గసింహాసనం సులభంగా లభించింది.

భువనత్రయాలకు బలి చక్రవర్తి అయ్యాడు. ధర్మమార్గం అనుసరించి, గురువు శుక్రుని ఆజ్ఞమేరకు, అనేక యజ్ఞయాగాలు చేస్తూ, యాచకులకు అడిగిన దెల్లా దానం చేస్తూ మహాదాత అనీ, వదాన్యుడని బలి ప్రసిద్ధి పొందాడు.

దేవతల తల్లి అదితికి, రాక్షసుల ప్రాభవం కంటగింపు అయింది. తనబిడ్డలయిన దేవతలు రాజ్యం పోగొట్టుకుని అడవుల పాలవడం ఆతల్లికి కడుపుకోత అయింది.

కశ్యప ప్రజాపతి అదితిభర్త. ఆయన ఆమెను చూడ ఒకనాడు వచ్చాడు. ఆమెభర్త పాదాలకు నమస్కరించింది.

''దితి బిడ్డలు లోకపాలకులై, అమరుల తరిమికొట్టారు. మహాత్మా! వారంతా చెట్టుకొకరు, పుట్టకొకరు అయి విలపించడం చూసి తల్లినయిన నాకు దుఃఖం కలుగుతూంది. సురల దుఃఖం మాన్పడం తండ్రివయిన నీధర్మం స్వామీ! ధర్మాధర్మ వివేకం గల సమవర్తివి నీవు. నా పిల్లలకు కలిగిన అన్యాయం నీవు తప్ప మరిఎవరు నివారింపగలరు?'' అంది అదితి.

''ఈ మాయా నాటకంలో మనమంతా నటులం దేవీ! నీపాత్ర తల్లిదయితే నా పాత్ర తండ్రిది. వీరూ వారూ మనసంతానమే! వీరుడు అయిన బలి జయించాడు. బలహీనుడు ఇంద్రుడు ఓడిపోయాడు. ఈ జయాపజయాలు పరమేశ్వరలీలలు! అయితే కాలం ఎప్పుడూ ఒక్క తీరున ఉండదు. బలి ధర్మాత్ముడు. బలప్రయోగంతో బలిని జయించడం ఎవ్వరి తరం కాదు. పరిష్కారం భగవంతుడి చరణసేవ. నీవు ఆ పరమేశ్వరుని ఆరాధించు. ఆయన దయ అపారం. నీకు శుభం కలుగుతుంది.'' అన్నాడు కశ్యపుడు.

ఆయన విష్ణుదేవుని ప్రీతికై వ్రతమొకటి భార్యకు ఉపదేశించాడు. ఫాల్గుణమాసం శుక్లపక్షం నుండీ పన్నెండు దినాలు హరివాసరాలుగా ఆమెవ్రతం చేసింది. ఆమె వ్రతనిష్ఠకూ, భక్తి ప్రపత్తులకూ మహా విష్ణువు కరుణించి దర్శనం కలిగించాడు.

సంతోషాశ్రువులు వరదలై పారగా అదితి ముకుళిత కరాలతో ''తండ్రీ! నీదర్శనం మంగళకరం. శుభావహం. కడుపుతీపితో స్వార్థపూరితమైన నా ప్రార్థన మన్నించు దేవదేవా!'' అంది.

''అమ్మా! బలిసాధువు. ధార్మికుడు. బలంతోగెలువ రాదు. నయంతో వినయంతో గెలువవలె. నేను నీకు కొడుకునై పుట్టి నీ ముచ్చట తీరుస్తా. చింతమాను. తల్లీ!'' అని భగవంతుడు అదృశ్యుడైనాడు.

కశ్యపుడు, తన భార్యవలన విషయం తెలుసుకున్నాడు. తదనుగుణమైన మహావీర్యం ఆయన అదితి గర్భంలో నిలిపాడు. శ్రావణ ద్వాదశినాటి మధ్యాహ్నం, గ్రహస్థితిగతులు శుభంగా ఉన్న అభిజిత్ లగ్నంలో పరమేశ్వరుడు శిశువై వారికి జన్మించాడు.

కాలోచిత కర్మకలాపాలు పెద్దల సమక్షంలో ఆబాలుడికి వారు నిర్వర్తించారు. ఐదేండ్ల వాడుకాగానే ఉపనయనం చేశారు. ఆశుభ సమయంలో సవిత సావిత్రీమంత్రం ఉపదేశించాడు: బృహస్పతి యజ్ఞోపవీతాన్నీ, కశ్యపుడు ముంజినీ, అదితి కౌపీనాన్నీ, భూమాత కృష్ణాజినాన్నీ, చంద్రుడు దండాన్నీ, గగనదేవత గొడుగునూ, బ్రహ్మ కమండలాన్నీ, సరస్వతి అక్షమాలనూ, సప్తర్షులు కుశపవిత్రాలనూ, ఆచిన్ని వటువునకు సమర్పించారు.

ఆవటువునకు పరమేశ్వరుడొక పాత్రనిచ్చి అక్షయం అనగానే అన్నపూర్ణామాత భిక్షపెట్టింది.

నాలుగు వేదాలు సాంగోపాంగంగా ఆవటువు నేర్చాడు. బలియజ్ఞశాలకు వెళ్లేందుకు అన్ని విధాలా సిద్ధం అయ్యాడు. మహోదారమైన తేజస్సుతో వెలిగిపోతూ, బాలసూర్యుడు నేలమీద నడచి వస్తున్నట్లుగా వామనుడు బలి యాగశాల ప్రవేశించాడు.

అలా ప్రవేశించిన అతడు కొందరతో వేదాలు పఠించాడు. కొందరతో తర్కంచేశాడు. ఇంకొందరితో శాస్త్రచర్చ గావించాడు. కొందరితో మంత్రాలు వల్లించాడు. యజ్ఞశాలలో అందరిలో తానై తనలో అందరూనై చిత్రంగా ఆవటువు సంచరించాడు. చివరకు బలిని సమీపించాడు.

''ముల్లోకాల శాసనకర్తకు స్వస్తి! నిరంతరదానవ్రత దీక్షాపరునకు స్వస్తి!'' అని వామనుడు బలిని చేయెత్తి దీవించాడు.

వేదమూర్తి వలె ప్రకాశిస్తున్న ఆ వటువును బలి చకితుడై చూశాడు. అప్రయత్నంగా నమస్కరించాడు.

''మంగళంనీకు కలుగుతుంది మహాబలీ!''

బలిచక్రవర్తి ఆ వటువునకు ఆసనం ఇచ్చి కూర్చోమన్నాడు. తనభార్య వింధ్యావళి బంగారు కలశంలోని నీరు పోస్తూండగా, ఆ వటువు పాదకమలాలను కడిగి, ఆ పాదోదకం తన శిరస్సున బలి చల్లుకున్నాడు.

''ఇలా వచ్చి నా యాగశాలనూ, నన్నూ పునీతం చేసిన నీవెవరు? నీకేంకావాలి? చూడగా బ్రహ్మచారివి. సంపదకావలెనా! కామినుల కోరుతున్నావా? భూమిని వాంఛిస్తున్నావా? నీకేంకావాలో చెప్పు. ధైర్యంగా చెప్పు. ఈ ధరణి యావత్తు నీపాదాల ముందు ధారపోయమంటావో, ఏదోనీకామితం చెప్పు బ్రహ్మచారీ!''.

''నేనం ఎవరినని నీకు చెప్పగల చక్రవర్తీ? అందరివాడనం! అన్నిచోట్లా నావే! తిరుగుబోతునునేను. ఒంటరివాడను. పూర్వం ఒకప్పుడు సిరిగలవాడను. నా సరిలేని వాడను. ఇప్పుడు మూడడుగుల నేల దానం చేశావా బ్రహ్మానందం పొందగల!''

''దాత తాహత్తును తెలుసుకుని గ్రహీత కోరవలె. మూడడుగుల నేల కోరడం చూస్తే నన్ను చిన్న బుచ్చడంవలె ఉంది., అదేకాదు. ఈరథ గజతురగ పదాతులతో సహా ఈ భూఖండానికి నిన్ను ఏలిక చేయగల. మళ్లీ ఒకమారు ఆలోచించి కోరు. మరో అవకాశం ఇస్తున్నా!'' అని బలిచక్రవర్తి నవ్వాడు.

వామనుడు ప్రసన్నంగా నవ్వి, ''నేను బ్రహ్మచారిని. తృప్తి పొందడం బ్రాహ్మణ లక్షణం. రాజుకుమల్లే బ్రాహ్మణుడు అసంతృప్తుడు కారాదు. ఈరాజ్యాలూ, సంపదలూ నేనేం చేసుకోను? సంతుష్టుడే పూజ్యుడూ! సుఖికూడా! నా అవసరంమించి కోరడం ధర్మసమ్మతం కాదు. నేను కోరిన పదత్రయం ధారపోశావంటే, అదే మేరువని సంతోషింపగల!'' అన్నాడు.

''నీభాగ్యానికి నేనేం చేయగల? అల్లాగే తీసుకో!'' అంటూ అతడు సంకల్పం చేయడానికి నీళ్ళు అందుకోబోయాడు.

ఇంతలో శుక్రుడు అక్కడకు వచ్చాడు.

''కొంపమునిగి పోయింది నాయనా బలీ! ఈ పొట్టివటువు ఎవరనుకున్నావు? ఎంతమాత్రం నీవు ఈదానం ఇవ్వకు. మూడడుగుల నేలేం ఖర్మ? ఒఖ అడుగుతో ముల్లోకాలుసరి. రెండో అడుగుతో నీకున్నదంతా కొలిచేస్తాడు. మూడో అడుగునీవు ఇవ్వలేవు. ఎక్కడ ఉందీనీకు ఇచ్చేందుకు? సర్వం విష్ణార్పణం చేసి ఎల్లా బతుకుతావు తండ్రీ? నామాట విను. ఈపొట్టివాడికి బిచ్చం పెట్టకు. సర్వనాశనం కలిగే దానం ఇవ్వకపోవడం వల్ల అసత్యదోషం రాదు. స్త్రీ విషయంలోనూ వివాహాల్లోనూ, ప్రాణవిత్తమాన భంగాలు కలిగే విషమ పరిస్థితుల్లోనూ అసత్యం దోషంకానేకాదు. ఈమాయావికి దానం లేదని చెప్పు!'' అని శుక్రుడు హితం చెప్పాడు.

బలిచక్రవర్తి ఒక నిముషం పాటు గంభీర మౌనం వహించాడు. కృతనిశ్చయుడైనటుల తల పంకించాడు.

''భగవాన్! నన్ను క్షమించాలె! మీరు చెప్పే హితం సాధువుగా అనిపించడంలేదు. భూమాత ఎందరినైనా భరిస్తుందిట. అయితే ఒఖ అసత్యవాదిని మోయలేదట. ఎందరు రాజులు ఈ భూమ్మీద పాలకులై ఉండలేదు? వారు ఎక్కడ ఉన్నారీనాడు? వారిలో కొందరుమాత్రమే చిరస్మరణీయులై ఉన్నారు. ఎందువల్ల స్వామీ? త్యాగం వల్లనే అమృతత్వం కలుగుతుంది. ఈ వటువు మాయలాడుకావచ్చు. లేకపోతే శ్రీమహావిష్ణువే కావచ్చు. అయితే మరీ మంచిది. విష్ణువంతటి వాడు, వామనుడై నాగుమ్మంలో, నాదానం కోసం యాచకుడై నిలిస్తే, వట్టి చేతులతో పంపడం ధర్మమా? అతడి జోలెనింపడం నీ శిష్యుని అదృష్టం కాదా మహాత్మా? ఏచేయి వరదానం చేస్తుందో, అభయం కలిగిస్తుందో, సిరుల తల్లిని లాలిస్తుందో, భక్తులకు ఆధారమైందో ఆ చేయి, నా చేయి క్రిందకు వచ్చి సజల ధారతో దానం పుచ్చుకోవలసి రావడానికి నేనెంత పుణ్యం చేసుకున్నానో కదా! గుమ్మం తట్టిన ఈ అదృష్టాన్ని ఎలా పోగొట్టుకోను? నా సర్వస్వం, – నాప్రాణం పోయినా చింతలేదు. నన్ను క్షమించండి. మీపట్ల అమర్యాద అని అనుకోవద్దు. వింధ్యావళీ! నీవెక్కడ ఉన్నావ్? ఆ జల కలశం అందుకో! ఆలస్యం చేయకు!'' అంటూ బలిచక్రవర్తి గురువుకు నమస్కరించాడు.

శుక్రుని కోపం మితిమీరింది. తన ఆజ్ఞను పాటింపని బలిని త్వరలో పదభ్రష్టుడవు కమ్మని శపించాడు.

బలి నమస్కారం చేసి గురుశాపం చిరునవ్వుతో స్వీకరించాడు.

భర్త మనస్సును గ్రహించిన ఇల్లాలు వింధ్యావళి స్వర్ణకలశంతో నీరు తెచ్చింది.

''వామనా? ఇలా కూర్చోవయ్యా! నీచిట్టి పాదాలు కడుగనియ్! నీవు కోరిన దానం పుచ్చుకుని నన్ను కృతార్థుడను చెయ్!'' అంటూ బలిచక్రవర్తి భగవంతుడయిన వామనమూర్తి చరణకమలాలను, వింధ్యావళి నీరు పోస్తుండగా కడిగి ఆపాదోదకం పావనం శుభం అని తన శిరస్సున చల్లుకున్నాడు.

సంకల్పం చెప్పుకుని వామనుని దోసిట దానజలధార పోస్తూండగా, హఠాత్తుగా ధారఆగిపోయింది. కొమ్మునుండీ నీరు రాకపోవడంతో, వామనుడొక దర్భపుల్లతోను, కొమ్ములోకి నెట్టాడు. అదృశ్యుడై శిష్యవాత్సల్యంతో కొమ్ములో చేరి ఉన్న శుక్రుడు కన్నొకటి పోగొట్టుకుని ఇవతలకు వచ్చాడు. నాటినుండీ ఆయన ఏకాక్షి. శిష్యవాత్సల్యానికి అది గురుతై భాసించింది.

''త్రిపాద ధరణీం దాస్యామి!'' అని బలిచక్రవర్తి మూడడుగలనేల వామనునకు దానం చేశాడు.

దానం గ్రహించడంతో వామనుడు త్రివిక్రముడైనాడు. అద్భుతమైన ఆ మూర్తి శిరస్సు ఆకాశం అంచుకు దాటి సత్యలోకం చేరింది. భూమి యావత్తు శరీరం అయింది. ఒక కాలి కొలతకు భూమి సరిపోయింది. రెండవకాలు క్రమంగా పైకి లేచి సత్యలోకం చేరడంతో, బ్రహ్మతన కమండల జలంతో అభిషేకించాడు. ఆ అభిషేక జలం ఆకాశగంగై ఉప్పొంగి పోతూ, ఉద్వేగంతో దేవలోకంలో ప్రవహించసాగింది.

త్రివిక్రమ దేవుని పాదపీఠం రసాతలాన్నుండీ భూమి వరకూ వ్యాపించింది. జానువులూ తొడల్లో ఇంద్రాది దేవతలూ, స్కంధంలో సంధ్యలూ, గుహ్యంలో ప్రజాపతులూ, పిరుదుల్లో దానవులూ, నాభిలో ఆకాశం, పొట్టలో సప్త సముద్రాలూ, హృదయంలో తారకలూ, ఋతువులూ ధర్మమూ, మనస్సున చంద్రుడూ, వక్షస్థలంలో సిరినీ, కంఠాన వేదాలూ, భుజాల్లో దేవతలూ, చెవులందు దిక్కులూ, శిరోజాల్లో మేఘాలు, ముక్కులో వాయువూ, కండ్లలో సూర్యుడూ, ముఖాన అగ్నినీ, మాటల్లో ఛందస్సూ, నాలుకన వరుణుడూ, కనుబొమల నిధులూ, రెప్పల అహోరాత్రాలూ, నొసట కోపమూ, అధరాలమీద లోభమూ, స్పర్శలో కామమూ, రేతంలో నీరూ, పృష్ఠభాగంలో అధర్మమూ, చూపులో యజ్ఞమూ, ఛాయలో చావూ,నవ్వులోమాయా, రోమాల్లో ఓషధులూ, నాడిలో నదులూ, గోళ్లలో కొండలూ, బుద్ధిలో బ్రహ్మ, ప్రాణంలో దేవఋషులూ, గాత్రంలో జంగమస్థావరాలూ, నాలుగు చేతుల ఆయుధాలూ, మకర కుండల కిరీట శోభాయమాన నీలనీరద శ్యామల దేహమూ, వనమాలికాది విభూషలూ కలిగిన ఆ త్రివిక్రమ స్వరూపం భయోత్పాతంగానూ, ఆశ్చర్యసమ్మోద సమ్మోహకరంగానూ కనిపించింది.

సర్వం తానైన జగన్నాథుని, వారు నతులై సన్నుతులు చేశారు. అప్పుడు హరి ఇలా అన్నాడు.

''మహాబలీ! మూడడుగులదానం ఇవ్వగలనని ఆచమనం చేశావు. భూమీ ఆకాశాలు రెండడుగులకు సరిపోయింది. మూడవ పాదం ఎక్కడ కొలుచుకోమన్నావు? చేటుచూపు!''

బలిచక్రవర్తి బలగం అయిన రాక్షస ప్రముఖులు కొందరు తమరాజును, ఆ వటువు వంచించాడనీ, తమ ఆయుధాలు తెచ్చారు.

అయితే బలి వారిని వారించాడు.

హరి కనుసన్నలు ఎరిగిన గరుడుడు, వారుణ పాశంతో బలిని బంధించాడు.

బలి చక్రవర్తి నిండుగానవ్వాడు.

''రెండడుగులతో భూమ్యాకాశాలు కొలిచి, నాసర్వస్వం ఆక్రమించిన మహానుభావుడెవరయిందీ తెలుసుకున్నాను. నాది అంటూ మిగిలింది ఏదీ లేదు ప్రభూ! అంతానీవే పుచ్చుకున్నావు. ఇప్పుడు మిగిలినది కేవలం నాశిరస్సు మాత్రమే! నాతల మీద నీమూడవపాదం కొలుచుకో!''

అలా బలి అంటూండగా అక్కడకు ప్రహ్లాదుడు వచ్చాడు. శ్రీహరికి నమస్కారం చేసి ''ఈ బలికి నీవు ఇంద్రపదవి ఇచ్చావు. ఇవాళ అదీ నీచేతులతో పుచ్చుకున్నావు. అంతాతీసుకున్న తరువాత దండించడం ధర్మమా ప్రభూ! నీవు ధర్మమూర్తివి కదా?'' అన్నాడు.

దుఃఖం మూర్తీభవించినట్లున్న వింధ్యావళి త్రివిక్రమమూర్తి ముందుకువచ్చి రెండుచేతులూ జోడించింది.

''పతిభిక్ష ప్రసాదించు ప్రభూ!'' అని ప్రార్థించింది.

''ఎవరిమీద నాకరుణ పడుతుందో, వారు నిర్ధనికులూ, నిస్సంగులూ, నిరాసక్తులూ అవుతారు. వారి ప్రాకృత సంపదలు హరించి, శాశ్వత సంపద ఇవ్వడం నాస్వభావం. అందువల్లనే బలి సంపద హరించాను. ఈ బలి సంపదగోలుపోయాడు; గురుశాపం పొందాడు, వారుణ పాశబద్ధుడయ్యాడు. అయినా ధర్మం తప్పలేదు. సత్యశీలుడూ, అకల్మషుడూ అయిన ఈ బలి సావర్ణి మన్వంతరంలో తిరిగి ఇంద్రపదవి పొందగలడు. అంతవరకూ సుతలం పాలిస్తాడు. ఈబలి గుమ్మాన్ని నేను సదా గదాపాణినై, కావలి భటుడనై రక్షిస్తుంటాను. నాయనా బలీ! నీజన్మధన్యం అయింది. నీకేం వరంకావాలో అడుగు! ఇస్తాను!'' అంటూ వామనుడు ప్రసన్నంగా నవ్వాడు.

భగవంతుని కృపమూలంగా వారుణపాశాలు పుటపుటతెగిపోయాయి. బలి సాంజలి అయి, ''నీమీద భక్తి నిరంతరం ఉండేలా అనుగ్రహించు తండ్రీ!'' అని కోరుకున్నాడు.

''నీకు మంగళం కలుగుతుంది!''

శ్రీహరి యాజకుల మధ్య కూర్చున్న ఆచార్యుని చూసి, ''భార్గవా! యజ్ఞం పూర్తిచెయ్! మధ్యలో ఆగిపోరాదు!'' అన్నాడు.

''నీవే ప్రత్యక్షం అయినప్పుడు, ఈప్రాకృతికమైన యజ్ఞం ఎందుకు ప్రభూ? యజ్ఞం, యజ్ఞేశ్వరుడూ ఎవడోవాడే సంతృప్తి పొందినపుడు వేరొక యజ్ఞంకావలెనా? అయినా నీ ఆజ్ఞమేరకు పూర్తిచేస్తా!'' అన్నాడు శుక్రుడు.

బలి భార్య వింధ్యావళితో సుతలం చేరి రాజ్యపాలనతో, శ్రీహరి చింతనతో సుఖంగా జీవించాడు.

దీపావళినాడు బలి, తన రాజ్యాన్ని తిలకించేందుకు భూమికివస్తాడని ప్రతీతి. అందుకే దీపావళితో ఆయనను ఆహ్వానించడం!



# అంబరీషుడు

సప్తద్వీప విశాల వసుంధరను అంబరీషుడు పాలించాడు. అతడు నిష్కాముడు, నిరంతరం అతని ధ్యాస శ్రీహరి చరణాలమీద నిలచి ఉండేది. తినడం తిరగడం సకల వ్యాపారాలు భగవంతుని కైంకర్యంగా భావించిన మహానుభావుడతడు.

సరస్వతీ తీర్థంలో వశిష్ఠాది మహాఋషులను ముందుంచుకుని అనేక వాజపేయాలు చేసి, అంతులేనంత ధనం పేదలకు, యాచకులకూ పంచిపెట్టి, అంబరీషుడు మహాదాత అన్న పేరు

పొందాడు.

ఐశ్వర్యం మీదా, విలాసాల మీద, చివరకు దారాపుత్రాదుల మీదా అతనికి ఇచ్ఛ పోయింది. సర్వం భగవదర్పణం చేసి, నిమిత్త మాత్ర జీవనుడైన అంబరీషునకు శ్రీమహావిష్ణువు తన చక్రం, స్మరణ మాత్రాన కనిపించేలా వరం అనుగ్రహించాడు.

ఒకసారి ఆ మహారాజు ఏకాదశీవ్రతం అనుష్ఠించాడు. ఆ వ్రతసమాప్తిలో కార్తీక ద్వాదశినాడు సుస్నానుతుడై, అభిషేకాదులతో అర్చనలు చేసి, అనేకదానధర్మాలు సలిపి బ్రహ్మసంతర్పణలు కావించాడు. తను పారణ చేయబోతున్నంతలో దూర్వాసమహర్షి అభ్యాగతిగా వచ్చాడు. రాజు, మహర్షికి ఉచితమర్యాదలు చేసి భోజనం చేయప్రార్థించాడు.

ఆ మహర్షి అంగీకరించి, స్నానార్థం యమునకు వెళ్లాడు. నదికి పోయినవాడు పోయినట్లే ఉండిపోయాడు. ఎంతకూ తిరిగి రాడు.

ద్వాదశిఘడియలు దాటుతూండడం తెలుసుకున్న రాజు చింతించాడు. పారణ చేయకపోతే వ్రతఫలం దక్కదు. అతిథిని విడచి భోజనం చేయడం కూడనిపని. ఈ సంకటస్థితిలో రాజు పండితులను ఆపద్ధర్మమార్గం చెప్పమని కోరాడు.

తలసీదళంతో ఉద్ధరిణెడు జలం పుచ్చుకుని పారణ ముగించడం ధర్మం అనీ వారు చెప్పారు. రాజు తీర్థసేవ చేశాడు.

దూర్వాసుడు అసలే ముక్కోపి. రాజు తులసీదళ జలసేవ చేశాడని తెలుసుకుని తోకతొక్కిన పాములె ముని మండిపడ్డాడు. రాజు తన స్థితిని ఎంతగా వివరించినా అతడు వినలేదు. శాంతుడుకాలేదు. రాజు చేయరానంత దోషం చేశాడని, అతడు భావించాడు. శిక్షింపవలెనను కున్నాడు. తన జటనొకటి మొదలంట ఊడబెరికి నేలకేసి కొట్టాడు. అలా కొట్టడంతో శూలధారిణి అయిన కృత్య పుట్టుకవచ్చింది. ఆ కృత్యను అంబరీషుని మీద అతడు ప్రయోగించాడు. అయితే రాజును సదారక్షిస్తున్న సుదర్శన చక్రం అడ్డు నిలచింది. క్షణమాత్రంలో కృత్యను భస్మం చేసి, దూర్వాసుని వెంటపడిందా సుదర్శనం.

భయంతో వణకి పోతూ దూర్వాసుడు పరుగులు తీశాడు. చక్రం వదల్లేదు; చంపలేదు. చక్రం తరుముతూండగా రక్షణకోసం ఆముని ముల్లోకాలూ తిరిగాడు. ఆయాదేవతల పాదాలు పట్టుకున్నాడు. చివరకు శ్రీహరి దగ్గరకూ వచ్చాడు. చక్రధారనుండీ తప్పింపమని వేడుకున్నాడు.

శ్రీహరి నవ్వుతూ, ''ఇది నేను ప్రయోగించిన చక్రం కాదు. ఎవరు ప్రయోగించారో, వారే చక్రాన్ని ఉపసంహరించగలరు.'' అన్నాడు.

దూర్వాసుడు, దంభం విడచిన వాడై, విధిలేక సాధువై, దీనుడై అంబరీషుని పాదాల మీదపడి కాపాడవేడుమన్నాడు.

ఆరాజు ఆమునిని లేవనెత్తి, ఆసనమ్మీద కూర్చుండచేసి చక్రాన్ని ప్రార్థించాడు.

''ఎవరు శ్రీపతి ఆజ్ఞానుసారంగా సంచరిస్తున్నారో వారికి నానుతులు. ఎవరు అగ్నిరూపమో, ఎవరు సంహారక రూపమో, ఎవరు రక్షణా రూపమో, ఎవరు బ్రహ్మస్వరూపమో వారికి నా శత సహస్ర ప్రణామాలు. ఈ మునిని కాపాడ్డం ధర్మం. ధర్మమూర్తి ఆ భగవంతుడు. ధర్మానుసరణ భక్తుల విధి!'' అని అంబరీషుడు నమస్కరించాడు.

చక్రం ఎలా వచ్చిందో, అలా అదృశ్యం అయింది.

''నీ మనస్సునవనీతం! నీదయ అపారం! నీలో రాగం, ద్వేషం, రోషం ఏమీ లేవు. వీటిని జయించావు. అందువల్లనే ఆ దయాళువుకు ఇంత దగ్గర వాడవయినావు; నన్ను క్షమించావు. నిన్ను అణచేందుకు శక్తినొకటి, నేనోశక్తివంతుడనని నీమీద ప్రయోగించానా? అయితే ఏమయింది మహానుభావా? నేను శక్తిహీనుడనని తేలింది. ఇంత తపం చేసినా కోపాన్ని అణచుకోలేక, నీమీద కక్షకడితే, నీవు వీతరాగుడవై నన్ను రక్షించావు. నామీద నీకు కోపంలేదు పైగా నాకీ ఆసనం, ఆతిథ్యం ఇస్తున్నావు. నీముందు నేనో అణువును; రేణువును! తలవంచి నీకు నమస్కరిస్తున్నాను!'' అని ముని నమస్కరించాడు.

''మీరు తపస్సంపన్నులు! నాకు నమస్కరించి చిన్నబుచ్చకండి. పదండి! మీకు కడుపారవిందు చేయనీయండి. ఆ తరువాత మాటాడుకుందాం!'' అని అంబరీషుడు ఆమునికి గొప్ప విందు చేశాడు.

అంబరీషుడు తన శేషజీవితం శేషశయానుని భక్తితో గడిపాడు.



# భార్గవరాముడు

గాధిరాజుకూతురు సత్యవతి. ఈ సత్యవతిని పెండ్లాడవలెనని మహర్షి రుచికునకు కోరిక కలిగింది. ఆయన గాధికి తనకోరిక తెలిపాడు. గాధి తానొక రాజు కావడం మూలాన, పేదవాడయిన రుచికునకు తన కూతురును ఇచ్చేందుకు సందేహించాడు. అయితే మహర్షికోరికను నిరాకరింపలేదు.

మేలు జాతి గుర్రాలొక వేయింటిని కన్యాశుల్కంగా ఇవ్వగలిగితే వివాహం నిరభ్యంతరంగా జరుగుతుందని రాజు మెలిక పెట్టాడు. అన్ని గుర్రాలు ఆపేదముని ఎటూ తేలేడు. అందుచేత తనకు తానే విరమించుకుంటాడని రాజుఉద్దేశం.

రుచికుడు వరుణ దేవుని ప్రార్థించాడు. వరుణుని కృపవలన వేయిగుర్రాలు ఆయన పొందాడు. అవి తీసుకుని గాధికి ఇచ్చాడు. గాధి విధిలేక, మరే షరత్తూ పెట్టలేక, సత్యవతిని రుచికునకు ఇచ్చి పెండ్లి చేశాడు.

రుచికుడు మహాతపస్వి. గాధిరాజు భార్య, తనకొక కొడుకును ప్రసాదించమని ప్రార్థించింది. సత్యవతి కూడా కొడుకును కోరింది.

ఆయన విప్రులకూ, క్షత్రియులకూ తగిన విధంగా కొడుకులను పొందగలందులకు మంత్ర పూతమైన చరువులను సిద్ధంచేసి, సంధ్యోపాసనకు నదికి వెళ్లాడు.

ఇంతలో సత్యవతిని ఆమె తల్లి తొందరించింది. ఆ తొందరలో నయితేనేమి, తెలీకపోవడం వల్ల నయితేనేమి, విధి విధానం వల్లనయితే నేమి; ఆ చరువులను తారుమారు చేసి బ్రహ్మమంత్రపూతమైన చరువును, తల్లికి ఇచ్చి క్షత్రియోచితమైన చరువును తాను పుచ్చుకుంది.

స్నానానంతరం రుచికుడు వచ్చి, చరువులు లేకపోవడం చూసి సత్యవతిని అడిగాడు.

ఆమె చేసిన పని ఆయనకు చెప్పింది.

ఆయన నవ్వాడు. ''నీకొక క్షాత్రగుణాలు కలిగిన కొడుకు పుడతాడు. మీ తల్లి బ్రహ్మవేత్తను కంటుంది!'' అన్నాడు.

సత్యవతి తన తొందర పాటుకు చింతించి, భర్తపాదాల మీద పడింది. ఆయన ప్రసన్నుడై ''నీకొడుకు బదులు, నీమనుమడు క్రూర క్షాత్ర తేజుడౌతాడులే!'' అని సర్ది చెప్పాడు.

వారికి పుట్టిన కొడుకు జమదగ్ని.

గాధికి పుట్టిన కొడుకు గాధేయుడు బ్రహ్మజ్ఞాని విశ్వామిత్రుడు. సత్యవతి, కేశికినది అయి ప్రసిద్ధి పొందింది. ఈ నదినే సత్యవతీనది అనీ అంటారు.

జమదగ్ని రేణువుకూతురు రేణుకను వివాహం చేసుకున్నాడు.

రేణుకా జమదగ్నులకు రాముడు పుట్టాడు. ఆయన ఈశ్వరోపాసన చేసి, మెప్పించి, అస్త్రశస్త్రాలనూ, పరశునూ పొందాడు. ఈ పరశువు మూలంగానె పరశురాముడుగా ఆయన ఖ్యాతి పొందాడు.

హైహయ రాజు అయిన అర్జునుడు దత్తాత్రేయుని ఆరాధించాడు. ఆ ఫలితంగా అణిమాది శక్తులనూ, వేయి చేతులనూ, అనేక అస్త్రశస్త్రాలనూ, అంతులేని సిరిసంపదలు అతడు పొందాడు. ఆ వరబలకారణంగా అతనికి పోరాని, రారాని చోటు లేకపోయింది. బలోపేతుడు కావడంతో ఎందరో రాజులను గెలిచి, మహారాజయ్యాడు.

దిగ్విజయ యాత్ర చేస్తున్న రావణునీ, అతని సైన్యాన్నీ ఒకసారి రేవానది ముంచింది. రావణుడు కోపించాడు.

''ఇంతటి ముంపు హఠాత్తుగా ఎల్లా వచ్చిందీ?'' అని అతడు విచారించాడు.

మహాబాహుడూ, మహాబలుడూ అయిన కార్తవీర్యార్జునుడు, తన దేవేరులతో రేవానదిలో స్నానం చేస్తున్నాడు. అతడు ఉబుసుపోకకు, తన వేయిచేతులతో రేవానదిని అడ్డుకున్నాడు. అలా చేయడం వల్ల నది పొంగింది. తనను నీళ్లల్లో ముంచాడన్న కోపంతో రావణుడు, అర్జునుని మీదకు యుద్ధానికి వచ్చాడు.

ఆయుద్ధంలో అర్జునుడు, రావణుని జుత్తు పట్టి మోకాళ్లమీద తలను తాకించి, నేలమీద రెండు చేతులూ పెట్టించి, నాలుగు కాళ్ల జంతువని, నడ్డిమీద తన్ని గేలిచేసి విడచాడు. రావణుడు శరణు కోరి చావుతప్పి కన్ను లొట్టబోయిన విధంగా ఇల్లు చేరాడు. మరెప్పుడూ, తను ఉన్నఛాయలకైనా రావద్దని రావణుని శాశించి, అర్జునుడు విడచి పెట్టాడు.

ఆ రాజు వేటకని పోయి చాలసేపు వేటాడి అలసి పోయాడు. దాహపీడితుడై అతడు జమదగ్ని ఆశ్రమం చేరాడు. జమదగ్ని ఆ రాజుకు సకల మర్యాదలు చేశాడు. హోమధేనువు సాయంతో ఆ రాజునూ, అతని పరివారానికి ఆకలి తీరేలా గొప్ప విందుచేశాడు జమదగ్ని.

విందు భోజనం చేసిన తరువాత, అర్జుననకు ఆ హోమధేనువు మీద కన్నుపడింది: మమకారం పెరిగింది. అంతటి అపురూపమైన వస్తువు తనకులేక పోవడం అవమానంగా తోచింది. తన సైనికులకు ధేనువును బంధింపమని ఆజ్ఞాపించాడు. జమదగ్ని ఎంతవేడుకున్నా, రాజుకనికరింపలేదు. పైగా హేళనగా నవ్వి తన నగరానికి వెళ్లాడు.

జమదగ్ని తపస్సంపన్నుడైనా, నిష్కామి కనుక రాజు పై ప్రతీకారం తలపెట్టలేదు.

పరశురాముడు వచ్చి సంగతి తెలుసుకున్నాడు.

''ఈరాజు ఎంతనీచుడు కాకపోతే, తిన్న ఇంటి వాసాలు లెఖ పెట్టి పోతాడు? వీడికి బుద్ధి చెప్పవలసిందే! అధర్మం సహించడం పాపం అవుతుంది!'' అని పరశువును ఎత్తి మాహిష్మతి చేరి సింహగర్జన చేశాడు పరశురాముడు.

ఎత్తిన పరశువుదించకుండా, ప్రళయకాలరుద్రుడై పరశురాముడు, వేయిచేతులతో సహా అర్జునుని అరటి చెట్టును నరికినట్లు నరికి పోగులు పెట్టాడు. దత్తాత్రేయ వరప్రభావం కూడా అతన్ని కాపాడ లేక పోయింది. ధర్మం తప్పిన వాడికి దైవబలం ఉండదు. అటువంటి వాడిని దైవం అపరోక్షంగా శిక్షిస్తుంది.

తన పరశుకు ఎదురులేక పోవడంతో, ధేనువును విడుదల చేసి ఆశ్రమానికి తీసుకవచ్చాడు రాముడు.

జమదగ్ని రాముని వలన విషయం తెలుసుకుని విచారించాడు.

''లోకాల పాలనకు రాజు అవసరం అని భగవన్నిర్ణయం నాయనా! రాజు ఎంత పాపం చేసినా, రాజును శిక్షించపకూడదు. క్షమవహించడం అన్నివ్రతాల కన్నా శ్రేష్ఠమైంది రామా!'' అంటూ ఆయన మందలించాడు.

''నీవు చేసిన పాపానికి నిష్కృతి కోసం ఓ సంవత్సరకాలం తీర్థయాత్రలు చేసిరా!'' అనీ ఆయన కోరాడు.

తండ్రి ఆజ్ఞను పాటించి, పరశురాముడు తీర్థయాత్రలకు బయలుదేరాడు. ఆయన ఆసేతు సీతాచలంలో గల పుణ్యక్షేత్రాలు దర్శించి, పుణ్య తీర్థాల్లో నీరాడి తిరిగి ఆశ్రమం చేరాడు.

ఒకనాటి ఉదయవేళ రేణుకాదేవి గంగకు నీళ్లకై పోయింది. ఆసమయంలో చిత్రరథుడు, దేవేరులతో స్నానం చేస్తున్నాడు. వారి ఆటపాటలను చూస్తూ మురిసి పోతూ రేణుక అక్కడ కొంతసేపు ఉంది.

జమదగ్ని ఆమె ఆలస్యానికి కారణం తెలుసుకుని కోపించాడు. తనకుమారులను పిలిచి తల్లిని చంపమన్నాడు ఆయన.

వారు తల్లిని చంపేందుకు అంగీకరించలేదు. సోదరులతోసహా తల్లిని చంపమని పరశురాముని కోరాడు. రాముడు, పరశునుఎత్తి మారుమాట లేకుండా అందరనూ సంహరించాడు.

జమదగ్ని అభినందనతో కుమారుని చూసి వరం కోరుకోమన్నాడు. పరశురాముడు తండ్రికి నమస్కరించి తల్లినీ, సోదరులనూ పునర్జీవులుగా చేయమన్నాడు.

తపోధనుడయిన జమదగ్ని వారినందరనూ బతికించాడు.

తండ్రి తపశ్శక్తి తెలియడం వల్లనే, రాముడు అంతపని చేశాడు కానీ ఆయన కంతటి శక్తి లేనపుడు అంతదారుణం ఆయన చేసి ఉండడేమో?

ఆ నాటి యుద్ధంలో కార్తవీర్యార్జునుడు చావడమూ, అతని కొడుకులు శృంగభంగం పొందడం జరిగిందికదా! ఆ అవమానాన్ని వారు మరచిపోలేదు. తగిన సమయం కోసం ఎదురుచూస్తున్నారు. వారు కోరుకున్న సమయం ఒకరోజు రానేవచ్చింది.

జమదగ్ని ఒంటరిగా తపస్సు చేసుకుంటూ వారికంటపడ్డాడు. కొందరు కత్తులు దూసి ఆయన గొంతుతరిగారు. జుత్తు పట్టుకుని ఆయన తలను తీసుక పోతూండగా రేణుక వారికి ఎదురయింది. ఆమెరోదనం అరణ్యరోదనం అయింది.

''రామా! ఎక్కడ ఉన్నావయ్యా? మీ తండ్రిని ఇంతదారుణంగా వధించిన దుర్మార్గులను దండింపరావేమయ్యా?'' అంటూ ఆమె గొంతెత్తి అరచింది.

నిస్సహాయులైన రామ సోదరులు తల్లిని ఊరడింప ప్రయత్నించారు.

ఇంతలో అక్కడకు రాముడు వచ్చాడు. తండ్రి కళేబరం భద్రం చేయమని చెప్పి పరశును ధరించి ప్రళయ తాండవరుద్రుడై బయలు దేరాడు.

అర్జునుని కొడుకులతో పాటు, వారికి సాయం వచ్చిన నానాదేశరాజులను ఆయన సంహరించాడు. ఆ సంహారంలో కళేబరాలు కొండలంతగా పోగులు పడ్డాయి. రక్తం నదులై ప్రవహించింది. ఇరవై ఒక్క సార్లు ఆయన రాజులను నరికి పోగులు పెట్టాడు. భూమ్మీద రాజన్న ప్రతివాడినీ ఆయన వధించాడు. అప్పటికి ఆయనలో తీవ్ర ప్రతీకారం చల్లారింది.

శమంతక పంచకంలో తొమ్మిది మడుగులు చేసి రాజుల రక్తంతో నింపాడు. తండ్రితలను తెచ్చి కళేబరంతో అతికించి బతికించాడు. అక్కడ ఆయన సర్వదేవమయం అయిన యాగం చేసి సరస్వతీ నదిలో అవభృథ స్నానం చేసి, తాను సంపాదించిన యావత్తూ భూమికి దానం చేశాడు. తూర్పుభాగం హోతకూ, పశ్చిమ భాగం అధ్వర్యునకూ, ఉత్తరదేశం ఉద్గాతకూ, దక్షిణం బ్రహ్మకూ, మధ్యప్రదేశం కశ్యపునకూ రాముడు దానం చేశాడు.

భూమిని ఇతరులకు దానం ఇవ్వడం వలన పరశురాముడు మహేంద్ర పర్వతం చేరి, శాంతుడై, తపస్వి అయి కాలం గడిపాడు.



# శ్రీరామకథ

వేదవేద్యే పరే పుంసీ జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాద్రామాయణాత్మనా!

వేదాల చేత తెలుసుకోదగిన మహా పురుషుడు, దశరథుని కొడుకై పుట్టగా, ఈ వేదాలు వాల్మీకి శిశువై సాక్షాత్తూ రామాయణమై అవతరించింది.

గంగకు ఉత్తరంలో కోసలదేశం ఉంది. ఈ దేశానికి రాజధాని అయోధ్య. అయోధ్య అంటే యోధులకూ సాధ్యంకానిది అని అర్థం.

ఈ అయోధ్యకు రాజు దశరథుడు. ఆయన కులగురువు మహర్షి వశిష్ఠుడు. కౌసల్య, సుమిత్ర, కైకేయి అనే ముగ్గురు భార్యలు. ఈ ముగ్గురు భార్యలూ నిస్సంతులు. వయస్సు కొంచెం కొంచెం పైన పడుతున్నా, వంశోద్ధారకుడు లేకపోవడం రాజుకు చింతగా ఉండేది.

గురువు వశిష్ఠుడు ఎన్నోయాగాలూ, యజ్ఞాలూ చేయించాడు. ఋష్యశృంగుని అధ్వర్యంలో పుత్ర కామేష్టి యజ్ఞం దశరథుడు నిర్వహించాడు. ఆ యజ్ఞ గుండంనుండీ అగ్నిహోత్రుడు ప్రత్యక్షమై పాయసం ఇచ్చి "నీ భార్యలకు పెట్టు! నీ కోరిక నెరవేరుతుంది!" అని అనుగ్రహించాడు.

దశరథుడు సంతోషంతో పాయసాన్ని తన భార్యలకు ఇచ్చాడు. పాయసం పుచ్చుకున్న అతని భార్యలు, దైవానుగ్రహం వలన గర్భాలు ధరించారు.

కౌసల్యకు శ్రీరాముడు, సుమిత్రకు లక్ష్మణశతృఘ్నులూ, కైకకు భరతుడూ జన్మించారు.

మహర్షి వశిష్ఠాశ్రమంలో రాకుమారులు విద్యావంతులూ, వీర్యవంతులూ, తేజోవంతులూ అయ్యారు.

ఉన్నట్టుండి ఒకనాడు విశ్వామిత్ర మహర్షి రాజసభకు వచ్చాడు. తాను చేయబోతున్న యాగసంరక్షణార్థం శ్రీరాముని పంపమని రాజును కోరాడు ఆయన.

రాజుగొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్టు అయింది. తనకు లేకలేక పుట్టిన గారాల రాముని, అందులో బాలుడయిన వాడిని యాగం రక్షించే నెపంతో భయంకర రాక్షసుల మీదకు పంపమని ఈ ముని అడుగుతాడేం? అలా అడిగేందుకు ఆయనకు నోరెలా వచ్చింది? ఆ పనికి తనూ, తనబలగం చాలదా?

అదే పైకి విశ్వామిత్రునకు రాజు చెప్పాడు.

మహర్షి వశిష్ఠుడు కలుగజేసుకుని నచ్చచెప్పిన మీదట దశరథుడు రాముని విశ్వామిత్రుని వెంట పంపేందుకు అంగీకరించాడు. రాముని వెంట లక్ష్మణుడూ బయలుదేరాడు. చిన్నతనాన్నుండీ రామలక్ష్మణుల స్నేహసౌభ్రాతృత్వాలు విడదీయలేనంత దృఢంగా పెనవేసుకున్నాయి. అల్లాగే భరత శతృఘ్నులు!

వారు అలా అడవుల పట్టి ఆ రాత్రి ప్రయాణం సాగించారు. రాత్రికి సరయూతీరంలో వారు నిద్రించారు. పడుకునే ముందు మహర్షి ఆ రాకుమారులకు బల అతిబల మంత్రాలను

ఉపదేశించాడు. ఈ మంత్ర బలం వల్ల, ఎవ్వరు గానీ, ఎటువంటి ఆపద కలిగించలేరని మహర్షి చెప్పి, వారిని ఆశీర్వదించాడు.

వారు అడవిలో నడుస్తూండగా, సుందుడి భార్య తాటకి ఎదురయింది. దానికి వేయి ఏనుగుల బలం. విశ్వామిత్రుని ఆజ్ఞతో శ్రీరాముడు తాటకను వధించాడు.

ఆరాత్రి అక్కడేవారు విశ్రమించి, తిన్నగా మరునాటి ఉదయం ప్రయాణం సాగించి సిద్ధాశ్రమం చేరారు. సిద్ధాశ్రమంలోనే విశ్వామిత్రుని కాపురం.

ఆ మరునాటి ఉదయవేళ, రామలక్ష్మణులను దగ్గరకు తీసుకుని మహర్షి ఇలా అన్నాడు.

''నేను పూర్వాశ్రమంలో రాజునే! ఎన్నో దివ్యాస్త్రాలు, శస్త్రాలూ అప్పుడు సంపాదించాను. నేడు నాకు వాటి అవసరం లేదు. ముక్కు మూసుకుని తపస్సు చేసుకునే నాకు, ఆ ఆయుధాల ప్రయోజనం ఏముంది? మా వంటి వారిని రక్షించేందుకు మీరున్నారాయె. అవి మీకు నేర్పుతాను.''

విశ్వామిత్రుడు తాను నేర్చుకున్న దివ్యాస్త్రాలన్నింటినీ ఆరాజ కుమారులకు సమంత్రంగా ఉపదేశించాడు. ఆయా అస్త్ర దేవతలు ప్రత్యక్షమై, పరిపూర్ణంగా శ్రీరాముడి వశం అయ్యామన్నారు.

మహర్షి యాగ దీక్ష పుచ్చుకున్నాడు. యాగ సంరక్షణకు శ్రీరామ లక్ష్మణులు సర్వసన్నద్ధులై ఉండగా యాగాగ్నిలో ధూమం పైకి లేచింది. అది రాక్షసుల రాకకు సంకేతం. ఇంతలో మారీచ సుబాహువులు కుండలతో నెత్తురు తెచ్చి యాగకుండంలో కుమ్మరించ సాగారు.

శ్రీరాముడు వింట బాణం సంధించి మారీచుని నూరామడల దూరానికి తరిమి కొట్టాడు. మరొకబాణంతో సుబాహువును సంహరించాడు. అలా రాక్షసుల బెడద తొలగిపోవడంతో యజ్ఞం నిర్విఘ్నమైంది. విశ్వామిత్ర మహర్షి అవభృథస్నానం చేస్తుండగా, మిథిలారాకుమారి స్వయంవర వార్త వారికి అందింది.

మిథిల రాజు జనకుడు. అతడు తన అయోనిజ అయిన కూతురును వీర్యశుల్కగా చేశాడనీ, శివధనుస్సు విరచిన వారికి పాణిగ్రహణం జరుగుతుందనీ ఆవార్త.

త్రికాల వేది అయిన విశ్వామిత్రుడు, రాకుమారులతో మిథిలకు ప్రయాణమయ్యాడు.

మిథిలకు చేరబోతుండగా నిర్జనమై, జీవరహితమైన ఓ ఆశ్రమం వారికి కనిపించింది. శ్రీరాముడు ఆశ్చర్యంతో ఆ వంక చూశాడు.

''ఇది గొప్ప తపస్వి అయిన గౌతమాశ్రమం శ్రీరామా! ఆయన భార్య అహల్య. బ్రహ్మదేవుని కూతురు. అసమాన లావణ్యవతి. ఇంద్రుడు కామమోహితుడై, గౌతమ మహర్షి వేషంలో వచ్చి, ఆయన లేనప్పుడు, అహల్య పొందు కోరాడు. ఆ వచ్చినవాడు, ఆమె, తనభర్తగనే తలచింది. ఆ తల్లిలొంగి పోయింది. స్నానం కోసం వెళ్లిన ముని అకాలం అని తెలుసుకుని, కాలకృత్యాలు తీర్చుకోకనే ఆశ్రమం తిరిగి వచ్చాడు. ఇంద్రుడు ఆడిన ఈ అకృత్య నాటకం ఆమునికి అర్థం అయింది. అహల్య పాప పంకిలంలో తలమునకలయింది.''

"అగ్నివలె పవిత్రుడయిన ఆ ఋషి, ఇంద్రుని నపుంసకుడవు కమ్మని శపించాడు. అహల్యను ఒక పాషాణం చేసి, విరక్తుడై తపస్సుకు హిమాలయం ఆయన వెళ్లిపోయాడు. దిక్కులేని అహల్యకు విమోచనం కలిగే సమయం ఆసన్నమయింది. తండ్రీ! అదృశ్యంగా తపోగ్నికి కాలుకపోతున్న ఆమెను ఉద్ధరింపవలసిన వాడు రానే వచ్చాడు!" అన్నాడు విశ్వామిత్రుడు.

ఆశ్రమంలోని ఆ పాషాణమ్మీద శ్రీరామ పాదం సోకగానే అహల్యకూ, ఆశ్రమానికీ శాపం తీరిపోయింది. ఇంతలో గౌతమ మహర్షి అక్కడకు వచ్చాడు. పులుకడిగిన ముత్యంలా వెలిగిపోతున్న అహల్యను మహర్షి మన్నించాడు.

ఆ దంపతులు, ఆ వచ్చిన అతిథులకు, అర్ఘ్యపాద్యాలు ఇచ్చి సత్కరించారు.

మిథిలను చేరిన శ్రీరామలక్ష్మణులనూ, మహర్షినీ చూచి జనకుడు ఎంతో సంతోషించాడు. వారికి వసతులు ఏర్పాటు చేయించాడు.

రాజసభలో ఎందరో రాకుమారులు శివధనుస్సునూ, తలలూ ఎత్తలేక అవతలకు వెళ్లారు.

విశ్వామిత్రుడు అంగీకార సూచనగా శ్రీరాముని వంక చూశాడు. శ్రీరాముడు, ధనుస్సుకు నమస్కరించి, అవలీలగా ఎత్తి, అల్లెత్రాడును బిగించబోతుండగా, అది రెండుముక్కలయింది.

జనక మహారాజు ఈ సంతోషకరమైన వార్తను క్షణాల్లో అయోధ్యకు తెలిపి, సీతారాముల పెండ్లికి తరలి రమ్మని దశరథుని ప్రార్థించాడు.

దశరథ మహారాజు, తన దేవేరులతో, పరివారంతో మిథిల చేరాడు.

ఇయంసీతా మమసుతా
సహ ధర్మచరీ తవ
ప్రతీచ్ఛ చైనాం భద్రంతే
పాణిం గృహ్ణీష్వ పాణినాం
పతివ్రతా, మహాభాగా
ఛాయేవాను గతా సదా-

అంటూ జనకుడు శ్రీరామునకు కన్యాదానం చేశాడు. ఈ మంత్రం నేటికీ మన వివాహాల్లో పురోహితులు చెబుతూంటారు.

ఊర్మిళను లక్ష్మణునకూ, మాండవీ శృతకీర్తులను భరత శతృఘ్నులకూ అదే వేదికలో జనకుడు వివాహం చేశాడు.

అయోధ్యలో తన వెంటతీసుక పోయిన శ్రీరామలక్ష్మణులను శుభసమయంలో దశరథునకు అప్పగించి, విశ్వామిత్రమహర్షి తన తోవన తాను వెళ్లిపోయాడు.

పెండ్లివారు సంతోషంగా అయోధ్యకు వెళుతూండగా భార్గవరాముడు ఎదురయ్యాడు. ఆయనను చూసి దశరథుడు కలత చెందాడు. శుభమా అని నూతన వధూవరులతో ఇంటికి వెళుతూండగా

ఈ విలయం ఏమిటా అని ఆయన భయం. పరశురాముడు అనేక సార్లు రాజులను ఏరిపారవేశాడు. తనతండ్రిని చంపిన కోపం ఇంకా ఆయనను వదల్లేదా? 'అని దశరథుడు అనుకున్నాడు.

ఇంతలో పరశురాముడొక విల్లు రామునకు అందించాడు. ''శివధనుస్సు విరిచావట. ఇది విష్ణుధనుస్సు. దీన్ని విరచి లేదా వంచి నీలావు చూపు! చూస్తా!' అన్నాడు. ఆయన నేరుగా శ్రీరామునితోనే మాటాడ్డం...

పరశురాముని చేతి విల్లందుకుంటుండగా, ఆయన తేజస్సు శ్రీరాముని చేరింది. అప్పుడు, పరశురాముడు తన అవతారకాలం సమాప్తం అయిందని గుర్తించాడు.

శ్రీరామునకు నమస్కరించి, ఆయన మహేంద్ర పర్వతం చేరుకున్నాడు.

నూతన వధూవరులు, నూతనోత్సాహాలతో, కొంతకాలం సుఖంగా గడిపారు. రాజుకు రాను రాను భూమిభారం అయింది. యోగ్యుడు అయిన శ్రీరామునికి రాజ్యం అప్పగించి, తాను విశ్రాంతి పొందాలనుకున్నాడు. పరాక్రమం, శాంతం, దాంతం, కరుణా పరిపూర్ణజ్ఞానం రూపుతీర్చుకున్నట్లున్న శ్రీరాముడు తగినవాడే అని ముక్తకంఠంతో పెద్దలు చెప్పి చక్రవర్తి సంకల్పానికి బలం కలిగించారు.

ఒకటి సత్సంకల్పమే అయినా, అపుడపుడూ వికల్పం కలగడం సహజం. దీపం ప్రక్కన చీకటి ఉన్నట్లు, సద్గుణం ప్రక్కన దుర్గుణం ఉంటుంది. మంథర అనే గూని దాసీ దానికి కైక కొలువులో చనువు ఎక్కువ. కారణం అది ఆమె పుట్టింటి నుండీ వచ్చింది. కైకపుట్టింటి మీద మమకారం ఆ గూని దాసిమీద చూపుతూండేది. మంథరకు శరీరమేకాదు మనస్సుకూడా వంకర. ఈ చనువుతో, సహజదుర్గుణ రాశి అయిన మంథర కైకను ప్రలోభపరచింది. ముందెపుడో రాజు, తనకు రెండు వరాలు ఇచ్చి ఉన్నాడు. ఆ రెండువరాలు నేడు తీర్చమని కైక రాజును నిలవేసింది.

నిస్సంతుడయిన దశరథుడు మూడవభార్యగా కైకను పెండ్లి చేసుకున్నారు. ఆసమయంలో కేకయ రాజు తనకూతురు మూలంగా సంతానం కలిగితే రాజ్యాధికారం వారికి చెందవలెననీ షరతొకటి పెట్టాడు. దశరథునకు ఆసమయంలో సంతానం లేకపోవడం చేతనూ, కైకమీది ప్రేమచేతనూ, ఆ షరత్తుకు ఆయన అంగీకరించాడు. దేవదానవసంగ్రామంలో దశరథుడు దేవతలకు సాయం చేశాడు. ఆయుద్ధంలో తనవెంట వచ్చిన కైక రాజును ఆదుకుంది. ఆ కృతజ్ఞతతో రాజు ఆమెకు రెండువరాలు కోరుకోమన్నాడు. ఆమెకు ఆ వరాలు కోరుకునేందు అవసరం కనిపించని కారణంగా, అప్పుడు కోరక, మరెప్పుడయినా కోరుకుంటానని చెప్పింది.

ఇప్పుడు మంథర దుర్మంత్రాంగం మూలంగా కైక ఆరెండు వరాలూ కోరుకుంటానని చెప్పింది. కుతంత్రం తెలియని రాజు సంతోషంగా కోరుకోమన్నాడు.

ఆమె కోరిన మొదటి వరం శ్రీరాముని పద్నాలుగేండ్లు అడవికి పంపడం, రాచపదవిని తనకొడుకు భరతునకు కట్టబెట్టడం రెండో వరం!

ఈ రెండు వరాలూ రాజుకు ప్రాణసంకటం కలిగించాయి. ఆ వరాలు ఇవ్వలేకా, వెనక్కు తీసుకోలేకా రాజు ఆరోగ్యం చెడగొట్టుకుని మంచం పట్టాడు. కైకమందిరంలో ఏర్పడిన విలయం తెలుసుకోలేక, అక్కడ రాచనగళ్లలో ఆనంద కోలాహలం సాగుతూంది. అంతకు ముందు నాటిరాత్రి శ్రీరాముడు ఉపవశించి, సంకల్పం లాంటి కార్యక్రమాలు నిర్వర్తించాడు. సీతారాములూ లక్ష్మణుడూ, వారి తల్లులూ పట్టాభిషేకం గురించిన మాటలు చెప్పుకుంటూ నిద్రించారు.

ఊరుఊరంతా సంబరాలు చేసుకుంటుంది. కొంతనిదానంగా తెల్లారిన తరువాత కైక పన్నాగం అందరకూ తెలిసివచ్చింది.

శ్రీరాముడు స్వచ్ఛందంగా, తండ్రికి బాసట అయి నిలచాడు. తనను, తండ్రి స్వయంగా అడవికి వెళ్లమని చెప్పకపోయినా, తండ్రిని సత్యశీలుడను చేయడం తన కర్తవ్యం అని శ్రీరాముడు అడవికి పోయేందుకు సంసిద్ధుడైనాడు.

లక్ష్మణుడు ఉద్రేకి! తొందరపాటు ఎక్కువ. తండ్రి వృద్ధుడు. బుద్ధిపెడతల పట్టిన కారణంగా, దుర్లభం అయిన వరాలు తన ముద్దుల భార్యకు ఇచ్చాడు. ఆయన మాటను లెఖచేయనవుసరం లేదని లక్ష్మణుని వాదన.

తండ్రి ఆజ్ఞాపిస్తే రాజ్యత్యాగమేకాదు, నిప్పులో దూకమన్నా దూకుతాననీ, అది తన ధర్మం అనీ రాముడు నిష్కర్షగా చెప్పాడు.

అధర్మానికి ఒడిగట్టిన దశరథుడు అసలు రాజుగా ఉండగల అర్హతనూ, యోగ్యతనూ గోలుపోయాడని, అధర్మాన్ని వ్యతిరేకించడం ధర్మమనీ లక్ష్మణుడు అన్నాడు.

ఈ సమయంలో ఒకరికి ధర్మం అయినది. మరొకరికి ధర్మం కాలేదు. తండ్రి ఆనతి తల దాల్చడం రాముడు ధర్మం అనుకున్నాడు. దాన్ని వ్యతిరేకించడం ధర్మం అని లక్ష్మణుడు అనుకున్నాడు.

తండ్రితో యుద్ధం అయినా చేసి మరీ రాజ్యం శ్రీరామునకు అర్పిస్తానన్నాడు లక్ష్మణుడు. అలా లక్ష్మణుడు అనడం విన్న కౌసల్య కొంత ఊరట పొందింది. పుత్రవాత్సల్యంతో ఉక్కిరిబిక్కిరి అవుతున్న ఆ మాతృహృదయానికి కొంత శాంతి కలిగించాయి ఆమాటలు. అయితే భరతుని రాజ్యాధికారాన్నుండీ తొలగించడం గురించి ఆమెకు భయం వేసింది.

శ్రీరాముడు శాంతస్వభావుడు. లక్ష్మణుని మాటలు విని ఆయన చిరునవ్వునవ్వాడు. లక్ష్మణుని కోపం తాటాకుల మంట వంటిది. ఎంత తొందరగా రవులుకుంటుందో అంత తొందరగా అణగి పోతుంది. ఈ విషయం రామునకు బాగా తెలుసు. ఆయన ఊహించినట్లే కొంతసేపటికి లక్ష్మణుడు మామూలు మనిషి అయ్యాడు.

''తండ్రిగారి మాట ధర్మమో, అధర్మమో నాకు తెలియదు లక్ష్మణా! ఆయన స్వయంగా అన్నాడో, పరోక్షంగా అన్నాడో అదీ తెలియదు. నీ ఆలోచనా విధానం మంచిది కాదు. ఆ దారిలో

మనకు సుఖం, శాంతి లభించవు. నీవు రాజ్యాన్నయితే సంపాదించి ఇవ్వగలవు. భరతుని విరోధం, తండ్రిమాట తిరస్కారంతో వచ్చిన ఆ రాజ్యాన్ని నేనేం చేసుకోను? పితృవాక్య పాలన అన్నదే నాకు తెలిసిన ధర్మం! ఆ ధర్మం విడచిన తరువాత, వచ్చే ఐశ్వర్యం, పదవీ మొదలయిన వన్నీ తప్పమైనది: అలా కావడం వలన వంశానికి తీరని అపచారం. మనం ఎంతగొప్ప వంశంలో పుట్టామో నీవేమయినా ఆలోచించావా లక్ష్మణా?''

లక్ష్మణుడు మౌనం వహించాడు.

మళ్లీ శ్రీరాముడు ఇలా అన్నాడు.

''ఈ విషయంలో – నా కేదో గొప్ప ద్రోహం కలిగిందన్న కోపంతో నీవు వెర్రివి అయ్యావు. ధర్మం ఒఖటే, మానవుని రక్షిస్తుంది: ఉన్నతుణ్ణి చేస్తుంది. మన తండ్రి గారి స్థితి, గురించీ ఆలోచించావా? నాగురించీ ఆలోచించడం మాని, ఆయన గురించి కొంచెం ఆలోచించు, వృద్ధుడై, ఆశాభంగం పొంది కుమిలి పోతున్నాడు. ఎప్పుడో ఇచ్చిన వాగ్దానం ఇలా పరిణమించిందే అని దుఃఖ పడుతున్నాడు. నాకు రాజ్యం ఇవ్వనని మాటమాత్రం ఎవరితోనయినా ఆయన అన్నారా? అసత్యం కలుగుతుందని ఆయన దుఃఖపడుతున్నాడు. పట్టాభిషేకం చేయవలెనని ఆయన ఉద్దేశింప లేదా? కలలు కనలేదా? సంతోషింపలేదా? మరి ఆయనలో ఏదో తప్పు ఉందనీ, అధర్మం చేశాడని నీవెలా నిందింపగలవు? ఆయన ధర్మబద్ధుడు. అంతటి ధర్మాత్ముడయిన తండ్రితో యుద్ధంచేసి రాజ్యం పొందేందుకు నేను సిద్ధంగా ఉన్నానని నీవు ఊహించావా లక్ష్మణా? ఇదా నీవు గురుముఖంగా నేర్చిన ధర్మం? నీతి? నీ గురువు ఎంత మహాత్ముడో నీకు గుర్తు లేదా లక్ష్మణా?'' అంటూ శ్రీరాముడు లక్ష్మణుని భుజం తట్టి బుజ్జగిస్తూ దగ్గరకు తీసుకున్నాడు.

''ఇదంతా దైవనిర్ణయం లక్ష్మణా! భగవంతుడొక్కడే శాశించగల విషయం ఇది! పౌరుషంతో దీన్ని మార్చలేము. దీన్ని మార్చవలెనంటే, మనం దైవంతో యుద్ధంచేయవలె. కనబడని దైవంతో ఎవరేనా యుద్ధం చేయగలరా? ఈ దైవం ఉనికి మనకు, ఫలాఫలాలు ఎదురయినపుడే తెలుపుడు అవుతుంది.'' అని మళ్లీ రాముడే అన్నాడు.

అడవికి వెళ్లేముందు తండ్రి ఆనతికోసం శ్రీరాముడు కైకమందిరానికి వచ్చాడు.

దశరథచక్రవర్తికి నోరమాట పెగల్లేదు. ఏం చెప్పగలడు? ఎలా చెప్పగలడు? తన ప్రాణాన్ని, తన శరీరం నుండీ వెళ్లమని సంతోషంగా ఆయన చెప్పగలడు కానీ, శ్రీరాముని కానలకు పొమ్మని ఎలా చెప్పగలడు?

కండ్లనిండా ఊరిన అశ్రువులు తుడుచుకోవలెననీ ఆయన మరచి పోయాడు. రాముని వైపు చూపులు నిలిపి, మౌని అయి, దుఃఖి అయి ఆసన్నమరణుడైన ఆ వృద్ధ నరపతి పాదాలకు శ్రీరాముడు తలవంచి నమస్కరించాడు.

అనుజ్ఞ ఇవ్వమని రాముడు అడిగాడు.

''నేను ఎవడనునీకు ఆజ్ఞ ఇచ్చేందుకు తండ్రీ? నీవు ఎవడవు నా ఆజ్ఞ పాలించేందుకు? నీవు మహావీరుడవు. మరినేనో, ఒక ఆడదానికి ఎప్పుడో ఇచ్చిన మాటకు బద్ధుడనై, ఏం చేసేందుకు తోచక చావు బతుకుల్లో గిలగిల్లాడుతున్న అల్పప్రాణిని. నేను ఇచ్చిన మాటకు బద్ధుడవు కావలెన్న నిబంధన నీకు లేదు. నీమీద నాకేం అధికారం ఉందని శాశింపగలను? నీవు అధర్మపరుడవా? అసత్యవాదివా? దురాగతుడివా? దురాచారుడవా? మరి ఏధర్మబద్ధమైన మార్గంలో నిన్ను శాశించి నిష్కాసితుడను చేయగలను? ఆ కైక – ఆ మూర్ఖురాలు నా ప్రాణాలు అడిగితె ఎంతో సంతోషంగా ఇద్దును. ఈ రాజ్యం అడిగినా ఇవ్వకపోదునా? నిన్ను నాకు మిగిల్చితే అదే పదివేలు అనుకోనా? నిన్ను–నాతండ్రీ! నీలో నన్ను చూచుకుంటూ, ఈ నా శేషజీవితం గడపి వేయవలెనని ఎంతగా కోరుకున్నాను? ఈ అవకాశం నాకివ్వమని నేను కోరుకోని దైవం లేదు. ఏం లాభం? విధి వంచితుణ్ణి, శాపగ్రస్తుడను. శ్రావణుని చావుకు, ఆ తల్లిదండ్రుల ఆంక్రందనా, వేదనా ఎంత ఉత్కటమైనదో ఇప్పుడు నాకు అనుభవం అవుతూంది. శ్రీరామా! నాతండ్రీ! నీవు నాకు దూరం కావడానికి కైక ఓ నిమిత్తం. నేను పొందిన శాపం ఈ రూపాన ఫలవంతం అవుతూంది.'' –అలా అతడి ఆలోచనలు సాగుతున్నాయి.

''ఈ సమయంలో నీకొక విషయం గుర్తు చేస్తున్నాను తల్లీ! ఐశ్వర్యం నన్ను ఎప్పుడూ ప్రలోభ పరచలేదు. అదే పరమార్థం అని నేనూ తలచలేదు. ఈ రాజ్యం నాకు కావలెనని కోరుకోలేదు. ధర్మానికే నేను విలువ ఇస్తాను. భరతునకు రాజ్యాభిషేకం చేసి రాజమాతగా సంతోషం అనుభవించు తల్లీ!'' అంటూ శ్రీరాముడు కైక దగ్గర శలవు తీసుకున్నాడు.

సీత వనవాసానికి బయలు దేరింది.

''నీవు లేక పోయినపుడు ఈ నగరు నాకు అడవి అవుతుంది. నీవు నాచెంత ఉంటే, అడవి నందనం అవుతుంది. మాతండ్రి కన్యాదానం చేస్తున్నప్పుడు ఛాయేవానుగతా!'' అని అన్నాడా? నేను నీ నీడను. నీడ లేకుండా ఎలా ఉండగలరు స్వామీ? మీ కాళ్లమీద పడి ప్రార్థిస్తున్నాను. నన్ను విడచి వెళ్లకండి! అలా విడచి పోతే నేను నేనుగా మిగలను ప్రభూ?'' అంటూ సీత నారచీరెలు ధరించి వచ్చింది.

''ఇప్పుడు నేను ఎంత అందంగా ఉన్నానో ఇటుచూడండి స్వామీ!'' అంది సీత.

''అడవిలో నీకో సేవకుడి అవసరం కలుగుతుందికదా? అక్కడనీకు ఎవరు చిక్కుతారు? ఇక్కడనుండీ ఒకదాసుని తీసుకపోవడం క్షేమంకదా?'' అంటూ లక్ష్మణుడు బయలుదేరాడు.

వారిని శ్రీరాముడు వారింపలేకపోయాడు.

శ్రీరాముడు గంభీరంగా నవ్వి, ''ఓ గంప, తవ్వుకోల అడవిలో మనకు అవుసరం అవుతాయి లక్ష్మణా! వాటిని మాత్రం మనం రాజద్రవ్యంగా తీసుకపోదాం. సిద్ధం చెయ్!'' అన్నాడు.

అత్తాకోడళ్లు అయిన సుమిత్రా ఊర్మిళలు, రామాయణ గాథలో పట్టుచీరెమీది బంగారు జరీపోగుల్లా కనబడీ కనబడకుండా తళుక్కుని మెరిసే పాత్రలు:

అరణ్యం వెళ్లే ముందు ఊర్మిళకు ఆ విషయం చెప్పాలని అంతఃపురం వచ్చాడు లక్ష్మణుడు.

ఆసమయంలో ఊర్మిళ ఒక చిత్రం గీస్తూంది. భర్తరాకకు ఆమె ఉలిక్కిపడి లేవడంతో, తాను గీస్తున్న చిత్రమ్మీద రంగులు ఒలికిపడి చిత్రం పాడయి పోయింది. అలా కావడానికి ఆమె నొచ్చుకుంది.

''ఏ చిత్రం అది?'' అని లక్ష్మణుడు అడిగాడు.

''సీతారాముల పట్టాభిషేక దృశ్యం! ఊహించి గీస్తున్నాను. అయితే ఏంలే! అంతా పాడయి పోయింది'' అంది ఊర్మిళ బాధగా.

''నీ ఊహచిత్రం వల్లె అసలు చిత్రం కూడా పాడయిపోయింది ఊర్మిళా! కైకపుణ్యం కట్టుకుంది. బాధపడకు ఊర్మిళా! రాముడు వనవాసం వెళుతున్నాడు. సీత నీడవలె అనుసరించింది. ఆ వెలుగు నీడలసేవకు నేనూ బయలుదేరుతున్నా! మళ్లీ రావడం పద్నాలుగేండ్ల అనంతరమే సుమా!'' అన్నాడు లక్ష్మణుడు.

''ఈ ప్రవాసంలో నేను మీకు జ్ఞాపకం రాకుండా గడపండి ప్రభూ! వారిసేవ అన్న తపస్సుకు నాధ్యాస అంతరాయం కాకూడదు. నావల్ల మీ సాధన భంగం కారాదు. నిష్ఠతో సేవ చేయండి!'' అని ఆ సాధ్వి సంతోషంతో భర్తను సాగనంపింది.

సుమిత్ర తన పాదాల మీదవ్రాలిన కొడుకును లేవనెత్తి శిరస్సు నిమురుతూ ఇలా అంది.

''నాయనా! క్షణం విడువకుండా రాముడిని కాపాడు. కష్టాల్లో, సుఖాల్లో రాముడే నీకు గతి; సద్గతి. అని గుర్తుపెట్టుకో! పెద్ద అన్న తండ్రి వంటివాడు. రాముడు నీకు దశరథుని వంటి వాడు. నన్ను సీతగా చూడు. అరణ్యం అయోధ్యగా భావించు. నీకు మంగళం కలుగుతుంది. వెళ్లి రా తండ్రీ! రాముని అనుసరించు. ఆ అనుసరించడం ఎల్లాగో తెలుసా? సోదరుని వలెకాదు. ఓ బానిసవలె, ఓ దాసుని వలె అనుసరించు. రాముడు అడవినుండీ తిరిగివస్తే, నీవూ తిరిగిరా! రాముడు అలారాలేక పోతే, ఆమరణాంతం నీవు అడవిలో ఉండిపోవాలి. జ్ఞాపకం పెట్టుకో'' అంది సుమిత్ర.

''సీత కానీ, నేనుకానీ నిన్ను విడచిబతకలేం! చేపపిల్లలు నీటికి దూరం అయితే బతగ్గలవా? నాకు తల్లి లేదు: తండ్రిలేడు. సోదరులు లేరు. నీవు తప్పనాకెవ్వరూ లేరు!'' అన్నాడు శ్రీరామునితో లక్ష్మణుడు.

కంబరు మహాకవి దిద్ది తీర్చిన ఊర్మిళా సుమిత్రా లక్ష్మణపాత్రలు అవి.

సీతారామలక్ష్మణులు అడవికి బయలు దేరుతుండగా తల్లి అయిన కౌసల్యకు, వారికి దారిబత్తెం ఇవ్వడం అవసరం కదా? ఆభత్యానికి బదులు ఆమె ఇలా అంది.

''యం పాలయసి ధర్మం, త్వం ధృత్యాచ నియమేవచ
సవై రాఘవ శార్దూల ధర్మస్త్వా మభిరక్షతు!''

''తండ్రీ! నీవు ఏధర్మాన్నయితే ధైర్యంతో నియమంతో ఆచరిస్తున్నావో, అదేధర్మం నిన్ను కాపాడుతుంది!''

సుమంత్రుడు రథం సిద్ధం చేసి వినయంగా చేతులు కట్టుకుని ''రథం ఎక్కండి! మీకు ఇష్టం అయిన చోటుకు తీసుకవెళతాను. వనవాసం నేటితో మొదలయింది రాకుమారా? మీకు మంగళం కలుగుతుంది. మీ కీర్తి సూర్యుడు లోకంలో ఉన్నంతవరకూ శాశ్వతం అవుతుంది:'' అన్నాడు

రథం సాగుతుంది.

''సుమంత్రా! నీవొక దుర్మంత్రుడవులావుంది. మాకంటి వెలుగు, మాపాలిట దైవాన్ని దూరాలకు తీసుకపోతున్నావు. ఆగు! రథం ఆపు!'' అంటూ ప్రజలు రథం వెంట పరువులు తీశారు.

వారు సరయూ తీరంలో నాటి రేయి గడిపారు.

సుమంత్రుడు పేరుపేరునా తండ్రి దశరథునకు కడసారి మాటగా ఏదేనా చెబుతారా? అని అడిగాడు.

''ఎవరు నాతండ్రి? నా తండ్రి ఇదో ఇక్కడే వున్నాడు. ఇదో ఇతడే నాతండ్రి! నాభ్రాత. నాహితుడు సర్వస్వమున్నూ. దశరథునకు తానే ధర్మపరుడనన్న గర్వం ఉంది. అసలు ధర్మపరుడు అతడు కానేకాదు. అధర్మ పరుడయిన వాడూ, అన్యాయం చేస్తున్నవాడూ నాతండ్రి కానేకాడు!'' అన్నాడు లక్ష్మణుడు.

శ్రీరాముని ఈశ్వరావతారంగా గుర్తించిన లక్ష్మణుడు అంతకన్నా ఏంచెప్పగలడు?

మరునాడు ఉదయం వారుపాదచారులై, రాజలాంఛనాలు విసర్జించి ముందుకు సాగారు. గంగకు ఇవతలి ప్రాంతానికి రాజుగుహుడు. అతడు ఎన్నో రుచ్యాలయిన పదార్థాలు పంపాడు. అయితే శ్రీరాముడు తాపసులకు ఉచితం అయిన కంద మూలాలూ, ఫలాలు మాత్రమే తీసుకున్నాడు.

వారు గుహుని సాయంతో గంగోత్తరణం చేసి ముందుకు పోయి మహర్షి భరద్వాజాశ్రమం చేరారు.

మహర్షి దీవెనలు పొంది మరునాడు వారు, ఆయన సూచనల మేరకు కాళిందీ నదిని దాటి చిత్రకూట పర్వతం చేరుకున్నారు. అక్కడికి సమీపంలో మాల్యవతీ తీరంలో పర్ణశాలను నిర్మించుకుని, అడవిలో చిక్కినఖాద్య వస్తువులు మితంగా తీసుకుంటూ కాలం గడపసాగారు.

అక్కడ అయోధ్యలో నిబిడమైన దుఃఖతిమిరాలు ముసుకవచ్చాయి. అయోధ్యావాసులు రాముడు లేకపోవడం వలన రాజునూ, కైకనూ నిందింపసాగారు.

దశరథుని స్థితి మరీ విషమించింది. పుత్ర విరహం కొద్దీ కౌసల్య, సూటిపోటు మాటలతో ఆయనను బాధింపసాగింది.

ఏడవ రోజుకల్లా, శ్రీరాముని అడవిలో విడచి, సుమంత్రుడు అయోధ్యకు చేరుకున్నాడు. రాజును కలుసుకున్నాడు.

దశరథునిలో ఒక కొస ఆశ మిగిలి ఉంది. అసూర్యంపశ్యా, సుకుమారీ అయిన సీతతో రాముడు అడవికి వెళ్లాడుకదా. ఆమె కష్టాలుచూసి కరగిపోయి, ఏదో విధంగా తమను తామె సంభ్యాపెట్టుకుని అయోధ్యకు వారు తిరిగి వస్తారన్న ఆశ! వట్టి చేతులతో తిరిగివచ్చిన సుమంత్రునిచూడగానే దశరథుడు ఏ ఆశతో అంతవరకూ జీవించి ఉన్నాడో, ఆ ఆశ అడుగంటడంతో కొసప్రాణం పోయింది: దశరథుడు మరణించాడు.

దశరథుని ఇంద్రియాలు ఒకటొకటి, శ్రీరాముడు కనుమరుగయిన నాటినుండీ శిథిలం కావడం జరిగిందిట.

ఒకరోజు ఆయన కౌసల్యతో ఇలా అన్నాడు.

''కౌసల్యా! నన్నొకసారి ముట్టుకో!''

''ఎందుకూ?''

''నీవు నవమాసాలు మోసి నా రాముని కన్నావు కదూ? నీవు పవిత్రురాలివి! నీ స్పర్శను నారాముని స్పర్శగా భావించి కొంత ఊరట, సంతోషం పొందాలనే నా అల్పాశ! అంచేత అడిగాను. దయచేసి నన్ను ముట్టుకో కౌసల్యా!''

''అలా అయితే నీవే ముట్టుకో వచ్చుకదా?''

''నీవు ఎక్కడ ఉన్నావో నేను చూడలేను కౌసల్యా! నాదృష్టి ఎప్పుడయితే నా శ్రీరాముడు, ఇక్కడనుండీ వెళ్లాడో, అప్పుడే వాడిని అనుసరించి పోయింది. ఇప్పుడునేను గుడ్డివాడిని!'' అన్నాడు దశరథుడు.

రాజు మరణించడం, రాకుమారుడు అడవులకు పోవడం, భరతుడు అయోధ్యలో లేక పోవడంతో రాజకీయ అనిశ్చితస్థితికి దారితీయడంతో మహర్షి వశిష్టులు అప్పటికప్పుడే కేకయ రాజ్యానికి తగిన మనుష్యులను పంపాడు.

భరత శత్రుఘ్నులు, అయోధ్య చేరగానే, తల్లి చేసిన నిర్వాకం తెలుసుకున్నారు. భరతుని మనస్సులో కోపం, దుఃఖం ఒఖసారిగా చెలరేగాయి.

''అమ్మా! నీకొడుక్కు రాజ్యమే సర్వస్వం అనుకున్నావా? ధర్మం, న్యాయం, నీతి లేవని అనుకున్నావా తల్లీ? రాముని ఎంత తప్పుడు అంచనా వేశావు తల్లీ? ఈ రాజ్యం నీకు గానీ నీ గూని దానికి కానీ కావలెననుకుంటే, 'రామా! నీవు పట్టాభిషేకం చేసుకోవద్దు. ఈ రాజ్యం నాకు కావాలి!' అని అడిగి ఉంటే, ఆయన చిరునవ్వుతో మీ కోరికను తీర్చకపోయాడా? ఈ పాపిష్టి రాజ్యం కోసం అన్నను అడవులకు తరిమి వేయడం అవసరమా తల్లీ? నీ దారికి ఎవరు అడ్డం వస్తారు? ఒఖ ధర్మం అడ్డం వస్తుందేమో? వృద్ధ రాజు ఇచ్చిన వాగ్దానం మూలంగా దాని నోరూ మూయించవచ్చు కదా? నాకోసం ఈ రాజ్యం సంపాదించానన్నావు. ఈ రాజ్యం నాకు కావలెనని నేను ఎప్పుడయినా ఏడ్చానా? ఈ భ్రష్టమార్గంలో నీవు సంపాదించిన రాజ్యం నేను అనుభవిస్తానని ఎల్లా ఊహించావు?

అంతటి నీచుడు నీకొడుకని అనుకున్నావా? ఈ రాజ్యం నాకు వద్దమ్మా! నా కోరిక ఏమిటో తెలుసా? శ్రీరాముడు సింహాసనమ్మీద కూర్చుండగా ఛత్రధారినై, ఆయన చరణ సేవకుడనై, ఓయింతచోటు, చిక్కించుకుని, నాజన్మ ధన్యంచేసుకోవలెననే అనుకున్నానమ్మా!'' అంటూ భరతుడు తల్లిముందు వాపోయాడు.

''ఇన్ని సంకటాలకు కారణభూతురాలైన ఈ గూనిదాన్ని చంపుతా!'' అంటూ కోపంతో శతృఘ్నుడు కత్తి ఎత్తాడు.

''అవివేకి అయిన ఈ ఆడదాన్ని చంపడం నీతికాదు సోదరా! ఆగు!'' అంటూ భరతుడు వారించాడు, ''దీన్ని మనం చంపినట్లయితే ఒఖ నాటికీ శ్రీరాముడు మనల మన్నించడు. మాటలాడడుకూడా! ఆయన ఈ పాపకార్యాన్ని సహించడు!''

''శ్రీరాముడు ధర్మంరూపైన వాడు ఆయన అంగీకరించడు!'' అని భరతుడు అనడంలో ఉద్దేశం – ధర్మం అంగీకరించదు అని! ధర్మం అంగీకరించదు అనే బదులు, శ్రీరాముడు అంగీకరించడు అని అన్నాడు. వారికి శ్రీరాముడు అంటే, ధర్మం కొలిచే కొలబద్ద అన్నమాట.

పరలోక గతుడైన తండ్రికి చేయవలసిన క్రియలు భరత శతృఘ్నులు నిర్వర్తించారు.

రాముని వెదుక్కుంటూ అడవికి పోయి, ఎదో విధంగా ఆయన మనస్సు మార్చి, అయోధ్యకు తీసుకరావలెనని భరతుడు ప్రయాణం అయ్యాడు. అతడు రాజలాంఛనాలు విసర్జించాడు. అన్నకువలె నారచీరలు ధరించి, జింకతోలు కప్పుకున్నాడు. ఆయన వెంట రాణులూ, రాణువా బయలు దేరింది.

భరతుడు గుహుని కలుసుకున్నాడు. గొప్ప సైన్యంతో వచ్చిన భరతుని, మొదట గుహుడు సందేహించాడు. అయితే భరతుని గంగవంటి స్వచ్ఛమైన మనస్సును తెలుసుకుని గుహుడు పులకించి కౌగలించుకుని సజలనయనుడైనాడు. తన పాడు ఆలోచనలకు సిగ్గుపడి తలవంచుకున్నాడు అతడు.

భరద్వాజ మహర్షి ఆశ్రమంలోనూ అంతేఅయింది. భరతుడు కన్నీళ్లు కార్చుతూ, ''మహర్షీ! నేనులేని సమయంలో మాతల్లి ఇంత పాపానికి ఒడికట్టింది. నాకు రాజ్యకాంక్షలేదు. నేను ఆయన దాసుణ్ణి. తిరిగి రాజ్యం రామునకు అప్పగించి, చేతులు కట్టుకుని ఆయన ముందు నుంచోవాలనే ఇంతదూరం వచ్చాను!'' అన్నాడు.

''రఘువంశంలో పుట్టిన వారిని తగ్గట్టు అన్నావు భరతా! నీకు శుభం కలుగుతుంది. ఇక్కడికి కొంచెందూరంలో మందాకిని ఉంది. ఆనదికి దక్షిణంగా వెళ్లు! చిత్రకూటం చూస్తావు. ఆ కొండ చరియల్లోనే రాముడి పర్ణశాల. వెళ్లిరా!'' అన్నాడు భరద్వాజుడు.

భరతుడు మహర్షి శలవు పొంది ముందుకుసాగాడు.

చిత్రకూటసానువుల్లో కూర్చుని, మందాకినీ సౌందర్యం చూస్తున్నారు ఆముగ్గురూ.

ఇంతలో అడవి జంతువులు అలజడిగా పారిపోతూండం వారికి కనిపించింది. ఆకాశంలోని పక్షులు అరుస్తూ దిక్కుతోచక ఎగురుతూన్నాయి. కొంచెం ధూళి ఆకాశంలో పరచుకుంది:

ఆ మార్పులను చూస్తూ ''ఎవరో గొప్ప రాజు తన బలగంతో ఇటువస్తున్నట్లుంది?'' అన్నాడు లక్ష్మణుడు.

ఆక్షణంలోనే అతడు ఓ ఎత్తైన చెట్టును ఎక్కి అటూ,ఇటూ చూసి గబగబా క్రిందకు దిగాడు.

''భరతుడు గొప్పసైన్యంతో వస్తున్నాడు. వాడిజండా నాకు కనిపించింది. వాడి అంతుచూడక విడిచిపెట్టను. నీవూ సిద్ధంగా ఉండు'' అన్నాడు.

''అయి మరీ మంచిదే! భరతుడే ఇటువస్తే యుద్ధం ఎందుకు కలుగుతుంది లక్ష్మణా? వాడి కోసం మనం ఏమయినా ఇచ్చేందుకు సిద్ధంగా ఉన్నాం కదా?'' అంటూ శ్రీరాముడు నవ్వాడు.

''అయితే మహారాజే వస్తుండవచ్చు. మనల చూసేందుకు రావచ్చు!'' అని లక్ష్మణుడు, తన తప్పు తెలుసుకుని ఏదో చెప్పాడు.

లక్ష్మణునకు శ్రీరాముని మీద అంతులేని ప్రేమ. అది అవధి లేని జలధి వంటిది. రామునకెటువంటి అపకారం జరుగుతుందని తెలిసినా, అతడు ఊరుకోలేడు. దశరథుడిమీదా శ్రీరామునికై యుద్ధానికి దిగిన వాడు. కైకను దండిస్తానని కత్తులు నూరినవాడు ఇప్పుడు భరతుని అంతు చూస్తానని చెప్పాడు. శ్రీరాముని మీద ఈగవాలనివ్వనంతటి ప్రేమ అతనికి చిన్నతనాన్నుండీ కలిగింది. చిన్నతనంలో విశ్వామిత్రయాగ సంరక్షణకు రాముని ఎందుకు అనుసరించడం? ఇప్పుడు అడవికి ఎందుకు వచ్చాడు? అదే ప్రేమతో అనుసరించాడు. అదేప్రేమతో భరతుని శంకించాడు.

శ్రీరాముడొకసారి లక్ష్మణుని చూచి, ''మా తల్లి గురించీ, మీ తల్లి గురించీ నాకు చింతగా ఉంది. వారి సేవలు చేసేందుకు ఎవరూ లేరు లక్ష్మణా! కనీసం నీవయినా వారి సేవలు చేస్తూ అయోధ్యలో ఉండవలసింది. ఇప్పుడయినా సమయం మించిపోలేదు. అయోధ్యకు వెళతావా?'' అని అడిగాడు.

''అయితే సీతమ్మను పంపు ఆమె అయితె అత్తలను బాగా సేవించగలదు!''

''మరి నా సేవకో? నన్ను విడచి సీత ఉండగలదా?''

''అయితే నేను మాత్రం ఉండగలనా? నిన్ను విడచి నేనూ ఉండలేను రామా! నేను పుట్టిన నాటి నుండీ నా స్థితి అంతే! నన్ను దూరం చేయవద్దు. దేనికి దూరమైనా జీవించగలనుకానీ, నీకు దూరం అయితే బతకలేను!'' అన్నాడు సజలనయనాలతో లక్ష్మణుడు.

శ్రీరామలక్ష్మణులు ఏకోదరులు కాకపోయినా, విడదీయలేని అనుబంధం కలిగిన సోదరులు. లక్ష్మణుడు శ్రీరామునికి బహిఃప్రాణం. ఉద్ధవుడు శ్రీకృష్ణునకు ఎల్లాగో లక్ష్మణుడు శ్రీరామునకు అంతే!

ఇంతలో భరతుడు అక్కడకు రానేవచ్చాడు. పరుగుపరుగున భరతుడు శ్రీరాముని పాదాల మీద వ్రాలి, ''అన్నా!'' అని మరేం మాటాడలేక వెక్కివెక్కి ఏడవసాగాడు.

''భరతా! నీవా నాయనా?'' అంటూ శ్రీరాముడు గాఢంగా తమ్ముని గుండెలకు హత్తుకున్నాడు.

''మహారాజును విడచి, ఇంతదూరం ఎందుకు వచ్చావయ్యా? భరతా! నీవెందుకు నారచీరలు కట్టుకున్నావు?''

ఇంతలో మహర్షి వశిష్ఠుడూ, సుమంత్రుడూ, రాణులూ ఇతర పరివారం అక్కడకు వచ్చారు.

''కేకయ రాజ్యంలో నేనుండగా ఇంత అనర్థం జరిగింది. అసలు ఈ విలయానికి కారణం నేను. నేనంటూలేక పోతే, మా తల్లికి ఇటువంటి స్వార్థ చింతన కలిగి ఉండేదికాదు కదా? నీ ఎడబాటుకు సహించలేక చక్రవర్తి పరమపదించాడు. ఆయనకు ఉత్తరక్రియలు మీరూ చేయండి. ఎంతగొప్ప చక్రవర్తి? చివరకు, అవసాన కాలంలో, ఆయన సమీపంలో ఒఖ కొడుకైనా, ఇంత తులసీజలం గొంతులో పోసేందుకు లేకపోవడం ఎంత దురదృష్టం?''

శ్రీరాముడు తండ్రి మరణవార్త విని మ్రాన్పడిపోయాడు.

మందాకినీతీరంలో రామలక్ష్మణులు తండ్రికి ఉత్తరక్రియలు నిర్వర్తించారు.

''ఈ రాజ్యంతో నాకు సంబంధం లేదు. దీని కోసం నేను ఒఖ నాటికీ ప్రలోభపడలేదు. నాకన్న తల్లి మూర్ఖురాలై, ఆశావివశురాలై, లోక ధర్మానికి విరుద్ధంగా ప్రవర్తించి ఇంతటి చేటు తెచ్చిపెట్టింది. జేష్టుడు తండ్రితో సమానం అంటారు. నీకు చెందవలసిన రాజ్యాన్ని నేను పొందినా, పొందవలె ననుకున్నా బ్రహ్మహత్య చేసినంతటి పాపం నాతల మీద పడుతుంది. వేయి గోవులను చంపినంత పాపం చుట్టుకుంటుంది. దేవుడి మాన్యాలు తిన్న వాడు పొందే నరకం నాదవుతుంది. అన్నా! నన్ను నమ్ము! ఈ రాజ్యం నీది. నీవు అర్హుడవు. నీవు సింహాసనమ్మీద కూర్చుని ఉండగా, నీకు వింజామర వీచడంలోనే నాకు ఆనందం ఉంది. అదే నా చోటు కూడా! దయచేసి నీవు తిరిగి వచ్చి పట్టాభిషేకం చేసుకో! మా అందరి పాపాలకు నిష్కృతి కలిగించు!'' అంటూ భరతుడు ప్రార్థించాడు.

శ్రీరాముడు మందహాసం చేశాడు.

''నాయనా భరతా! మనం కులీనులం. సుశిక్షితులం. ఎంతగొప్ప చక్రవర్తికి పుట్టినవాళ్లం? ఎంతగొప్ప మహర్షికి శిష్యులం? అలాంటి మనం ఒక తప్పు చేయకూడదు. మనమే తప్పుచేస్తే, ఇతరులు మనల అనుకరించి తప్పు చేస్తారు. అప్పుడు లోకం ధర్మభ్రష్టమై పోతుంది. పై వాడు మార్గదర్శకుడుగ ఉండవలె! తండ్రి ఆదేశం అదే కోరికా కావచ్చు. మనకు అది శిరోధార్యం, అవశ్యాచరణీయం. కాదనలేం భరతా! రాజ్యాన్ని నీవు ఎలా కాదనలేవో, కానలను నేనూ కాదనలేను. ఇది ధర్మానికి కొలతబద్ద. ఇది తారుమారుకావడం, చేయడం మంచిదికాదు నాయనా!

వెళ్లు! రాణులను శ్రద్ధగా చూడు! ప్రజలను గౌరవించు. గురువుగారి ఆదేశం పాలించు. చక్కటి రాజువని కీర్తి పొందు. రఘువంశానికి వన్నె తీసుకరా భరతా!''

వశిష్ఠ మహర్షి మౌనం వహించాడు. అయితే జాబాలి అన్న ఋషి మటుకు ఇలా అన్నాడు.

''దశరథుడు అందరకు మల్లె ఒక శరీరధారి. నేడు ఆ శరీరం పంచత్వం పొందింది. గుర్తులేని స్థితికి అది చేరింది. ఇటువంటి సమయంలో ఆయన ఆజ్ఞ అనీ, గీజ్ఞ అనీ ఏదో అనుకోడమూ, దాన్ని పాలించడం ధర్మమని అనుకోడం వివేకం కాదు. ఉనికి లేని వాని ఆజ్ఞకూ ఉనికి లేదు. అంచేత శ్రీరామా! భరతుని విన్నపం మన్నించి రాజ్యం ఏలుకోడం సమంజసం!'' అన్నాడు.

శ్రీరామునకు కోపం వచ్చింది. కనులు ఎర్రతామరలయ్యాయి.

''ధర్మం, సత్యం మీ దృష్టిలో ఇంతగా పలచబడిపోతే పోయింది. అవే నా సర్వస్వం; నా ఊపిరి; నాప్రాణం. పంచత్వం పొందిన రాజు చేసిన దానధర్మాలూ కూడా కాలదోషం పట్టవలెకదా మీమాట విన్నట్లయితే? భ్రష్టాచారం, నాస్తిక వాదం, దయచేసి ఈపవిత్ర దేశంలో ప్రచారం చేయకండి!'' అన్నాడు శ్రీరాముడు.

''నాయనా శ్రీరామా! కోపం నిగ్రహించుకో! ఈ జాబాలి నాస్తికుడుకాడు. నిన్ను ఏదోవిధంగా అయోధ్యకు తీసుకవెళ్లవలెనన్న కోరికతో, నీ మనస్సు మార్చేందుకు అలా చెప్పాడు. అంతే! సత్యధర్మాలకు రూపైన వాడివి. నీసంకల్పం ఎవ్వరూ మార్చలేరు. నీకు శుభం కలుగుతుంది. నీకీర్తి శాశ్వతం అవుతుంది నాయనా!'' అంటూ మహర్షి వశిష్ఠుడు సర్ది చెప్పాడు.

అన్నదమ్ములిద్దరూ రాజ్యం నీదంటే నీదని కొంతసేపు గడిపారు. శ్రీరాముడు ఎంతకూ అంగీకరింపక పోవడంతో, ఆమరణాంతం నిరశన వ్రతం చేస్తానని భరతుడు దర్భలు పరచి కూర్చున్నాడు...

శ్రీరాముడు ఎంతగనో బ్రతిమలాడాడు.

''దశరథుని ఆత్మ మీ వంటి సుపుత్రులను కన్నందుకు ఎంతో పొంగిపోతుంది. ధర్మదేవత రెండు చేతులా మీ ఇరువురనూ ఆశీర్వదిస్తుంది. ఎంతత్యాగం? ఎంతటి సద్వర్తన? ఎంతటి సత్య నిరతి? మీరు ఇద్దరూ ధర్మమూర్తులు. నాయనా! భరతా! నీవు రాముని ప్రతినిధివై రాజ్యం పాలించు. అరణ్యవాసానంతరం రాముడికి రాజ్యం అప్పగించు. రాజ్యంనీదికాదు. నీవు కేవలం రాజప్రతినిధివి. ఈ సంకటస్థితిలో మరోమార్గం లేదునాయనా!.. ధర్మం ఆచరిస్తున్న వాడిని విముఖుడుగా చేయడం పాపం అవుతుంది!'' అన్నాడు మహర్షి వశిష్ఠుడు.

''అయితే అన్నా! నీ పాదుకలుఇవ్వు! సింహాసనమ్మీద నీ పాదుకలు నిలిపి, నీకు సేవకుడనై, నిమిత్త మాత్రుడనై, నీవు వచ్చేంతవరకు నీపాదుకలకు తలవంచి పాలన చేస్తూ ఉంటాను. అరణ్యవాసం తీరిన తరువాత మరేదో వంకపెట్టి రాజ్యం కాదన కూడదు. ఈ మాటనీవు ఇవ్వవలె!'' అంటూ భరతుడు చేతులు జోడించాడు.

శ్రీరాముడు అతిగంభీరంగా నవ్వాడు. ఆయన నేత్రాలు ఆర్ద్రం అయ్యాయి.

అక్కడచేరినవారు పులకితగాత్రులై, చెమ్మగిల్లిన కండ్లను తుడుచుకుంటూ భరతుని వేపు అభినందనతో చూడసాగారు.

భరతుడు శ్రీరామపాదుకలతో నందిగ్రామం చేరి పాదుకాపట్టాభిషేకం, చేసి రాజప్రతినిధిగా రాజ్యం పాలించసాగాడు.

శ్రీరాముడు అనసూయా అత్రులను దర్శించాడు. అయోధ్యాజ్ఞాపకాలకు కొంచెందూరంగా ఉండవలెనని, దండకలో మరోప్రాంతానికి వెళుతున్న సమయంలో నడగొండవలె విరాధుడు వారికి ఎదురయ్యాడు.

వాడు అంతలోనే సీతను పొదివిపట్టుకున్నాడు. శ్రీరాముడు విడచిన బాణంతో వాడు దగ్ధమై, శాపం తీరగా యక్షలోకం చేరుకున్నాడు.

శ్రీరామదర్శనం కోసం ఎదురుచూస్తున్న మహర్షి శరభంగునికి నమస్కరించి, తమకు ఉచితం అయిన ప్రదేశం చెప్పమని కోరారు.

''నాయనా! నీ కోసమే, నీ దర్శనం కోసమే ఎదురుచూస్తున్నాను. నీ చల్లని చూపూ, నీకమనీయ విగ్రహం చూశాను. కండ్లుచల్లబడ్డాయి. ఇక్కడకు సమీపంలో సుతీక్ష్ణ మహర్షి ఉంటున్నాడు. ఆయనను దర్శనం చేసుకో! నీకు శుభం కలుగుతుంది!'' అని చెప్పి మహర్షి యోగాగ్నిలో తన శరీరం చాలించాడు.

శ్రీరాముడు, సతీసోదరులతో సుతీక్ష్ణ మహర్షి ఆశ్రమం చేరి, ఆయన దర్శనం చేసుకుని, ఆ రాత్రి అక్కడ విశ్రమించాడు.

దండకలోవారు కాలగమనం అంటూ తెలీకుండా పదేళ్లకాలం గడిపారు. సుఖాల్లో రోజులూ సంవత్సరాలూ ఎంతో తొందరగా దొర్లుకపోతాయి. కష్టాలు చుట్టిముట్టినవేళ కాలగమనం మామూలే! అయితే కాలం ఆగినట్లు, మొండికెత్తినట్లు అనిపిస్తుంది...

ఈదండకంలోనే మహర్షి అగస్త్యుడు, తనభార్యలోపాముద్రతో తపస్సు చేస్తున్నాడు. అగస్త్యుడు గణపతి ఉపాసకుడు. గొప్ప తపస్వి. ఆయన భార్య లోపాముద్ర మహాసాధ్వి. పతివ్రత. వారిదర్శనం కొరకు ఆశ్రమానికి శ్రీరాముడు వచ్చాడు.

అగస్త్యుడు త్రికాలవేది. అవతారవిశేషాలు ఆయనకు తెలుసు.

''నాయనా! శ్రీరామా! నీకు మంగళం కలుగుతుంది. నాదగ్గర ఒకమూలలో, పూర్వం విశ్వకర్మ, విష్ణువు కోసం నిర్మించిన ధనుస్సూ, అక్షయతూణీరం, కరవాలం నిరుపయోగంగా పడిఉన్నాయి. ఇప్పుడు వాటి అవసరం నీకు ఎంతో ఉండవచ్చుకదా! అవి నీకు ఇస్తాను!'' అని మహర్షి సాభిప్రాయంగా నవ్వాడు.

''మహాప్రసాదం!'' అని శ్రీరాముడు ఆకానుకలు గ్రహించాడు.

పంచవటిలో అరణ్యవాసశేషం గడుపవలెనని శ్రీరాముడు నిశ్చయించుకున్నాడు. అక్కడ లక్ష్మణుడు, తన చాతుర్యం కొద్దీ చక్కటి పర్ణశాలను నిర్మించాడు.

అక్కడ వారికి జటాయువు స్నేహం కలిగింది. గరుడభగవానుని తమ్ముడు అరుణుడు. ఈ అరుణుని కొడుకులు సంపాతి, జటాయువులు. జటాయువు దశరథుని స్నేహితుడు కూడా! ఈ విషయాలు తెలుసుకున్న తరువాత శ్రీరామలక్ష్మణులు, తమతండ్రిని చూసినట్లుగా జటాయువును చూసి సంతోషపడ్డారు.

''మీరు ఆహారం కొరకు వెళ్లినపుడు నేను సీతకు తోడుగా ఉంటాను'' అని జటాయువు మాటఇచ్చాడు.

దివ్యమంగళ విగ్రహుడయిన శ్రీరాముని చూచీ చూడగానే రావణుని చెల్లెలు శూర్పణఖ కామమోహిత అయింది. తనను ఏలుకొమ్మని ప్రాధేయపడింది. దాని రాక్షసప్రేమకు ఆయన భరింపలేక, లక్ష్మణుని చూపించాడు. దాని ప్రేమకు ప్రతిఫలంగా ముక్కూ చెవులూ కోసిమరీ తిరస్కరించాడు లక్ష్మణుడు.

అరణ్యకాండకు కైక ఏవిధంగా అంకురార్పణ చేసిందో, యుద్ధకాండకు ఈ చుప్పనాతి ఆవిధంగానే కీలక పాత్ర ధరించింది.

శూర్పణఖ నెత్తురోడుతున్న ముఖాన్ని రెండు చేతులతో కప్పుకుని ఖరుడిదగ్గరకు వచ్చి వాపోయింది.

ఖరుడు ఆమెను సముదాయించి, పద్నాలుగురు సేనాపతులతో గొప్పసైన్యంఇచ్చి పంపాడు.

శ్రీరామునిబాణధాటికి ఆ సైన్యం ఆగలేక పోయింది. క్షణ మాత్రంలో రాక్షసులు పీనుగుల పెంటయ్యారు.

శూర్పణఖ ఈ మారు దూషణుని వెంటపెట్టుక వచ్చింది. వాడిగతీ అంతేఅయింది. దూషణుడు చావడంతో ఖరుడు కోపోద్రేకంతో మండి పడుతూ వచ్చాడు. శ్రీరాముడు విడచిన దివ్యబాణాగ్నికి వాడూ సైన్యంతోసహా భస్మం అయ్యాడు.

జనస్థానంలో రాక్షసులలో చావగా మిగిలినవాడు ఒకడున్నాడు. వాడిపేరు అకంపనుడు. ఈ అకంపనుడు రావణుని కొలువుకు పోయి ''జనస్థానం నిర్జన స్థానం అయింది ప్రభూ!'' అంటూ విలపించాడు.

''ఎవడు అలా చేయగలిగాడు?''

''దశరథ కుమారుడట. సింహబలుడూ! అసహాయ శూరుడై మనబలగంతో సహా ఖరదూషణులను హతమార్చాడు.'' అని అకంపనుడు చేతులు కట్టుకునినుంచున్నాడు.

''అయితే వాడి బలమేదో తేల్చుకవద్దాం! నీవు దారిచూపు!'' అంటూ రావణుడు పైకిలేచాడు.

''అదేవద్దు ప్రభూ! ఆరాముడి భార్య అసమానలావణ్యవతి. అతిలోకసౌందర్యవతి. దేవతా

స్త్రీలు ఆమెముందు సూర్యునిముందు దివిటీలు. ఆమెను అపహరిస్తేచాలు, దాని విరహంతో వాడు గిలగిల్లాడి చస్తాడు. తమ రాణీవాసానికో కొత్త అందం, కళ ఆసీత రాకతో కలుగుతుంది.''

''ఆహా. ఇది మంచి ఆలోచన!'' అని రావణుడు సభచాలించాడు.

రావణుడు అప్పటికప్పుడే మారీచుని వెదకుతూ వచ్చాడు.

గతంలో విశ్వామిత్రాశ్రమంలో ఈమారీచుడు రామబాణం దెబ్బకు ప్రాణాలు మిగిల్చుకుని, సాధువై తపంచేస్తూ కాలంగడుపుతూన్నాడు. మారీచుడు అతి జిత్తులమారి, మాయావి. అందువల్లనే రావణుడు సీతాపహరణకు మారీచుని సహయం కోసం వెదకుతూ వచ్చాడు.

''రాముడితో విరోధం నీకెవరో గిట్టనివాళ్లు చెప్పి ఉంటారు. మహాప్రభూ! ఆ మహావీరుడి జోలికిపోయి ప్రాణాలు పోగొట్టుకోకు! నీ మానాన నీరాణీవాసంతో హాయిగా జీవించు. జనస్థానం ఏదో అయిందనీ, దానికి ప్రతీకారంగా సీతాపహరణం ఉచితం కాదు. శ్రీరామునిలో రెండు ఉత్తమ గుణాలు కనిపించాయి. అతడు ఎంతటి మహావీరుడో, ఎంతక్రూరుడో, అంత సాధువు. అంత కరుణాళువు, అంత దయామయుడు. సీత మహాపతివ్రత. ఆమెను కోరదగదు మహారాజా!'' అని అతడు హితం చెప్పాడు.

రావణుడు మహావీరుడు. తపస్సుచేసి అనేక వరాలు పొందాడు. ఒఖ మానవుని వల్ల తప్ప, మరెవ్వరి వల్లా మరణం కలుగకుండా ఒకవరం.

ఈ శ్రీరాముడు మంచి పోటరిలా ఉన్నాడు. అసహాయంగా జనస్థానంలోని మెరికల్లాంటి వీరులను మట్టికరిపించడం ఎవరితరం?

కొంచెం భయం, కొంచెం వివేకం, రావణుని మనస్సులో మెదిలింది. మరేమీ మాటాడకుండా అతడు లంకచేరాడు.

మారీచుడు ''బతుకు జీవుడా!'' అని తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

అగ్నిలా రావణుడు కొలువుతీరి ఉన్న సమయంలో, ముక్కు చెవులూ పోగొట్టుకున్న శూర్పణఖ నెత్తీనోరూ కొట్టుకుంటూ, ఏడుస్తూ సభకు వచ్చింది.

''నీవు మొగవాడివో, మొనగాడివో, ఏదో తేల్చుకో రావణా? జన స్థానంలో నీ సోదరులు చచ్చి పోయారని తెలిసీ, నిమ్మకు నీరెత్తినట్లు నెమ్మదిగా ఎలా ఉండగలుగుతున్నావూ? ఇదో ఇలా చూడు. నన్ను వికృతం చేసిన ఈ అవమానం నీదికాదా? నీ వంశానికి చెందదా? ఆ ధూర్త రాముడు, ఉత్తపుణ్యానికి నా ముక్కూ, చెవులూ తెగ్గోయించాడు. నీ సోదరులను నిర్మూలించాడు. నీవు వీరుడవుఅయితే ప్రతీకారం ఆలోచించు. ప్రాణాల మీద తీపి ఎక్కువఅయితే, పదిలంగా సింహాసనాన్ని అంటిపెట్టుకుని, భీరుడవన్న కళంకం పదిమొగాల నిండా పులుముకుని బతుకు!'' అంటూ శూర్పణఖ నిప్పులు చెరిగింది.

కొసమెరుపులా చివరకు ఆమె, ఇలా అంది. ''సీత అందమే అందం! దేవతా స్త్రీలు దాని ముందు దిగతుడుపు! ఆమె సౌందర్యం ఏమని వర్ణింపను? అంతటి అపురూపమైన భోగవస్తువు ముల్లోకాలు జయించిన నీకు సొంతం కాకుండా, ఎవడో ఊరూ పేరు లేని దేశభ్రష్టుడు అనుభవించడం, నీ అతిశయానికీ, ప్రాభవానికీ లోటుకాదా సోదరా? ముందులేచి ఈ అవమానానికి ప్రతీకారం ఆలోచించు. మన రాక్షస వంశగౌరవం నిలుపు!'' అని ఉసి కొల్పింది శూర్పణఖ.

మిత్తి నెత్తి మీద చేరి మొత్తుతూన్నపుడు వివేకం పని చేయదు. రావణునికి స్త్రీ ప్రలోభం అధికం కూడా!

రావణుడు తిరిగీ మారీచాశ్రమానికి వచ్చాడు.

''మారీచా!'' అని రావణుడు అరచాడు.

మారీచుడు ఉలిక్కిపడి దీనంగా చూశాడు.

''మారీచా! నీవొక మాయ లేడిగా మారు. సీత కండ్ల ముందు గెంతుతూ, ఆడుతూ ఆమె మనస్సును వశం చేసుకో! రాముని దూరాలకు తీసుకపోయే ప్రయత్నంచెయ్! ఆ తరువాతి సంగతి నేను చూచుకుంటా'' అన్నాడు రావణుడు.

''రావణా! తప్పు చేస్తున్నావు. ఈ విషయం నీకూ తెలుసు. విధి బలీయం! నేను నీకు సాయం చేయనంటే, నీవు చంపుతావు. అంతకన్నా రామ బాణంతో చావడం మేలు. నేనూ ఆనాడే సుబాహువుతో చావవలసింది. కానీ చావలేదు. ఎందువల్లనంటావు? నీవు చేసే నీచపనిలో భాగస్వామిని కావలెనని, నా నొసట రాయబడి ఉంది. అందువల్లనే చావలేదు. రాముడూ ఇందుకే చంపక విడచాడు. మంచిది రావణా! నీవు కోరిన విధంగానే చేస్తాను. నేను పొందే ఫలితం కొద్దిపాటిది. కానీ, నీవు చెల్లింపబోయే మూల్యం చాలా పెద్దది. ఇదేదో కూడా నా మనస్సుకు తోస్తూంది. విను! వంశనాశనం, సర్వనాశనం జరిగి తీరుతుంది. శ్రీరామునితో కయ్యం అంటే, మాటలా?'' అంటూ మారీచుడు అదృశ్యుడైనాడు.

అలా అదృశ్యుడైన మారీచుడు, బంగారులేడి రూపం పొంది ఆశ్రమ ప్రాంతంలో సీత కండ్ల ముందు మెరపులా దృశ్యాదృశ్యంగా కనిపింపసాగాడు.

''స్వామీ! రావాలి! త్వరగా రావాలి! ఈ లేడిని మీరు తప్పక చూడాలి!'' అంటూ సీత కేకవేసింది.

శ్రీరాముడు అక్కడకు వచ్చాడు.

''ఆ లేడిని చూడండి స్వామీ! ఎల్లాగయినా దాన్ని పట్టుకరండి. ప్రాణాలతో చిక్కితే మనం అయోధ్యకు తీసుకపోదాం. వాళ్లు ఈ అపరూపమైన లేడిని చూచి ముచ్చట పడతారు. చిక్కకపోతే దాన్ని చంపి తీసుకరండి! దాని చర్మమ్మీద కూర్చుని మీ నామజపం చేసుకుంటా. నా కోరిక తీర్చండి స్వామీ!'' అంటూ సీత తొందరింపసాగింది.

"ప్రకృతి స్వభావానికి విరుద్ధంగా ఈ లేడి కనిపిస్తూంది దేవీ! ఇలాంటి లేడి ఎక్కడయినా ఉంటుందా? ఇదేదో మాయ అయి ఉంటుంది!" అంటూ రాముడు నవ్వాడు.

"నష్టం లేదు స్వామీ! మాయావి అయితే, మరో రాక్షసుడు చస్తాడు. అంతేకదా? మనం పోగొట్టుకోబోయేది ఏమీ ఉండదు!"

"అలా అంటావా దేవీ! దీని ఫలాఫలాలు మనం ఇప్పుడు నిర్ణయించలేం! నీవింతగా ముచ్చట పడుతున్నావు. ఈ స్వల్పమైన కోరిక తీర్చడం నా ధర్మం కూడా! అల్లాగే పట్టుకవస్తా! లక్ష్మణా విల్లందుకో!"

శ్రీరాముడు వెళుతూ సీత క్షేమం గురించి లక్ష్మణునకు మరీ చెప్పాడు. ముందు జాగ్రత్త కోసం ఆయన అలా అనడం, అక్షరాలా రాబోయే విపత్తుకు ధ్వని వలె అనిపించింది.

విధి చేత లాగబడుతున్న వాడిలా శ్రీరాముడు ఆలేడి వెంబడి పరువులు పెట్టాడు. అది ఎండమావివలె ఇంతలో కనిపించి, అంతలోనే కనిపించక పోయేది. శ్రీరాముని, ఆ లేడి ఎంతో దూరం, ఎంతో సేపు గికురించింది. చివరకు ఆయనలో ఓర్పు నశించింది. ప్రాణాలతో లేడిని పట్టలేమన్న నిశ్చయానికి వచ్చిన తరువాత శ్రీరాముడు ఒకబాణం తీసుకుని, చెవిదాకాలాగి విడచాడు.

మారీచుడు ప్రాణాలు పోతున్నపుడు "హా లక్ష్మణా! హా సీతా!" అని ఆక్రందన చేశాడు.

వాడిచావు కేక శ్రీరాముని విభ్రాంతుణ్ణి చేసింది. ఏదో అనుమానం, మనస్సులో మెదలినా, ఏంకాదు లెమ్మని తనకు తానే సమాధానపడ్డాడు.

ఆ కేక సీతకూ వినిపించింది. సీత కంపించి పోయింది. తన పతికి ఏదో మహా విపత్తు కలిగిందన్న నిశ్చయానికి సీత వచ్చింది. ఆమె రాముని సాయం కోసం వెళ్లమని లక్ష్మణుని తొందరించింది సీత.

"ముల్లోకాల వీరులు ఒక్కపెట్టున చుట్టు ముట్టినా మడిమ కదలించకుండా పోరగల మహావీరుడు రాముడు. ఆయనకు నా సాయం అవసరం లేదు. నీవు కంగారు పడకు వదినా!" అంటూ లక్ష్మణుడు సీతకు నచ్చ చెప్ప ప్రయత్నించాడు.

"అది తప్పక రాక్షసమాయ" అనీ అతడు చెప్పాడు.

అయితే సీతకు అదేమీ కాబట్టలేదు.

"ఆపదలో చిక్కుకుని, నీపేరు ఎలుగెత్తి పిలిచినా సాయానికి పోక తాత్సారం చేస్తున్నావు. నీకు మేం కానివాళ్లం అయ్యామా నాయనా? భరతుని తల్లికి బాసట అవుదామనుకున్నావా? శ్రీరాముడు చనిపోతే నేను విధవనైతే, నీకు వశం అవుతాననుకున్నావా? అదేం జరగదు. ప్రాణాలు పోయినా నీ వశంకానని గుర్తుంచుకో! నీవో కుటిలుడవని తెలియక మేం ఇద్దరం మోసపోయాం! ఛీ! నీవో కులపాంసుడివి. నీ ముఖం నాకు చూపకు!" అంటూ సీత నోరికి రాకూడని విధంగా అన్నది.

''హరి! హరి! కులకాంతకు తగని విధంగా మాటాడుతున్నావు తల్లీ! ఇలా అనడం నీకు ఉచితంకాదు. భయంకరమైన విధి ఆడబోయే పాపిష్టి నాటకంలో నీవు ముఖ్యపాత్ర ధరించావు, అయోధ్యలో కైకకువలె! వెళుతున్నాను. ఎవరి ఆజ్ఞను పాలించాలనీ, అది నా జన్మ సాఫల్య కారణమనీ, ఇంతదూరం వచ్చానో, వారి ఆజ్ఞను ఉల్లంఘించి మరీ వెళుతున్నాను. నీకు శుభం కలుగవలె! ఈ సర్వదేవతలు నిన్ను కాపాడవలె!'' అని లక్ష్మణుడు భగ్నహృదయంతో, తిరిగి తిరిగి ఆశ్రమం వైపు చూస్తూ వెళ్లాడు.

లక్ష్మణుడు అటు వెళ్లగానే, పర్ణశాల గుమ్మం ముందు ఓ సన్యాసి నుంచుని భిక్ష అడిగాడు:

కులాచారం ప్రకారం, సీత పూలూ, పండ్లూ తెచ్చి భిక్ష ఇవ్వబోయింది.

''నీవెవరివి? చూడబోతే దేవతాస్త్రీవి వలె ఉన్నావు. అడవిలో ఇంత కష్టపడడం, నీవంటి సుకుమారికి ఉచితం కాదే! దేని కోసం ఇంతగా కష్టపడుతున్నావు? నీవు 'ఊ' అంటే నీ కోసం అందలాలు తెప్పిస్తాను. సింహాసనం అందిస్తాను. ముల్లోకాల అధికారాలు నీ పాదాక్రాంతం చేయగలను!'' అంటూ ఆ సన్యాసి మాటాడాడు.

''నీ మాటలకూ, నీ వేషానికి పొంతన కుదరడం లేదు. నీవు ఎవరవు? నీవు ఎవరివైనా, నాకవుసరం లేదు. ఈ భిక్ష తీసుకుని అధికప్రసంగం మాని వెళ్లిపో!'' అంది సీత.

రావణుడు నిజస్వరూపం పొందాడు.

''నీ అంద చందాలకు దాసోహం! ఈ రాక్షసరాజును ఏలుకో! లోకాలకు ఏలికసానిని చేస్తా! అంతులేని సుఖాలు అనుభవించు. నీవెప్పుడూ రుచిచూడని – కనీసం ఊహించని భోగాలు నీకు చూపుతాను. నాతోరా!'' అంటూ సీత కొప్పుపట్టుకుని, తన రథం వేపుకు రావణుడు నడచాడు.

''అయ్యో! ఎంత కష్టం దాపురించింది? కాని మాటలతో లక్ష్మణుని తరిమి కొట్టానే! ఎంత తప్పుచేశాను? ఇప్పుడు నాకు దిక్కెవ్వరు?'' అంటూ సీత వాపోయింది.

మ్రాగన్నుగా పడుకుని ఉన్న జటాయువు ఆమెగొంతుక విన్నాడు: మునుపు శ్రీరామునకు ఇచ్చిన మాట జ్ఞాపకం వచ్చింది.

వెంటనే రెక్కలు విప్పుకుంది జటాయువు.

''రావణా! ఆగు! అబలా, ఏకాకీ అయిన ఈ సీతను ఎందుకు చెరబడుతున్నావు? ఆమె రక్షణకు ఎవ్వరూ లేరనుకున్నావేమో! కానీ నేనున్నాను. కాచుకో''

''పక్షివి! నీవల్ల ఏమవుతుంది? పోయి మూల కూర్చో!'' అంటూ రావణుడు రథాన్ని కదలించాడు.

''రావణా! ఆగు! నేను వృద్ధుణ్ణి. నీవు యువకుడవు. నేను నిరాయుధుడను. నీవు సాయుధుడవు. నేను పక్షి కులం వాడివి. నీవు రాక్షస వంశం వాడివి. ఈ కారణాల వల్ల నీవు బలవంతుడవే! కానీ నాకు గొప్ప బలం ఉంది. అది నీకు లేదు. నాకున్న బలం ఏమిటో

తెలుసా? ధర్మబలం! తాత్కాలికంగా నీవు గెలిచినా, భవిష్యత్తులో దుంపనాశనం, ఈ అధర్మంతో కలుగుతుందని గుర్తుంచుకో'' అన్నాడు జటాయువు.

రావణుని రథమ్మీదకు, విప్పుకున్న రెక్కలతో దూకి, ముక్కుతో పొడిచాడు జటాయువు.

''తండ్రీ! నా దీనావస్థను, కనీసం నా భర్తకు తెలుపు. లక్ష్మణునికీ తెలుపు. అంతేచాలు!'' అంటూ సీత చేతులు జోడించింది.

నిరాయుధుడైన జటాయువు, సీతను రక్షింపవలెనని శక్తికి మించి ప్రయత్నించాడు. బలవంతుడూ, వీరుడూ, ఆయుధ పాణీ అయిన రావణుడు జటాయువు రెక్కలను ఖండించాడు. శరీరాన్ని గాయపరచాడు.

రెక్కలు తెగిన పర్వతం వలె జటాయువు చతికలపడ్డాడు.

నిరాటంకంగా రావణుడు సీతతో దక్షిణం వైపుకు వాయువేగంతో దూసుకు పోయాడు.

రావణునితో వెళుతున్న సీతకు, ఒక కొండచరియల్లో, కొందరు వానరులు కనిపించారు. తన నగలు కొన్ని మూటకట్టి ఆమెక్రింద పడవేసింది. ఈ నగలు ఆనవాళ్లై, తన అన్వేషణకు సాధనం అవుతుందనీ, రాముని ప్రయత్నంలో ఈ వానరులు, సహకరించగలరనీ ఆమె ఊహించిందేమో?

ఇంతటి దూరాలోచన చేసిన ఆమె, మాయలేడి గురించి గానీ, లక్ష్మణుని తరుముతున్నపుడు గానీ రాబోయే విపత్తును ఎందువల్ల అంచనా వేయలేక పోయింది?

అదృష్టం, దురదృష్టం – ఈ రెండూ కంటికి కనిపించవు. అయితే అనుభవానికి వస్తాయి. ఈ రెండూ సీతకు వెంటవెంటనే కలిగాయి.

అపహరణ దురదృష్టం అయితే, అన్వేషణకు ఉపకరణను స్వయంగా ఇవ్వడం అదృష్టం. కాదా? భగవంతుడు కేవలం అదృష్టాన్ని కానీ, దురదృష్టాన్ని కానీ ఎవ్వరికీ కల్పింపడు. కలగాపులగం చేసి మరీ ఇస్తుంటాడు. అది ఆయనకు వినోదం.

పరమసాధ్వి అయిన సీత ములుకుల్లాంటి మాటలతో లక్ష్మణుని మనస్సును గాయపరచి, తరిమికొట్టి విధి చేతుల్లో కీలుబొమ్మ అయిన కారణం ఏమిటి?

పిశాచాలవంటి కొందరు రాక్షసస్త్రీలను సీతకు కాపలాపెట్టి రావణుడు సంతోషంగా అంతఃపురానికి వెళ్లాడు.

శ్రీరామలక్ష్మణులు మారీచుని చంపిన తరువాత, పర్ణశాలకు వచ్చారు. అక్కడ భయంకర నిశ్శబ్దం తాండవిస్తూంది. ప్రకృతికి నోరు ఉంటే, జరిగిన విపరీతం చెప్పిఉండేది.

క్షణాలమీద వారికి సీతాపహరణ సమాచారం తెలిసింది.

''హా సీతే! సఖీ!'' అంటూ శ్రీరాముడు మూర్ఛపోయాడు. కోనలూ, కొండలూ, ఎంతోదూరం వారు వెదకారు. సీత జాడలు ఎక్కడా చిక్కలేదు. అలసటా శ్రమా మిగిలింది.

శ్రీరామునకు కోపం వచ్చింది. ''ఈ సచరాచరప్రపంచాన్నే నిర్మూలిస్తాను. సీతను తీసుకపోయిన రాక్షస వంశాలు నాశనం అవుతాయి!'' అని ఆయన బ్రహ్మాస్త్రం అందుకోబోయాడు.

''జిత క్రోధుడవు అయిన నీకు ఇంతటి కోపం తగదు. శాంతించు!'' అని లక్ష్మణుడు ప్రార్థించాడు.

అలాకొంతదూరం పోగా, ఏదోయుద్ధం జరిగినట్లు ఆయుధాల అవశేషాలు కనిపించాయి. అవి చూడగానే, రాక్షసులు సీత కోసం యుద్ధం చేసుకుని, అపహరించారన్న ఊహ వారికి కలిగింది.

మహానుభావుడూ, జితేంద్రియుడూ అయిన శ్రీరామునకు కోపం, దుఃఖం కలిగాయి. ఎప్పుడూ పల్లెత్తు మాట కైకగురించి అనని అతడు, సీత అదృశ్యం అయిన తరువాత, తనుబతుకలేడు. తను లేక పోయినపుడు, రాజ్యపదవి భరతునకు శాశ్వతం అవుతుంది. అంచేత ''సీతాపహరణం తెలుసుకున్న కైక ఎంతో సంతోషిస్తుంది కదా!'' అని లక్ష్మణునితో అన్నాడు శ్రీరాముడు. దుఃఖంలోంచి ద్వేషం. దానిలోంచి క్రోధం రాముడి మనస్సును ఆక్రమించింది.

లక్ష్మణుడు ధైర్యం చెబుతూ, చుట్టుప్రక్కల వెదకుతూండగా మూలుగులు వినిపించాయి. అటుపోయిచూడగా, ప్రాణావశిష్టుడయిన జటాయువు కనిపించాడు. జటాయువు వలన రావణుడు సీతనపహరించాడన్న విషయం వారు తెలుసుకున్నారు. జటాయువు ఆ సమాచారం వారికి చెప్పి ప్రాణాలు విడచాడు.

వారు భక్తితో జటాయువునకు అగ్ని సంస్కారాలు చేసి అన్వేషణ ప్రారంభించారు.

అలా వారు కొంతదూరం పోగా, వారికి కబంధుడు ఎదురు వచ్చాడు. వాడికి తలలేదు. కాళ్లు లేవు. ఉన్న దల్లా రెండు చేతులూ బాన కడుపు. ఆ వికృత రూపుడు కబంధుడు ఆ ఇద్దరు రాకుమారులనూ రెండు చేతులా చిక్కించుకుని, నోర వేసుకోబోయాడు.

శ్రీరాముడు లక్ష్మణుని వేరుచూచి ''ఆ చేయి నీవు నరుకు! ఈ చేయి నేను నరకుతాను!'' అని హెచ్చరించాడు.

శ్రీరామలక్ష్మణులు వాడి రెండు చేతులూ నరికి వేశారు. చేతులు పోయిన కబంధునకు జన్మాంతర స్మృతి కలిగింది.

''ప్రభూ! మీరెవరో తెలిసింది. నా చేతులయితె నరకారు. అల్లాగే నన్ను దహనం చెయ్యండి. ఇంద్రుడు ఇచ్చిన శాపం. తీరి పోతుంది. నీవు నా చేతులు నరికి దహనం చేస్తే నాశాపం తీరుతుందని మునుపు దేవరాజు చెప్పి ఉన్నాడు ప్రభూ! రామచంద్రా!'' అంటూ కబంధుడు ప్రార్థించాడు.

శ్రీరామలక్ష్మణులు, కబంధుని కోరిక మేరకు, వాడిశరీరాన్ని దహించారు. ఆ అగ్ని నుండీ దివ్య తేజస్సుతో, ఒక దేవపురుషుడు బయటకు వచ్చి శ్రీరామునకు నమస్కరించాడు.

''ప్రభూ! మీరు తప్పక సీతను తిరిగి పొందగలరు. కలత పొందకండి. పంపాతీరంలో ఋష్యమూక పర్వతమ్మీద భ్రాతృ నిష్కాసితుడైన సుగ్రీవుడు నివసిస్తున్నాడు. అతడు మీకు సహకరించగలడు. అక్కడకు వెళ్లు రామచంద్రా!'' అని అతడు అదృశ్యుడయ్యాడు.

పంపాతీరంలో మతంగముని ఆశ్రమం ఉంది. ఆ ఆశ్రమంలోనే శబరి ఉంటుంది. శ్రీరామదర్శనం కోసం ఆమె ఎదురు తెన్నులు చూస్తూ ఉంది. ఈ వంక శ్రీరాముడు రాగలడని, ఆమె, మతంగముని ద్వారా తెలుసుకుంది.

తన దైవం వస్తాడనీ, ఆతిథ్యం స్వీకరిస్తాడనీ, ఆ భక్తురాలు తీయని పండ్లు ఏరి, రుచిచూచి మరీ దాచి పెట్టింది.

శ్రీరామ దర్శనంతో ఆమె వివశురాలై, ఆనందభాష్పాలు చెక్కిళ్ల మీద జాలువారుతూండగా, ''ప్రభూ! నాప్రభూ!'' అంటూ ఆయన పాదాల మీద వ్రాలింది. తానుసేకరించిన స్వాదువయిన ఫలాలు వారిచే తినిపించింది.

శ్రీరామ దర్శనానంతరం తన శరీరాన్ని అగ్నికి ఆహుతి చేసి ఊర్ధ్వ లోకాలకు పోయింది శబరి.

రామలక్ష్మణులు ముని వేషాలతో, ధనుర్బాణాలు ధరించి ఏదో వెదుకుతూ సంచరించడం సుగ్రీవుని కంట పడింది.

సుగ్రీవుడు భయంతో కంపించిపోయాడు. భయం రెండు కారణాల వల్ల కలుగుతుంది. ఉన్నది పోతుందన్న భయం; కోరింది పొందలేమన్న భయం. సుగ్రీవునకు ఈ రెండు కారణాల వల్ల భయం కలిగింది. వాలికి భయపడి ఇక్కడ తలదాచుకున్నాడు. వాలి తన స్నేహితులయిన వీరిని, తనను చంపమని పురమాయించాడేమో? తను తీవ్రంగా కోరుతున్న రాజ్యం, తన భార్య తనకు చిక్కవేమో?

ఏమయినా అలా తిరుగుతున్న వాళ్లెవళ్లయిందీ తెలుసుకోడం అవసరం. ఆయనకు మంత్రీ, స్నేహితుడూ, సర్వస్వమూ అయిన వాడొకడున్నాడు. అతని పేరు హనుమంతుడు. ఈ హనుమంతుని, దగ్గర తన భయాన్ని సుగ్రీవుడు వ్యక్తం చేశాడు.

''నీవు నిశ్చింతగా ఉండు సుగ్రీవా! విషయం నేను చిటుకలో తెలుసుకవస్తా!'' అని ఆంజనేయులు, బ్రాహ్మణరూపం ధరించి వారి వద్దకువచ్చాడు.

మొదట హనుమంతుడు, తానెవరో తెలుపకుండా గ్రంథం నడుపుదాం అనుకున్నాడు.

అయితే, అతడు శ్రీరాముని చూడగానే, అతని మనస్సులోని రహస్యగోపనం, సూర్యదర్శనంతో మంచు పొరల్లా విడవడింది.

ఒక భక్తుడు, భగవంతుని ముందుకు వచ్చి, ఎంత దీనుడై, ఎంత ఆర్తుడై, ఎంత విధేయుడై నుంచుంటాడో, అంత ఆర్ద్రంగా ఆంజనేయులు తన మనస్సును విప్పి పెట్టాడు. తన గురించీ, తన రాజు సుగ్రీవుని గురించీ ఏదీ దాచకుండా మారుతి ముచ్చటించాడు.

"అతని మాటలు విన్నావా లక్ష్మణా! సరళగంభీరంగా ఉన్నాయి. వేద పాండిత్యం, వ్యాకరణం మాటల్లో తొణికిసలాడుతూంది. స్నేహశీలుడుగా ఉన్నాడు. అవశ్యం మనం స్నేహం చేయదగిన వాళ్లు!" అన్నాడు శ్రీరాముడు.

మారుతీ లక్ష్మణులు, హృదయాలు విప్పుకుని, తమ తమ కష్ట సుఖాలు, తమ వారి గురించిన సమాచారాలు చెప్పుకున్నారు. అలా మాటాడుకోడం వల్ల, ఒకరిమీద మరొకరికి గౌరవం కలిగింది. వాత్సల్యం ఏర్పడింది.

'"సుగ్రీవుని జీవితం వాలి భయం కొద్దీ దుఃఖమయం అయింది. భార్యను పోగొట్టుకున్నాడు. రాజ్యలాభం, మీ స్నేహలాభం వలన పొందగలడు. సుగ్రీవుని సాంగత్యం వలన సీతాన్వేషణ మీకు సులభం అవుతుంది" అని చివరి మాటగా మారుతి చెప్పాడు.

వారు నడచి కొంత దూరం పోగా, నర సంచారానికి అనువుగాని చోటుకు చేరుకున్నారు. అప్పుడు హనుమంతుడు, తన నిజస్వరూపం ధరించి, తన భుజాల మీద, ఆ సోదరులను కూర్చుండ చేసి సుగ్రీవుని దగ్గరకు తీసుకవచ్చాడు.

..వానరుడయిన నా స్నేహం, నీకు అవసరం అనిపిస్తే నాచేయి అందిస్తున్నాను. అందుకో మహాపురుషా!" అని సుగ్రీవుడు, తన చేయి అందించాడు.

శ్రీరాముడు ఆనందంతో, సుగ్రీవుని చేయి అందుకుని కౌగలించుకున్నాడు. అగ్ని సాక్షిగా వారు స్నేహితులయ్యారు.

"వాలి భయం కొద్దీ నిలువ నీడలేకుండా ఇటూ, అటూ పరువులు పెట్టాను. చివరకు ఈ కొండ చేరాను. నీవు వాలిని చంపగలవా శ్రీరామా? నా రాజ్యాన్నీ, నా భార్యనూ నాకు అప్పగించగలవా?" అని సుగ్రీవుడు సూటిగా అడిగాడు.

"తప్పక వాలి నా బాణాగ్నికి భస్మం కాగలడు. నీ కోరికతీర్చడం నాకు పెద్ద కష్టంకాదు!"

ఇక్కడ ఈ సంఘటన జరుగుతున్నపుడు, లంకలో సీతకూ అటూ, ఇటూ రావణునకూ ఎడమ కండ్లు అదిరాయి. సీతకు అది శుభసూచన అయితె, రావణునకు అశుభారంభం.

సుగ్రీవుని ఆజ్ఞతో వానరుడొకడు గుహలో దాచి పెట్టబడ్డ నగల మూట తెచ్చి వారి ముందు పెట్టాడు.

లక్ష్మణుడు నగల మూట విప్పి, సీతాదేవి నూపురం గుర్తు పట్టాడు.

"ఇదో! ఇది ఆ తల్లినూపురం" అన్నాడు లక్ష్మణుడు. లక్ష్మణుడు సీతాదేవి కాలి అందెను మాత్రమే గుర్తు పట్టడం గురించి, అది ఆయన శీలసంపదకు గుర్తుగా భక్తులు ఎంతో విపుల వ్యాఖ్యానాలు చేయడం ఒక సాంప్రదాయం.

ఆ నగలు చూడగానే శ్రీరామునకు దుఃఖం ఆగలేదు. ఆపైన కోపం వచ్చింది. ఆయన ఆ కోపంతో "ఈ దుష్టుడి తల తాటిపండువలె భూమిపై పడేరోజు దగ్గర పడింది. వీడివంశం నాశనం చేస్తా! ఇది నిశ్చయం" అన్నాడు.

''ఈ దుష్టుడి నివాసం నాకు తెలుసు. వాడి బలం, బలగం, కూడా తెలుసు. అయితే సీతాదేవిని ఎక్కడదాచాడో తెలీదు. వెదకడం అవసరం. వానరులు దానికి సమర్థులు. దుఃఖం అసమర్థుల లక్షణం! బాధ పడకు. మన ఇద్దరకూ కొన్నింట సాపత్యం ఉంది శ్రీరామా! ఇద్దరం రాజ్యభ్రష్టులం సతీ విరహార్తులం. నేను ధైర్యంతో కాలం గడుపుతూన్నా. నీవూ ధైర్యంతో ఉండుప్రభూ! అన్ని పనులూ నిబ్బరంతో, నిదానంగా చక్కబెట్టుకుందాం. సర్వం తెలిసిన మహాజ్ఞానివి నీవు. వానరుడనైన నేను ఎక్కువగా చెప్పవలెనా?'' అన్నాడు సుగ్రీవుడు.

శ్రీరాముడు సంతోషించాడు. ''ముందు నీ కష్టం ఏమిటో నివారిద్దాం! సంకోచం విడచి చెప్పు!'' అన్నాడు శ్రీరాముడు.

సుగ్రీవుడు పొంగి పోయాడు.

''వాలితో నీకు విరోధం ఎలా వచ్చింది సుగ్రీవా?'' అని రాముడు అడిగాడు.

''వాలి మహాపరాక్రమశాలి. కిష్కింధకు రాజు ఆయన. నేనంటే, ఆయనకు ఎంతో ప్రేమ. యువరాజునని గౌరవించేవాడు. మాకు సుఖంగా రోజులు గడచి పోతున్నాయి. మాయావి అనేపాత విరోధి ఒక అర్ధరాత్రివేళ గుమ్మం తట్టి వాలిని పోరుకు పిలిచాడు. వాలి నిద్రలేచి అప్పటికప్పుడే యుద్ధానికి వచ్చాడు. నేనూ తోడై ఉన్నాను''

''మాయావి వాలి రావడం చూసి ఒక గుహలో దూరాడు. వాడిని తరుముతూ వాలి గుహలో ప్రవేశించాడు. నేను అనుసరించగా, వాలి నన్ను వారించి, గుహ ముఖంలో ఉండమని, తాను లోపలకు పోయాడు''.

''గుహలోపల వారి యుద్ధం ఎన్నిరోజులయినా ఒక కొలిక్కి రాలేదు. లోపల రాక్షసుల బొబ్బరింతలూ, కేకలూ వినిపించాయి. నెత్తురులు ప్రవాహాలైనాయి. వాలి సంగతీ సందర్భమూ తెలిసిరాలేదు. రాక్షసులంతా చేరి వాలిని వధించారని అనుకున్నాను. ఆ రాక్షసుల భయం కొద్దీ గుహ ద్వారాన్ని ఓ పెద్ద బండతో మూసి కిష్కింధ చేరాను. వాలి సమాచారం ఎన్ని రోజులకూ తెలియక పోవడంతో, ఈ వానర ప్రముఖులు, నన్ను బలవంతం చేసి సింహాసనమ్మీద కూర్చుండ చేశారు.''

''చాలా కాలానికి వాలి విజయుడై తిరిగి వచ్చాడు. నేను ఆశతో తన రాజ్యం ఆక్రమించాననీ, తనకు ద్రోహం చేశాననీ వాలి మండి పడ్డాడు. నేను ఎంతగా ప్రార్థించినా నామాట వినిపించుకోలేదు. నాకు రాజ్యం అక్కరలేదు. మునుపటివలె, సేవకుని వలె ఉంటానని చెప్పాను. అయితె వాలికి కోపం తగ్గలేదు. నన్ను మన్నించక పోగా, తన్ని తరిమి వేశాడు. అన్నీ పోయినా, ఈ నలుగురు స్నేహితులతో ఎల్లాగో జీవిస్తున్నాను. ఇదీ రామభద్రా! నాకథ! నేను వాలి పట్ల తప్పుచేశానా? నేను ద్రోహినా? విశ్వాస ఘాతకుడనా? ఏమో! నాకు తెలియడం లేదు'' అన్నాడు విచారంగా సుగ్రీవుడు.

''నీకు వచ్చిన భయం లేదు సుగ్రీవా! నేను మాట ఇచ్చాను. ఆ మాటకు తిరుగులేదు.''

రామాయణంలో కొన్ని అపూర్వమైన మెలికలున్నాయి. మహర్షి వాల్మీకి ఈ మెలికలకు

వివరణ ఇవ్వడు. ఎవరి బుద్ధికి వారు ఊహించుకోవలసిందే! వాలి నడవడికలో లోపం ఉందా? సుగ్రీవుని ప్రవర్తనలో లోపం ఉందా? కోపంతో ఉక్కిరి బిక్కిరి అవుతున్న వాలికి సుగ్రీవుడు తీసుకున్న మార్గం స్వార్థ పూరితమని అనిపించడంలో తప్పులేదు. బలహీనుడయిన సుగ్రీవుడు అంతకన్నా ఏమీ చేయలేక పోవడం తప్పుకాదు. వాలి ఉదారంగా తీసుకోలేదు. కోపానికి వశం అయినవాడికి విచక్షణాజ్ఞానం నశిస్తుంది. అందువల్లనే కోపం వల్ల నాశనం కలుగుతుందని పెద్దలు చెబుతారు.

భరతునికి రాజ్యపదవి కాళ్ల దగ్గరకు వచ్చి పడింది. అయితే అతడు మహోదారుడు కావడం వల్ల చిరునవ్వుతో, ఆపదవిని తృణం వలె విసర్జించాడు. ఇక్కడ సుగ్రీవుడు అలా చూడలేదు.

చిక్కిందే చాలునని, దక్కించుకునే ప్రయత్నం చేశాడు సుగ్రీవుడు. రాజ్యం అనుభవిద్దాం అనుకున్నాడు. ఫలితం వాలి వలన నిష్కాసితుడు కావాల్సివచ్చింది. ప్రవాస జీవితం గడపవలసి వచ్చింది. రాజ్యపదవిని తృణీకరించిన భరతుడు మహోన్నత వ్యక్తి అయ్యాడు. అదే వారిద్దరికీ భూమ్యా కాశాలంతటి తేడా! కామానికీ నిష్కామానికీ తేడా అది. ముందు ముందు మరోవ్యక్తిని – విభీషణుని కలుసుకుందాం! అతడు సుగ్రీవుని వంటివాడుకాదు. భరతుని వంటివాడు కాడు.

శ్రీరాముని శక్తితో సుగ్రీవుడు, తాను పోగొట్టుకున్న భార్యనూ, రాజ్యాన్నీ పొందవలెననుకున్నాడు. అయితే శ్రీరాముడెంతటి బలవంతుడో తెలియదు. వాలిబలం అతనికి బాగా తెలుసు. శ్రీరాముని బలం ఎలా తెలుసుకోవలె? అదీ సమస్య!

సుగ్రీవుడు మంచి మాటకారి. పరోక్షంగా వాలి గురించి ప్రస్తావించడం ఆ సమయంలో అవసరం అనుకున్నాడు.

''ప్రభూ! రామచంద్రప్రభూ! వాలి గురించి కాస్త చెప్పడం, ఈ సమయంలో అవసరం అనుకుంటున్నాను. వాలి వేకువనే లేచి సంధ్యావందనం చేసేందుకు, నేల నాలుగు చరగులా ఉన్న సముద్రాలను వాయువేగంతో చుట్టివస్తాడు.''

ఒకసారి దుందుభిరాక్షసుడు, బలోన్మత్తుడై పోరుకు సముద్రుని పిలిచాడు. ఆయన మృదువుగా ''హిమవంతునితో పోరు. నీకు సమానమైన బలవంతుడతడు'' అన్నాడు. వెంటనేవాడు హిమవంతుని దగ్గరకు వచ్చి కొమ్ములతో కుమ్మసాగాడు. ఆయన ప్రశాంతంగా నవ్వి, ''నీతో పోరగల శక్తి నాకులేదు. ఇక్కడ ఎందరో తాపసులు ప్రశాంతంగా కాపురం చేస్తున్నారు. పరమ శివుడే కొలువై ఉన్నాడు. వారి శాంతికి భంగం చేయరాదు. వెళ్లు. మరెక్కడైనా నీబలప్రదర్శన చేసుకో!'' అన్నాడు.

''అయితె ఎవరితో పోట్లాడమంటావో, నీవే చెప్పు! లేకుంటే కుమ్మికుమ్మి, నీ కుదుళ్లు నేల మట్టం చేస్తా!'' అన్నాడు వాడు.

''తిన్నగా కిష్కింధకు వెళ్లు! అక్కడ వాలి ఉన్నాడు. అతడు నీకు సరి ఉద్దీ!'' అన్నాడు అతడు.

దుందుభి కిష్కింధకోట సింహద్వారం చేరి సింహనాదం చేయసాగాడు.

వాలి బయటకు వచ్చి ''ఎవర్రా నీవు? పోగాలం దాపురించిందా ఏం?'' అని గర్జించాడు.

''నీతో పోట్లాడదామని వచ్చా వాలీ! ఈరాత్రికి, ఎన్ని సుఖాలు నీకు చిక్కితే, అన్ని సుఖాలు అనుభవించి తెల్లారి రా! మనం యుద్ధం చేద్దాం. మళ్లీ నీకు సుఖం అనుభవించే అవకాశం ఉండదు వాలీ!''

''ఓరీ దుందుభీ! నీవటరా! ఇంతపోటరివి ఎప్పుడయ్యావురా వదరుబోతా? నీకు నూకలు చెల్లాయి. అంచేతనే ఇలా వాగుతున్నావు. నీతో యుద్ధం చేసేందుకు, తెల్లారేదాకా ఆగాలా?'' అంటూ వాలి వాడిమీదకు దూకి ముఖం పగిలేలా ముష్టిఘాతం ఇచ్చి, వాడితోక పుచ్చుకుని గిరగిరా తిప్పి విసరి కొట్టాడు.

వాడు క్రింద పడి పైకి లేచి, వళ్ళు విదలించుకుని, కొమ్ములతో వాలిని కుమ్మేందుకు ఎగిరి దూకాడు. వాడి దూకుడును వాలి తప్పించుకుని పిడిగుద్దులతో వాడిని చంపి, నెత్తురోడుతున్నవాడి కళేబరాన్ని విసరి కొట్టాడు. అలా గాలిలో ఎగురుతున్న వాడికళేబరాన్నుండీ రాలుతున్న కొన్ని నెత్తురు చుక్కలు మతంగ ఆశ్రమంలో పడ్డాయి. ఆయనకు కోపం వచ్చింది. ఆశ్రమ భూమిని అపవిత్రం చేసిన వాడు ఎవడేనా ఇక్కడకువస్తే తల పగిలి పోతుందని శపించాడు మతంగముని. వాలికీ విషయం తెలియడం వలన ఇక్కడకు వాలి రాడు. వాలికి వచ్చిన శాపం నాపట్ల వరం అయింది. నిర్భయంగా ఇక్కడ తల దాచుకున్నా! వాలి వంటి బలశాలితో విరోధం వచ్చిననాకు శాంతి ఎక్కడికి శ్రీరామా?'' అన్నాడు సుగ్రీవుడు.

శ్రీరాముడు మృదువుగా నవ్వాడు.

''శ్రీరాముని బలం ఎంతటిదో నీవూ తెలుసుకోడం అవసరం కదూ సుగ్రీవా?'' అని లక్ష్మణుడు శ్రీరాముని వైపు చూశాడు.

''ఔను! నీకు కలిగిన సందేహం సబబయినదే!'' అని శ్రీరాముడు, దుందుభి కంకాళాన్ని కాలి బొటనవ్రేలితో పది ఆమడల దూరంలో పడేలా తన్నాడు.

సుగ్రీవుని ముఖంలో అసంతృప్తి ఛాయలు ఇంకా కనిపించాయి. శ్రీరాముడు కోదండం ఎత్తి, వాడిగల బాణం సంధించి సాలవృక్షాలమీదకు వదలాడు. ఆబాణం ఆరు సాలవృక్షాలను దూసుకు పోయి, తిరిగి శ్రీరాముని చేరింది.

సుగ్రీవుడు నెమ్మది పొందాడు. ఆయన వాలిని జయించగలడన్న నమ్మకం సుగ్రీవునకు కలిగింది.

సుగ్రీవుడు కిష్కింధకు వచ్చి సింహనాదం చేశాడు. వాలికి ఆశ్చర్యం కోపం కలిగింది. వెంటనే బరికి దిగాడు. ఇద్దరకూ గొప్ప యుద్ధం జరిగింది. క్షణాల్లో సుగ్రీవుడు చావుదెబ్బలు తిని రక్తసిక్తమైన శరీరంతో, ముఖం వ్రేలాడవేసుకుని పరువెత్తుకవచ్చాడు.

''వాలిని చంపడం నీకు ఇష్టం లేకపోతే, వాడితో పోరమని నన్నెందుకు పురికొల్పావు శ్రీరామా? ఈ దెబ్బలు చూడు! ఇవి నాకు తప్పి ఉండేవికదా?''

''సుగ్రీవా శాంతించు! మీరిద్దరి రూపురేఖల్లో, ఆభరణధారణలో నాకు తేడా కనిపించలేదు. నాబాణం తిరుగులేనిది. వాలిని చంపగల బాణం పొరబాటున, నీకు తగిలితే, నాకెంత నష్టం కలుగుతుందో ఆలోచించు. అందుకనే ఊరకుండక తప్పలేదు. లక్ష్మణా! ఈ అడవి పూలతీగెను, సుగ్రీవుని మెడలో విజయమాల వలె అలంకరించు. సుగ్రీవుని గుర్తించే వీలవుతుంది. ఈ మాటు వాలి నాబాణాన్ని తప్పించుకోలేడు సుగ్రీవా!'' అంటూ శ్రీరాముడు ఊరడించాడు.

ఆ తరువాత జరిగిన యుద్ధంలో, విజయమాలవలన సుగ్రీవుడెవరయిందీ శ్రీరాముడు గుర్తించాడు: సూటిగా విడచిన శ్రీరాముని తీవ్రబాణం వాలి గుండెలను చీల్చుక పోయింది. మరణ వేదనతో వాలి మొదలు నరకిన చెట్టులా నేలకూలాడు. బాణం ఎవరు వేశారా అని వాలి అతి కష్టంమ్మీద తల ఎత్తి చూడసాగాడు.

ఇంతలో శ్రీరాముడు వాలిని సమీపించాడు.

''సద్వంశంలో పుట్టావు, ధార్మికుడయిన దశరథుడి కొడుకవు. తపస్సంపన్నుడయిన. మహర్షి వశిష్టుని శిష్యుడవు. గొప్పవీరుడవు. ఇంతటి చరిత్ర కలిగిన నీవు ఔచిత్యం మరచి, ఇంతటి నైచ్యానికి ఎలా ఒడికట్టావు? మరొకడితో యుద్ధం చేస్తున్న నన్ను వెనుక నుండి తాకడం యుద్ధ ధర్మం అని నీకు ఉపదేశించింది ఎవరు? సామాన్య ధర్మం పాటింపని నీవు ఒక వీరుడవా? గడ్డి మాటున ఉన్న కూపం వంటి పాపివినీవు. అపకారం చేయనివాడికి అపకారం చేయడం ఎంతదుష్కృత్యమో నీకు ఎవరూ చెప్పి ఉండరు. నీ భార్యను ఎవరో తీసుకపోయారనీ విన్నాను. సుగ్రీవుని వంటి అల్పుడిసాయంతో నీవేం పొందాలని ఊహించావు? నాతో మాటమాత్రం చెప్పి ఉంటే, ఆ రావణుని చెవులు మెలివేసి క్షణాల్లో నీ భార్యను నీకాళ్లదగ్గర పడవేయ మనకపోయానా? వాడి తలను నీపాదాల చెంత పడవేయక పోయానా? ధర్మభ్రష్టుడవైన నీ చేత నాచావు భగవంతుడు రాసిపెట్టాడు. నా ప్రియపుత్రుడు అంగదుడు దిక్కులేని వాడయినాడు. వాడిని కాపాడు. అది చాలు!'' అంటూ వాలి శ్రీరాముని నిందింపసాగాడు.

శ్రీరాముడు సమాధానంగా ఏం చెప్పాడు? వాలి మృగం అనీ మృగాల వేట, రాజధర్మం అనీ శ్రీరాముడు అన్నట్లుగా చెప్పాడు వాల్మీకి మహర్షి. ఆ వాదనను సమర్థింపలేదు. ఏవో పొడిమాటలతో సరిపెట్టాడు. ఏమయినా భగవంతుడు సర్వనియంత. ధర్మాధర్మాలకు ఆయన అతీతుడు. ఆయన ఏం చేసినా ధర్మమే!

ధర్మం రూపైన పరమాత్మ ఏది చేస్తే అది ధర్మం. అధర్మం అని అనేందుకు అల్పులయిన వారికి హక్కులేదు కూడా! ఒక అవతారంలో ఒక నిర్దుష్టమైన ఉద్దేశం ఉంటుంది. బలి ధర్మాత్ముడే! మహాదాత అయినా, ఆయనను పాతాళానికి అణచివేయక తప్పలేదు. బలికి అసాధ్యం అయిన

మూడడుగుల నేల వామనుడై యాచించి, త్రివిక్రముడై నేలకొలచి, చాలలేదనడం ధర్మమా? ఇది విమర్శలకు అతీతం అయిన విషయం. శ్రీరాముడు వాలిని చంపడమూ అంతేఅవుతుంది. వాలి రావణుని చెవులు మెలివైచి సీతను తెచ్చి రామునకు అప్పగించగలడు. అయితే రాముని పౌరుషం ఏంకాను?

వాలి చెడ్డవాడుకాడే! ఎందువల్ల శిక్షింపవలసివచ్చింది! బలిని పాతాళానికి అణచి ఏదయ ఇంద్రుని పట్ల భగవంతుడు చూపాడో, ఆ దయను, వాలిని చంపి, సుగ్రీవుని పట్ల చూపాడు.

చివరకు వాలి ఇలా అన్నాడు.

''నా జీవితం ముగిసింది. ఇప్పుడు నాకు ఎవరిమీదా కోపం లేదు. మీకు మంగళం కలుగుతుంది. సుగ్రీవా! అంగదుని మన్నించు. తారనూ, ఆమెవివేకాన్నీ కాదనకు!'' అని ప్రాణాలు వాలి విడచి పెట్టాడు.

శ్రీరామానుగ్రహంతో సుగ్రీవుడు రాజ్యం పొంది, పట్టాభిషేకం చేసుకుని సుఖాలు అనుభవించసాగాడు. అతడు శ్రీరామునకు ఇచ్చిన మాట మరచి పోయాడు. అలా వర్షాకాలం గడచి పోయింది.

సుగ్రీవుడలా కావడానికి ఆంజనేయులు చింతిస్తూ రామలక్ష్మణులను సాధు వచనాలతో శాంత పరచసాగాడు.

వర్షాకాలం గడచి పోయినా సుగ్రీవుడు మధువధూ మైకంలో తల మునకలై ఉన్నాడు. అతడికి శ్రీరామకార్యం గుర్తుకూడా లేదు. శ్రీరామ లక్ష్మణుల అతీగతీ సుగ్రీవుడు కాబట్టించుకోలేదు.

శ్రీరాముడు మండి పడుతూ, లక్ష్మణుని, కిష్కింధకు పోయి అమీతుమీ తేల్చుక రమ్మని పంపాడు. అగ్నిలా మండుక పోతూ వచ్చిన లక్ష్మణుని నిరోధించేందుకు ఎవ్వరూ సాహసించలేదు.

అంగదుడు ఎదురై నమస్కరించాడు.

అంగదుని దగ్గరకు తీసుకుని, తలనిమురుతూ లక్ష్మణుడు కొంత శాంతపడ్డాడు.

''నారాక రాజుకు తెలిపి శ్రీరామ సందేశం వినేందుకు ఉన్న పళంగా రమ్మని చెప్పునాయనా!'' అన్నాడు లక్ష్మణుడు.

అంతః పురంలో సుగ్రీవునకు తాగిన మైకం తీరలేదు. అయితే లక్ష్మణుని రాక విన్నతరువాత, అతనిలో మైకం పోయింది. గబుక్కున లేచి కూర్చున్నాడు: కంగారు ఎక్కువయింది.

''వదినా! నీవు చతురభాషిణివి. లక్ష్మణుని కొంచెం సమాధాన పరచిరా వదినా!'' అంటూ సుగ్రీవుడు తారను ప్రార్థించాడు.

తార చిరునవ్వుతూ లక్ష్మణుని సమీపించింది.

''మీరు ఇచ్చిన బిచ్చం లాంటి సుఖభోగాలను – ఎంతోకాలంగా దూరం అయిన సుగ్రీవుడు, ఇప్పుడు లాలసుడై, సాంతం అనుభవిస్తూన్నాడు. కొంచెం శృతిమించిన మాట నిజమే! అయితే

అతడు శ్రీరామకార్యం గురించి అప్రమత్తుడుకాలేదు. సీతాన్వేషణ కొరకు ఎక్కడెక్కడో ఉన్న వానర బలగాన్ని సమీకరించేందుకు ఆజ్ఞలు అతడు ఇచ్చే ఉన్నాడు. లోపలకు దయచేయండి. రాజదర్శనం కలుగుతుంది'' అంది తార.

లక్ష్మణుని కోపం పూర్తిగా పోయింది. లోపలకు వచ్చాడు. సుగ్రీవుడు ఎదురుపడి కౌగలించుకున్నాడు.

''ఆలస్యం జరిగినట్లుంది కొంచెం కదూ? మన్నించవలె! నాసాయం ఎంత? నేను ఎంత? నేనూ నాబలగం లేక పోయినా ఆయన రావణుని సంహరించగలడు. సీతాన్వేషణకు వెంటనే ఏర్పాట్లు చేద్దాం! వర్షాకాలం ముగిసింది. ఇకవెదకడం సులభం అవుతుంది!''

లక్ష్మణుడు ఆనందంతో, ''మంచిపని చేశావు సుగ్రీవా! నీవే స్వయంగా శ్రీరామునితో వచ్చిచెప్పు. అది ఉచితం కూడా!'' అన్నాడు.

''అయితె పద! శ్రీరామదర్శనం చేసుకవద్దాం!'' అంటూ సుగ్రీవుడు బయలు దేరాడు.

శ్రీరామలక్ష్మణులతో సుగ్రీవుడు మాటాడుతూండగా వానరవీరులు గుంపులు గుంపులై రావడం కనిపించింది. ఎలుగులు నడగొండల్లా, కారు మేఘాల్లాగా అట్టహాసాలతో కేరింతలాడుతూ వస్తున్నాయి.

''ప్రభూ! రామ చంద్రా! అదో అటుచూడు. కోటాను కోట్ల సంఖ్యగల వానరవీరులూ, ఎలుగులూ నీ ఆజ్ఞకు ఎదురుచూస్తున్నారు. ఇది నీసేన. మేమంతా నీభృత్యులం! ఆజ్ఞాపించు!'' అని సుగ్రీవుడు చేతులు జోడించాడు.

సుగ్రీవుడి వినయానికి శ్రీరాముడు ఎంతో సంతోషించాడు.

''సీత ఎక్కడఉంది! ఎల్లా ఉంది? రావణుడు ఎక్కడ ఉన్నాడు? ఈ విషయాలు తెలుసుకోవాలి! తగిన విధంగా నీవే ఆజ్ఞాపించు సుగ్రీవా! నీవే కదా రాజువు?''

దక్షిణంవైపు వెదకడం మారుతి వంతు అయింది. సుగ్రీవుడు హనుమంతునితో ఇలా అన్నాడు.

''నీవు సర్వసమర్థుడవు మహాత్మా! నానమ్మకం అంతానీమీద ఉంది. నీవు వాయునందను డవు. ఆయన జవం, శక్తీ నీలో ఉంది. రుద్ర తేజస్సు నీలోఉంది. నీ బుద్ధి బలం, నీ పరాక్రమం నిరుపమానం. వాలి భయంతో గిలగిల్లాడుతున్న నాకు గురువై బోధించావు. స్నేహితుడవై హితం చెప్పావు. దైవమై రక్షించావు. ఈ శ్రీరాముని సుహృల్లాభం నీవల్లనే కలిగింది. ఇప్పుడు ఈ మహాత్ముని ఋణం తీర్చుకునే అవకాశం నీ చేతుల్లో పెడుతున్నాను. తండ్రీ! వాయునందనా! వానరకులానికి కీర్తిప్రతిష్ఠలు నీవల్లనే కలుగవలసిఉంది: ఆ రావణుడు దక్షిణ దిశగా వెళ్లడం మనం కళ్లారా చూశాం. నీవు వెళ్లవలసిందీ ఆవైపు. కార్యం సానుకూలం చెయ్!'' అంటూ చెప్పాడు సుగ్రీవుడు.

శ్రీరాముడు అభిమానంతో, అనురాగంతో మారుతి వైపు చూశాడు. తనవ్రేలి ఉంగరం తీసి మారుతికి ఇచ్చి ఇలా అన్నాడు.

"నాయనా! హనుమా! నా ప్రాణాధికం అయిన సీతను నీవు చూడగలవు. నా ఆనవాలుగా ఈ ఉంగరం ఆమెకు ఇవ్వు! ఆమె నీతో హృదయం విప్పి మాటాడుతుంది".

హనుమంతుడు, శ్రీరామముద్రికను కన్నుల కద్దుకున్నాడు. గంభీరంగా శ్రీరామునివైపు చూశాడు. ఆయన చూపుల్లో ఎదో నమ్మకం సాధించాలన్న పట్టుదల కనిపించాయి.

శతబలి ఉత్తరం వేపుకూ, వినతుడు తూర్పుకూ, సుషేణుడు పడమరకు బయలుదేరారు.

"ఎల్లాగయినా సీత జాడలు తీయాలి. ఒక్కమాసంలోగా ఈ పనిని మీరు చేయవలసి ఉంటుంది!" అని సుగ్రీవుడు ఆజ్ఞాపించాడు.

ఒక నెలకల్లా, మారుతి మినహా మిగిలినవారు తిరిగి వచ్చి సీత జాడలు చిక్కలేదని తెలియచేశారు. హనుమంతుడు మాత్రం తిరిగి రాలేదు.

హనుమంతుడూ, అంగదుడూ, జాంబవంతుడూ మొదలయిన ప్రముఖులు దక్షిణం వేపు వెళ్లారా? కొండలూ, కోనలూ అడుగడుగునా పరీక్షిస్తూ వారు ముందుకు సాగుతున్నారు. ప్రయత్నలోపం ఉండకూడదని వారు దీక్షగా వెదకుతున్నారు.

ఆకలి దప్పులతో ముందుకు సాగుతున్న వారికి ఎదురుగా ఒక కొండ గుహ కనిపించింది. ఆ గుహనుండీ అనేక జాతుల పక్షులు ఎగురుతూ వస్తున్నాయి. చల్లని గాలి వీచడం వలన, లోపల నీరుందని వారు అనుకున్నారు. అసలే దప్పికతో అసలుసులైన వారు కావడం వల్ల వారు లోపలకు ప్రవేశించారు.

గుహలోపల చీకటిగా ఉంది. సూర్యరశ్మి దూసుకరావడం లేదు. అలా వారు ఇంకొంతదూరం పోగా వెలుతురు కనిపించింది. సుందరోద్యాన వనాలూ, రమణీయ హర్మ్యాలూ కనిపించాయి.

ఒక తరుమూలంలో, నారచీరలు ధరించి, కృష్ణాజినమ్మీద కూర్చున్న తాపసి ఒకర్తె దివ్య తేజస్సుతో కనిపించింది.

ఆంజనేయుడు ముందుకు పోయి ఆమెకు నమస్కరించాడు.

"తల్లీ! ఎవరుమీరు? మేం రామకార్యం నిమిత్తంగా తిరుగుతున్నాం. ఆకలి దప్పులతో అలమటిస్తూ, ఏదేనా ఇంత ఫలమో, కాయో చిక్కుతుందని గుహలో ప్రవేశించాం! ఇక్కడి పరిస్థితి చాలా ఆశ్చర్యంగా ఉంది. కారణం తెలియడం లేదు తల్లీ!" అన్నాడు.

"ఇక్కడ మీరంతా ఆకలి దప్పులను తీర్చుకోండి! ఈ నగరాన్ని మయుడు నిర్మించాడు. నా చెలికత్తె హేమకు కానుకగా అతడు ఇచ్చాడు. నాపేరు స్వయంప్రభ!" అంది ఆమె.

వానరులు తృప్తి తీరా భోజనాదులు చేశారు.

"మీకు తెలియక ఈ గుహ ప్రవేశించారు. ఈ లోపలకు వచ్చిన వారెవరూ ప్రాణాలతో బయటకు పోలేదు. కానీ మీరు ఓ సత్కార్యం నిమిత్తంగా వెళుతున్నారు. అంచేత మీరందరనూ నా తపశ్శక్తితో బయటకు పంపుతాను. కండ్లు మూసుకోండి!" అంది స్వయంప్రభ.

స్వయంప్రభా ప్రభావంతో వానరులు దక్షిణ సముద్రతీరానికి వచ్చి చేరారు. అక్కడకు వచ్చిన తరువాత ఏం చేయవలెనో వారికి తోచలేదు. సీత జాడలు తీయలేక పోయినందుకు సుగ్రీవుడు, తమను ముఖ్యంగా తనను దండిస్తాడని అంగదుడు భయపడి ప్రాయోపవేశానికి తూర్పుముఖమై కూర్చున్నాడు.

అంగదుడలా పంతం పట్టి కూర్చోడంతో, మిగతా వానరులు వాపోవసాగారు. ఈ గందరగోళాన్ని దూరంలో ఉన్న సంపాతి చూస్తున్నాడు. ఈ సంపాతి జటాయువు సోదరుడు. కడువృద్ధుడు. చిన్నతనంలో జటాయువూ, సంపాతీ పోటీపడి సూర్యమండలం వైపుకు ఎగురుతూండగా, సూర్యశక్తికి, జటాయువు కాలి పోవడంచూసిన సంపాతి, తన రెక్కలను అడ్డం పెట్టి జటాయువును రక్షించాడు. అయితే తన రెక్కలను కాల్చుకున్నాడు. అంచేత అతడు, రెక్కలు లేకపోవడంతో ఎగురలేడు. పెద్ద ప్రయత్నం లేకుండా లభించే జలచరాల్లాంటి వేవో కాసిని తిని కడుపు నింపుకుని కాలక్షేపం చేస్తున్నాడు. ఇప్పుడు ఇందరు వానరులు ప్రాయోపవేశానికి కూర్చోడం చూసి తనకు కావలసినంత ఆహారం చిక్కుతుందని సంపాతి సంతోషించాడు.

ఇంతలో వానరులు దీనికంతా కారణం గురించి ఆరాతీయడానికి పూనుకున్నారు. శ్రీరాముని వృత్తాంతం – ఆయన అడవికి రావడమూ, సీతాపహరణం. జటాయు మరణం, సుగ్రీవమైత్రీ వగైరా విషయాలు వారు మాటాడుకోడం జరిగింది.

జటాయువుమరణవార్త సంపాతికి పిడుగులా తగిలింది. అతడు విలవిల్లాడుతూ, "ఎవరామాటాడేది? జటాయుమరణం ఎలా సంభవించిందో, కాస్త వివరంగా చెప్పరూ?" అంటూ కేకవేశాడు.

ఎవరూ లేరనుకున్న నిర్జన ప్రాంతంలో మాటలు వినిపించేసిరకి వానరులు ఆశ్చర్యపోయారు. వారు సంపాతిని సమీపించారు.

హృదయాలు విప్పి మాటాడుకోడంతో ఒకరినొకరు ఆప్తులైనారు. సంపాతి కడువృద్ధుడు అయినా, అతని సునిశిత దృష్టికి లోపం రాలేదు. లంకలో అతడు సీతను స్పష్టంగా చూడగలిగాడు. సీత గురించి, అతడు వానరులకు చెప్పాడు.

వానరులు సంతోషం కొద్దీ గంతులు వేశారు. ఈ సత్కార్యం చేయడం మూలాన సంపాతికి, ఎప్పుడో కాలిపోయిన రెక్కలు కొత్తగా మొలుచుకవచ్చాయి.

సముద్రం దాటడం, లంకను చేరడం, సీతకు రాముని సందేశం వినిపించడం వానరులకు కష్టంగా తోచింది. సముద్ర పరిమితి నూరు యోజనాలు దాకా ఉంది. అంతదూరం ఎగరడం. తిరిగి అంతదూరం ఎగిరిరావడం, వారికి అనుకున్నంత తేలిక అయిన విషయంగా అనిపించలేదు. తమవల్ల కాదంటే, తమవల్ల కాదని వారు తెగేసి చెప్పారు. మరి ఎవరు దాటగలరు? హనుమంతుడయితే దాటగలడు. అతడేమో మౌనంగా దిక్కులు చూస్తున్నాడు. జాంబవంతునకు హనుమంతుని శక్తి సామర్థ్యాలు చక్కగా తెలుసు.

అంచేత అతడు హనుమంతుని దగ్గరకు పోయి ఇలా ప్రార్థించాడు.

"నీకేమో అంతులేని లంఘనశక్తి ఉంది. మాకెవ్వరికీ చేతకాని పని నీవుసులభంగా చేయగలవు. గరుడుని రెక్కల కున్నంతశక్తి నీభుజాలకు ఉంది. వాయువేగం నీతండ్రినీకిచ్చిన వరం. నీకు గుర్తులేదేమో, పురిటి పాపవై ఉన్నప్పుడు, ఆకాశంలోని సూర్యుని పండుగా భావించి, అందుకోవలెనని ఎగిరావు. సూర్యుని మీదకు నీవు రావడం చూసి ఇంద్రుడు కోపించి, వజ్రాయుధంతో నీముఖమ్మీద కొట్టాడు. ఆ పాటుకు నీవు పర్వతమ్మీద పడ్డావు. బండరాళ్లు చూర్ణం అయ్యాయి. నీకుడి చెంపకు గట్టి దెబ్బ తగిలింది. నీవు మూర్ఛ పొందడం చూసిన నీతండ్రి వాయుదేవుడు స్తంభించి పోయాడు."

"అప్పుడు గాలి అందక సర్వప్రాణులూ విలవిల్లాడి పోయాయి. విధిలేక దేవతలు బ్రహ్మను ముందు పెట్టుకుని, వాయుదేవుని ప్రార్థించారు: ప్రాధేయపడ్డారు. వాయుదేవుడు ప్రసన్నుడైనాడు. బ్రహ్మదేవుడూ, ఇంద్రుడూ నీకు వరాలిచ్చారు. బ్రహ్మాయుధం లాంటివీ నిన్నేమీ చేయలేవు. నీవు చిరంజీవివి. రుద్రవీర్య సంభూతుడవు నీకు వల్లమాలిన పని అంటూ లోకంలో లేదు. నీకు ఎంతటి బలం ఉందో నీకు తెలియదు. నాయనా! హనుమా! నాకూ ఒకప్పుడు కొంచెం బలం ఉండేది. ఇప్పుడు ముసలివాడినైనానా? ఇంకా బలం ఎక్కడిదీ? నీవు విజృంభించు! ఈ సముద్రం నీకో లెఖ కాదు. ఇలాంటి వేయి సముద్రాలనైనా అనాయాసంగా లంఘనం చేయగలవు. ఇప్పుడు నీవు తప్ప మాకు వేరు గతిలేదు. మారుతీ! నీకు శరణాగతులం. శ్రీరామ కార్యం చక్కబెట్టగల దిట్టవు నీవే నాయనా! శ్రీరామచంద్రుని ఆశీస్సులు నీకున్నాయి. నీకు సదా మంగళం కలుగుతుంది."

జాంబవంతుని మాటలకు హనుమంతుడు పొంగి పోయాడు. ఆ పొంగి పోవడం ఎదో ఆయన శరీరంలో స్పష్టంగా కనిపించింది. ఆశ్చర్యకరంగా ఆయన శరీరం పెరిగింది. ఆయన బృహద్రూపం ఆనాటి త్రివిక్రమరూపానికి ప్రతిరూపం వలె కనిపించింది. ఆయన దివ్య శరీరాన్నుండీ వెలువడిన కాంతిపుంజాలు, సూర్య ప్రభలవలె దిక్కులను తాకాయి.

వానరులు ఆనందంతో కేరింతలాడుతూ, మారుతి చుట్టూ చేరి నృత్యం చేయసాగారు.

"మీరు ఆజ్ఞాపించిన విధంగా లంకకు వెళతాను. సీతా మాతను గుర్తిస్తాను" అని హనుమంతుడు మహేంద్ర పర్వతం ఎక్కాడు. వాయువునూ, బ్రహ్మాది దేవతలను స్మరించాడు. కుప్పించి ఎగిరాడు ఆయన వేగానికి కొండమీది అడవి పూలు రాలి, పూలవాన కురిసినట్లు ఆయన శరీరాన్ని ముంచి వేశాయి.

వాయునందనుడు సముద్రమ్మీద ఎగురుతూండగా ఉన్నట్లుండి మైనాకపర్వతం పైకి లేచింది. ఈ అడ్డం ఏమిటా అని ఆయనచేత్తో మృదువుగా చరిచాడు.

"నాయనా హనుమా! నీకు ఆటంకం కలిగించాలని నేను రాలేదు. నీవు అలసి పోతే, నామీద ఓ క్షణకాలం విశ్రమించు! సముద్రుడు నీకు సాయపడమని కోరగా నేను పైకివచ్చాను. ఒకనాడు

ఇంద్రుడు పర్వతాల రెక్కలు తెగనరికాడు. ఆసమయంలో నేను నీతండ్రి వాయుదేవుని సాయంతో ఇక్కడ తలదాచుకున్నాను. నేను నీ శ్రేయోభిలాషిని!'' అన్నాడు మైనాకుడు.

''విశ్రమించే వ్యవధిలేదు తండ్రీ! మన్నించు! మీ ఆదర వాక్కులే చాలు! శెలవు!'' అన మారుతి ముందుకు దూసుకు పోయాడు.

ఓ పెద్ద రక్కసి కొండంత నోరు తెరచి, ''నానోర ప్రవేశించు! పెద్ద కాలంగా తిండిలేదు. దైవం పంపినట్లు నేడునీవు చిక్కావు'' అంది.

''నన్ను అడ్డగించకు!''

''వీలులేదు! నన్ను దాటి పోలేవు! నాకు ఆహారం కావాల్సిందే!'' అంటూ ఆ రాక్షసి నోరంతా తెరచింది.

హనుమంతుడు, తన శరీరాన్ని అపారంగా పెంచాడు. అదేవిధంగా రాక్షసీ నోరు పెద్దది చేసింది. హఠాత్తుగా హనుమంతుడు చిన్ని రూపం ధరించి, రాక్షసి గుహలాంటి నోర ప్రవేశించి, క్షణమాత్రంలో ఇవతలకు వచ్చాడు.

''నీకోరిక తీరిందా తల్లీ? నీనోరప్రవేశించాను కదా? ఇక వదలు.''

ఆ రాక్షసి నాగమాత సురస. దేవతల కోరిక పై హనుమను పరీక్షింపాలని వచ్చింది.

''హనుమా! నీవు గెలిచావు. బుద్ధిమంతుడవు. శ్రీరామకార్యం నీవల్ల నెరవేరుతుంది. విజయుడవై తిరిగి వస్తావు!'' అంది సురస.

అలా ముందుకు సాగుతున్న ఆయన వేగానికి ఉన్నట్టుండి అవరోధం కలిగింది. కారణం ఏమిటా అని ఆయన కలయచూశాడు. సముద్రం మీది తన నీడను పట్టుకున్న ఒక భూతం కనిపించింది.

పెద్ద నోరుతెరచి, ''దిగిరా! నిన్ను మింగుతా!'' అంటూ ఆ భూతం గర్జించింది.

హనుమంతుడు ఆ రాక్షసి నోర ప్రవేశించి, గోళ్లతో దాని కడుపు చీల్చి, చంపి, ఇవతలకు వచ్చాడు.

మరే ఆటంకం లేకుండా ఆయన లంక చేరాడు. తన బృహద్రూపాన్ని ఉపసంహరించి, సూక్ష్మరూపం ధరించిన ఆయనకు నగరాధిదేవత లంకిణి ఎదురయింది.

''ఎవరునీవు? ఇక్కడకు ఎందుకు వచ్చావు కోతీ?'' అని లంకిణి గద్దించింది.

''నేను కోతినే! చాపల్యం కొద్దీ, లంకను చూడవచ్చాను. చూసి మరీ వెళతాను!''

''లోపలకు ప్రవేశం లేదు. తిరిగి వెళ్లు!'' అని లంకిణి హనుమంతుని చెంపమీద కొట్టింది.

కోపంతో రుద్రుడు అయిన మారుతి, పిడికిళ్లు బిగించి లంకిణి డొక్కలో పొడిచాడు. ఆపోటుకు లంకిణి కండ్లు బైర్లుకమ్మాయి. నేలమీద పడిపోయి, ఓ నిముషానికల్లా ఆమె లేచి నుంచుంది.

హనుమంతుడనే వానరం చేత ఏనాడు ఓడి పోతావో, ఆనాడే లంకకు అవసానం దాపురిస్తుందన్న బ్రహ్మవాక్కు ఆమెకు జ్ఞాపకం వచ్చింది.

"రావణునకు పోగాలం దాపురించిందన్నమాట!" అనుకుంది లంకిణి.

"వెళ్లు హనుమా నీకు అడ్డురాను!" అని ఆమె తోవ విడచింది.

లంకిణి లంకానగరాధి దేవత. ఆమె రావణుని సేవకురాలు కాదు. ఆమె అతని అదృష్టదేవత. మారుతి లంకా ప్రవేశంతో రావణుని అదృష్టం నేలపాలయింది.

లంకయావత్తూ ఆయన గాలించాడు. చివరకు రావణుని అంతఃపురం వెదకాడు. ఎందరో లావణ్యవతులు, సుందరాంగులూ అగ్నిలా వెలుగుతూన్న రావణుని పరివేష్టించి వళ్లు మరచి నిద్రపోతున్నారు. అక్కడా ఆయనకు సీతాదేవి కనపడలేదు.

ఉద్యానవనాలూ, తోటలూ, దొడ్లూ వెదకాడు. చివరకు ఆయన రమణీయమైన అశోకవనం ప్రవేశించాడు.

రాక్షసజనపరీవృతా, ఆర్ద్రనేత్రా, శోకపరితప్తా అయిన ఒక స్త్రీ అంతరాత్రప్పుడు మేలుకొని, ఒక చెట్టుక్రింద కూర్చుని కనిపించింది. ఆమెసీత కాబోలు అనుకున్నాడు. ఆ చెట్టు ఎక్కి చూస్తూ కూర్చున్నాడు.

ఇంతలో తెలతెలవారుతోంది. సూర్యకిరణాలు నులి వెచ్చగా దూసుక వస్తున్నాయి. దివ్య తేజస్సుతో అపర సూర్యుని వలె ప్రకాశిస్తూ అంతఃపురస్త్రీలు పరివేష్టించి రాగా రావణుడు అక్కడకు వచ్చాడు.

"ఎవరికీ తలవంచని రావణుడు, తన సంపదనూ, రాజ్యాన్నీ నీ పాదాల ముందు పణం పెట్టి, ప్రతిఫలంగా నీ ప్రేమను కోరుతున్నాడు. కనికరాన, ప్రియమార ఒక్కసారి నన్నుచూడు. సురభోగాలు నీ సొంతం చేస్తాను. సురభామలను నీకు దాసీజనంగా చేస్తాను. ఆ మానవ కీటకం గురించీ మరచిపో, వ్రతాలూ, నియమాలూ పెట్టుకుని ఎందుకు కృశించి పోతావు?" అంటూ రావణుడు మృదువుగా తన ప్రేమను వెల్లడించాడు.

"మహాత్ముడయిన వారికి భార్యనయిన నేను, నీ ఐశ్వర్యానికీ, నీ అహంకారానికీ ప్రలోభ పడతానని ఎలా అనుకున్నావు? ధర్మం చెయ్! అది నిన్ను, నీ వంశాన్నీ రక్షిస్తుంది! లేకపోతే దుంపనాశనం పొందుతావు. నీవు మానవకీటకం అని ఎవరిని, ఉద్దేశించి అన్నావో అతడు మహోదారుడు. పురుషోత్తముడు, పుణ్యపురుషుడు, ధర్మమూర్తి! ఆయన చరణ ధూళికైనా నీవు సరిపోలవు. ఆయన పాదాలమీద పడి తప్పు ఒప్పుకో! నన్ను గౌరవంగా అప్పగించు. బతికి పోతావు. నీవంశం నిలుస్తుంది!" అని సీతముఖం తిప్పుకుంది.

"సీతా! ప్రేలాపన చాలించు! ఆ కటిక దరిద్రుడి వల్ల ఏం సుఖపడ్డావో ఆలోచించు. కందమూలాలూ, కాయగూరలూ తిని కృశించి పోవడమే నీముఖాన గీచి ఉంది కాబోలు. అందుకే నీవిలా వాగుతున్నావు. నీకు ఓ రెండు నెలలు గడవు. మనస్సు మార్చుకున్నావా బతికి పోతావు. లేకపోతే ఈ రాక్షస స్త్రీలు నిన్ను అప్పడంలా నమలి వేస్తారు. జ్ఞాపకం పెట్టుకో!" అంటూ అతడు విసవిసా కదలి పోయాడు.

సీత మోకాళ్లమీద తలపెట్టుకుని సన్నగా ఏడవసాగింది.కేశపాశాలతో గొంతుకు ఉరిబిగించుకుని ఆత్మహత్యప్రయత్నం చేసుకోబోతుంది.

చెట్టుచిటారు కొమ్మల్లోంచి, మారుతి ఆమెనూ, ఆమెనిస్సహాయతనూ చూస్తున్నాడు. ఆమెకు తానెవరో తెలిపి, ధైర్యం పాదుకొల్పి శ్రీరామ సందేశం వినిపించడం మంచిది అని అనుకున్నాడు ఆయన.

"దేవతలకు దీటైన రాజు దశరథుడు. ఆయన భార్యకు ఇచ్చిన మాట నిలబెట్టేందుకు, ఆయన కొడుకయిన శ్రీరాముడు, రాజ్యాన్ని తృణప్రాయంగా త్యజించి, అడవికి వచ్చాడు. ఆయన వెంట సతిసీతా, సోదరుడు లక్ష్మణుడూ అడవికి వచ్చారు. మునివృత్తిలో ఉన్న వారి జీవితాల్లోకి రావణుడు ధూమకేతువువలె ప్రవేశించాడు. సీతా మాతను దొంగవలె వచ్చి ఎత్తుకు పోయాడు. ఆమె జాడలు తెలియక శ్రీరాముడు వెదకుతూండగా సుగ్రీవుడన్న వానర రాజు సుహృల్లాభం కలిగింది. సుగ్రీవుడు సీత జాడలకై తన బలగాన్ని నలుదిక్కులా పంపాడు. ఆయన పంపగా నేను ఇక్కడకు వచ్చాను. రఘురాముడు తన దేవి గుణరూపాలను వర్ణించి వర్ణించి చెప్పగా విన్నాను. తదను రూపమైన దేవి ఇక్కడ కనిపిస్తోంది!" అని వాయుపుత్రుడు మౌనం వహించాడు.

ఆ తల్లి ఆ మాటలు విని పులకరించిపోయింది. ఆనందవీచిక స్పృశించిన అనుభూతి ఆమెకు కలిగింది. ఎవరు ఆ గానం చేశారో తెలుసుకుందామని ఆమె తలఎత్తి పైకి చూసింది: మిలమిలామెరిసే కన్నులతో, తన వైపుచూచే చిన్న వానరం చెట్లు గుబురుల్లో ఆమెకు కనిపించింది.

ఆ సమయంలో అంజనీసుతుడు చెట్టుదిగి క్రిందకు వచ్చాడు. ఆమె ముందుకు వచ్చి చేతులు కట్టి నుంచున్నాడు.

"తల్లీ! నీకు మంగళం కలుగుతుంది. నీవెవరు? ఎందుకు చెట్టుక్రింద శోకమూర్తివై కూర్చుని ఉన్నావు? జనస్థానం నుండీ అపహరింపబడ్డ సీతామాతవు నీవుకాదుకదా?" అని అడిగాడు ఆంజనేయులు.

"ఆ అభాగ్యురాలను నేనే తండ్రీ!"

"కృతార్థుడను తల్లీ! నా పుణ్యవశాన నీ దర్శనం కలిగింది!"

అంతలోనే ఆమె మనస్సుకు, అదొక రాక్షస మాయ అనిపించింది. బంగారు లేడి ఉదంతం జ్ఞాపకం వచ్చింది. ఈ వానర వేషంలో, ఎవరో మాయావి వచ్చాడని ఆమె అనుకుంది.

నిస్సహాయులకూ, బలహీనులకూ సందేహాలు అనేకం కలగడం సహజం!

"నిజంగా నీవు రామదూతవేనా? నిజం చెప్పు! నీ ముఖంలోకి చూస్తే నీ నిర్మల హృదయం ప్రతిఫలిస్తూంది. నీముఖం చూసి రాక్షసమాయగా అనుకోలేక పోతున్నా: ఒకసారి చావు దెబ్బతిన్నాను నాయనా! పవిత్రుడయిన లక్ష్మణుని అనరాని మాటలు అన్నాను. ఆ సజ్జనుడి మనస్సును గాయపరచిన ఫలితం ఇలా అనుభవిస్తున్నాను. భర్తకు దూరం అయ్యాను. ఇక నేను

పోగొట్టుకోవలసినది అంటూ నాదగ్గర ఏమీ మిగల్లేదు నాయనా! ఓ రెండు నెల్లలోగా నా దైవం నన్ను కాపాడరాలేక పోతే వీళ్లు నన్ను బతకనివ్వరు!''

హనుమంతుడు అనేక దృష్టాంతరాలు వివరించాడు.

''తల్లీ! ఇదో ఇటుచూడు! స్వామి తన గురుతుగా ఇచ్చిన ముద్రిక!'' అంటూ ఆయన ఉంగరాన్ని ఆమె చేతుల్లో పెట్టాడు.

సీత ఉంగరం అందుకుని కండ్లకు అద్దుకుంది. ఆ ఉంగరంతో మారుతి మీద పూర్ణ విశ్వాసం ఆమెకు కలిగింది. ఆమె కండ్లలో, హృదయంలో ఆనందం తొణికిసలాడింది.

వాత్సల్యంతో ఆమె అతని వైపు చూసింది. ఆ తల్లి పరిపూర్ణ కటాక్షవీక్షణం హనుమంతుని మీద ప్రసరించడంతో ఆయన మనస్సులో ఆనందం నిండుకుంది.

''సందేహం కొద్దీ నీమనస్సు గాయపరచాను నాయనా! భయం వల్ల నేను నేనుగా లేను. ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని బతుకుతున్నా! అదీ ఒక రెండునెల్లు మాత్రమే! ఈ లోగా నా స్వామి వచ్చి నన్ను రక్షింపవలె! నాబాధ, ఆర్తి తీర్చవలె!''

''తల్లీ! నీవు ఆజ్ఞ ఇస్తే ఈ క్షణంలో నిన్ను నా తండ్రి చెంత చేర్చగల. దేవతలకు అగ్ని హవిస్సు అందించిన విధంగా శ్రీరాముని చెంత నిన్ను చేర్చగలను!'' అన్నాడు మారుతి.

సీతాదేవి ఆశ్చర్యంతో కండ్లింత చేసుకుని మారుతి వైపు చూచింది. ఓ చిన్న వానరం తనను ఎల్లా తీసుక పోగలదు? అని ఆమె ఆశ్చర్యపోయింది. ఆమె ఆశ్చర్యం ఆయనకు తెలిసింది.

తనశక్తి ఎంతటిదో, ఆమెకు చూపి, ఆమెలో ఆత్మ విశ్వాసం పాదుకొల్పవలెనని ఆయన నిశ్చయించాడు.

తన శరీరాన్ని అనంతంగా ఆయన పెంచాడు. భూవ్యోకాశాలకు వారధి వలె ఆయన విరాడ్రూపం శోభించింది.

''నాయనా! వాయునందనా! నీ అపూర్వ శక్తి గ్రహించాను. నీతో వస్తే, నాపతి వీరత్వం ఏంకాను? నా పతిదేవుడు వీరోచితంగా పోరాడి, వీరిని దండించి, నన్ను తనతో తీసుక పోవలెననుకుంటున్నాను తండ్రీ! ఒక భీరువులా, ముచ్చులా, దొంగలా ఇక్కడినుండీ పారిపోవడం ఉచితం కాదు. నీవు తిరిగి వెళ్లు. నాపతినీ, వానరసేననూ వెంటపెట్టుకరా!''

''మంచిది తల్లీ! నీకోరిక నెరవేరుతుంది. ఆనవాలుగా ఏదేని ఇవ్వవా తల్లీ?''

ఆమెకు గత స్మృతులు ఎన్నో జ్ఞాపకం వచ్చాయి. అంతలోనే విషాదకాళిమలు ముఖంలో గూళ్లు కట్టుకున్నాయి. కన్నీళ్లు పెట్టుకుంది. తల్లిదండ్రులకు చెప్పుకున్నట్లు, ఎన్నో జ్ఞాపకాలు, ఎన్నెన్నో స్మృతులు మారుతి ముందు ఆతల్లి తవ్వి పోసింది.

''నాయనా! నా పెండ్లినాడు, మా తల్లి ఇవ్వగా, మా మామగారు స్వయంగా నా తలలో అలంకరించిన చూడామణి ఇది. ఈ ఆనవాలు చాలు తండ్రీ!'' అని ఆమె తనచూడామణి హనుమ చేతుల్లో పెట్టింది.

హనుమంతుడు "మహా ప్రసాదం తల్లీ!" అంటూ కండ్ల కద్దుకుని భద్రపరిచాడు.

ఉత్తర ప్రాకారం ఎక్కి కూర్చున్న మారుతి ఆలోచించాడు. తన రాకను నలుగురకూ తెలుపకుండా వెళ్లడం అనుచితం అనుకున్నాడు. ఏదో గుర్తుపెట్టుకునేలా లంకలో చేయవలె. ఏం చేయాలి?

మారుతి తన శరీరం పెంచి, కన్నుల పండువుగా ఉన్న అశోక వనాన్ని ధ్వంసం చేయసాగాడు. సమూలంగా చెట్లుపీకి, లతలు త్రుంచి, క్రీడా సరోవరాలు బూడ్చి, అలంకారాలు విరగగొట్టి, కట్టడపు పునాదులు పెకలించి, అశోకవనాన్ని అల్ల కల్లోలం చేసి ఆంజనేయుడు సింహనాదం చేశాడు.

"సీత కోసం ఒక కోతి వచ్చింది ప్రభూ! ఆమెతో గుసగుస లాడింది. అది చాలక అశోకవనం పీకిపందిరి పెడుతూంది మహాప్రభూ! రక్షించండి!" అంటూ వన పాలకులు మొరలు పెట్టారు.

రావణుని ఆజ్ఞమేరకు అనేక రాక్షసులు గదలూ, ముసలాలు, కత్తులూ, శూలాలు తీసుకుని బయలుదేరారు.

హనుమంతుడు సింహనాదం చేసి, ద్వారానికి ఉన్న ఇనుపగదను పెకలించి రాక్షసులను ఎడాపెడా వాయించాడు.

హనుమంతుడి ధాటికి సామాన్య రాక్షసులు చాలరని, ప్రహస్తకుమారుడు జంబుమాలిని రావణుడు పంపాడు. జంబుమాలి కవచం ధరించి, అలంకారాలు అవీ చేసుకుని ఆయుధాలనేకం తీసుకుని, పెండ్లికి వచ్చినట్లు వచ్చాడు.

అంజనీతనయుడు చేసే గర్జనలకు లంకానగరం యావత్తూ మార్మోగి పోతూంది.

శ్రీరామ చంద్రునకూ జై..! సీతామాతకూ జై! సుగ్రీవునకూ జై" అంటూ ఆయన బాకా ఊదినట్లు జయజయ ధ్వానాలు చేయసాగాడు.

జంబుబాలి తీవ్రబాణాలనేకం మారుతిమీద విడచాడు. అయితే మారుతి మండపంలోని ఇనుప గుదియను పెకలించి, జంబుమాలినీ అతడి రథాన్నీ నుగ్గునుగ్గు చేశాడు.

ఈ మాటు రావణుని కొడుకు అక్షయకుమారుడు వచ్చాడు. వాడిగతీ అంతే అయింది. తన కొడుకు మరణం విన్నాక, రావణుని గుండెల్లో గుబులు చెలరేగింది... ఒక కోతిని పట్టుకునేందుకు ఇంత శ్రమా? అని అతడు లోలోపల ప్రశ్నించుకున్నాడు.

ఇంద్రుని జయించి ఇంద్ర జిత్తని పేరుపొందిన మేఘనాదుడు చివరకు యుద్ధానికి వచ్చాడు. అతడు రావడంతోనే మామూలు ఆయుధాలు మారుతి ముందు పనిచేయవని గ్రహించాడు. బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు.

బ్రహ్మనుగౌరవించేందుకు, మారుతి ఓ ముహూర్తకాలం అచేతనుడైనాడు. బ్రహ్మాస్త్రం ఒక ముహూర్తకాలం వరకూ అతనిని బాధిస్తుంది.

హనుమంతుడు అచేతనుడుకావడం చూసిన రాక్షసులు సంతోషంతో చిందులు వేస్తూ, అతడు చనిపోయాడని తలచి కోలాహలంగా జయజయ ధ్వానాలు చేస్తూ తాళ్లతో బంధించి, రావణసభకు ఈడ్చుకవచ్చారు.

''ఎవరు నువ్వు?'' అని ప్రహస్తమంత్రి అడిగాడు.

''నేను శ్రీరాముని సేవకుడను. దాసానుదాసుడను. మీ రాజును చూడగోరి మరో మార్గం లేక ఇలా చేశాను!''

''ఎందుకు చూడాలనిపించింది?''

''బుద్ధి చెప్పేందుకు! మీ రాజు బుద్ధి పెడతలపట్టింది. శ్రీరాముని భార్యను దొంగిలించుక వచ్చాడు. శ్రీరామునకూ సుగ్రీవునకూ మైత్రి కలసింది: ఈ కారణంగా, మా రాజు సుగ్రీవుడు భ్రాతృవాత్సల్యంతో హితం చెప్పి పంపాడు. శ్రీరామ భద్రుడు శరణు అంటే, రక్షించగలడు: కాపాడగలడు. మీరు చేసిన అధర్మానికి, పశ్చాత్తాపంతో రాముని శరణ పొందండి! సగౌరవంగా సీతా మాతను అప్పగించండి. బతికి పోతారు.: బంధు నాశనం, కుల నాశనం తప్పుతుంది. దూతగా ఇది నా సందేశం!''

రావణుడు నిప్పులు రాల్చుతూ చూడసాగాడు.

''ఈ దూత చర్మం ఒలిపించండి'' అని ఆజ్ఞాపించాడు.

ఆ సమయంలో విభీషణుడు ఆసనమ్మీదినుండీ లేచి, చేతులు జోడించాడు ''మహారాజా! దూత అయిన వాడు ఎంత నేరం చేసినా వధార్హుడు కాడు. వానరం అయిన ఇతనికి దండన విధించడం మంచిది!''

''అయితే వీడితోకకు నిప్పు ముట్టించి తరిమికొట్టండి!''

రాజాజ్ఞానుసారంగా భటులు, హనుమంతుని తోకకు తైల వస్త్రాలు చుట్టి, నిప్పు ముట్టించి వీథుల్లో తిప్పసాగారు.

ఈ విషయం విన్న సీతాదేవి అగ్నిదేవుని ప్రార్థించింది.

''నాలో పుణ్యం ఏదేనా మిగిలి ఉంటే హనుమంతుని పట్ల నీదహన శక్తి ఉపసంహరించు ప్రభూ!''

ఉన్నట్టుండి భగభగమండే తోక, శీతలత్వం వహించడం మారుతికి ఆశ్చర్యం కలిగింది. అది సీతాదేవి కరుణ అని అతడు గ్రహించాడు. మనసా ఆ దేవికి నమస్కరించాడు.

హనుమంతుడు రాక్షసుల బారినుండీ తప్పించుకుని ఒక సౌధాగ్రం చేరి, అక్కడ నిప్పుముట్టించాడు. మరొక ఇంటికీ ఎగిరి అగ్ని రగలించాడు. ఒకదానిమీద మరొకటిగా యావత్తు లంకా నగరాన్నీ పరశురామప్రీతి చేస్తూ లంకనంతా క్షణాల్లో భస్మం చేశాడు. విభీషణుని ఇల్లు మాత్రం కాలిపోలేదు. ఆయన సముద్రం చేరి తోకచల్లార్చుకున్నాడు.

శింశుపాతరునీడల్లో సురక్షితంగా ఉన్న సీతా దేవిని చూసి ''తల్లీ! శెలవు! పోయి వస్తాను!'' అన్నాడు ఆయన.

''నిజమైన వీరుడవంటే, నీవే నయ్యా హనుమా! నా దుఃఖ నివారణ చేయగలవాడవూ నీవే తండ్రీ! నీకు మంగళం కలుగుతుంది.'' అంది సీత.

సీత శెలవు పొంది సముద్రం దాటి, మహేంద్ర పర్వతం చేరి ఆనందంతో ఆంజనేయులు సింహనాదం చేశాడు. ఆయన రాకను చూసి వానరులు బిలబిల్లాడుతూ చేరవచ్చారు. తన విజయ వృత్తాంతం సొంతం వారికి తెలియ చేశాడు.

వారంతా కిష్కింధ చేరి, ఆకలితీర్చుకునే నిమిత్తం రాజుగారి తోట అయిన మధువనం ప్రవేశించారు. వన రక్షకులు ఆపుతున్నా ఆగక, వారు కోలాహలంగా, చెట్లకొమ్మలు విరచి, పండ్లు తిని, కాయులు కొరికి, తెనెలు తాగి, గంతులు వేస్తూ పూలు తుంపి, ఒకళ్ళమీద ఒకరు చల్లుకుంటూ, ఎంతో హంగామా చేశారు.

వారి ఆనంద కోలాహలాన్ని తెలుసుకున్న సుగ్రీవుడు, ''వారు విజయులై తిరిగి వచ్చారు. అందువల్లనే మధువనం చేజిక్కించుకున్నారు!'' అన్నాడు.

శ్రీరాముడు తృప్తిగా నవ్వాడు. మారుతి రాకకు ఎదురుచూడసాగాడు.

ఇంతలో మారుతి అక్కడకు వచ్చి సాంజలి అయి ''కంటిని సీతను!'' అన్నాడు.

శ్రీరాముని ఆనందానికి అవధిలేక పోయింది. తన ఎదుట సీత ఉన్నంత సంతోషం ఆయన అనుభవించాడు. మారుతిని గాఢంగా హృదయానికి హత్తుకుని, ''ఇంత సాయం చేసిన నీకు నేనేం ప్రత్యుపకారం చేయుగలను నాయునా?'' అంటూ, ఆనంద భాష్పాలు మారుతి శిరస్సు మీద శ్రీరాముడు వర్షింపసాగాడు.

ఆయన కౌగలింతకు పులకింత పొందిన మారుతి తలవంచుకున్నాడు.

ఉత్తర ఫల్గుణీ నక్షత్రం కూడిననాటి మధ్యాహ్న సమయంలో కపిసైన్యం కదలింది. ఎంతో ఉత్సాహంతో, ఎంతో ఆనందంతో సుశిక్షితులైన వానర సైన్యం నడచింది.

మహేంద్ర పర్వతం చేరగానే సముద్రం కనిపించింది. సముద్రం దాటడం ''ఎల్లాగా?'' అని అందరూ మథన పడసాగారు.

హనుమంతుడు చూడవచ్చి కాల్చిపోయిన నాటి లగాయితూ లంకలో కలవరం చోటు చేసుకుంది. అందరి హృదయాల్లో ఏదో భయం, ఏదో బాధ కలిగింది. రావణుడు మంత్రాలోచన తీవ్రం చేశాడు.

ప్రముఖ వీరులందరూ రావణు ప్రతిభనూ శౌర్యప్రతాపాలను తెగపొగిడి తుది విజయం మనదే అన్నారు.

విభీషణుడు మాత్రం, ''ఇప్పుడు కూడా సమయం మించి పోలేదు. నేను నీ

తమ్ముడిస్థాయిలో, హితుడి స్థాయిలో హితం చెబుతున్నాను. సీత మన పాలిట ధూమకేతువు. ఆమెలంక చేరినప్పటినుండీ అన్నీ అరిష్టాలే కలుగుతున్నాయి. ఆమెను అప్పగించు. చేతులు దులుపుకుందాం. అందరం క్షేమంగా ఉందాం! నీ శ్రేయోభిలాషిగా చేతులు జోడించి ప్రార్థిస్తున్నాను!'' అన్నాడు.

''నీవు సీతను అపహరించుక రావడం పెద్దతప్పు. అప్పుడు నీవు ఎవ్వరితో ఆలోచించలేదు. ఎవరి ఆలోచనా నీకు అవసరం లేకపోయింది. ఇప్పుడు ముప్పు ముంచుకవచ్చినపుడు, తీరిగ్గా సలహా అడుగుతున్నావు. నీకోసం ప్రాణాలు ఇవ్వడం కన్నా నేనేం చేయగలను? ప్రాణాలున్నంత వరకూ, నీపక్షం చేరి పోరాడడం ఒక్కటే నాకు కనిపిస్తున్న స్పష్టమైన మార్గం!'' అని కుంభకర్ణుడు చెప్పాడు.

''నీవు ధర్మాన్ని విడచిపెట్టావు. నేను ధర్మం విడచిపెట్టదలచుకోలేదు. మనం మన దారులనుండీ వేరుపడ్డాం! నిన్ను విడువక తప్పదు.'' అన్నాడు విభీషణుడు.

సముద్రం ఎలా దాటడం అని తీవ్ర చర్చచేస్తున్న వారికి ఆకాశంలో నలుగురు స్నేహితులతో విభీషణుడు కనిపించాడు.

వారు శత్రువులని వానరులు సింహనాదాలు చేశారు.

''నేను, మీకందరకూ పరమ శత్రువయిన రావణుని సోదరుడిని. నా పేరు విభీషణుడు. సీతాదేవిని అప్పగించమని వేడుకున్నాను. ధర్మం కాదన్నాను. రాజు నామాట వినలేదు. చెడిపోతావన్నాను. పోతే పోనిమ్మన్నాడు. ఆయన దారి నాకు సరిపోలేదు. నాకు తోచిన మార్గాన్ని అనుసరించాను నేను. శ్రీరాముని శరణు కోరివచ్చాను. శత్రువని తృణీకరించినా, మిత్రుడని ఆదరించినా నాప్రాప్తం అనుకుంటాను. ఆయన దయకు చేతులు జోడించి ఎదురు చూస్తున్నాను'' అన విభీషణుడు వానరులతో చెప్పాడు.

విభీషణుని గురించి అందరూ వ్యతిరేకంగా చెప్పారు.

హనుమంతుడు మాత్రం ఇలా అన్నాడు.

''తండ్రీ! రామచంద్రమూర్తీ! మాకు ఎక్కువేం తెలుసు? అభిప్రాయం అడిగావు కాబట్టి చెబుతున్నాను. ఈ విభీషణుడు సాధువు. ధార్మికుడు. అతడు అనుకున్నది, నమ్మినదీ స్పష్టంగా చేసి చూపుతున్నాడు. అతడు తన ప్రవృత్తిని దాచిపెట్టడం లేదు. ఇక శంకించాల్సిన అవుసరమేముందీ? ఒక పాపి అయిన వాడికి సద్గతి కల్పించడం పరమాత్మ ధర్మం కదా స్వామీ! పశ్చాత్తాపంతో పవిత్రుడు కాగలడని సనాతన ధర్మం చెబుతూంది. పైన నీచిత్తం!''

స్వామి గంభీరంగా నవ్వాడు.

''శరణు అని, ఈ విభీషణుడే కాదు, ఆ రావణుడు వచ్చినా రక్షించడం నాధర్మం, నావ్రతం. శరణు పొందడం వారి వారి చిత్తాలమీద ఉంటుంది. ఈ విభీషణుని తప్పక ఆదరిద్దాం!

రమ్మనండి!'' అన్నాడు శ్రీరాముడు.

విభీషణుడు, తనవారితో వచ్చి శ్రీరామునకు నమస్కరించాడు.

శ్రీరాముడు మూడు రోజులపాటు దర్భాసనమ్మీద కూర్చుని, అన్నోదకాలు మాని సముద్రుని ప్రసన్నం చేసుకునేందుకు ప్రార్థించాడు. ఫలితం లేకపోయింది.

శ్రీరామునకు కోపం వచ్చింది. వింటబాణం సంధించి విడువబోతున్నంతలో సముద్రుడు సాకారుడై, సాంజలి అయి వచ్చినుంచున్నాడు.

''ఈ జలసంబంధం అయిన గుణం నాకు ఎవరు అనుగ్రహించారు. ప్రభూ? ఇలా ఉండమని ఎవరు శాశించారు? ఉన్నట్టుండి నేను పాషాణం కాగలనా? అగాధమైన నేను ఎన్నో ప్రాణులకు, ఆశ్రయమై, జలమయమై ఉండవలసిన నా విధిని ఎలా తిరస్కరించగలను? నాధర్మం ఎలావిడువగలను? వీల్లేదుకదా? పెద్దపెద్ద బండరాళ్లను, చెట్లనూ తెచ్చి సేతువును నిర్మించండి. అవకాశం కల్పిస్తాను. ఈ వానరులలో విశ్వకర్మ పుత్రుడు నలుడున్నాడు. అతడు సేతునిర్మాణం అవలీలగా చేయగలడు. మీకు శుభం కలుగుతుంది'' అని సముద్రుడు అదృశ్యుడైనాడు.

సముద్రుని సూచన అనుసరించి సేతువును కట్టేందుకు వానరులు ప్రారంభించారు. మహావృక్షాలూ, కొండలూ తెచ్చి సముద్రంలో పడవేయసాగారు. నలుడు సేతునిర్మాణాన్ని అజమాయిషీ చేయసాగాడు. కొండ బండల మధ్య గడ్డీగాదం, ఇసుకా తెచ్చి కుమ్మరించి మార్గం సుగమం చేశారు. ఆశ్చర్యకరంగా సేతువు తయారయింది.

వానరసేన ఆనందోత్సాహాలతో సముద్రం దాటి, అవతలి భాగం చేరింది. హనుమంతుడు శ్రీరామునీ, అంగదుడు లక్ష్మణునీ, తమభుజాల నెత్తుకుని నడచారు.

మాల్యవంతుడన్న వృద్ధ రాక్షసుడు రావణుని దగ్గరకు పోయి ఇలా అన్నాడు.

''మహారాజా! హితం కటువైంది. అహితం రుచిగా ఉంటుంది. హితం చెప్పడం, ఒప్పించడం, లోకంలో అతి దుర్లభం. నీకు మంచి రోజులు గతించాయి. నీకేకాదు ఈ రాక్షసకులానికీ కాని కాలం దాపురించింది. లేకపోతే, ఒక సామాన్య స్త్రీ కోసం నీవు ఇంతగా కలవరించి మోహావేశుడవు కావు. అటుచూడు! సముద్రంలా ఉప్పొంగుతూ ఊగుతున్న ఆ సైన్యం వేపు చూడు! ఆ సైన్యంలో ఎవరు ఉన్నారో కూడా చూడు. కోతులూ, ఎలుగులూ! ఎంత సుశిక్షితంగా ఎంత ధైర్యంగా అక్కడ మోహరించి ఉన్నారో చూడు. సముద్ర మ్మీద సేతువును ఎంత అపూర్వంగా నిర్మించారో చూడు. నీ శత్రువులు గుమ్మం తట్టి నుంచున్న వైనం చూడు. ఇప్పుడు ఏం చేస్తావో ఆలోచించు. ఇలా అసాధ్యాన్ని సాధ్యం చేయడం, ఒక సామాన్య మానవునకు సాధ్యమేమో ఆలోచించు. శ్రీమహావిష్ణువు ధనుర్ధారి అయి, నిన్నూ, నీబలగాన్నీ నిర్మూలించేందుకు వచ్చి నుంచున్నాడు. ఈముప్పునుండీ నీవు తప్పుకోవలె నంటే, ఒకేదారి ఉంది. ఆ దారి ఇంకా మూసుకుపోలేదు. అది సీతను రామునకు అప్పగించి చేతులు జోడించడం! తరువాత నీచిత్తం!''

''మీరంతా అవసరం లేని భయంతో చీకాకు పడుతున్నారు!'' అంటూ రావణుడు ఏదో చెప్పబోయాడు.

''చివరగా హెచ్చరిస్తున్నాను మహారాజా! బాగా ఆలోచించు!''

''ఏమని ఆలోచించాలి? ఒక మనిషిముందు తలవంచి, చేతులు ముడుచుకోమనేగా నీ ఆలోచన? అంతకన్నా చావుమేలు. ఈ రావణుని శిరస్సులు ఎవరిముందూ వంగిపోవు. తలలు ఎత్తుకుని తిరగడమే ఈ రావణునికి తెలిసిన విషయం!''

మాల్యవంతుడు తలవంచుకు వెళ్లిపోయాడు.

రావణుడు తనసేనను విభజించాడు. నాలుగు ద్వారాల్లో నిలిపాడు. శ్రీరాముడూ సేనను విభజించాడు.

''నలుడు, తూర్పుద్వారం దగ్గర ఉన్న ప్రహస్తుని ఎదిరిస్తాడు. దక్షిణంలో అంగదుడు మహోదర పార్శ్వలను నిలువరిస్తాడు. పడమర హనుమంతుడు ఇంద్రజిత్తును తాకుతాడు. ఉత్తరంలో రావణుని నేనూ, లక్ష్మణుడూ ఎదుర్కొంటాం! మావెంట సుగ్రీవుడూ, జాంబవంతుడూ, విభీషణుడూ ఉంటారు!'' అన్నారు శ్రీరాముడు.

నాటి సాయంవేళ సుగ్రీవుడు ఉన్నట్టుండి లంకలో ప్రవేశించాడు. ఎదురయిన రావణుని లెంపకాయ కొట్టి, కిరీటాన్ని నేలకూల్చాడు. రావణుడు కోపంతో పండ్లు నూరుతూ, సుగ్రీవుని తాకాడు: ఇద్దరకూ మల్లయుద్ధం కొంతసేపు జరిగింది. రావణుడు మాయాయుద్ధం సాగించడంతో సుగ్రీవుడు వెళ్లిపోయాడు.

యుద్ధ ప్రారంభానికి ముందు అంగదుని పిలచి, రాయబారిగా లంకకు శ్రీరాముడు పంపాడు.

అంగదుడు రావణుని కొలువు చేరి శ్రీరామసందేశం ఇలా చెప్పాడు.

''నేను వాలి కొడుకును. నా పేరు అంగదుడు. వాలి ఎవరో నీకు బాగా తెలుసు. ఇప్పుడు నేను శ్రీరాముని రాయబారిగా వచ్చాను. మీ సింహద్వారం చెంత మాసైన్యం మోహరించి ఉంది. యుద్ధం తప్పక పోతే వినాశం తప్పదు. పొంగినవాడు కుంగక తప్పదు. ఈ వినాశం నుండీ తప్పుకపోయేందుకు, మీకున్న ఏకైక మార్గం శరణు పొందడం. ప్రాణాలు దక్కించుకుంటారో, యుద్ధం చేసి దుర్మరణం పాలవుతారో తేల్చుకోండి''

''ఈ నీచుణ్ణి పట్టుకోండి! ప్రాణాలతో విడువకండి'' అంటూ రావణుడు ఎలుగెత్తి అరచాడు.

ఇద్దరు రాక్షసభటులు అంగదుని రెక్కలు పట్టుకున్నారు. అయితే అంగదుడు ఆరాక్షసులతో పాటు చివాలున పైకి లేచి కాళ్లతో భటులను తన్ని సురక్షితంగా పరివారాన్ని చేరుకున్నాడు.

అంగదుడు అలా తిరిగి రావడంతోనే యుద్ధ ప్రారంభానికి రామాజ్ఞ ఇవ్వబడింది. వానరులు చేసిన భేరీభాంకారాలు, శంఖారవాలూ లంకలో కర్ణకఠోరంగా వినిపించాయి. రాక్షసప్రజకు భయోత్పాతం కలిగింది.

ఒక్కుమ్మడిగా వానరసేనలు లంకకు నాలుగు వేపులా ముట్టడించాయి. రావణుని ఆజ్ఞతో రాక్షసులు వానరులకు ఎదురుదాడి చేశారు. వానరసేనలో పొంగులు వారే విజయోత్సాహాలు రాక్షససేనలో లుప్తం అయింది.

అంగదుడు ఇంద్రజిత్తును తీవ్రంగా తాకాడు అతని సారధినీ, గుఱ్ఱాలనూ అంగదుడు కూల్చాడు. గత్యంతరం లేక ఇంద్రజిత్తు మాయాసమరం ప్రారంభించాడు. మేఘనాథుడు రామలక్ష్మణులను నాగాస్త్రం ప్రయోగించి మూర్ఛితులను చేశాడు.

అస్త్ర బలం వలన రామలక్ష్మణులు అచేతనంగా నేలకూలారు.

వానరసేన భయకంపితం అయింది. అయితే విభీషణుడు మాత్రం వారి కాపదలేదని శాంతపరచాడు. శ్రీరాముడు కొంతసేపటికి కన్నులు తెరచి లక్ష్మణుని స్థితికి దుఃఖపడసాగాడు.

వానరసేనలో సుషేణుడు ఘనవైద్యుడు. ఆయన రామలక్ష్మణులను పరీక్షించి, ఓషధులు వాడిన గుణం కలుగుతుందని వారిని ఊరడించాడు.

ఇంతలో హోరుగాలి సుడులు తిరుగుతూ వీచింది. ఆ మరుక్షణంలో గరుత్మంతుడు ప్రత్యక్షం అయ్యాడు. ఆయన రామలక్ష్మణుల మీద మృదువుగా, తన రెక్కలతో గాలి వీస్తూ వలయాలు చేశాడు.

శ్రీరామలక్ష్మణుల సంధిబంధాల్లో బాణ రూపంలో చేరిన నాగులు జలజలారాలి ప్రాకి పోయాయి. నాగాస్త్రశక్తి అంతటితో ఉపశమించింది.

బాధ తీరిపోగా శ్రీరామక్ష్మణులు లేచికూర్చున్నారు.

గరుత్మంతుడివైపు ఆరాధనగా శ్రీరాముడు చూచి, ''మహాత్మా! నీవెవరు? అయాచితంగా ఇంత సాయం చేసిన నీవెవరు?'' అని అడిగాడు.

''మీకు పరమమిత్రుడిని. మీకు శుభం కలుగుతుంది. శెలవు!'' అని గరుత్మంతుడు వెళ్లిపోయాడు.

నాగాస్త్రం వ్యర్థంకావడం విని రావణుడు కళవళ పడ్డాడు. తనచింతను వెలికి తెలియనీయకుండా, వెంటనే ధూమ్రాక్షుడిని యుద్ధానికి పంపాడు.

హనుమంతుని చేతుల్లో వాడుమట్టికరచాడు. వజ్రదుష్ట్రుడు అనంత బలగంతో వచ్చాడు. వాడిపనీ అంతే అయింది. అకంపనుడు ఆతరువాత రాక్షస సైన్యానికి నాయకత్వం వహించాడు. తీవ్రంగా యుద్ధం చేసి వాడూ చనిపోయాడు.

ప్రహస్తుడు సర్వసైన్యాధిపతి. మూడువంతుల రాక్షససేన అతని అధీనమై ఉంటుంది. ఏయుద్ధంలోనూ ఓటమి ఎరుగని మహావీరుడు. ఈ ప్రహస్తుడు వానరసేన మీద విరుచుకపడి అల్లకల్లోలం సృష్టించాడు. ఎందరినో చంపాడు.

మురాంతకుడూ, మహనాథుడూ, కుంభహనుడూ, ప్రహస్తునకు బాసట అయి భయంకరంగా యుద్ధం చేశాడు.

నీలుడు ప్రహస్తుని ఎదుర్కొన్నాడు. ప్రహస్తుడు ఇనుపగదతో నీలుని తలమీద మోదబోయేంతలో, నీలుడు వాటంగా తప్పుకుని పెద్దబండరాయితో వాడి తల సహస్రభిన్నం చేశాడు.

వానరవీరులలో ద్వివిదుడూ, దుర్ముఖుడూ, జాంబవంతులు వరుసగా మురాంతక, మహానాథ, కుంభ హనులను సంహరించారు.

ఇలా తన బలగంలోని ప్రముఖులు క్రమక్రమంగా మరణించడంతో, రావణుడు చింతాక్రాంతుడయ్యాడు. ఆ చింతలోంచి కోపం పుట్టుక వచ్చింది. ఆకోపం ఎవరిమీద? శత్రువుమీద. ఆశత్రువు ఎంతబలవంతుడో అర్థం అవుతూంది. ఆ శత్రువు ముందు, తను అశక్తుడవుతున్నాడు. కారణం? తనూ, తనబలగం, తనతపస్సూ నీరుకారి పోతూంది. చూద్దాం! ఎవరు గొప్పవారో?

రావణుడు సకలాభరణాలు ధరించి, సకలాయుధాలతో యుద్ధానికి వచ్చాడు. కోపంతో అతడు ఉఅగ్నాతలూగి పోతూ, దొరికిన వాడిని దొరికినట్లు ఎడాపెడా కొట్టి చంపసాగాడు. ఆంజనేయులు రావణునితో ముష్టియుద్ధానికి తలపడ్డాడు. ఇంతలో లక్ష్మణుడు సాయంరాగా, రావణుకొక తీవ్రబాణంతో లక్ష్మణుని మూర్ఛితుని చేశాడు.

శ్రీరాముడు ఆంజనేయుని భుజాలమీద కూర్చుని స్వయంగా యుద్ధభూమికి వచ్చాడు. ఒకరి కొకరు తీసిపోక, శక్తివంతమైన బాణాలతో నొప్పించుకున్నాడు. చివరకు శ్రీరాముడు విడచిన బాణాగ్నికి రావణుని రథం, బాణాసనం భస్మం అయింది. సారథి ఎల్లాగో తప్పించుకుని ఇవతలకు వచ్చాడు. రావణుడు నిశ్చష్టుడై నేల మీద నుంచున్నాడు.

శ్రీరాముడు నిర్మలంగా నవ్వి "రేపురా! అలసిపోయావు. యుద్ధం బాగా చేశావు విశ్రాంతి తీసుకుని రా! యుద్ధం చేద్దాం!" అన్నాడు.

రావణుడు అవమానభారంతో తలవంచుకుని లంకచేరాడు. శత్రువు ముందు ఏతల అయితే వంచుకొననని యుద్ధానికి ముందు బీరాలు పలికాడో ఆ తల వంచుకున్న వాడై రావణుడు ప్రాణాలు దక్కించుకుని మరలవలసి వచ్చింది.

కుంభకర్ణుని నిద్రలేపమని అతడు ఆజ్ఞాపించాడు. అతి కష్టంమ్మీద కుంభకర్ణుడు నిద్రలేచాడు. లేవగానే సుష్టుగా భోజనం చేశాడు. సంగతి తెలుసుకుని రావణుని దర్శనానికి వచ్చాడు.

"నీవు ఎవరిమాటా వినలేదు. ఆ కారణంగా ఇంతటి విపత్తు నెత్తికెత్తుకున్నావు. వినాశం జరుగుతుంటే మంచీ చెడూ ఆలోచించే వ్యవధి చిక్కదు. అంతకుముందే చక్కగా ఆలోచించాలి. నీవు ఆలోచించలేదు. ఈ సంకటస్థితి స్వయంకృతం. ఇప్పుడు నిన్ను నేరస్తుడని అనడం ఆత్మీయతా లక్షణం కాదు. నీ కోసం నా ప్రాణాలు ధారపోస్తాను. అంతకన్నా నేనేం చేయగలను? రాజైనవాడికి చక్కటి మంత్రాంగం అవసరం. అంగీకరించే ఓర్పూ అవసరం!" అన్నాడు కుంభకర్ణుడు.

రావణునికి కోపం మితిమీరసాగింది. అయితే అనువుకాదని ఊరుకున్నాడు. శాంతం బలవంతంగా తెచ్చి పెట్టుకున్నాడు.

''తమ్ముడూ! ఇది విమర్శలకు సమయం కాదు. న్యాయమో, అన్యాయమో, వివేకమో, అవివేకమో, గర్వమో, నిగర్వమో ఆలోచించే సమయం మించిపోయింది. ఇప్పుడు నాకు కావాల్సింది నీపౌరుషం, నీశక్తి, నీబల పరాక్రమం!'' అన్నాడు రావణుడు.

''నీకోసం నా సర్వశక్తులూ ధారపోస్తాను. విజయం చేకూర్చగలను. సంతోషంగా ఉండు!'' అని ఆ మహావీరుడు కుంభకర్ణుడు యుద్ధానికి బయలు దేరాడు.

ఒక పొడవైన నిశిత శూలం చేతధరించి, మహాకాయుడైన కుంభకర్ణుడు, వానసేనకు అమితనష్టం కలిగించాడు. అందిన వాళ్లను అందినట్లు నోరవేసుకుని నమలడం, కాళ్లక్రింద తొక్కడం, పొడవడం సాగించాడు. వానరసేనకు కుంభకర్ణుడంటే హడలు పుట్టింది. వానరసేన చిక్కిన దారిపుచ్చుకుని ప్రాణభీతితో పారిపోసాగింది.

వానర ముఖ్యులు వారికి ధైర్యం కలుగజేయసాగారు.

శ్రీరాముడు కుంభకర్ణునితో చాలసేపు యుద్ధం చేశాడు. ఎంతటి తీవ్ర బాణానికయినా, అతడు చలించక నడగొండవలె యుద్ధభూమిలో మృత్యువువలె సంచరింపసాగాడు.

శ్రీరాముడు ఒక దివ్యాస్త్రంతో కుంభకర్ణునికాళ్లు ఖండించాడు. మోకాళ్లమీద నడుస్తూ కుంభకర్ణుడు హింసింపసాగాడు. మరో బాణంతో శ్రీరాముడు వాడి చేతులు నరికాడు. శ్రీరాముడు చివరగా ఒక దివ్యబాణం విడచాడు: ఆ బాణవేగానికి కుంభకర్ణుని శరీరం మూడుముక్కలు అయింది. ఒక ముక్క కోటసింహద్వారానికి అడ్డంపడింది. మరో ముక్క సముద్రంలో పడింది. తల లంకకు చేరింది.

''హా! సోదరా!'' అంటూ రావణుడు విభ్రమతో మౌనం వహించాడు. కుంభకర్ణుని అలా చిత్ర వధకు గురి చేసిన ఆ బాణశక్తి ముందు ఎవరు ఆగగలరు? సర్వనాశనం అయిందనుకున్నాడు రావణుడు. అతనికి దుఃఖం ముంచుకవచ్చింది.

త్రిశిరుడు, రావణుని ఓదార్చి యుద్ధానికి వచ్చాడు. అతనికి ఆసరాగా అతికాయుడూ, నరాంతకుడూ, దేవాంతకుడూ వచ్చారు. అప్పుడు జరిగిన దారుణ సంగ్రామంలో అంగదుని చేతుల్లో నరాంతకుడూ, మారుతి చేతుల్లో దేవాంతక త్రిశిరులూ మరణించారు. అతికాయుని లక్ష్మణుడు సంహరించాడు.

తన వీరుల మరణవార్తలు రావణునకు పిడుగుపాట్లవలె తగులుతున్నాయి. దుఃఖం ఇప్పుడు కలగడం లేదు. ఒకటా? రెండా? తన బలగం అంతా చచ్చిపోతుంటే, ఎంతని ఏడుస్తాడు? పేరుపేరునా ఎక్కడ ఏడవగలడు? ఇప్పుడు అతని స్థితి సగం మూర్ఛ – సగం తెలివిగల స్థితి. మ్రాగన్నుగా కూర్చున్నాడు. ఎక్కడ కూర్చున్నాడు. కూర్చోడానికి ఉచితమైన ఆసనం అవసరం అని,

అతడి మనస్సుకు తోచలేదు. కాళ్లు శరీరాన్ని నిలుపలేక పోయినాయి. అంచేత కూర్చున్నాడు. కూర్చునేందుకు ఎక్కడయితేనేం? అదీ అతడి మనస్సుకు అందలేదు.

''తండ్రీ! నేను ఇంకా బతికేఉన్నాను. చింతపడవద్దు!'' అంటూ మేఘనాథుడు తండ్రిని ఓదార్చాడు.

రావణుడు కండ్లు తెరచీ తెరవక కొడుకువైకు చూశాడు. ఆ చూపులో జీవం లేదు. కండ్లలో జవం లేదు. ఇంద్రజిత్తు ఏమన్నాడో కూడా చెవులు విన్నా, మనస్సుకు అందింపలేక పోయింది. ఇంద్రజిత్తు, ఎల్లాగయినా తండ్రిని సంతోష పరచవలెననుకున్నాడు. మౌనంగా అక్కడనుండీ వెళ్లిపోయాడు.

అంతులేని సేనతో కాలాగ్నివలె జ్వలిస్తూ యుద్ధరంగానికి ఇంద్రజిత్తు వచ్చాడు. వచ్చీరావడంతోనే, అతడు బ్రహ్మాస్త్రం ప్రయోగించి రామలక్ష్మణులను, వానరులనూ మూర్ఛావివశులను చేశాడు.

ఆ సంతోషకరవార్త ఇంద్రజిత్తు తండ్రికి చెప్పి రావణునకు కొంత ఊరట కలిగించాడు.

కొసప్రాణంతో ఉన్న జాంబవంతుడు హీనస్వరంతో ''మారుతి ఎక్కడ ఉన్నాడు?'' అని అడిగాడు.

''ఇదో! ఇక్కడ ఉన్నాను!''

''నీశక్తినంతా కూడదీసుకో. వెంటనే ఉత్తరంగా వెళ్లు. హిమవత్పర్వతాల్లోని ఋషభ కైలాస పర్వతాల మధ్య సంజీవనీ పర్వతం చేరు. ఎంత తొందరలో పోగలవో నీఇష్టం. ఆపర్వతంలో ఓషధులున్నాయి. వాటి ప్రభావంతోగానీ వీళ్లు కోలుకోరు తండ్రీ! నీవు తప్ప వేరెవ్వరూ దీన్ని సాధింపలేరు వాయునందనా!''

హనుమంతుడు రివ్వున గరుత్మంతుని వలె ఆకాశం అంచుకు ఎగిరాడు. సంజీవనీ పర్వతం చేరాడు. అయితే అక్కడ, మృతసంజీవనీ, విశల్యకరణి సువర్ణకరణి, సంధానకరణి మొక్కలు ఎక్కడ ఉంటాయో, ఎలా ఉంటాయో ఆయనకు అర్థం కాలేదు. ఆ మందు మొక్కలను వెదక్కుంటూ కాలయాపన చేయడం ఉచితంకాదనిపించింది. అంచేత ఆమహానుభావుడు మొత్తం పర్వతాన్నె పెకలించి గిరిధారివలె తీసుకవచ్చాడు.

కొండ అల్లంతదూరంలో ఉండగనే, ఔషధ ప్రభావం వారిమీద పనిచేసింది. శ్రీరామలక్ష్మణులు, వానర ప్రముఖులూ నిద్రలేచినట్లు లేచికూర్చున్నారు. చనిపోయిన వానరులు పునర్జీవులు అయ్యారు.

సంజీవనీ పర్వతాన్ని పనితీరగనే, హనుమంతుడు యథాస్థానంలో నిలిపివచ్చాడు.

సుగ్రీవుడు శ్రీరామునితో ఆలోచించి, కొందరు వానరులను లంకుపంపి నిప్పు ముట్టింపచేశారు. లంక రెండవసారి అగ్నికి ఆహుతి అయింది. లంక పౌరుల రోదనలతో, వేదనలతో నిండిపోయింది.

కుంభకర్ణపుత్రులూ మరణించడంతో లంకలో వీరుడన్నవాడే మిగల్లేదు.

ఇంద్రజిత్తు రెండవ సారి యుద్ధానికి వచ్చాడు. మాయా యుద్ధంలో అతడు అందెవేసిన చేయి. ఇంద్రజిత్తు తనమాయాబలంతో సీతను సృష్టించి, తన రథంలో తీసుకవచ్చి, వానరులంతా చూస్తుండగా ఆమెను వధించాడు.

సీత నిజంగా చనిపోయిందని వానరులు దిగాలుపడిపోయి నుంచున్నారు. ఆ సమయాన్ని, ఇంద్రజిత్తు అసురయాగం చేసేందుకు వినియోగించుకోవలెనని సిద్ధం అయ్యాడు.

విభీషణునకు ఇంద్రజిత్తు జిత్తులు బాగా తెలుసు. అతడు అసురయాగం చేసినట్లయితే అతనిని గెలవడం అసాధ్యం అవుతుంది. ఆ యాగాన్ని విధ్వంసం చేయడం ఎంతో అవసరం.

"ప్రభూ! రామచంద్రా! ఇప్పుడు మనం చూచింది నిజంకాదు."

ఇంద్రజిత్తు ప్రయోగించిన ఓ జిత్తు. అతడు అసురయాగం చేసేందుకు ఓ అవకాశం కల్పించుకున్నాడు. అతడు ఆయాగం పూర్తి చేస్తే అజేయుడౌతాడు. మనం త్వరపడవలె. ఆ యాగాన్ని భగ్నం చేయవలె! దానికి లక్ష్మణుడు తగినవాడు" అంటూ విభీషణుడు తొందరించాడు.

శ్రీరాముడు అంగీకరించిన మీదట ఆంజనేయుడూ, లక్ష్మణుడూ విభీషణుడూ, కొందరు వానరులతో, ఇంద్రజిత్తు యాగశాలకు వచ్చారు.

ములుకుల్లాంటి బాణాలు వచ్చి పడుతుంటే, ఇంద్రజిత్తు అర్ధాంతంలో యాగం విడచి, యుద్ధానికి రాక తప్పలేదు. ఇంద్రజిత్తు రథం ఎక్కి అంప వానకురిపింపసాగాడు.

హనుమంతుని భుజమ్మీద లక్ష్మణుడు కూర్చుని నిశిత బాణవర్షం ఇంద్రజిత్తుమీద కురిపించాడు: వారు గొప్ప నైపుణ్యంతో గెలుపోటములు తెలియకుండా యుద్ధం చేశారు.

లక్ష్మణుడు ఇంద్రాస్త్రం వింట సంధించాడు.

"శ్రీరాముడు ధర్మాత్ముడే అయితే, సత్యసంధుడే అయితే, పౌరుషవంతుడే అయితే ఈబాణం ఇంద్రజిత్తును వధించుగాక" అని బాణం విడచిపెట్టాడు.

ఆబాణం జ్వాల వలె పోయి ఇంద్రజిత్తుతలను త్రుంచింది. మండుతున్న కొరివికట్టెవలె అతని కళేబరం నేలమీద పడిపోయింది.

సుషేణుడు లక్ష్మణుని వంటిమీది గాయాలకు తగిన చికిత్స చేశాడు..

అంతటి విపత్తుకు కారకురాలైన సీతను నిజంగానే రావణుడు చంపవలెననుకున్నాడు.

"ఇంద్రజిత్తు మాయాసీతను చంపితే నేను నిజం సీతను చంపుతాను!" అన్నాడు.

సుపార్శ్వుడు అన్న మంత్రి చేతులు జోడించాడు.

"వేదాధ్యయనం చేసి, సమస్త విద్యలూ నేర్చి, అనేక భోగభాగ్యాలూ తనివితీరా అనుభవించిన మహారాజులు మీరు. అబల, నిస్సహాయ అయిన స్త్రీని వధించి స్త్రీహత్యాపాతకం పొందాలనుకున్నారా? యుద్ధంలో విజయం పొంది న్యాయంగా సీతను పొందవచ్చుకదా? బ్రహ్మ

ప్రసాదించిన కవచం ధరించి రథం ఎక్కి బయలుదేరండి. మహావీరుడి వలె యుద్ధం చేయండి!'' అన్నాడు.

రావణుని అహంకారం చాల వరకు అంతరించింది. చావగా మిగిలిన వీరులనూ, సేనాపతులనూ పిలిచి తలవంచుకుని దీనంగా ఇలా అన్నాడు.

''మీరంతా పోయి, మీబలం శక్తి చూపి యుద్ధం చేయండి! మీవల్ల కాకపోయినప్పుడు నేను బయలుదేరుతాను'' అన్నాడు.

మహావీరులెందరో నేల కూలారు. ఇప్పుడు మిగిలినవారు మామూలు వీరులు. వీళ్లవల్ల ఏమీకాదని రావణునకూ తెలుసు.

వారు రాజును సంతోషపరచేందుకు యుద్ధానికి వచ్చారు. శ్రీరాముడు కురిపించిన బాణవర్షంలో మునిగిపోయేందుకు వారికి ఎక్కువసేపు పట్టలేదు.

లంకలో స్త్రీలు ఒకళ్లనొకళ్లు పట్టుకుని భోరున విలపించారు. రావణుని శపించారు.

రావణుడు అగ్నిలా మండిపోతూ, క్రోధంతో సముద్రంలా ఘూర్ణిల్లి పోతూ తానే యుద్ధానికివచ్చాడు. అనేక బాణాలతో వానర సేనను పీనుగుపెంట చేస్తూ వీరవిహారం అతడు చేయసాగాడు. శ్రీరాముడున్న దిశకు రథంతోలమని అతడు సారథికి ఆజ్ఞాపించాడు.

శ్రీరామునితో తలపడేందుకు సాగుతున్న రథాన్ని లక్ష్మణుడు అడ్డుకున్నాడు. విభీషణుడు పెద్దగద తీసుకుని రావణుని రథాశ్వాలను మొత్తి చావకొట్టాడు విరథుడయిన దశకంఠుడు, నేలమీద నిలచి శక్తిబాణాన్ని విభీషణుని మీద గురిపెట్టాడు. అయితే ఆబాణాన్ని లక్ష్మణుడు ఎదిరించాడు.

''లక్ష్మణా! ఈశక్తి బాణానికి అడ్డం వచ్చావు. దీనిధాటికి దేవతలే ఓర్చుకోలేరు. కోరివచ్చిన నీమీదికే ప్రయోగిస్తున్నాను'' అని లక్ష్మణుని మీదకు రావణుడు శక్తిని విడచాడు.

ఆ బాణ శక్తికి లక్ష్మణుడు నేలమీద కుప్పకూలిపోయాడు.

శ్రీరాముడు ''అయ్యో! లక్ష్మణా!'' అని అరచాడు.

సుషేణుడు అక్కడకు వచ్చి, ''నాయనా! మారుతీ! తిరిగి నీవు సంజీవనీ పర్వతం వెళ్లవలె. ఆఓషధులు లేక పోతే లక్ష్మణుడు మనకు దక్కడు!'' అంటూ లక్ష్మణుని అక్కడినుండీ సురక్షిత ప్రాంతానికి తీసుకపోయాడు.

ఆంజనేయులు క్షణాలమీద సంజీవనీ పర్వతం చేరి, మరలా పర్వతం పెకలించుకవచ్చాడు. ఆమందు మొక్కల మీదిగాలికే లక్ష్మణుడు కోలుకుని కండ్లు తెరచాడు.

ఇంతలో ఇంద్రుడు పంపిన రథాన్ని మాతలి తీసుకువచ్చాడు. శ్రీరామునకు అతడు నమస్కరించి, ''ఇంద్రుడు ఈ రథాన్ని మీకోసం పంపాడు. ఈరథమ్మీద కూర్చుని, దేవతల శత్రువును చంపమని ఆయన ప్రార్థన!'' అన్నాడు.

శ్రీరాముడు సగౌరవంగా ఆ రథానికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి అధిరోహించాడు.

అప్పుడు రామరావణ సంగ్రామం, మహాభయంకరంగానూ మహాద్భుతంగానూ సాగింది. అస్త్రానికి ప్రత్యస్త్రం వేస్తూ ఒకరి కొకరు తీసిపోక, ఒకరి అస్త్రాన్ని మరొకరు ఖండిస్తూ తుత్తునియలు చేస్తూ యుద్ధం చేయసాగారు వారు.

సముద్రం సముద్రం వలె ఉంది. ఆకాశం ఆకాశం వలె ఉంది. రామరావణ సంగ్రామం రామరావణ సంగ్రామం వలెనే ఉంది. ఆ సంగ్రామం గురించి చెప్పేందుకు పోలికలేదు అని అంటారు వాల్మీకి మహర్షి!

ధర్మబలం శ్రీరామునితోడై నిలువగా, ధర్మచ్యుతి రావణుని అడుగడుగునా పాతాళానికి అణచివేయసాగింది.

శ్రీరాముడు విడచిన బాణానికి రావణుడు మూర్ఛితుడైనాడు. సారథి రథాన్ని అవతలకు తీసుకపోయాడు. కొంతసేపటికి తెప్పరిల్లిన రావణుడు, సారథిని మందలించి, తిరిగి యుద్ధం చేయ వచ్చాడు.

బాణ ధ్వనులూ, అగ్ని వెలుగులూ, తప్ప మరేమీ వినిపించనంతగా, కనిపించనంతగా వారు ఒకరికొకరు తీసిపోని వీరత్వం చూపుతూ పోరాడసాగారు.

ఆయుద్ధం చూడగా ఆకాశంలో దేవతలు దానవులూ, ఋషిగణాలు బారులు తీరారు. ఆచేరిన మునుల్లో ఒకరు అగస్త్యుడు.

శ్రీరాముడు కొంచెం అలసినట్లు ఆయనకు తోచింది. చప్పున ఆయన శ్రీరాముని సమీపించి, ఆదిత్య హృదయ మంత్రాన్ని ఉపదేశించి, మంగళం కలుగుతుందని ఆశీర్వదించాడు.

శ్రీరాముడు ముమ్మార్లు, ఆచమనం చేసి ఆదిత్యహృదయం జపించాడు. సూర్యభగవానుడు ప్రీతుడై, రావణుని అంత్యకాలం తెలిపాడు. శుభం కలుగవలెనని దీవించాడు.

శ్రీరాముడొక తీవ్రబాణం విడచి, రావణుని తలత్రుంచాడు. విచిత్రంగా, ఆరాలిన తల మళ్లీ మొలుచుక రావడం జరిగింది.

ఆశ్చర్యపడుతున్న శ్రీరామునితో మాతలి; "ప్రభూ! బ్రహ్మాస్త్రం మరచారా? అంత్యకాలం రావణునకు సమీపించింది. విడవండి!" అని హెచ్చరించాడు.

శ్రీరామచంద్రుడు, తనకు అగస్త్య మహర్షి ప్రసాదించిన బ్రహ్మాస్త్రం సమంత్రంతో ఏకాగ్రదృష్టితో రావణుని పై విడచాడు.

ఆ దివ్యబాణం రావణుని గుండెలను చీల్చుకపోయింది. రావణ మరణంతో రాక్షస మూక చెల్లాచెదరై పోయింది. దేవతలు సంతోషం కొద్దీ సుమవర్షం కురిపించారు. హర్షధ్వనులతో వానరులు నృత్యం చేశారు.

చచ్చి, నేల మీద పడిఉన్న అన్నను చూడగానే, విభీషణునకు దుఃఖం కలిగింది.

"ఎంత పండితుడవు? ఎంత జ్ఞానవంతుడవు? ఒక అవగుణం కారణంగా ఇంతటి ముప్పు

తెచ్చుకుని నేలకూలావు.'' అన్నాడు విభీషణుడు.

''మహావీరుని వలె పోరాడి వీరమరణం పొందిన రావణుని గురించి విచారపడకు విభీషణా! రావణుని మరణంతో శతృత్వం అంతరించింది. ఇకపై జరుగ వలసిన కార్యాలు జరిపించడం నీవిధి విభీషణా!'' అని శ్రీరాముడు సమాధానపరచాడు.

రావణుని మరణ వార్త విని అతని భార్యలందరూ వచ్చి నేలపై దొర్లుతూ, పొర్లుతూ ఏడ్చారు.

''ఇంద్రియాలను నిగ్రహించాననేవాడివికదా స్వామీ! నీవు? సీతను చూడగనే నీ నిగ్రహం ఏమయిపోయింది? ఇప్పుడయినా సమయం మించిపోలేదు. నీవు నిగ్రహం కలవాడివే అయితే సీతను అప్పగించవలసిందికదా అని నేను ఎంతగా చెప్పాను? నీవు వినలేదు. ఈ ముప్పుకు కారణం ఇంద్రియాలు నీవశం తప్పడమే కదా నాథా? శ్రీరామునితో విరోధింపకు అని ఎన్నిసార్లు చెప్పాను స్వామీ? నీ సోదరులు చెప్పారు: నీమంత్రులు చెప్పారు. ఎవరు చెప్పినా నీవు వినలేదు. నీస్వాభిమానం విడువలేదు. ఎంతటి ప్రాజ్ఞుడవు? సీతమహా పతివ్రత. ఆమె తపోగ్ని నిన్నూ, నీవంశాన్నీ దహించి వేసింది. ఏమయినా నీవు లేవు'' అంటూ మండోదరి విలపించి మూర్ఛపోయింది.

అప్పుడు శ్రీరాముడు కల్పించుకుని ''విభీషణా! ఈస్త్రీలను ఓదార్చు. అగ్ని సంస్కారాలు ప్రారంభించు!'' అన్నాడు.

రావణాదులకు పరలోక క్రియలు ముగించిన తరువాత విభీషణుడు శ్రీరాముని కలుసుకున్నాడు.

శ్రీరాముడు నవ్వుతూ, ''లక్ష్మణా! లంకారాజ్యం అరాజకమైంది. మన విభీషణునకు పట్టాభిషేకం జరిపించు!'' అన్నాడు.

లక్ష్మణుడు యథావిధిగా విభీషణునకు రాజ్యాభిషేకం జరిపించాడు.

''హనుమా! నాయనా! నీవొకపని చేయవలె! మహారాజయిన విభీషణుని అనుమతి తీసుకుని లంకలోని సీతకు మాక్షేమసమాచారం తెలిపి, ఆమె ఏం చెబుతుందో విని, నాకు తెలియచేయాలి!'' అని శ్రీరాముడు ఆజ్ఞాపించాడు.

హనుమంతుడు అశోకవనిలోని సీతను కలుసుకున్నాడు.

''తల్లీ! రావణుడు సంహరింపబడ్డాడు. ఇప్పుడు లంకకు రాజు విభీషణుడు!'' అని హనుమంతుడు చెప్పగా సీతాదేవి తన మ్లాన వదనం పైకెత్తి గంభీరంగా చూచింది.

''తల్లీ! మాటాడవేం?'' అని మారుతి హెచ్చరించాడు.

''ఆనందంతో నోర మాట రావడంలేదు తండ్రీ! నీకు సాటివారు ఈలోకంలో ఎవ్వరూ లేరు. నీవుమధుర భాషివి!'' అంది సీతాదేవి.

సీతాదేవి చుట్టూ ఉన్న రాక్షసస్త్రీలను ఆంజనేయులు కోపంగా చూస్తూ, ''వీళ్లంతా నీకు ఎంతో

కష్టం కలిగించారు కదా? ఈ దుష్టులను సంహరించనా తల్లీ? వీళ్లు నీ పట్ల తప్పుగా ప్రవర్తించారు'' అని అడిగాడు.

''వద్దునాయనా వద్దు! ఈ లోకంలో తప్పు చేయని వాళ్లు ఎవరూ లేరు! అయినా వీళ్లు తప్పు చేయలేదు. రాజాజ్ఞను పాలించారు. జీతాలు ఇచ్చింది అందుకే కదా? రాజుమారగానే రాజధర్మం మారింది. ఇప్పుడు వీళ్లు నాపట్ల సభ్యతగానే ప్రవర్తిస్తున్నారు.'' అంది సీత.

''శ్రీరామునకు ఏంచెప్పమంటావు తల్లీ?''

''ఆయనను చూడాలని ఉంది. అంతే!'' అని సీత కండ్లు మూసుకుంది కనుకొలుకులనుండీ రెండు కన్నీటిబిందువులు జాలువారాయి. అవి ఆనందభాష్పాలో, దుఃఖాశ్రువులో మారుతికి అర్థంకాలేదు.

సీతాదేవి చెప్పిన విషయం మారుతి రామునకు చెప్పాడు.

శ్రీరాముని కండ్లు చెమర్చాయి. ఆయన కండ్లు ఎందువల్ల చెమర్చాయో, సీతాదేవి కండ్లు ఎందుకు చెమర్చాయో ఎవరికీ అర్థం కాలేదు. వారిద్దరకూ ఒకరిమీద మరొకరికి ఉన్న ప్రేమకు అది సంకేతం అని వారనుకున్నారు.

శ్రీరాముని విభీషణుని చూచి, ''దేవిని సాలంకృతను చేసి ఇక్కడకు తీసుకరా విభీషణా!'' అన్నాడు.

అది రామాజ్ఞ! అతడేం చేయగలడు? శిరోధార్యం అనగలడు.

విభీషణుడే కాక, అందరూ, శ్రీరాముడలా అనడం విని కళవళపడ్డారు. ధ్వని సవ్యంగా లేదనీ భావించారు.

విభీషణుడు సీతాదేవి దగ్గరకు పోయి నమస్కరించి రామాజ్ఞ తెలియచేశాడు.

''నేను ఇల్లాగే వస్తాను!'' అంది సీత ధృఢంగా.

''కాదు తల్లీ! రామానతి ప్రకారం చేయడం మంచిదనుకుంటున్నాను!'' అని విభీషణుడు చేతులు జోడించాడు.

సీతాదేవి మరేమీ మాటాడలేదు. గంభీరంగా ఒకసారి చూచి, తలదించుకుంది. ఒక బొమ్మకు వలె, మంగళ స్నానాదులు చేసి, శుభ్ర వసనం ధరించి, అలంకరించుకుని ఆమె పల్లకి ఎక్కింది.

సీత ఎక్కిన పల్లకి దాపవుతున్నా శ్రీరాముడు వంచిన తల ఎత్తలేదు. ఎవేవో ఆలోచనలు, ఆయన ముఖంలో ద్యోతకం అవుతున్నాయి.

సీతాదేవి పల్లకి దిగి వస్తుండగా ఆమెను చూడాలన్న కుతూహలంతో వానరులు గుంపులు గుంపులై తొక్కిసలాడ సాగారు. అయితే రాజభటులు వానరులను నెట్టివేయసాగారు.

''వాళ్లంతా నావాళ్లు! వాళ్లను అడ్డుకోడం నాకు ఇష్టంలేదు!'' అన్నాడు శ్రీరాముడు.

సీతాదేవి నేలమీది చూపులు నిలిపి శ్రీరాముని సమీపించింది.

ఒక్కసారి ఆమె తలఎత్తి, శ్రీరాముని వేపు చూచి, ''ఆర్యపుత్రా!'' అని వెక్కివెక్కి ఏడువ సాగింది.

అంతకాలం తరువాత, ప్రాణాధికం అయిన సీత ఎదురు పడగా శ్రీరాముని ముఖంలో కనిపించవలసిన ఆనందం కనిపించలేదు. ఆయన చూపులు సీత వైపుకాక ఎటో తిరిగి ఉన్నాయి.

''సీతా! నాశత్రువును జయించాను. నీచెర విడిపించాను. నాశపథం నెరవేరింది.'' అన్నాడు శ్రీరాముడు అతి గంభీరంగా.

ఆయన మాటల్లో కాఠిన్యం, నిష్ఠురత్వం ద్యోతకమైంది.

''అవమానం పొందిన పౌరుషవంతుడయిన వాడు చేయవలసినది నేను చేశాను. ఈ నాస్నేహితుల సాయంతో నేను నిర్వహించిన ఈ బృహత్కార్యం కేవలం, నీగురించీ కాదని గుర్తుంచుకో. నా సద్వంశం రక్షించుకునేందుకు మాత్రమే నేను నా శత్రువును సాధించాను; సంహరించాను. అపకీర్తి, అపవాదు తుడిచి పెట్టేందుకు ఇంతపని చేశాను. నీకు అన్ని దిక్కులూ ఉన్నాయి. నీ చిత్తనుసారంగా ప్రవర్తింపవచ్చు. నీవు రావణుని కాముకనేత్రాలకు ఆనందం కలిగించే వస్తువు అయ్యావు. నీపట్ల నాకు ఉచితం అయిన ధర్మం నిర్వర్తించాను. నీవు నీ శేష జీవితాన్ని భరత శత్రుఘ్న, లక్ష్మణుల్లో ఎవరి దగ్గరనయినా గడుపవచ్చు ఈ లంకలోనైనా ఉండవచ్చు. ఒంటరిగానూ ఉండవచ్చు. నీవు అందమైన దానివి. రావణుడు కామాతురుడు. చూస్తూ ఊరుకున్నాడా?'' అని శ్రీరాముడు పెడముఖం పెట్టాడు.

''ఆర్యపుత్రా! స్త్రీ జాతినంతా అవమానించే విధంగా నీవు మాటాడ్డం ఉచితం కాదు! రావణుడు నన్ను తాకాడు; విరాధుడూ నన్ను తాకాడు. నిజమే! ఆ ఇద్దరు తాకడంలో నాప్రమేయం లేదు. ఒకరు తిండికోసం తాకితె, మరొకరు కామం కోసం తాకారు. ఈదోషం నాదికాదు. ఎవడు ఈ సంఘటనలకు కర్త అయి ఉన్నాడో వాడిదే దోషం! ఇంతకాలం మనం ఏకశరీరులం కాకపోయినా, ఏకప్రాణులమై, ఏకాత్మలమై జీవించాం! త్రికరణశుద్ధిగా నేనూ, నాశరీరం, నాఆత్మ ఎవరిని కోరుకుంటుందో అర్థంకాలేదా మహాత్మా? నన్నో అల్పబుద్ధిగల స్త్రీని వలె చూశావు. మైథిలిగా చూడలేదు. జానకిగా చూడలేదు. నా జన్మసంగతీ మరచావు. అయోనిజనునేను, నాజన్మకూ, నాకర్మకూ, నామనస్సుకూ కళంకం కలిగించేలా మాటాడుతున్నావు. ఒక మహానుభావుడయిన వాడికీ, ఒక మహాపురుషుడయిన వాడికీ ఇలా మాటాడ్డం ఉచితం అనిపించుకుంటుందా?'' అంటూ జానకి వెక్కివెక్కి ఏడ్చింది.

ఒక్కనిముషానికల్లా ఆమె, తనను తాను సంబాళించుకుంది.

''నాయనా! లక్ష్మణా! ఒఖ సహాయం చెయ్! మీ అన్నకు నేను ఏమీ కాకపోయిన దుష్టకాలంలో, ప్రాకృతికంగా నీకూనేను ఏమీ కాను. అర్హతతో ఆజ్ఞాపించడం లేదు. ఓ అబల, నిస్సహాయ, విధివంచిత అయిన సాధారణ స్త్రీవలె నిన్ను ప్రార్థిస్తున్నాను. నాకు చితిసిద్ధం చెయ్!

బంగారానికి పుటం పెట్టినట్టు, నా శీలానికి అగ్నిని సాక్షిగా నుంచో బెట్టడం తప్ప నేనేం చేయగలను? ఇది నాచివరి ప్రయత్నం!''

కోపంతో లక్ష్మణుడు శ్రీరాముని వైపు చూశాడు. ఆయన వదనం గంభీర సాగరం వలె ఉంది.

సీత కనిపించకపోతే, ఏడ్చిఏడ్చి చివరకు ఆ దుఃఖంలోంచి కోపం తెచ్చుకుని, సర్వజగత్తునూ నాశనం చేస్తానన్న ప్రేమమూర్తి ఇతడేనా? ఆప్రేమ మూర్తి రామమూర్తికి ఇపుడేమయింది? సీతపట్ల ఇంత విముఖుడు ఎలా అయ్యాడు? సీత లేకుండా నిజంగా ఇతడు బతకగలడా? – లక్ష్మణునకు అర్థం కాలేదు.

చిటపటలాడుతూ చితిమంటలు నాలుకలు కోస్తూ పైకి లేస్తున్నాయి.

సీతాదేవి తలవంచుకుని, నమస్కారం చేస్తూ శ్రీరామునికి ప్రదక్షిణం చేసింది. ఆకాశం వైపు చూపులు నిలిపి ఇలా అంది.

''నామనోవాక్కాయ కర్మలతో శ్రీరాముని సేవించినట్లయితే ఓఅగ్ని దేవా! నన్ను కాపాడు! నాశీలానికి సాక్షీభూతమై నిలువ్! ఈ రాముడు అనుకునే విధంగా నేను కళంకితను కానట్లయితే నన్ను రక్షించు!''

''ఈ సూర్యుడూ, ఈ గాలీ, ఈ దిక్కులూ, ఈసంధ్యలూ, ఈ పగలూ ఈ రాత్రీ, ఈ సర్వదేవతలూ, ఈ పంచభూతాలూ, నాశీలాన్ని గుర్తించి నట్లయితే ఈ అగ్ని భట్టారకుడు నన్ను కాపాడుగాక!'' అంటూ ఆసాధుశీలవతి సీతాదేవి అగ్ని ప్రవేశం చేసింది.

ఆభయంకర సన్నివేశం చూసిన వాళ్లు అందరూ ఒఖ శ్రీరాముడు తప్ప, హాహాకారాలు చేశారు.

శ్రీరాముడు వంచిన తల ఎత్తలేదు. ఆయన నేత్రాల్లోంచి అశ్రువులు ధారాపాతంగా కురుస్తున్నాయి.

''శ్రీరామా! నీవు ఆదిదేవుడవు. సీత స్వయంగా లక్ష్మీదేవి!'' అంటూ సకల దేవతలతో బ్రహ్మదేవుడు ప్రత్యక్షం అయ్యాడు.

''ఏమో. నాకేమీ తెలియడంలేదు. నేను కేవలం దాశరథిననే నాకు తెలిసింది. నేనూ ఓ మానవుడనే నాకు తెలిసింది. అయితే నేను ఎవరను? ఇలా ఎందుకున్నాను తండ్రీ? వివరంగా చెప్పు!'' అని శ్రీరాముడు అడిగాడు.

''నీవు పరబ్రహ్మవు. సత్యస్వరూపుడవు. యజ్ఞం, ఓంకారం, సర్వం నీవే మహానుభావా! జగత్కారణుడవూ, జగత్కల్యాణుడవూ నీవు. ఈ జగత్తంతా నీవిరాడ్రూపమే భగవాన్!''

అలా బ్రహ్మదేవుడు చెబుతూండగా, అగ్నిదేవుడు యజ్ఞంలో వేల్చిన హవిస్సును దేవతలకు తెచ్చి ఇచ్చినట్లు సీతతో ప్రత్యక్షం అయ్యాడు.

''శ్రీరామా! ఈ సీత పునీత! నిష్కళంక! సాధుశీల! సుశీల! స్వీకరించు!''

''సీత నిరపరాధి అని ముల్లోకాలకూ తెలుసు. నాకూ తెలుసు ఇంతకాలం లంకలో ఉన్న సీతను, ఆమె పవిత్రతను లోకానికి తెలియకుండా, నేను గ్రహిస్తే ఈ రాముడొక కాముకుడని లోకం అనదా? సీతకు నేనే సర్వస్వం, నేనే లోకం అనీ తెలుసు. మీ అందరి ఆజ్ఞను ఈ దాశరథి శిరసావహించగలడు!''

అప్పుడు వారికి దశరథుడు కనిపించాడు.

''తల్లీ! రాముని మన్నించు. లోకధర్మాన్ననుసరించి రాముడు అలా అన్నాడు. కోపగించకు!''

ఇంద్రుడు రాముని సమీపించి ''నీ కోరిక ఏదేనా చెప్పు శ్రీరామా! తీర్చుతా!'' అన్నాడు.

''చనిపోయిన వానర భల్లూకాలను బతికించు! ప్రకృతిలో వారి ఆహారానికి లోటు లేకుండా అనుగ్రహించు!'' అని శ్రీరాముడు అడిగాడు.

''తథాస్తు'' అని వారందరూ అదృశ్యం అయ్యారు.

ఆ రాత్రివారికి ఆనందంగా గడచింది.

ఉదయం విభీషణుడు వచ్చి ''నా ఆతిథ్యం స్వీకరించి నన్ను కృతార్థుడను చేయవలె ప్రభూ!'' అంటూ కోరాడు.

''నీవు చేసిన సాయమే నాకు గొప్ప ఆతిథ్యం. నామనస్సంతా భరతుని మీద ఉంది. నేను చేయవలసిన ప్రయాణం బహుదూరం! అందువల్ల..''

''ఈ విషయంగా ఆలోచించాల్సిన అవసరం లేదు ప్రభూ! కుబేరుని నుండీ రావణుడు కైవశం చేసుకున్న పుష్పక విమానం లంకలో ఉంది. ఇప్పుడు అది మీ సేవకు సిద్ధంగా ఉంది. ఈ విమానం సంకల్పమాత్రాన దూరాన్నీ, కాలాన్నీ అధిగమించి ప్రయాణం చేస్తుంది!'' అన్నాడు విభీషణుడు.

''అయినా విభీషణా! ఎంతో కాలంగా ప్రవాస జీవితం గడిపానా? నా మనస్సునిండా అయోధ్య జ్ఞాపకాలున్నాయి. ఈ వానర భల్లూక మిత్రులకు పేరుపేరునా, నాకు చేయాలనుకున్న విధంగా సత్కరించు! అది నాకు చెందినంతగా సంతోషిస్తాను!'' అన్నాడు శ్రీరాముడు.

శ్రీరాముడు కోరిన విధంగా వారిని విభీషణుడు సత్కరించాడు.

''సుగ్రీవా! నీవు ఆదర్శస్నేహితుడవు. చక్కగా కిష్కింధను పాలించు! ప్రజను సుఖపెడుతూ సుఖించు!'' అని శ్రీరాముడు సుగ్రీవుని కౌగలించుకున్నాడు.

అలా అందరి దగ్గరా శ్రీరాముడు వీడ్కోలు తీసుకున్నాడు.

సుగ్రీవ విభీషణులు చేతులు జోడించి నుంచున్నారు.

శ్రీరాముడు నవ్వుతూ వారి వైపు చూశాడు.

''ఇక్కడనుండీ మమ్మల సాగనంపి, నీవు మాత్రం వెళ్లాలనుకున్నావా ప్రభూ? మా పట్టాభిషేకాలు నీవు జరిపించావు. మాకింతటి ఆనందం కలిగించావు. మరి నీ పట్టాభిషేకం కండ్లారా

చూడనీయవా ప్రభూ? మా విన్నపం ఇది. నిన్నుకన్న తల్లి పాదధూళి ఓయింత తీసుకుని మా శిరస్సుల పెట్టుకోవలెనని మా కోరిక! కాదనకు స్వామీ!'' అన్నారు వారు.

''అల్లాగే రండి! మీ స్నేహవాత్సల్యాలకు కృతజ్ఞత చూపే అవకాశం నాకు కల్పిస్తానంటే, నేను కాదంటానా? అవశ్యం! నాతో రండి! ఈ పుష్పకంలో ఎంతరికయినా చోటు ఉందని విన్నాను. నేనూ అంతే! నాహృదయంలో ఎందరకయినా చోటు ఉంటుంది.''

అందరూ– సీతారాములూ లక్ష్మణుడూ, విభీషణ సుగ్రీవ జాంబవంత హనుమంతాదులు అనేకులు పుష్పకంలో ఎక్కికూర్చున్నారు.

శ్రీరాముడు సీతాదేవికి, అపహరణం తరువాత జరిగిన సంగతులు చెప్పసాగాడు. ఇంతలో భరద్వాజాశ్రమం చేరారు. అందరూ విమానం దిగి మహర్షికి పాదాభివందనం చేశారు.

''ఇప్పుడు నామనస్సుకు ఉల్లాసంగా ఉంది నాయనా! వెళ్ళు భరతుని కలుసుకో! అతడు ఉత్తముడు. మీకు శుభం కలుగుతుంది!'' అని మహర్షి ఆశీర్వదించాడు.

శ్రీరాముడు హనుమంతుని ద్వారా గుహునకూ, భరతునకూ తన రాక తెలియచేశాడు.

హనుమంతుడు గుహునకు శ్రీరామాగమనం తెలిపి, శృంగి బేరపురంలో ఉన్న భరతుని కలుసుకున్నాడు.

శ్రీరాముని రాకను విన్న భరతుడు ఎంతో పొంగి పోయాడు.

శత్రుఘ్నుని పిలిచి అయోధ్యావాసులకు వార్త తెలిపి, నగరాలంకారానికి తగిన ఆజ్ఞలు ఇవ్వమని పంపాడు. అయోధ్యావాసులు తమంతమ గృహాలు అలంకరించుకుని శ్రీరాముని రాకను ఎదురుచూడసాగారు.

మహర్షి వశిష్ఠునితో రాజమాతలు ఎదురు చూడసాగారు.

మంగళ వాద్యాలతో శ్రీరామపాదుకలు తలపై పెట్టుకుని భరతుడు పరివారంతో సహా నందిగ్రామం పొలిమేరల్లో ఎదురుచూడసాగాడు.

ఇంతలో పుష్పకం అక్కడకు వచ్చి చేరింది.

పుష్పకంనుండీ దిగిన శ్రీరాముని, భరతుడు సమీపించి తలపైని పాదుకలు దింపి ఆయన పాదాలముందుంచాడు.

''ఇదో నీరాజ్యం, నీవేస్వీకరించు!'' అని భరతుడు చేతులు కట్టుకునినుంచున్నాడు.

శ్రీరాముడు భరతుని కౌగిలించుకుని ''నాయనా భరతా!'' అంటూ కన్నులు మూసుకున్నాడు.

అందరి చూపులూ అటు తిరిగాయి. భరతుని భ్రాతృవాత్సల్యానికి చూపరుల కండ్లు చెమర్చాయి.

హనుమంతుడు అనేక పుణ్యనదీ జలాలు తీసుకుని రాగా, ఆ దంపతులు స్నానాలు చేశారు.

మంత్ర పూతంగా గురువు వశిష్టమహర్షి శ్రీరాముని శిరస్సున రత్నఖచితమైన కిరీటం అలంకరించాడు. ఆ పట్టాభిషేకం అత్యంత వైభవంగా, మహోత్సాహంగా, కన్నులపండువు వలె జరిగింది. ఋషులూ, విప్రులూ ఆశీస్సులిచ్చారు.

శత్రుఘ్నుడు శ్వేతఛత్రం ధరించాడు సుగ్రీవ విభీషణులు వింజామరలు వీచారు. చిరునగవుతో సీతాదేవి వామభాగాన శ్రీరామునిలో సగమై కూర్చుంది. భరతుడు లక్ష్మణులు ఇటూ అటూ చేరారు.

దేవేంద్రుడు పంపిన స్వర్ణపుష్పమాలను స్వయంగా వాయుదేవుడు సమర్పించాడు.

వాయునందనుడు శ్రీపాదల చెంత చేరి కూర్చున్నాడు.

గంధర్వగానం, అప్సరసల నృత్యాలతో ఆ మహోత్సవం నయనానందకరంగా సాగింది.

శ్రీరాముడు అనేక గోహిరణ్యదానాలు చేశాడు. అనేక యజ్ఞాలు యాగాలు చేసి దేవతలను తృప్తి పరచాడు. ప్రజను కన్న తండ్రివలె పాలించి, ధర్మమూర్తి అయి భాసించాడు. శ్రీరాముని తత్త్వం ధర్మం! స్వరూపం ధర్మం!

శ్రీరామరాజ్యంలో ప్రజ సుఖశాంతులతో జీవించారు.

శ్రీకృష్ణతత్త్వం ఎలా ఆనంద మయమో; శ్రీరామ తత్త్వం అల్లాగే ధర్మమయం...

అందువల్లనే భారతీయులకు శ్రీరామకృష్ణులు అత్యంత ప్రీతిపాత్రమైన అవతారాలు. ప్రతిప్రాణికీ అవసరం అయింది ధర్మం – ఆనందం – సచ్చిదానందం.

**అసతోమ సద్గమయ**
**తమసోమా జ్యోతిర్గమయ**
**మృత్యోర్మా అమృతం గమయ**
**అవిరా కర్మ పథి రుద్రాయత్తే ముఖం**
**తేన మాం పాహి నిత్రం**
**ఓం శాంతి శాంతి శాంతిః**